

సంపు. ౧౩ ధాత సంవత్సరము, మార్గశీర్షమాసము (డిసంబరు ౧౯౩౮) సంఖ్య ౧౨

# ప్ర భా త వృ ష్టి

బొ డ్డు బా పి రా జు

తెల్లని దూదిపింజవలె తేలిన మబ్బులు తూర్పుకొండపై
నల్లరిసేయ, నీలితెరయంచులు నించుక నొత్తిగించి య
ల్లల్లన పైకి బ్రాకు వికచాంబుజమిత్రుని కాంతిహస్తముల్
చల్లిన ముత్తెపున్సరుల జల్లుగ వాన బిరాన సాగగా!

దుండగపు న్సురానిలసుఖుల్ పయి కెక్కి కదల్చ, నున్న య
ట్లుండియు కప్పతిప్పలుగ నుర్వరకుం దిగజారుచున్నవో
పండిన పారిజాతరసవత్ప్రసవ ప్రచయంబునా సుహ్మా
న్మండలిముంచె మక్కువల, మందవిభాస్త విభాతవృష్టియున్.

చినుకును జిమ్ముకొరా నడుమ చీలిన వాలిన సందులందు జిం
కను నదలించుకొంచు దయ కా విహారము సేయు వాయుభూ
పునిపయి కందువా తడిసి ముద్దగుచుం, జిరుప్రొద్దు వెల్గు గూ
డిన తడియారుచున్న దపుడే నిముసమ్మున కొక్కమాపుగా.

ధారలు గట్టుకొన్న జలదామములన్ మొనలెత్తు లేతనీ
దూరపు వెల్గురేక లవి తొల్త బ్రసర్పఁ బదియారువన్నె బం
గారపు చంద్రహారముల కైవడినై, పరిపక్వ శాలి కే-
దారములందు నందముల దాచిన దీవరహాలవాన పో!

అటనట చిన్నిచిన్ని పడియల పడి వర్ష జలమ్ముతోడి మి
క్కుటమగు భాస్కరద్యుతుల కూడిక నిద్దపుటద్దముల్ ధరా
కటమున గూర్చినట్లు సొబగై ప్రకృతి ప్రతిబింబముల్ సము
న్నటన మొనర్చుచుండ నయనమ్ములకుం బయనమ్ము పెట్టెడి
చూలకని గాలికిం జలిని గ్రుక్కిన వార్షుకబిందు సుందర
మ్ములు దలలూగ భూమిరుహముల్ [illegible] చు
క్కలవలె నీటిబొట్టురలగా దలమోచి ప్రభాతభానుమం
జుల కిరణాగ్రలత్కులకు సూడిదలిచ్చె పసిండిపచ్చికల్.

నిన్నటినుండి కార్మొయిలు సీలపుటోలపు మేలుకట్టు క్రిం
ద న్నిలుచుండియున్న వసుధాస్థలయ మ్మిది నేడపూర్వపుం
జెన్నలరారుచున్ వెలుగుసిడల దాగుడుమూతలాడు, భా
వోన్నతి దారుమారగుచునుండు కవీంద్రుమనమ్ము వోలికన్.

నింగి మతాబుకాల్చినటు నిండిన వేడివెలుంగు పొంగులన్
ద్రింగగను ; వర్షలక్ష్మి యళిమేచకస్నా కచము న్వెలార్చి హ
స్తాంగుళి నారవిప్పినదొ యన్నటులున్న నవోదయాంబుముక్
భంగము లొక్కటొక్కటిగ పైబడి క్రుమ్ముచు దొమ్ములాడుచున్.

వేసగిగాని వేసగిగ వేడిమి మిక్కిలిగాసివెట్ట నా
యాసము జెందియున్నదపురా! యిల మొన్నటిదాక సీనమో
హ సరినున్న సస్యముతోపాటుగ ; నేడిటులూడిపడ్డ వ
ర్షాసమధార నోలలని యాడుచునున్నది తృప్తిదీరగన్.

వానలని కలవరించిన - జానపదులకోర్కి పండె, సంతోషమ్మే
కాని మ్మిక, తెరపిబడిన - గాసి, నోటికడకూడు కలదా జలదా!

---

# "హిస్ మాస్టర్స్ వాయ్స్"





మాడల్ 118
వెల రూ. 120.

## ఈ దీపావళి పండుగలకు

జగద్విఖ్యాత "హిస్ మాస్టర్స్ వాయ్స్" వారి ఈ నూతన గ్రామఫోను మెషీనులందు, నవరసభరితమై యలరారు "హిస్ మాస్టర్స్ వాయ్స్" సెట్టు రికార్డులను విని, మీ యిచ్చవచ్చినప్పుడెల్ల మంగళకరమైన సంగీతశ్రవణముచే ఆనందము పొందుడు!


మాడల్ 178
వెల రూ. 140.

## "హిస్ మాస్టర్స్ వాయ్స్" సెట్టు రికార్డులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| రామదాసు | 13 | 8 | గయోపాఖ్యానము | 13 | 8 |
| సావిత్రి | 13 | 8 | భక్త మీరాబాయి | 11 | 4 |
| మిస్ 1934 | 9 | 0 | కచ్చేరి సెట్టు | 13 | 0 |
| ప్రహ్లాద | 11 | 4 | పుండరీక | 11 | 4 |
| భక్త కుచేల | 9 | 0 | రాధాకృష్ణ | 6 | 12 |
| ద్రౌపదీ మానసంరక్షణము | 9 | 0 | మాయాబజారు | 11 | 4 |
| విశ్వామిత్ర | 13 | 8 | భక్త కబీరు | 9 | 0 |

తగ్గింపుధరలు తెలుపు క్రొత్త మెషీను కేటలాగులుగాని,
పై కనుపరచిన నాటకపుస్తకములుగాని
వలయువారికి ఉచితము!


మాడల్ 176
వెల రూ. 150.

# ది గ్రామఫోన్ కంపెని లిమిటెడ్.

45, సౌత్ పెరేడ్, బెంగుళూరు.

# మధురవాణి

క్రీ. శ. ౧౬౩౦ ప్రాంతమునఁ దంజాపురీశుఁడగు రఘునాథనృపాలుని యాస్థానమున విలసిల్లిన మధురవాణి రచించిన సంస్కృతరామాయణ సారమునుగూర్చి పెక్కండ్రు లఘువ్యాసముల లిఖించిరి. చర్వితచర్వణమే యైనను మాకుఁదోఁచినదాని సంగ్రహముగాఁ గొంత తెలిపెదము.

రఘునాథుఁడు పెక్కండ్ర సంస్కృతాంధ్ర ద్రవిడ విద్వన్మణులఁ బోషించి గ్రంథముల స్వయముగా రచించియు, రచియింపించియుఁ జోళ పాండ్యతుండీరదేశముల ననేక పుణ్యస్థలముల దేవతా విమానమంటపాదుల నిర్మించి చోళదేశమున ననేకాగ్రహారములఁ దన పెద్దలపేర స్థాపించి పశ్చిమోత్తరదేశముల నుండి దక్షిణాభిముఖులై పాఱివచ్చు సంగీతదేవతకుఁ దంజాపుర ప్రాంతము విహారభూమిగా నిలిపి శూద్రక వాసుదేవ విక్రమార్క భోజాదుల చరిత్రము లిట్టివని యుద్యోతింపఁజేయు విద్యావినోదములతోఁ గాలము పుచ్చి కీర్తికాయుఁడయ్యె. ఇతనిగుఱించి పెద్దగ్రంథము రచింపఁదగినంత చరిత్రసామగ్రి కలదు.

భోజ విక్రమార్కాదుల సభలలోవలె నితని యాస్థానమునఁ బెక్కండ్రు స్త్రీలు సంగీతసాహిత్య నృత్తవిద్యలలోఁ బ్రౌఢిమ చూపుచుఁ బురుషప్రకాండులకు సమానముగా గోష్ఠీప్రసంగములఁ జొచ్చి కనక రత్నాభిషేక గౌరవములు వడసి సంస్కృతాంధ్రములఁ గావ్యసంతానముచేఁ దమ వంశకీర్తులఁ బవిత్రతరములుగాఁ జేసికొనిరి. వీరిలో మిన్నలని యెన్నఁదగిన యన్నులు రఘునాథచరిత్రము రచించిన రామభద్రాంబయు, రామాయణసారసంగ్రహము విరచించిన మధురవాణియుఁ గాఁ దగుదురు. రామభద్రాంబ తాను రఘునాథుని దేవి యని చెప్పుకొన్నదిగాని మధురవాణి రాజుతోఁ దనకుఁ గల సంబంధబంధముల వర్ణించుకొన్నదికాదు. కావున నా రాజపుంగవుని రహఃకేళీవిలాసములఁ బాల్గొనునంత సౌభాగ్యసంపద లేనిదేమో. రేవా, రోహా, శశిప్రభా, అణులక్ష్మి, మాధవీ, ప్రహతా మొదలగు ప్రాకృతభాషాకవయిత్రులును, విజ్జా, విజయా, అవంతిసుందరీ, శీలాదులగు నార్యావర్త సంస్కృత కావ్యకర్తృలును కంతి హొన్న మొదలగు కర్ణాటరచయిత్రులును, అవ్వై, ఆండాళ్ మొదలగు ద్రవిడ విదుషులును ప్రఖ్యాతలై యుండ నాంధ్రవనితలలో సంస్కృతాంధ్రకవయిత్రులు గలరనుట యేమిచోద్యము? మొల్ల, రంగాజి, ముద్దుపళని మొదలగు నాంధ్రభాషారచయిత్రు లాంధ్రవిమర్శకులకుఁ జిరపరిచితలే కదా. అట్లే గంగాదేవీ, తిరుమలదేవీ, రామభద్రాంబాప్రభృతులగు నాంధ్రస్త్రీల సంస్కృత వాగ్విలాసము లాస్వాదిత పూర్వములే యగును.

సంస్కృతమున రామాభ్యుదయము రచించిన యభిరామకామాక్షియు, నందే శ్రీరంగాభ్యుదయము విరచించిన త్రివేణికయు, దృశ్యశ్రవ్యకావ్య ప్రాకృత గ్రంథ సంధాత్రియగు శారదయు నాంధ్రమహిళలు గాఁబోలు. వారి వచోగుంఫము కొందఱి కింకను శ్రవణ గోచరము కాకుండవచ్చును.

> గద్యపద్యప్రబన్ధానాం
> పఞ్చాశత్షోడశనాటకైః,
> సాకం ప్రాకృతకావ్యాభ్యాం
> సాహిత్యం శారదా వ్యధాత్ .

అని డిండిమకవిచక్రవర్తి యగు నరుణగిరినాథునిచేఁ బొగడ్తఁ గన్న శారద దేవరాయల యాస్థానవిదుషి యందురు. త్రివేణి తానే తన్ను గుఱించి, శ్రీరంగాభ్యుదయసర్గాంతముల నిట్లు చెప్పుచున్నది.

> త్వద్గాఙ్గతరఙ్గపఙ్క్తివిలస
> ద్వాగ్జైత్రపాకృతిస్స్వా-
> సుమ్యాఽనన్తకవి స్త్వసూత తనయాం
> యోఽసౌ త్రివేణ్యాఖ్యకామ్,

శ్రీరఙ్గాభ్యుదయే తయా విరచితే
సద్భిః ప్రశస్యే మహా-
కావ్యేఽసౌ లలితః సుధాకృతసఖః
సర్గః స్వమాధుర్యతః.

మధురవాణి రఘునాథునియాస్థానమున సమస్త విద్యాప్రసంగములఁ గలసికొని యతఁడు రచించిన రామాయణము పఠింపఁగా విని సంస్కృతమున రచించినట్లు చెప్పుదురు కాని యతఁడు రచించిన రామాయణము మాకు లభించినంతవఱకు పరిశోధింపఁగా మధురవాణి రామాయణసంగ్రహము దానికిఁ దెనిఁగింపు గా దని తోఁచెను. మధురవాణికావ్యము సుందరకాండమువఱకుఁ లభించును అంతకు పదునాలుగుసర్గలు గలవు. రఘునాథుని బాలకాండమునందలి కొంతభాగముసైతము దాని కంటెఁ బెద్దదిగా నున్నది. భావములు గలిసినవి కావు. రఘునాథుఁడు చిత్రరచనకొంత పోక సరళముగాఁ బద ములకుఁగాని, యతిప్రాసములకుఁ గాని కష్టపడక మహా వర్ణనలసైతము మృదుపదసందర్భముగా రచించుచున్నాఁడు. మధురవాణి యనేకస్థలములఁ గ్లిష్టరచనకు దిగును. పాఠకులు కాలక్రమమున నవ్యుత్పన్నులుగాఁ బుట్టఁ బోవుదురనికాఁబోలుఁ గొన్నిశ్లోకములకు స్వయముగా వ్యాఖ్యరచించె. పాణినీయము చక్కఁగాఁ జదివె నని చెప్పి తదాస్వాదము చూపుటకుఁ గాఁబోలు "రాః నీతిరపప్రశా" యని మాఘుఁడు చెప్పినట్లు ప్రయోగ చాతురిఁ జూపును. ఆమెగద్యములు దన్నుఁగూర్చి యే మనియో? ఇదియో——

తత్తాదృగ్ఘటికార్ధ నిర్మితశత-
శ్లోకీఘణిగ్రామణీ
వాణీప్రాకృతశాస్త్ర నైపుణసము-
న్మీలద్యశఃశ్రీజుషా,
దేవ్యోద్యన్మతిసఖ్యయా మధురవా-
ణ్యాఖ్యాఖ్యయా నిర్మితే
శ్రీరామాయణసారకావ్యతిలకే
సర్గస్తృతీయోఽభవత్.

అని ఘటికాశతగ్రన్థకర్తల నధఃకరింప ఘటికార్ధ శతగ్రంథకర్త్రి యనియు, ప్రాకృతభాషలలోను శాస్త్రములలోను నైపుణి గల దనియుఁ జెప్పుకొనియె. ఓవిదుషీమణీ, గ్రామ్యభాషాకవిచక్రవర్తుల మఱు మాకునీఘణిగ్రామణీ వాణి యేల? మఱికొన్ని గద్యములఁ గానిమ్ము.

ప్రస్తారాభినవార్తవృత్తకవితా
ధాటీకథాప్రక్రియా
షడ్భాషారచనావిశేషబహుధా
విఖ్యాతకీర్తిశ్రియా।
దివ్యోద్యన్మతి...... సర్గస్తురీయోఽగమత్ ॥

మాకాలములోని యనేకపతి సర్వకాలసర్వావస్థలలోను బ్రారంభించిన నిలువఁజాలక వీగులలో సహిత మసర్గముగాఁ బ్రవర్తించుట నీవు చూచినదానవు కావు. నీషడ్భాషారచనలో నత్యుత్కృష్ట మగు మా గ్రామ్యభాషాసముల్లాసములు కలవేని తక్కిన దైయును దప్పక శ్లాఘ్యములే యగు. ఇంకను నీప్రతిభ గొంత వర్ణింపుము విందము-

వీణావాదకళావినోదసమయే
ధృత్వా సమస్యాః శతం
సద్యస్సంసది సాధు పూరయతి యా
దత్తైః కవీన్ద్రైస్తయా,
దివ్యోద్యన్మతిసఖ్యయా...
సర్గోఽభవత్పఞ్చమః.

అనువాదినియంత్రములను (గ్రామఫోనులు), హార్మోనియములును నీకాలమున నుండియుండినయెడల నోకళావతీ, వేయుసమస్యలఁ బూరించియుందువు. అయినను నీచాతుర్య ముభయకళాన్వంసక మని మా సభ్యులు రహస్యముగా గుసగుస లాడుచున్నారు. నీపాట కానిమ్ము.

ప్రఖ్యాతాజ్ఞవయా పదార్థగమక-
వ్యాఖ్యానపఞ్చాన్వయ
ప్రాగల్భ్యప్రదనైషధప్రతివిధా-
సానందసూరీన్ద్రియా,
దివ్యోద్యన్మతిసఖ్యయా...
సర్గోఽత్ర షష్ఠోఽభవత్,

నీయం దున్న యార్జవము మే మెఱుఁగఁజాలము. కాల మను యవనిక నిన్ను మఱుగుపఱచుచున్నది. పోనిమ్ము, వామత్వము లేక యార్జవము గలదేని గాని యందు స్త్రీత్వము లేదని 'అవామతా కామశ్రః' అని పాంచాలుఁడును

> గ్రామేవాసః శ్రోత్రియ
> కథనం పరతన్త్రితా కృపణభావః,
> ఆర్జవయుతా చ నారీ
> పుంసాం మదనాంతకారిణః కేనితే.

అని యీశ్వరదత్తుఁడును జెప్పుదురు విద్వన్మధ మగు నైవధమునకుఁ బ్రతికృతిఁ గల్పించెదవా? వసుచరిత్రను జూచి వేయుఁబ్రతికృతుల నిర్మించు మాయాంధ్రులలోఁ బుట్టినదానవు కావే? నీ కేల యట్టి చాతుర్య మలవడకుండఁ గానిమ్ము. ఏమి యూరకున్నావు? విషయాంతర ప్రసక్త మగు వామత్వమును సౌజన్యధర్మ మగు నార్జవమును వర్ణించుచో నప్రస్తుతప్రశంస చేసితి నని కోపమా? నిన్నార్జవ మాశ్రయింపఁగా మా వాక్కున వక్రోక్తి ప్రవేశించె. పోనిమ్ము నీకథ స్వస్థముగ జరుగనీ. నీవాణి యాత్మస్తుతియందుఁ గేవలము మధురముగా నున్నది. వినుము.

> స్వాద్వీ దుగ్ధసితా సుధామధురవా-
> గ్విశ్రాన్తసన్తోషిత-
> ప్రౌఢశ్రీరఘునాథదత్తసుభవ-
> త్సార్థాభిధాసంభృతా,
> దివ్యోద్యానకృతిసఖ్యయా...సర్గో ఽభవత్సప్తమః.

స్వాద్వియగు నీవాక్కు సాక్షాత్తుగా విన్న రఘునాథుఁడు శ్రాంతసంతోషితుఁడై యెన్ని యేని బిరుదములు నీకొసఁగఁదగు. మాకు నీగద్యములలోని యుత్తరార్ధము పల్లవిగా వినివిని పరిచయాధిక్యముచే మాశ్రోత్రములు జగమంతయు మధురతరముగా గ్రహించుచున్నవి. కథ సాగనిమ్ము.

> సద్యోవిస్మయకృన్నిగూఢకవితా
> సన్దర్భధారాసుధా-
> సారోక్తిపరిపూరితశ్రుతిసుధీ
> సమ్భావితాభిఖ్యయా,
> దివ్యోద్యానకృతిసఖ్యయా......
> సర్గో ఽజని ష్టాష్టమః.

ఇందు శ్రుతి యనఁగా జెవియనియే కాదా అర్థము? కాక సంగీత స్వరములలోని శ్రుతులైనయెడల మధ్యమపంచమము లగు జీవస్వరముల సౌఖ్యము లని వచింతువో నీ సంగీత మతిమానుష మగునో యని భ్రమించితి. పోనిమ్ము నీనిగూఢకవితాగద్యమున నీవే రెట్లు కూర్చెదవో వామత్వము పూనక యార్జవముగాఁ జెప్పుము. లేక మధురశబ్దమును దొలఁగించుకొనెదవా? ఏమి! విస్మరణ్రమముచే వయ్యోదవు? అహో, యూఁదు వాసవుకనా! ముగిసితి.

> మాధుర్యైకధురంధరాంధ్రకవితా
> నిర్మాణసమ్మోదయా
> దివ్యోద్యానకృతిసఖ్యయా మధురవా
> ణ్యమ్బికయా నిర్మితే,
> శ్రీరామాయణసారనామని మహా
> కావ్యే ఽతిభవ్యే సుధీ -
> వర్గోల్లాసవిశేషధామ్ని నవమః
> సర్గో మనోజ్ఞో ఽభవత్.

ఏమి విదుషీమణీ ద్విపాదియగు పల్లవి త్రిపాది యయ్యె, ఇఁకఁ జతుష్పాది యగునా యేమి? లేక యాంధ్రకవులలోని భావదారిద్ర్యము నిన్నావహించెనా? కావుననే కాఁబోలు నీయాంధ్ర ప్రబంధములు మాకాలమువఱకు రావయ్యె.

> సూరిస్తవ్యకుమారసమ్భవమహా
> కావ్యప్రతిగ్రన్థన -
> ప్రాగల్భ్యప్రకటప్రియా పదపదః
> ప్రఖ్యాతినైదుష్యయా,
> దివ్యోద్యానకృతిసఖ్యయా ...
> దశమః సర్గో ఽత్ర కావ్యే ఽభవత్.

రఘువంశమునకు యదువంశ మనియు, భారవికి భూరవి యనియు, మేఘసందేశమునకు హంససందేశ

మనియు, మాఘమునకు ఫాల్గునమనియు, కుమారసంభవమునకు మారసంభవమనియు నొకమహాకవి ప్రతిగ్రంథము నేసె. ప్రతిగ్రంథనకళానైపుణ మతనివలన సంపాదించితివా? లేక జాతిధర్మమా? నీదేశకు లెవ్వరో తెలుపనైతివే.

ప్రౌఢ శ్రీరఘునాథనాయక కృత
స్వర్ణాభిషేకక్రియా
దివ్యోద్యన్మతిసత్కృతా మధురవా
ణ్యాఖ్యాఖ్యయా నిర్మితే,
శ్రీరామాయణసారనామని ...
సర్గస్తథైకాదశః.

కనకరత్నాభిషేకముచే నీశరీరము మందాకినీ జలావగాహము చేసినట్లే పవిత్రమయ్యె. ఇట్టి ధన్యురాలిం గన్న తల్లిదండ్రుల పేరులఁ దెలుపుము. విని యానందింతము.

"ఏమి నీయసందర్భప్రశ్నము? కాళిదాసాదులు తమ జననాదులు వర్ణించుకొనిరా? గ్రంథములు చదువు పాఠకులుకదా తత్తద్రసభావగుంభనములచే కవివ్యక్తుల ననుమానమున నిర్ణయింపవలయు." అని చెప్పెదవా?

"ఓ కవయిత్రీ, ఏమి ప్రతారణము సేసెదవు. కవులచరిత్రములు వ్రాయునప్పుడు తల్లిదండ్రుల పేరులును, నియోగియా తదన్యుఁడా, గోదావరీమండల స్థితుఁడా లేక యనాంధ్రుఁడా, యనుట ముఖ్యాంశములుగా మేమాంధ్రులము పరిగణించియున్నారము. అందు కొఱకడిగితిమి. నీకంతకోపము రానేల? కాళిదాసాదులు తమవిషయముగా సర్వత్రసహానమునే పూనిరి. నీవు నీ పాండిత్య విశేషమును బహుభంగిగా గద్యములలోఁ జెప్పినందున నీ జననకథ యడిగితిమి. నీవును కాళిదాస భాషసరణి నవలంబించియున్నావో -

"ఏదంపతులకుఁ బొడమెనో, యేదేశమునందుఁ గీర్తి కెక్కినవాఁడో, (తుదకు) ఏదెసవాఁడో యెఱుంగను" అన్న వాక్యమున లింగముమార్చి నీకన్వయించియుందుము. కాని యాత్మప్రఖ్యాపనశీలవగు నీకు సిగ్గేల చెప్పరాదా? "సరస్వతీపవిత్రాణాం జాతిస్తత్ర న కారణం"

అని యొక్కక్షత్రియకవిసార్వభౌముఁడు పలికెఁగదా! మేము నామతములోనివారము. నీవు నిశ్శంకముగాఁ దెలుపుము. భోగిని వని సంకోచించెదవా? ఈవ్యాసమున మంగళాంతము మాడుము. పోనిమ్ము గ్రంథము నారంభింపుము కొంత తెలిసికొందము.

లక్ష్మీం దశేల్ల క్షత్రపూర్వజన్మ
వీరో రఘూణాం విజయం ప్రయచ్ఛేత్,
ఆరోగ్య మర్కాభిజనశ్చ విద్యా-
ప్రతీశయూర్తే రఘునాథనేతుః.

ఇది శ్రోత్రియబ్రాహ్మణాది యాశీర్వచన మంత్రమువలె నున్నది. కృత్యాదినే రతీశశబ్దమునకు సందర్భమేమి? రఘునాథశబ్దముతో నాంధ్రభాషాసంప్రయుక్తము విశ్రామనియము వర్గసమముగా నిందు సంఘటించుచు రతీసుఁడు యతీఁ డయ్యెనా? కృత్యాద్యవస్థ యను వాచోయుక్తి నీయందు నిక్కమయ్యెఁగాఁబోలు.

సాహిత్యసర్వస్వగతిని సంచరస్తః
సస్తః పుర్గో నాయికతాం సమేత్య,
శబ్దాయమానాః శ్రవసోరసహ్యాం
న కాకవీః ప్రేష్ఠమపి క్షమస్తే.

కుకవిభాషణము కావ్యమర్యాద కదా. అది లేకున్నఁ బ్రబంధము మెఱుఁగువట్టని యాభరణమువలె నగు. కావులు కుడిచియెడమగా వచ్చుట యపశకునమా?

రఘునాథునివంశావళి బహుగ్రంథముల వర్ణితమయ్యె. మేము విన్నదే. దానిదాఁటి నీగ్రంథరచనకు సందర్భము రచించితి వేని చదువుము.

యదన్తరాత్ర త్రిశనర్తనానాం
సీమన్తినీనాం శ్రమమాక్షిపన్తి,
పర్యస్తయన్తి ప్రతిమాకరాగ్ర
ప్రకీర్ణజాతాః పవమానపోతాః.

ఇది రఘునాథసభలోని శిల్పప్రతిమారచనకదా!

విపఞ్చికాయాం చతురాః ప్రగల్భాః
శాస్త్రే౽తిదక్షాః సరసప్రబన్ధే,
సమీపమేతస్య సమేత్య కేఽపి
సుభ్రూజనాః స్వస్వకళా వ్యవృణ్వన్.

ఇది యంతఃపురవృత్తమా, లేక సభానిర్వృత్తమా?

> రామాయణం శ్రీరఘునాథనామ్నా
> రాజ్ఞాముయా నిర్మితమన్ధ్రవాణ్యా,
> కర్ణామృతం కావ్య మతీవభవ్య
> మపాఠి పాఠీనదృశా కయాచిత్ .

రఘునాథుని యంధ్రరామాయణము నొకతె పఠించుచుండెనా?

> సర్వోత్తరస్యాదిమ సంస్కృతాన్ధ్ర
> ప్రబన్ధనిర్మాణపచేళిమాని,
> యశాంసి భూయాంస్యవతారయన్త్యః
> సహస్రశః సన్తి సరోజనేత్రాః.

రఘునాథరామాయణముఁ దెనిఁగింపఁగల స్త్రీలు గలరా యని ప్రశ్నించినపుడు పైసమాధానము కలిగెను. ఉత్కృష్టసంస్కృతాంధ్ర ప్రబంధనిర్మాణకీర్తి గల స్త్రీలు వేనవేలుగల రనికదా. విక్రమార్కునియట్టి దాత గలఁడేని కాళిదాసువంటి కవు లేల పుట్టరు?

> రసోత్తరం రామకథానుబన్ధి
> కావ్యం మయా కల్పితమన్ధ్రవాణ్యామ్,
> కార్యం కయా సంస్కృతవాగ్విరేత-
> దిత్యేవ చిత్తే గణయన్నవాత్సీత్ .

ఇది రఘునాథునివాక్యము. తన రామాయణము నెవ్వతెయైనఁ దెనిఁగింపఁగలదా యని. రఘునాథుఁడు రామునియందుఁబరమభక్తుఁడు రామసేతు శ్రీరంగవిజయ రాఘవపుర కుంభఘోణాది దివ్యస్థల ప్రతిష్ఠాపిత రామభద్రుఁడని తన యాంధ్రగ్రంథగద్యములలోను, "శ్రీరామ సేతావపి కుమ్భఘోణే శ్రీరఙ్గధ మన్యపి రామభద్రమ్, దేవం ప్రతిష్ఠాప్యతరాం సుతానీః ప్రాకారసద్గోపురమణ్టపాని, రథోత్సవాది ర్మహతీం విభూతిం రసా దకార్షీ రఘునాయకస్య"అని సంగీతసుధలో రఘునాథుని సంబోధించి చెప్పఁబడియె.

కావుననే రామకథ యొన్నిముఖములనైన వినఁగోరి స్త్రీవాక్కు మధుర మగుటచే తద్రచనకు స్త్రీకవులఁ గోరుకొనియె. అంత నారాత్రి స్వప్నమునఁ దనయిష్టదైవమే ప్రసన్నుఁడై—

> చతురమధురవాణీం సమ్య గాకర్ణ్య యస్యాః
> సదసి మధురవాణీనామ దత్తం త్వయైవ,
> సరసకృతివిధాయాం సాధుమేధావిశేషా-
> స్వధికపటు రశేషా స్వమ్బుజాక్షీషు సైషా.

రాముఁడు "నీచే మధురవాణి యను బిరుదము పొందిన మేధావతి, స్త్రీలలో నెక్కుడు కవిత్వపాటవముగలద" యని చెప్పెనే కాని యామెకుఁ దల్లిదండ్రులు పెట్టిన నామమును దెలుపఁడయ్యె. సర్వాంతర్యామి యగు భగవంతునకుఁగూడ దానిపేరు తెలియదా?

> విద్యానవద్యే విదితావతారా
> సుశిక్షితాసౌ విదుషా త్వయైవ!
> విద్యాపరీక్షాసమయే విశేషాత్
> ప్రకాశమాన ప్రతిభానుభావా.
> చాతుర్యమేతి కవితాసు చతుర్విధాసు
> వీణాకళాప్రకటనే భవతీ ప్రవీణా,
> ప్రజ్ఞావశం నిపుణ మచ్ఛతి పాణినీయే
> మేధాం వ్యనక్తి బహుధా వివిధావధానే.
> కర్తుం పటుః కావ్యమిదం స్వయం తే
> సాహాయ్యకం చేత్కుముతేతి సద్యః,
> ఆవేద్య రామోఽన్తరధా త్ప్రభాతే
> పద్మోధికాఙ్క్షః పతిరిత్యబోధి.

అని శ్రీరామచంద్రుఁడే గ్రంథకర్త్రి పాండిత్యశక్తుల వర్ణించె. రఘునాథుఁడే దానికి విద్యాగురువైనప్పుడు కొంతయేమి? మీమాం. సాలంకార శాస్త్రముల జితశ్రముఁ డగు యజ్ఞనారాయణకవియుఁ దాను రఘునాథుని శిష్యుఁ డనియె చెప్పుకొనెను.

> ప్రౌఢశ్రీరఘునాథభూపతికృపా
> స్ఫారీభవత్సాహితీ
> సామ్రాజ్యస్తనయోఽతివిశ్రుతనయో
> గోవిన్దయజ్వేశితుః
> వస్తుస్సర్గమపూరయత్

అని మఱియు,

కావ్యాలంకృతి నాటకాదికలనా
పాణ్డిత్యమత్యద్భుతం
సర్వజ్ఞో రఘునాథ భూమిశతమఖో
యస్యోపదిశ్య స్వయమ్,
ఆనాతుం గురుదక్షిణామభిమతా-
మర్థ్యోఽస్య హో దత్తవాన్
స్వర్ణాలంకరణం విజంచ పతితం
పాదాగ్రదం కిఙ్కిణీః॥

అని రఘునాథుఁడు యజ్ఞనారాయణకవివలన గురుదక్షిణ గ్రహింపక శిష్యునకుఁ దానే కుండలకంకణాదు లొసంగెనఁట. ఇది విద్యారసికుని వాత్సల్య చేష్టగదా. లక్ష్మీసరస్వతులు లహమహమికగా విలాసము లెవ్వని యందు నిలుపుదురో యాపురుషుని జన్మజీవితములు ధన్యత్వము నొంది జీవలోకమును రసమయముగాఁ జేయు ననుట వింతయే.

"ఆంధ్రక్ష్మామండలాఖండలుండు నైన
వేమభూపతికృపావీక్షణంబు
వేదాద్రినరసింహవిపులవక్షస్థలీ
కహ్లారమాలికాగంధలహరి
ఘోడెరాయాంకసద్గురురాజభీమేశ్వ
రస్వామిపదసమారాధనంబు
కమలాద్రినిలయ మార్కండేయశశిమౌళి
........................
కారణంబులు నుద్బోధకములు గాఁగ
సంభవించినసాహిత్యవిద్య

అని శ్రీనాథుఁడు తనకు పెద్దకోమటివేమభూపతియు, అహోబలనృసింహస్వామివరప్రసాదమును రెడ్డిరాజులకు గురుపీఠ మధిష్ఠించినశైవాచార్యుఁడగుఘోడెరాయభీమేశ్వరుఁడను పండితోత్తముఁడును విద్యాప్రదాతలైరనుటచే వేమనకు శ్రీనాథుఁడు శిష్యుఁడా యని సందియము గలుగు. కారణోద్బోధకశబ్దము లాయర్థమునకు వాచకము లయ్యు మహాకవుల వాక్కులు వేయువిధముల ధ్వనించుచుండు నని భీతిచే నారాజేంద్రుని గురుభావము శ్రీనాథునియందుఁ బ్రసన్నమయ్యెనా ?

స్వప్నానంతరము రాజు సభాస్తారులతోఁ గొలువుండి మధురవాణిఁ బిలిపించి రామకథ రచింపు మని సస్నేహముగా నాజ్ఞ యొసఁగె.

ప్రకృతిమధురకావ్యప్రౌఢసన్దర్భవిద్భి-
ర్న్యవతిజనమణీభి ర్వ్యక్తపార్శ్వద్వయోఽసౌ,
అథ సవిధముపేతాం సౌహృదాదాహ్వయన్మా
మవనిపరిబృఢానా మగ్రణీరిత్యభాణీత్.
అజహదలంకృతిక్రమ మనేకరసోల్లసితం
సరసపదార్థసంగతి సమగ్రగుణానుగుణమ్,
రఘువరమణ్ప్రబన్ధతిలకం రసికాభిమతం
సుమతి విధీయతామితి సుధీరగదీన్నృపతిః.

అని గ్రంథరచనకుఁ బ్రోత్సాహకరముగాఁ గ్రొత్త రత్నహారములు కంకణములు చెక్కడపుటంగదాదులఁ బ్రీతి దాయముగా నొసఁగె. పూర్వము శకారాతి యగునొక కవి తనవిజయప్రతాపకీర్తుల వర్ణించినకవికిఁ బ్రహృష్టచిత్తుఁడై మదజలాసార సంక్లిన్నపథ్యాసముద్యద కాలప్రావృషేణ్య సౌభాగ్యంబుగ భద్రగజశతంబుల నొసఁగెనఁట.

శ్లోకోఽయం హరుపాభిధా కవినా
దేవస్య తస్యాగ్రతో
యావద్యావ దుదీరితః శకవధూ
వైధవ్యదీక్షాగురో,
తావత్తావదుపోఢసాన్ద్రపులకో-
ద్భేదః స తస్మై దదౌ
లక్షం లక్షమఖణ్డితం మదజల
ప్రక్లిన్నగణ్డాన్ గజాన్.

అని శకారాతియగు విక్రమార్కుని రసికతయు నుదారతయు వర్ణింతురు. ఆగజచయంబును మన కవయిత్రి యాభరణములతో డనే యంతర్ధానము నొందఁగా నికత్కృపు లొసంగిన కావ్యదీపికలు కాలదండమును ఖండించి బ్రహ్మాండవ్యాప్తి నొంది నక్షత్రలోకమువలె స్థిరజీవము లైయున్నవి.

ఇఁకఁ గథాభాగము నెట్లు కవి తనబిరుదు సెల్లింప రచించెనో చూతము. కుశలవులు వాల్మీకాశ్రమమునఁ

గాఁబోలుఁ జెలిరయొక వీణపుచ్చుకొని శ్రుతులు గూర్చు కొని తంత్రులుసారించి కంఠనాదములు కలియునట్లు పాడిరఁట.

తౌ వల్లకీ ముత్కటతలే నిధాయ
శ్రుతిప్రమాణం స్ఫురితప్రధానమ్,
తన్త్రీః సమస్తాస్త్వను సారయన్తా-
వాలోకయామాసతు రైకకణ్ఠ్యాన్.

స్ఫురిత మనునది గమకములలో నొకటి—

గ్రామద్వయే దీవ్యతి భూతధాత్ర్యాం
ప్రశస్యమానే సురసద్మ చ జాతే,
రసగ్రహాంశాంతర మార్గసృష్టి
తాలేషు నైకాన్తికలోన్నతేషు.

ఈ శ్లోకములకెల్లఁ గవయిత్రియే వ్యాఖ్యయుఁ గూర్చె. షడ్జమధ్యమ గ్రామములలో గ్రహాంశన్యాస ములు తప్పక యల్పస్వరసంగతి విశేషములతో సుఖ మైనజాతి గ్రహించి లఘుగురుప్లుతాది తాళాద్యంగనియమ ములతోఁ పాడఁబోయెదరు. అంతరమార్గ మన "అల్పత్వ భాజాం స్వరాణాం విచిత్రసఙ్గతివిశేషః- తదుక్తం- న్యాసాదిస్థాన ముత్సృత్య మధ్యేమధ్యేఽల్పతాయుతాః। స్వరాణాం సఙ్గతిః" అని యామె యొటీకలో వివరిం చెను. గాంధారగ్రామము స్వర్గలోకముననే ప్రసిద్ధము. కింద వర్ణింపఁబోవు రాగములలో వికృతస్వరములే ప్రధానములు కావునను, షడ్జమధ్యమ గ్రామములలో స్వరశ్రుతులు నియతము లగుటయు వికృతస్వరములలో శ్రుతినియమము లేకుండుటయు షడ్జమధ్యమగ్రామ విభాగమే నేఁటిగాయకులలోను, దక్షిణదేశ వీణలలోను గానరాదు. కావున గ్రామద్వయప్రశంస కేవల మర్థ వాదమై సంగీతప్రశంసాపర మగు.

వివాదినం తం పరిమృద్య వాది-
సంవాదినావప్యనువాదినం చ,
ప్రకాశ్య కాలస్ఫురితాది హృద్యం
స్థాయిక్రమేణాపి విచిత్రవృత్తిః.

వాదిసంవాద్యనువాదిస్వరములు పరస్పరమైత్రితో మెలఁగును. వివాదులు స్వరవ్యక్తి నశింపఁజేయు. స్ఫురి తము గమకములలో నొకటి.

వృత్తులు వేగమును బాటించు మార్గగతులు చిత్ర వార్తిక దక్షిణములని. స్థాయిక్రమ మనఁగా నొకానొక స్వరమునుండి యారోహావరోహరూపములుగా స్వరసం చారము సేయుట యందురు.

ఉత్కర్ష ధన్యర్షభలాలనీయ-
ముష్యోష్ణధోన్మేష విశేషధన్యమ్,
విశుద్ధ భాస్వత్సమపాతి భావం
నాట్యం పటుత్వం బహు నాటయన్తౌ.

నాటరాగమేళ మని ప్రకృతార్థము. నాట్య మని యప్రకృతార్థము. ఇం దప్రకృతార్థము ధన్యులలో ఋషభులు (శ్రేష్ఠులు) వారిచే లాలనీయము. సుధ యొక్క యున్మేషము, సమపాతి (పాదవిన్యాసము సమముగా నడచుట.)

ప్రకృతార్థమున, ఉత్కర్ష- తంత్రులఁ బైకి నుద్ధత ముగా నాకర్షించుట ధ, ని, ఋషభస్వరములచే (ధైవ తనిషాదర్షభములు శ్రుత్యధికములగుట, షట్ శ్రుతి ధైవ తర్షభములు, కాకలీనిషాదము, అందుచే నంతరగాంధా రము). సమపాతం షడ్జమధ్యమ పంచమముల శుద్ధస్వర త్వము గల నాటరాగమేళ మని యర్థము.

నాటమేళమున శుద్ధములు షడ్జమధ్యమ పంచమ ములు. ధైవతర్షభములు షట్ శ్రుతికములు. గాంధార నిషాదము లంతర కాకలీనామకములు. ఈ నాట దేశి రాగములలోఁ జేరినది కావున షడ్జమధ్యగ్రామ వ్యవ స్థలో వచ్చునది కాదు. నాటరాగము మొదటఁ జెప్పు టకుఁ గారణ మేమన రఘునాథుని సంగీతసుధలో నిది ప్రథమ మేళముగా గ్రహింపఁబడియె. దీనినె కళ్యాదులు వర్తరాగ మనిరి.

మఱియు రఘునాథున కీరాగ మెక్కువ ప్రీతి నొసఁగు చుండెనని తోఁచుచున్నది. మఱియు నది మంగళకరమం దురు. రఘునాథుఁడు బాల్యముననే వీణావాదనము చక్కఁగా నేర్చి గురుకులమునుండి తండ్రియొద్దకు రాఁగా సభలోఁ గుమారుని విద్యాసంస్కారము పరీక్షింప నతఁడు మొదట నాటరాగమునే రూపకాలాపాది లక్ష ణములతో రాగవర్ధనీ క్రమములతోడఁ బాడి వాయించి

చూపినట్లు యజ్ఞనారాయణదీక్షితులు సాహిత్యరత్నాకరమునఁ జెప్పుచున్నాఁడు.

> రాగేణ తేన ప్రథితేన తాయ
> గీతప్రబన్ధాన్ పరం వాదయిత్వా,
> పరం విహాయీకృతపఞ్చమోఽస్య
> ప్రసక్తి గౌళస్ఫురణం ప్రకాశ్య.

గౌళస్ఫురణ మనఁగా గౌళరాగపు గమకము, లేక వ్యక్తీకరణము విహాయీకృత పంచమ=పంచమస్వరము పరిహరించినది. పంచమస్వరము వదలి గిక్కిన యాఱుస్వరములతో గౌళరాగ మారోహణమున షాడవ మను సంజ్ఞ చెందుచున్నది. సంపూర్ణముగా రాగము విస్తరింపఁదగినచో నాలాప, తాయ, గీత, ప్రబంధము లను నాలుగంగములఁ బరిపూర్ణము సేసి పాడుట యుత్తమగాయక సంప్రదాయము. ఇందు తాయగీతప్రబంధములు మూఁడు చెప్పఁబడియె. గౌళరాగమును చౌకముగా వర్ధనము చేసి సర్వజనామోదము గలిగించెననుట ప్రకృతార్థము. అగ్రాంతరమునఁ గోకిలస్వరోద్యత్ప్రసక్తి యని మధురవాణియే వ్యాఖ్య యొనర్చె.

ఈశ్లోకమునకుఁగవి పంచమ మనఁగా ధైవతస్వరము. "గౌళస్తదంగవిన్యాసగ్రహాంశః పఞ్చమోజ్ఝితః॥ ఇతి గౌళే గ్రహస్స్వరోనిషాదః తదపేక్షయా పఞ్చమో ధైవతః" అని సంగీతరత్నాకరశ్లోకము నుదాహరించి పంచమము (అయిదవది) ధైవతము వర్జ మని వ్యాఖ్య చేసె. పంచమశబ్దము సరిగమపధనిస్వరములలో నొకటియగును. అది పారిభాషికార్థము. పంచమము=అయిదవది. ఇది లౌకికార్థము. ఈమె శ్లోకమున పంచమశబ్దమును లౌకికార్థమున వ్యాఖ్యాన మొనర్చె. దీనిరత్నాకర వ్యాఖ్యాతలు (సింగభూపాలకల్లినాథు లిరువురును) నంగమమని వదలిరి. అందుచేఁ బంచమస్వర మని పారిభాషికార్థముననే గ్రహింపవలసియున్నను.

మతంగుఁడు

> "టక్కరాగేణ సదృశః పఞ్చమేన వివర్జితః,
> షడ్జాంశన్యాససమ్పన్నో గౌడః స్యాత్స్ఫురితర్షభః"

అనియు, శార్ఙ్గదేవుఁడు (సరస్వతీహృదయాలంకారమున)

> న్యాసాంశగ్రహషడ్జః పంచమహీనస్త్వవరోహ్యర్షభగ్రహః,
> స్ఫురితాఖ్యగమకనిబిడో గౌడః స్యాట్టక్కరాగరవసదృశః॥

జగదేకమల్లుఁడు సంగీతచూడామణిలో-

> గౌడః స్యాత్ టక్కరాగాఙ్గః సన్యాసాంశగ్రహాన్వితః,
> వర్జితః పఞ్చమేనైవ రసే వీరే నియుజ్యతే.
> జాతేశ్చాఙ్గం నిషాదిన్యా వదన్తి న తు మేమతమ్.

అని వీరెల్లరు పంచమహీనమై గౌడరాగము షాడవమనియు, షడ్జగ్రహము గలదై (అనఁగా షడ్జస్వరముతో ప్రారంభించుట, దానితో న్యాసము అనఁగా ముగింపు) అనిరి. టక్కరాగచ్ఛాయ గాక నిషాదినీజాతిలోఁ బుట్టినదన్నమతము జగదేకమల్లుఁ డంగీకరింపఁడు. అనఁగా నిషాదస్వర మంశస్వరమగుట (ప్రధానము, లేక జీవస్వరమగుట) ఏలయనఁగా నిషాదమునకు గాంధారము పదియవశ్రుతిలో నుండుటగా సంవాదిత్వము కావలయును. గాంధారనిషాదము లెల్లప్పుడు వివాది (విరోధ)స్వరములు కావున నిషాదము గ్రహాంశస్వరములుగా గ్రహించినచో రక్తినాశ మగు. నిషాదము గ్రహాంశ మని శాస్త్రమం దున్నను ఋషభమే యంశస్వర మగుట వాడుక. రికి పంచమ (ఐదవ) స్వరము ధైవతము; దాని లోపింపఁజేసిరి. ఈయంశమునే రఘునాథుఁడు సంగీతసుధలో నిట్లు చెప్పె-

> వక్ష్యామహే సంప్రతి గౌళరాగ-
> మేషో భవే దత్ర చ గుర్జరీవత్,
> గౌళస్య చైతస్య వదామి లక్ష్య
> న్యాసో గ్రహోంశోఽత్ర నిషాద ఏవ.
> స షాడవో ధైవతలోపతః స్యా
> ల్లక్ష్యానుసారా దృషభస్త్వహాంశః,
> అత్రోచ్యతేఽన్యస్వరశబ్దభూతే
> గాన్ధారకే కించ నిషాదనామ్ని.
> ప్రధానభావోఽంశతయా న యుక్త-
> స్తస్మా దిహ స్యాదృషభస్వరోఽంశః,
> రాగాభియుక్తై రత ఏవ కైశ్చిత్
> సంకీర్ణరాగత్వ ముదీర్యతేఽస్య.

అని యంశస్వరము ఋషభ మనియుఁ గొందఱు దీని సంకీర్ణజాతిలోఁ జేర్తురని చెప్పె. కొంద ఱనఁగా రామామాత్యాదులు. వారు దీని నధమరాగ మనిరి. అనఁగా ఆలాపతాయగీతప్రబంధము లను నాల్గంగములు దీనికి రావని భావము. వేంకటమఖి చతుర్దండిప్రకాశిలో గౌళాదిసప్తరాగములకు నిషాదము గ్రహస్వర మని చెప్పి—గౌళస్తు షాడవో రాగో రాగాంగో ధైవతోజ్ఝితః, వాదిసంవాదినావత్ర రిగౌ శశ్వత్ప్రగీయతే. అని ధైవతలోపముచేత షాడవ మనియె. తులజారాజు తన సారామృతమున—గౌళో మాళవగౌళీయ మేళజో ధైవతోజ్ఝితః, షాడవో నిగ్రహో రాగాంగోఽయం శశ్వత్ప్రగీయతే. అనియె.

మఱియు, రఘునాథుఁడు గౌళరాగమును సుర్జరీమేళజన్యముగాఁ జెప్పె. రామామాత్యుఁడు శ్రీరాగముక్రిందను, వేంకటమఖి స్వతంత్రమేళకర్తగాను, పరమేశ్వరుఁడును స్వతంత్రమేళముగాఁ జెప్పిరి.

> సంత్యజ్య మేష మవరోహణి నైశికేస్తు
> తత్ షాడవోడువగణే పరిగణ్య గీతః.

అని మేషమును (అనఁగా గాంధారమును) పరిత్యజించి యవరోహించుచు షాడవ మగు ననియె. కావున దీనికి వీరి మతానుసారము తాయాదులు పొసఁగవని భావము. నేఁటికాలమువారు దీని మాళవగౌళమేళజన్యమందురు. పైనూచించినమతభేదములు గల గౌళరాగమునకు తాయాదులు కూర్చినట్లు మధురవాణి చెప్పుచున్నది.

ఆలాప, తాయ, గీత, ప్రబంధము లను నాలుగంగములను నాలుగుదండెము లని యందుచే రాగము చతుర్దండీవిలసిత మని గోపాలనాయకుఁడు చెప్పినట్లు వేంకటమఖి చెప్పుచున్నాఁడు. ఆలాప మనఁగా కేవలము స్వరసందోహమున నారోహణావరోహణాది చమత్కృతి. తాయ మన స్థాయిగా నొక స్వరమును నిర్ణయించుకొని యారోహావరోహగమక చమత్కృతి నాతిద్రుత విలంబితములుగా జరుపుట. గీతమన స్వరతాళపదాత్మకమైన చిత్రి. ప్రబంధమన స్వరతాళపదరసభావపుష్టిచమత్కృతులు గలుగును. కావుననే సంగీతసూర్యోదయమున స్థాయి సంచార్యారోహావరోహణములకే చతుర్దండి యని నిర్వచించెను.

ఈ గీత తాయ ప్రబంధమైన చిత్రి దేశీయరాగములకే కాని కేవలము యజ్ఞోపయోగముగా దేవతాస్తుతి పరమగు గాంధర్వమున వచ్చు గ్రామరాగములకు లేవని యాంజనేయాదు లనుశాసించిరి.

> మధ్యైవ తాదృఙ్మహిత ప్రకర్షం,
> వరాళిరాగోల్లసనం సృజన్తి,
> స్వ[illegible] స్మ సామన్తముఖారిపాళి
> జయన్తసేనాదిషు చాతురీం తే.

మ = మధ్యమస్వరమున, హితమైన ప్రకర్షం, అనఁగా వరాళిరాగమున మధ్యమస్వరమునకు ౬ లేక ౮ ప్రకారములు గలవందురు.

సామన్తము, ముఖారి, పాళి, జయన్తసేన-రాగభేదములు. జయన్తసేన రఘునాథుఁడే యుద్ధరించినట్లు చెప్పుచున్నాఁడు. అది భైరవీమేళజన్యమని తాఁ జెప్పె. "జయన్తసేనా రఘునాథ భూమిపురన్దరేణైవ సముద్ధృతా చ, సదా ప్రగేయా శుభదాయికా స్యాద్రక్తిప్రదా చాఖిలగాయకానామ్" అని సంగీతసుధలో రఘునాథుఁడే చెప్పెను. షణ్ముఖుఁడును తులజామహారాజును దీనిని శ్రీరాగమేళముక్రింద నొసఁగిరి. శ్రీరాగమున చతుశ్శ్రుతిక ధైవతము, భైరవిలో ధైవతము శుద్ధము. ఇదియే భేదము.

ఇట్లే సంగీతశాస్త్రమర్మములు సూచించునట్లు కుశలవులగానవైఖరి ౩౯ శ్లోకములలో వర్ణింపఁబడియె.

కథాభాగములోఁ గొన్ని వర్ణనలఁ జూతము. కథాశరీర నిర్మాణకౌశలము చూపుటకు రామాయణకథ పొంకము కాదు. ఏలయనఁగా సుప్రసిద్ధమయిన కథాసంధిఘట్టనము గల పురాణపుణ్యకథల మార్చినచో సీతాది దివ్యకాంతల లోకోత్తరగుణ సంపత్తియు, రావణాదులయుద్ధతియుఁ గొంతమాఱి ధర్మోపదేశము భిన్నరూపము వహించి లోకులహృదయాధిష్ఠితనిత్యార్చనీయ దివ్యమూర్తులు స్వరూపనాశము నొందును.

ఇట్టి నట్టి కథలఁ బుణ్యానుబంధములని గ్రహించువారు కథానిర్మాణకౌశలము పీటఁబుచ్చి సల్లాపనైపుణియు, నానారసభావ సంభవాసంభావనయు, లోకజ్ఞతయుఁ ప్రసన్నగంభీరపదరచనా విచక్షణతయు క్షీరాబ్ధికల్లోలమాలా పరంపరలవలెఁ దెరలెత్తి సదర్థజాలము పొంగిపొరలునట్లు రచించు ప్రతిభాప్రభావమును జూపఁగలుగుదురు.

పాత్రస్వభావచిత్రణము శ్రవ్యకావ్యములకంటె దృశ్యకావ్యములలోఁ బ్రవ్యక్తముగా నుండు. మధురవాణి వర్ణనానైపుణి చూపుచు సాహిత్యజ్ఞానము ప్రకాశింప నిచ్ఛగలది యగుటచే శ్లేషాదిచిత్రరచనలతో సర్గములు నిండించును. తంజాపురాంధ్రకావ్యములలో నచ్చటచ్చట హాసజనకము లగు భావములు నిపుణముగాఁ బొందింపఁబడినవి. విద్యావసనావాసిత యగు నదియు నట్టి హాస్యరసము స్పష్టముగాఁ బోషించును. హాస్యరసమునఁ గలుగు నపాయ మేమనఁగాఁ గావ్యములో నుదాత్తరూపముగా వర్ణింపఁబడు ప్రధానరసమునకు సన్నభావము స్థాయికి స్ఫోటకపిటకములచే ముఖసౌందర్యము చెడినట్లు కృతికి వికృతి కలుగవచ్చు. ఈదశావిశేషము రఘునాథాదుల కావ్యములందును బ్రతిఫలించును. మధురవాణి కేవలము వర్ణనలలో మెలఁగుచున్నందునఁ దద్దోషముచే నెక్కుడు బాధింపఁబడదయ్యె. ఆమె కవితలోఁ గొన్ని పట్టులు చూపుచున్నాము. * రామపాదుఁడు ఋశ్యశృంగునియొద్దకు వేశ్యల పంపిన ఘట్టమున-

శ్రుతిసంహృద్యముదారభక్తిగానం
  సుదృశాం పశ్య సుతో విధత్త ఏషా,
నిరవద్య మసౌ నిశమ్య ముగ్ధం
  సముత్థాప్య సామగానబుద్ధ్యా.
వనజాక్షీః ప్రసభం నిరీక్ష్య వక్షో
  ధృతచంచన్నవమౌక్తికాశ్చ దామ్నః,
మునుతే స్మ తదా మన స్స్వపూర్వాన్
  మునిరశ్మశ్రుముఖాన్ స మౌనిముఖ్యాన్.

ఈ ఘట్టమున రఘునాథునివర్ణన సరసమై గ్రామీణశేఖరుని లోకతంత్రజ్ఞలకు విదగ్ధాంగన లెట్లు వశీకరింతురో యా నైశితతంత్రచ్ఛాయఁ బ్రకటించుచున్నది. కొన్ని పద్యముల నుదాహరించెదము.

క. ఇమ్మానిసిమెకమున్ మును
నమ్మఁదగదు చేరి కొబ్బునఁ జనకుఁడు పైఁ
గ్రుమ్మి తలవంచికొని వశిఁ
గొమ్మున నటు చిమ్మనేని కొదవగుఁ జుమ్మా.

గీ. తరుణిరో వీని పెద్దపంతముల మీఁద
లీలఁ దాంబూలరస మింత కీలుకొనిన
పండిపగిలిన దాడిమీఫలములోని
విత్తులననుండు నెలుఁగొందు వీడియుంబు.

గీ. కొమ్ములెల చివయరాని మాపవయేల
వచ్చు నితఁడేమి కన్నెపాపఁడుగాఁడె
యది కిరీటంబులోపల నడఁగరాద
యంచుఁ బల్కరి ముఖ్యసుఖగాంచి వేశ్య.

గీ. ఘనుఁడె యితఁడేమి యిందులకంటె వేల్పు
కొమ్ములెల చెనేయు నాడికొందు రెంతుఁ
గొమ్ములున్న దితనికిఁ గొమ్మ వార
మునిశిరోమణి యిచ్చెపో ముజ్జగముల.

గీ. చెలియరో వీఁడు నా చేతఁ జిక్కెనే
కౌఁగలించి యెక్కించి సుఖునిఁ బ్రగమ్మఁజేసి
గుబురు సుడిగులకయుంపుగఁ గొమ్మనిచి
మంచికస్తూరిబరణిఁ బట్టింపవచ్చు.

సీ. చెలువలు పన్నీరుచెంబులిచ్చినఁగాళ్ళ
  కుప్పెలజలమంచుఁ గ్రోలనెంచు
సతులు జవ్వాది యొసఁగ గోపిచందన
  మని ఫాలమునఁ దీర్చి నగ్గలించుఁ
గాంతలు పరువంబు గానుకిచ్చినఁదుల
  సీదళంబనుచు భక్షింపఁజూచుఁ
బోలఁతులు తెలిగందవొడియిచ్చిన విభూతి
  యిదియటంచుఁ బ్రపుంఖ మిడఁదలంచు

* గ్రంథ మచ్చటచ్చటఁ జదువఁగలిగెఁగాని సాంతముగాఁ జూచు నవకాశము లేకుండెఁ బూర్ణముగాఁ జదివిన మఱికొన్ని గుణవిశేషము లందుఁ గానరావచ్చు-

నలువంబోఁడులు వజ్రాలహార మొసఁగఁ
బటికపుజపామాల సరముఁ దమ బాణిఁబూని
పేరాని జపియింపఁ దివురు నెంతైనఁ గలరు
ముగ్ధలగువార లిటువంటిముగ్ధ గలదె.

శాపథారాజివ్యంచలులగు సువర్ణులతో సరస మాడుట యగ్నిజ్వాలలతో మల్లయుద్ధము సేయుటయే యని యిమ్ముగ్ధ లెఱుంగరు కాఁబోలు.

మిథిలానగరము రామప్రవేశసమయమున నిట్లుండె —

వితానపరిలమ్బితోత్పలవితానసన్దానితం
వినూతననికేతనాకలితకేతనాలంకృతమ్,
మృదఙ్గపటహార్భటీముఖరగోపురం తత్పురం
ప్రశస్తమవలోకయన్ ప్రముముదే రఘూణాంపతిః.

ఇది స్వభావసిద్ధమగు వర్ణన. ఇందుఁ గల శబ్దాలంకార మంతగా రసభఙ్గకారి కాదు. సీతావర్ణనము నాంధ్రకావ్యములలో వలెఁ బ్రత్యఙ్గసౌష్ఠవప్రకాశక మగుట చూడఁగా స్త్రీ స్త్రీని వర్ణించెనేని స్త్రీత్వమునకుఁ గల యపూర్వగర్వస్వాతన్త్ర్యమది భ్రమము లాస్త్రీ కని యుండియుండునా యని యొక వినోదప్రశ్న గలుగ వచ్చును. ప్రతియోగిభావముచేఁ బురుషకవులకుఁ గల్గు భావనావిలాసములు తత్ప్రతియోగిస్థానమున వ్యత్యస్తముగా నుండునేమో యని కొందఱు భావకులు తలంతురు! సీతాహరణానంతరము రామవిరహోద్దీపకములగు ప్రావృట్కాలపుఁ బ్రళయవేళలలో —

ధ్వన్యామ్భోజనిర్మసాహిత్యముద్రాం
తన్వద్భిః స్వే సన్నిధానే కవిభ్యః,
రాజ్ఞో యేన(?) శ్వేతపద్మావికీర్ణాః
కూజద్భృఙ్గా జైత్రశఙ్ఖా ఇవాసన్.
తస్మిన్ భృఙ్గీమీననాళీకకోకే
ద్వన్ద్వాలోకాదూష్మికన్యాప్రతీతాన్,
స్మారంస్మారం జాతదీనానులాపం
సౌమిత్రిస్తం సాంత్వయామాస రామమ్.

మొదటిది సంధ్యాకాలమున ముకుళించు పద్మములనుండి వచ్చు భృంగారవములును, రెండవది సీతాసమానవస్తుదర్శనముచే రామునకుఁ గలుగు భ్రాంతిస్మరణవిలాపదైన్యాదుల లక్ష్మణుఁ డపనయింప ననునయించుటయుఁ దెలుపును.

నృత్తై రాస్తాం నీలకణ్ఠస్య సద్యో
వ్యోమాభోగే కాళికాయాం నటన్త్యామ్,
వేగాల్లగ్నా లక్ష్యతత్కుణ్డలాంచ-
ద్రత్నాభేవ ప్రాద్యుతద్దైవయోనిః.

నీలకంఠః=శివుఁడు, నెమలి, కాళికా=నల్లకాంతి. కాళికాదేవి, కుణ్డల=శ్రవణాభరణము, కాళికాదేవికి సఖి. ఇందు మెఱుపుకాంతి వర్ణింపఁబడియె.

పాథోవాహాః ప్రావృషేణ్యాః ప్రభూతే
ప్రాదుర్భూతే పక్వజమ్బూనిదానే,
కేకిశ్రేణీకేతకీ కలినీశ
కేదారాళీ సోత్కలాపా బభూవుః.

ఇందు- ఉత్కలాప = ఉత్ + కలాప (నెమలిపురివిచ్చి పైకెత్తుట.) ఉత్కలా, ప = అధికశ్రుతిగల పంచమస్వరము.

నృత్తేఽబ్దానాం పఙ్క్తిమాలోక్య కేకీ
మేఘాంచక్రే సిన్ధురాజీవనానామ్,
ప్రోవాహోష్యశ్యామశాఖిచ్ఛటానా
మేఘాంచక్రే సిన్ధురాజీవనానామ్.

ఇందు-సిన్ధురాన్ ఆజీవయన్తీతి సిన్ధురాజీవనాః, నృత్తే, మేఘాంచక్రే, సింధు, రాజీ, వనానాం, ఏథాంచక్రే, ప్రోవాహ = వసంతిస్మ. అని గ్రహింపవలయు.

పఙ్క్తీభూయ ప్రాదురాసన్ బలాకా
నాథం నాత్రాశ్లిష్యతి స్మాబలా కా,
సిన్ధోరూర్మ్యః కూలసీమామరాళాః,
ప్రాయోఽబధ్నన్ వ్యోమ్ని యత్రావన్మరాళాః.

ఇందు బలాకాః పఙ్క్తీభూయ, ప్రాదురాసన్, కా, అబలా, అత్ర, నాథం నాశ్లిష్యతిస్మ, అరాళాః సిన్ధోరూర్మ్యః కూలసీమాం ప్రాయో అబధ్నన్, మరాళాః వ్యోమ్ని అధావన్- అని యన్వయము.

అమ్భోదానాం దత్తసంసారసానా
మాలీ శేజే మానినీ సారసానామ్,

ధారానికషు వ్యాసకే పారసానాం
జజ్ఞే నాఖ్యా భూతలే పారసానామ్.

ఇందు దత్తిహంస + అరసానాం (అరసః = అప్రీతి) మానినీపారసానాం = మానినీనాం పారః స్థైర్యం, తత్ స్యన్తి (అన్తర్భావితణిచ్, అతోఽనుప సర్గేకః ఇతికప్రత్యయః) అమ్భోదానాం ఆస్తే రేజే, సా = తాదృశీ రసానాం జలానాం వా ధారా నికషు వ్యాసకే, పారసానాం = పద్మానాం ఆఖ్యా, భూతలే, న, జజ్ఞే.

వర్షాకాల వర్ణనమంతయును జుటుములు మెరుపులు పడగంట్లు- వీనితో అనంగా యమకానుప్రాస శ్లేషాదు లచే విరహిజనులకుంబోలెఁ బాఠకులకును దుస్సహమై యుండెఁగదా. శరత్కాలసనోద్యోగమున కర్ణమగు శర ద్వాసరవైశద్యము నొక్కసర్గములోఁగవయిత్రి వర్ణించె. ఒండురెండు మాత్రలఁ జూపెదము.

కాదమ్బిన్యాః శ్యామికయా కాళిమానం,
కాదమ్బానాం కాముకాధానహేతుం,
శామ్య త్యబ్దః పక్వశాలి ప్రభాలీ
శాలీ పద్యశ్శారదో వాసరోఽభూత్.

(కాముకము = వివాహము, ఆధానము- గర్భాధానము)

శత్రూన్ జేతుం శాతశాతా మతిస్వన్
నాళీకానాం పాళికాం రాజహంసాః,
ప్రత్యగ్రాణాం ప్రాప్నువన్ సప్రశంసా
నాళీకానాం పాళికాం రాజహంసాః.

(రాజహంసాః-రాజహంసలు, రాజశ్రేష్ఠులు, నాళీకము = తామర, బాణము. శాతశాతాం = అతి తీక్ష్ణమైనట్టి, పాళికాం).

అతిదూర మాగపతః శ్రమచ్ఛిదే,
నిజకామినీమణిజనస్య యుమ్ఫుతః,
పటవాసపాంసురివ కేతకీరజ-
స్తటినీమని స్ఫురతి వాసయన్ మహీమ్.

తటవికస్వరనూతనకేతకీ
పతితపాంసుపరీతనిజాన్తరమ్,
స్ఫురతి యస్య పురారితనుః పయః
పరిలభాసితభాసితభా ఇవ.

(భాసిత = భస్మసంబంధము)

అని మొదలుగా శారదగాజహంస కేతకీరజో వర్ణనలు తేటగా నింపుసరసములుగా నున్నవి.

సుందరకాండ కథలో హనుమంతుఁడు సీతాద ర్శనమున నంగుళీయక మిచ్చిన ఘట్టమున

ఆదాయ మద్రి రఘువీరకరావమర్శం,
సద్యః స్మృతిం రాగభరమాత్మని మాస్పృశా త్వమ్.
రత్నాఙ్గులీయక విరక్తయ రత్నగర్భా
గర్భోద్భవయా స్సహజరాగ మసూన మేవ.

అనుమానుమద్వాక్యము భావవ్యంజకముగా నున్నది. సీత యుంగరమును బ్రతిగ్రహించి శోకపరవశ యగుట కవి చక్కఁగా వర్ణించెను.

భవ్యం విహాయ భరతో మణిముద్రికే త్వాం
సామ్రాజ్యపాలనసమంజసతా ప్రకారే,
పాదద్వయం రఘుపతిం ప్రణయాద్యయాచే
కింను త్వదీ మ్యయమయం తత్కలితోపకారమ్
సోఽగ్నిః స్వకీయశిఖయా గ్లపితాశయానాం
నక్తంచరేంద్రనగరీవనితాజనానామ్,
శ్వాసానిలైః ప్రవవృధే శతధా సమృద్ధ-
మగ్రే తతస్తు నయనాంబు తదావిరాసీత్.

అని సీతాబాష్పసలిలవర్ణన ముత్ప్రేక్షాసరసమైయున్నది. ఇవి పదునాలుగవసర్గములోని శ్లోకములు. ౧౫-వ సర్గమునఁ గొంతభాగమువఱకు గ్రంథము లభించుచున్నది. ఆంధ్రలోకమునకు నాంధ్రకవయిత్రి సంస్కృత రచన చూపవలయునని యుదాహరించితిమి. స్త్రీకవిత్వమును రాజశేఖరుఁడు—

"పురుషవద్ యోషితోఽపి కవీభవేయుః, సంస్కారోహ్యాత్మని సమవైతి న స్త్రైణం పౌరుషం వా

విభాగ మపేక్షతే, శ్రూయన్తే, దృశ్యన్తేఽపి చ రాజపుత్ర్యో మహామాత్రదుహితరో గణికాః కౌతుకిభార్యాశ్చ శాస్త్రప్రహతబుద్ధయః కవయశ్చ" అని విద్యాసంస్కారము స్త్రీపురుష భేదములేక లభించు. రాజపుత్రికలు మంత్రికుమారికలు గణికలాదిగా విదుషులు శాస్త్రముల నేర్చి కవిత్వము చెప్ప నేర్చిరని భావము. పూర్వము రాజులయొద్ద భోగినులు పట్టాభిషిక్తయగు రాజ్ఞికి స్థానవిశేషమున న్యూనత వహించినను కలావిలాసశిల్పనాగరుల మిన్నలై యేకచారిణీవ్రతము నవలంబించుచు గౌరవము నెందుచుండిరి. అట్టిపదవిలో గంగాదేవి, రామభద్ర, తిరుమలాంబ, మధురవాణి, రంగాజి మొదలగు సంస్కృతాంధ్రవిదుషులు చేరి యుందురని కేవల మూహచే దలంచుచున్నాము.

వైశ్యశూద్రకులోత్పన్నా రూపయౌవనసంయుతాః
నృత్తగీతకలాదక్షాశ్చిత్రజ్ఞాః ప్రేమనిర్భరాః.
సంభోగసుఖసామ్రాజ్య సంవర్ధనవిచక్షణాః,
అవరోధవధూః కాన్తాః కుర్యాద్భోగాయ భూపతిః.

అని సర్వజ్ఞసోమేశ్వరుడు మానసోల్లాసమున శాసించె.

అభిరభ్యుచ్ఛ్రితా వేశ్యా శీలరూపగుణాన్వితా,
లభతే గణికాశబ్దం స్థానంచ జనసంసది,
యోగజ్ఞా రాజపుత్రీ చ మహామాత్రసుతా తథా,
సహస్రాన్తఃపురమపి స్వవశే కురుతే పతిమ్.

తథా పతివియోగే చ వ్యసనం దారుణం గతా,
దేశాన్తరేఽపి విద్యాభిః సా సుఖేనైవ జీవతి.

అని వాత్స్యాయనమహర్షి గణికావిద్యా సంస్కారమును వర్ణించె. గణికలు స్వధర్మములఁ బరిత్యజించి నిమ్నమార్గముల హేయజీవనము సేసినచో దూష్యులగుచుందురు గాని నియతధర్మానుష్ఠాత్రులు వినింద్యులు కారు కదా.

గ్రంథచౌర్యమను శీర్షికతో నొకవ్యాసము వ్రాయఁదలఁచినారము. అందు రామభద్రాంబ (రఘునాథుని దేవి) కవితావిలాసములను బ్రకటించెదము.

మానవల్లి రామకృష్ణకవి.



# వ. సు. చరిత్రము

## నండూరి బంగారయ్య

పైపేరుకు లోపలియంశములకు నెంతమాత్రము సంబంధము కనిపింపకుండ వ్రాయుట నవీనసంప్రదాయములలో నొకటి. నేను అంతకంటె ఒకఅడుగు ముందుకుపోదలచినాను. లోపలియంశములనుగూర్చి అపోహకు అవకాశమిచ్చే పైపేరు పెట్టినాను. వ. సు. చరిత్రమనగా రామరాజభూషణుడు రచించిన వసు చరిత్రమునుగూర్చి యేమో వ్రాయుదునని కొందరు భ్రమపడవచ్చును. నేనిప్పుడు వ్రాయదలచుకొన్నది వడ్డాది సుబ్బారాయుడుగారినిగూర్చి. చరిత్రమనినంత మాత్రమున వారు జన్మించినదిమొదలు నేటివరకు జరగిన యంశములను పూసగ్రుచ్చినట్లు వ్రాయదలచుకొన లేదు. నామిత్రుడొకడు మన్నంగిశర్మ ఇంగ్లీషులోని Character అనుపదమునకు సరియయిన తెనుగుపదము చరిత్రమేయని వాదించుచుండును. ఈవాదముతో నేనేకీభవించినను ఏకీభవింపకున్నను ప్రస్తుత మీవ్యాసమును మాత్రము దానికనుగుణముగనే వ్రాయుచున్నాను.

నామిత్రులు గుండిమెడ వెంకటసుబ్బారావుగారు ఈనడుమ రంగులతో వ. సు. రాయకవిగారి చిత్రపటమును తయారుచేసిరి. నా కట్టిసామర్థ్యము లేదుగావున నుడుతభక్తిగ నీవాఙ్మయచిత్ర మర్పించుకొనుచున్నాను.

ఆంధ్రకవులలో నాకు ప్రథమమున పరిచయమైన వారు వడ్డాది సుబ్బారాయుడుగారు. "ఏ నమ్మహాను భావుల మేనల్లుడ" నని యుత్తరుడు చెప్పికొనినట్లుగ నాకును చెప్పికొనుట కధికారమున్నది. నేను వారిని మామగారూ అని పిలచుచుండెడివాడను. కాని ఆబంధుత్వ మెట్లుసిద్ధించినదో వివరించుటకు మూలమూలల నున్న వంశవృక్షములను వెదికిననేగాని సాధ్యపడదు. దైహికమగు బాంధవ్యముమాట యెట్లున్నను వారికిని నాకును ఆత్మబాంధవ్యము నిస్సంశయముగనున్నది.

మరియు వారియింట నేను రెండుమూడు సంవత్సరములు కాపురముంటిని. అప్పటికి వారు వృద్ధులగుటచే కళాశాలలో పనిచాలించుకొని యుపకారవేతనమందుచుండిరి. నేను తరుణుడనగుటచే నాకాకో ఆపరేషను ఉద్రేకములో కళాశాలలో చదువుచాలించుకొని ఉపవాసవ్రతము నవలంబించుచుంటిని. ఏమయిననేమి? ఉదయము లేచినదిమొదలుకొని రాత్రి పరుండువరకు ఒకరినొకరు విడువకుండనుండుట కవకాశమేర్పడినది. ఉబుసుపోకకు వారు నన్ను తరచు దగ్గరకు పిలచుచుండెడివారు. అటువంటివారితో మాటలాడుటయే మహాభాగ్యమని నేను తరచు వారిదగ్గరకు చేరుచుండెడివాడను.

నేను అప్పటిలో నజీర్ణముచే బాధపడుచుండుటచే వారిలో నాకు నచ్చిన మొదటిగుణము భోజనపుష్టి. అప్పటికి వారికి అరువదియారు సంవత్సరములు గడచినను దేహదార్ఢ్య మెంతమాత్రము తగ్గలేదు. బహుదృఢకాయులు. ఆజానుబాహులు. అరగంటసేపు తక్కువగాకుండ భోజనముచేయుగల సమర్థులు. అప్పటికి ఇప్పటికి గూడ భోజనపుష్టి యెంతమాత్రము జంకలేదు. (ఇప్పుడు వారికి ఎనుబదిమూడు.) చిక్కుడుకాయ తెలకపిండికూర వారింకను అరిగించుకొనగలరు. దొడ్డిలోపండిన- చిలకలు కొట్టివేయకుండ బుట్టలుకట్టి పండించిన- జామికాయలు, పొలమునుండి రయితులు పట్టుకొనివచ్చి సమర్పించిన తేగలు వారికి ఫలాహారము. అల్పాయుష్కులు నజీర్ణరోగులు ప్రబలుచున్న యీ కలియుగములో నిట్టి దృఢకాయులను దేవతలవలె పూజించినను తప్పులేదు.

రెండవది వారి గళమాధుర్యము. వారి గాత్రము ఇటీవల శరీరములో కంపము బయలుదేరుటచే జీర్ణించినదిగాని వెనుక బహుగంభీరముగనుండెడిది. పద్యము చదివినచో ఘర్ఘరాంగుదూరము వినబడవలసినదే. జంభో

రాకంఠము. మోతాదయిన సంగీతము. ఉచితమయిన విరుపులు- విరామములు- ఆరోహణావరోహణములు- ఆ వాచకమున కలయేసాటి. నేను వీరు క్లాసులో పాఠము చెప్పుచుండగ చూడలేదుకాని కళాప్రవీణుడయిన ఓ. జె. కూల్డ్రిదొర తరచు వీరికి తెలియకుండ ఏ తలుపు మూలనో దాగుకొని వీరి పాఠము వినుచుండెడివాడని ప్రతీతి. వీరు చిన్నతనమున నాటకము లాడుచుండెడివారట. వీరు రచించిన వేణీసంహారములో వీరే అశ్వత్థామ, ధర్మరాజు మన్నగు భూమికలు ధరించి చక్కగ నభినయించెడివారని చెప్పుచుందురు.

వీరిదగ్గర మెచ్చుకొనదగిన విశేషము నిరంతర కృషి. "ఆశుకవిత్వము చెప్పకపోయినచో కవినామమును గోలుపోవుదుమేమో" యను భయము వీరికెపుడును లేదు. సావధానముగ నాలోచించి ఏ పదము నెక్కడ నుంచిన రసవంతముగ నుండును? ఏ భావమును ఎట్లు ప్రదర్శించిన బాగుండునో ఆలోచించి కవిత్వము చెప్పుట వీరి కలవాటు. ఒకే పద్యమును రెండు మూడుదినములవరకు అదే పనిగ చిత్రికపట్టుటకూడ నే నెరుగుదును. పద్యము ప్రకటించుటకు పూర్వము కవి శ్రమకుజంకక లోకులకు దానిని హృదయంగమ మొనర్చుటకు శక్తివంచనములేక ప్రయత్నింపవలెనని వీరి యాశయము. డైరిడెనువలెనే వీరును "వ్యవధిలేకుండ వ్రాయవలసి వచ్చినందున లోపము లెక్కుడుగ దొరలియుండవచ్చును. క్షమింపుడు." అను కవులను క్షమింపరు. అట్టివారిని "ఇంకొక నాలుగురోజులాగి సంస్కరింపరాదా? ఏమంత పుట్టి మునిగిన"దని బాహాటముగ ప్రశ్నింపక పోయినను లోలోపల నయిన ప్రశ్నించుచుందురు.

"కబ్బంబల్లుదు నైన నాటకవనో
 గ్రవ్యాఘ్రదంష్ట్రాళికే
నబ్బబ్బా కవితాలతాంగి సెరసే
 యంజాలనబ్బాలచే
నుబ్బింతున్ రసికాంతరంగములబి
 ట్టూరింతు విద్వాంసులన్
నుబ్బారాయుడ భక్త. వేణి. సుమన
 స్సూక్త్యాదు లస్మత్కృతుల్."

అని వీరి ప్రతిజ్ఞ.

ఆత్మగౌరవమును కాపాడుకొనుటలో వీరు బహు నిపుణులు. కానికి చేయి చూపగడంగినచో కవికి గౌరవమెన్నడును నిలువదని వీరు గ్రహించి, ఆర్జన మంత పెద్దది కాకున్నను వచ్చినంతలోనే క్లప్తముగ కాలక్షేపము చేయుచుందురు. అందుచే కొందరు ఇతర కవులవలె ఎంత యార్జించినను పునః పునః భిక్షాటనము నిమిత్తము బయలుదేరవలసిన యగత్యము వీరికి లేదు. ఎవ్వరయిన గౌరవపూర్వకముగ తమ యింటికి వచ్చినచో సహృదయతతో నాదరింతురు.

వీరికి గడుసుదనము వెన్నతో బెట్టిన విద్య. ఎవ్వరినిగూర్చి కాని పరోక్షమునకాని ప్రత్యక్షమునగాని తూలనాడరు. వ్యర్థకలహములకు, వాక్యార్థములకు చేరరు. ఎవ్వరయిన పుస్తక మభిప్రాయమునిమిత్తము పంపినయెడల నచ్చినచో సదభిప్రాయ మిచ్చెదరు. లేకున్న నూరకుందురు. అంతే కాని ఎదుటివారి మనస్సు నొచ్చునట్లు మాటాడరు. లఘుత్వము వీరి సంభాషణములో మచ్చునకైన కానరాదు.

కడు నిశితమైన విమర్శనము. ఏ పదమునుగాని నిరర్థకముగ వాడరు. కళాదృష్టిచే గంభీరముగ కవిత్వము చెప్పువారియెడ వీరికి గౌరవము మెండు. తిక్కన వీరి కిష్టదేవత. పోతన గురువు తక్కిన ప్రాచీన తెనుగుకవులలో ప్రముఖులయినవారియందెల్ల గౌరవమే యయ్యును ముఖ్యముగ పింగళిసూరనయందును, నన్నయభట్టునందును పక్షపాతము. వీరు భారతము పాఠము చెప్పుచుండగ వినితీరవలయునని పలువురు విద్యార్థులు నాతో జెప్పుచుండువారు. నే నది విని యెరుగను గాని వీరి పద్యములకే వీరు తరచు వ్యాఖ్యానము చేయుచుండగ వింటిని. వీరు విపులీకరించుదనుకను వీరు చెప్పిన చమత్కృతి పద్యమునం దున్నట్లు మనకు బోడకట్టదు.

దేనిని గూర్చియైనను మాటాడునపుడు తూచి మాటాడెదరు. పొగడినచో నదే పనిగ నతిశయోక్తికి జొచ్చి పొగడుట, తిట్టినచో నదే పనిగ తిట్టుట తెనుగు పండితులలో తఱచు గానవగును. కాని వీరు దేనినయి

నను మోతాదుగ-సార్థకముగ-వర్ణింతురు. తొందరపాటనునది వీరి స్వభావములో మచ్చునకయిన గానరాదు.

పదునెనిమిదియేండ్లబాల్యమునుండియు వీరుపాధ్యాయవృత్తిలోనుండిరి. సాధారణముగ తెనుగుపండితులయెడ పిల్లలెంతయల్లరిగ వర్తింతురో చూడవలెనన్న పానుగంటివారి 'తెలుగుక్లాసుతమాషా' తిలకింపదగును. కాని వీరివిద్యార్థులకు వీరియెడ నపారగౌరవము. వీరు పాఠము చెప్పునపుడు చీమ చిట్టుక్కుమనకుండనుండెడిదట.

విద్యార్థిదశ వీడిన వెనుకగూడ వారు పెద్దపెద్ద యుద్యోగములకువచ్చినను వీరిపట్ల గౌరవము తగ్గుట గానము. మదరాసుగవర్నరుపదవినలంకరించిన సర్ కె. వి. రెడ్డినాయుడుగారు వీరిదగ్గర చదువుకొన్నవారే. ఇదిగాక వెనుక జిల్లాజడ్జిగనుండిన వ్యాన్మెన్టు మున్నగు విదేశీయులు వీరియొద్ద తెనుగు నేర్చుకొనుచుండెడివారు. ఇంకను అనేకులు డిప్యూటీకలెక్టర్లుగను, విద్యాశాఖోద్యోగులుగను, న్యాయవాదులుగను, సహాయవాదనాయకులుగను పలుతెరంగులుగ నున్నారు. ఎవ్వరయినను ఇప్పటికిని వీరిసముఖమున భయభక్తులతో మెలగవలసినదే.

శ్రీరాజా వాడ్రేవు విశ్వసుందరరావుగారికిని, శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావుగారికిని వీరియందు గౌరవము మెండు. కాని వారు వీరితో తరచు కలసిమెలసి తిరుగుట కవకాశము లేదు. వీరికి శిష్యులును, మిత్రులును సుప్రసిద్ధన్యాయవాదులును అగు నిడమర్తి జలదుర్గాప్రసాదరాయుడుగారును ఆంధ్రదేశమున నెల్లెడల ప్రఖ్యాతిగాంచిన చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారును వీరి సాంగత్యసౌఖ్యమును తరచు గ్రోలుచుండుట నే నెరుంగుదును. నిడమర్తి జలదుర్గాప్రసాదరాయుడు గారిని వాడుకలో దుర్గయ్యగారని పిలుతురు. వీరు కుశాగ్రబుద్ధులు. తెనుగున, సంస్కృతమున మంచి కృషి సలిపినవారు. భగవద్గీతకొక స్వతంత్రవ్యాఖ్యానము వ్రాసినారు. ఇంకను శాకుంతలాదికావ్యములు గూడ వ్రాసినారు. వీరికేకాక వీరికుటుంబమునకంతకును సుబ్బారాయుడుగారియెడల గురుభావము. వీరికిప్పుడు డెబ్బదియైదేండ్లు గడచినవి. అయినను ప్రతిదినము తీరికచేసికొని సుబ్బారాయుడుగారి నొకసారి దర్శించివత్తురు. ఒక్కొక్కప్పుడు నేనుకూడ వారి సముఖమున నుండుట తటస్థించెడిది. దుర్గయ్యగారికి బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు మున్నగు వేదాంతగ్రంథములయం దభిరుచి మెండు. అందుచే తరచు వేదాంతమునుగూర్చియే వారు ముచ్చటించుకొనువారు. ఒక్కొక్కపుడు తిక్కనకవిత్వమునుగూర్చి, సంస్కృతశాకుంతలమునుగూర్చి ప్రసంగించుటకూడ కలదు.

చిలకమర్తివారికి సుబ్బారాయుడుగారి కవిత్వమునను గౌరవము మెండు. ఈ శతాబ్దములో నింతటికవి లేడని వాదింతురు. వారికి వేణీసంహార మామూలాగ్రముగ కంఠతః వచ్చును. చాటూక్తి పద్యసూక్తి ముక్తావళి నుండియు ననేకపద్యములను కంఠస్థము గావించుకొనిరి. సుబ్బారాయుడుగారును, లక్ష్మీనరసింహముగారును కలసికొనినపుడు సముద్రము సముద్రములో కలసినట్లుండును. లక్ష్మీనరసింహముగారి ధారణాశక్తి యద్భుతావహము. ఆయన ఎన్నియో వేలపద్యములను నిలుచున్నపాటున నప్పజెప్పగలరు. ఆయన పద్యములు చదువుచుండగ సుబ్బారాయుడు గారు వ్యాఖ్యానమొనరించుచు మరికొన్ని పద్యములు చదువుచుందురు. ఇరువురు సమకాలికులగు నితరకవులలో గుణమున్నచో మెచ్చుకొను స్వభావముగలవారు. కవితాప్రాశస్త్యనిర్ణయ మొనరింపవలసినపుడు తమయభిరుచులనే యనుసరింతురుగాని శాఖాభేదములను, వర్ణభేదములను పురస్కరించుకొని ముచ్చటింపరు.

శ్రీరామునిగూర్చి ప్రసంగించినపుడు మారుతిని గూర్చి ప్రసంగింపకుండరాదు. అట్లనే సుబ్బారాయుడుగారినిగూర్చి ప్రసంగించి చెలికువాడ వెంకటరామయ్యను విడువరాదు. ఈ చెలికువాడ వెంకటరామయ్య ప్రస్తుతము "భాషామణి"యను పత్రిక నడపుచున్నాడు. ప్రథమదర్శనముననే ప్రాణస్నేహ మొనరింపగల మధురహృదయుడు. సరసమైన కవిత్వము చెప్ప నేర్చినవాడు. తప్పున్నచో నెంతవానినైన మొగమెదుట ఖండించు నిశ్శంకధీరుడు. ఇక సుబ్బారాయుడుగారి

పట్లనఖండగౌరవము. ఇరువదినాలుగుగంటలు సుబ్బారాయడుగారి సమక్షముననే ప్రొద్దుబుచ్చవలెనని దీక్షవారును ఇతనికి వారిసమక్షముననే స్నేహముదిరెను. వినువారున్నయెడల విసుగులేకుండ కబుర్లుచెప్పగలడు. కడుపుబ్బనవ్వించగల హాస్యము. ఒకొక్కప్పుడు సుబ్బారాయడుగారినే ఎదిరించు తలతిక్క తత్త్వము.

పరివార దేవతలందరును ఇంచుమించుగ భ్రాంత్రైనారు. నన్నుగూర్చి ఒకటిరెండు ముక్కలు తిరువాయి యున్నవి. వారికి నాయెడ వాత్సల్యమధికము. వారి మాతండ్రిగారి జననము ఆనందనామసంవత్సరముననే. అందుగాక మా తండ్రిగారిని వారు స్వయముగ నెరుగుదురు. అందుచే వారిని పితృసములుగజూచుకొనుచుందును. పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు అప్పుడప్పుడు సుబ్బారాయడుగారి దర్శనార్థము రాజమహేంద్రవరము వచ్చుచుండిరి. మా యిరువుర ప్రథమసమావేశము సుబ్బారాయడుగారి సమక్షముననే. నేను సుబ్బారాయడుగారియింట కాపురమున్న దినములలోనే "భారతి" "కళ" "సంవత్సరాది సంచిక" మున్నగు పత్రికలకు వ్యాసములు పంపుచుండువాడను. వారికడ పాఠశాలలో జదువుకొనుచున్నను నసుచరిత్రము సవ్యాఖ్యానముగ బఠింపనెంచి యిప్పటికి సుమారు పదునైదు సంవత్సరములకు పూర్వము కొన్ని పద్యములు చెప్పించుకొంటినిగాని తరువాత నాకట్టి కవిత్వమునందధికాదరములేకపోవుటచే మానివైచితిని. పది పద్యములు మాత్రమే చదివినట్లు జ్ఞప్తి. ఎక్కువ చదివితినని చెప్ప దలచినచో ఋజువుచేసికొనవలసిన భారము వారిదే! ప్రస్తుతమున్న నేను తరచు వారిసన్నిధికిపోయి సాహిత్య రసమును సాహిత్యరసముకంటెను అమూల్యమయిన వారి అనురాగరసమును గ్రోలుచుందును.

వసురాయకవిగారు సనాతన యుగమునకును ఆధునికయుగమునకును మధ్యస్థులు. ప్రాచీనుల పాండిత్యబలమునకు నవీనుల ప్రపంచజ్ఞానమును జోడించినారు. అందుచే వారి యుపమానములలో సహితమునవీనశాస్త్ర విశేషములు కొన్ని గనవచ్చును. ఇంగ్లీషు నేర్చినవిద్యార్థులతో సంపర్కముండుటచే ఇంగ్లీషుకావ్యములలోని భావములు, కల్పనలు, కొన్ని వారి కావ్యములో గానగును. కాని వారి కవితా ప్రాశస్త్యమును నిర్ణయించుట యీ వ్యాసమునకప్రస్తుతము.

వారి సాంగత్యము మిగుల అభ్యర్థనీయము. క్రమక్రమముగ నాశకమువారొకరివెనుక నొకరుగ నంతరించిపోవుచున్నారు. హిమవత్పర్వత శ్రేణివలె వారు మన ప్రాచీనౌన్నత్యమునకు నిదర్శనములు. ఇప్పటికళాశాలలలోను కచేరీలలోను సాహిత్యసభలలోను నడచు సంభాషణకును ఇట్టి పెద్దల సమక్షమున నడచు సంభాషణమునకును వ్యత్యాసమున్నది. దానికంటె నిది కాని దీనికంటె నది కాని మంచిదని నిర్ణయించుటకు నేను పూనుకొనలేను. దానిలో నొక విధమగునుదాత్తతయున్నది. దీనిలో నొక విధమగు తేలికదనమున్నది. దానిలో నొక విధమగు "నన్ను ముట్టుకొనకువాడవ" మున్నది. దీనిలో నొక విధమగు కలయికయున్నది. దేనిగుణములు దానివి. దేని లోపములుదానివి. కానివక్తవ్యమేమనగ సుబ్బారాయడుగారి సమక్షమున హాస్యప్రసంగమునకు బుద్ధిపుట్టదు. ఎంతసేపును గౌరవముగలమాటయు వారినిగూర్చి గాఢముగ నాలోచించిన మాటాడవలెననియుండును. చిలకమర్తి వారితో హాస్యమొనర్చుచు మాటాడువారిని నేనెరుగుదును. కాని యూహకు నాలునాలుగువత్సరములపరిచయము నందును సుబ్బారాయడుగారితో హాస్యమొనర్చినవారి నొక్కరినైన గానను. త్రికాలసంధ్యావందనము — కావ్యపఠనము — కావ్యరచన — మున్నగు గురువిషయములలోనే, — ఇంచుమించుగ తమప్రాయమువారేయయిన పెద్దలసాంగత్యమున వారు కాలక్షేపముచేయుచుందురు. ఇతరత్ర వాచాలురైన హాస్యప్రసంగిమూడ వారిసమక్షమున మూగనోముపట్టుచుండును. రాజమహేంద్రవరకవిత్రయములో నొక్కరగు యీ "కవిశేఖరుడు" ప్రాచీనసంప్రదాయములకు గోపురము వలె నిలచియున్నాడు! భక్తచింతామణియగు, భగవంతుడు వీరి కింకను ఆయురారోగ్యము లనుగ్రహించునుగాక!

# మెండలీయము–రక్తస్పర్శ–౬

యస్. యం. వేణు

"హీనక్రియం నిష్పురుషం నిశ్ఛందో రోమశార్శసమ్,
క్షయ్యామయా వ్యపస్మారి శ్విత్రి కుష్ఠి కులానిచ.
మహాంత్యపి సమృద్ధాని గోజావిధన ధాన్యతః,
స్త్రీ సంబంధే దశైతాని కులాని పరివర్జయేత్. మను.

గోవులు, మేకలు, గొఱ్ఱెలు, ధనము, ధాన్యము ఎంతసమృద్ధిగా నున్నను వివాహవిషయమున జాతకర్మాది క్రియలు లేనిది, పురుషసంతానము లేనిది, విద్య లేనిది, పొడుగాటి వెండ్రుకలు గలది, మూలరోగము, క్షయము, అజీర్ణము, అపస్మారము, బొల్లి, కుష్ఠము గలదియగు ఈ పదివంశములవారితో సంబంధము మనుధర్మశాస్త్రము నిషేధించుచున్నది. వివాహసంబంధము దలపెట్టుటకుముందు ఇరుపక్షములవారికిని ఒండొరుల వంశచరిత్ర కనీసము మూడుతరములనుండియైనను దెలిసికొనుట విధిగా నుండెడిది. తుదకు మనపూర్వులు మనకు మంచిదూడలు పెట్టవలయునను నుద్దేశముతో నేకేని యాబోతుతో దాటించవలయునని గలపెట్టిరి కేని, ఆయాబోతుది మూడుతరముల చరిత్రను మనము తెలిసికొనవలయును. ఈనియమమును పాటించియే శ్రీరాముడు శివధనుస్సును విఱిచినవెంటనే దశరథాదులు మిథిలానగరమునకు వచ్చినప్పుడు సూర్యవంశానుక్రమమును జనకుని కెఱింగింపుమని వసిష్ఠుని నియోగించెను. తరువాత జనకుడు సహితము తనవంశమునుగూర్చి చెప్పికొనెను. అన్యవంశబాంధవ్యము సంకల్పించునెడ మనవారవలంబించుచుండిన యీవిధానము మెండెలువిధుల నెంతయనుసరించుచున్నదో గమనించుడు. (చూడుము "ఆగష్టు భారతి") ఆర్యావర్తమున పూర్వమునుండి జాత్యౌన్నత్యమే ప్రధానముగా నెన్నబడుచుండెడిది. భారతకాలమునాడు ఇది చాలవఱకు అమలులోనుండినట్లు మనము గ్రహించవచ్చును. ఆ జన్మరోగపీడితుడగు పాండురాజునకు చక్కని సంతానోత్పత్తి కొఱజాలదని భార్యాసంభోగము నిషేధించబడినది. అదియుగాక ధృతరాష్ట్రుడు చాల బలశాలి. భారత యుద్ధానంతరము అతనికి 'దుస్సహజరాభారంబు పైగప్పి' నను సత్తువ ఏమాత్రము సన్నగిలలేదు. తనపుత్రుని జంపినవాడగుటచే భీమునిపై నాతనికి తీరనికోపము. కడుపున లేనిప్రేమ నటించుచు పాండవుల నొక్కరొక్కరినే కౌగలించుకొనుచుండు సమయమున శ్రీకృష్ణు డాతని దుర్ణయము గుర్తెఱింగి భీముని వంతు వచ్చినప్పుడు, వానిని వెనుకకు లాగుకొని ధృతరాష్ట్రుని కౌగిలింతలోని కొక ఇనుపవిగ్రహము నిచ్చినట్లును, అతడు దానిని పిండిగా నలపివేసినట్లును మనము చదివియున్నాము. ఇంత బలశాలికి గలిగిన సంతానము ఎట్టి బలవంతులుగా నుండవలయును? అట్టివారితో పాండురాజునకు గలుగుపుత్రులు పోరాడగలుగుదురా? కనుకనే కుంతి తనపతియాజ్ఞ బడసి మానవాతీతులైన దేవతల నారాధించి పుత్రులను బడయుచు వచ్చినది. ఇందలి సత్యాసత్యవిచారణ మన కిప్పు డనవసరముగాని కుంతి సంతానాభిలాషిణియై యితరులను పొందిన దనుమాట మాత్రము నిజము. అది దేవుడైన కానిండు దూర్వాసుడైన కానిండు. ఇప్పటికాలమువలె అప్పుడు వ్యభిచారముగాని, జాదముగాని, త్రాగుడుగాని తప్పులలో చేరలేదు. ఉత్కృష్ట సంతానవాంఛ గలిగినవారు తమ యిష్టముచొప్పున ప్రవర్తించుచుండిరి. కనుకనే కుంతిచేసిన పనులకన్నిటికిని లోకాపవాదమునకు మారు లోకఖ్యాతి గలిగినది.

వివాహసంబంధములనెడ మనవా రవలంబించుచుండిన ధర్మములలోని సత్యాసత్యములు ఆధునిక జీవశాస్త్రపరిశోధన లెంతవఱకు రూఢిపరచుచున్నదో విచారింతము.

జాతకర్మాదిక్రియలు లేనివారి నేల వర్జించవలయును? కులసంబంధమైన క్రతువులు కర్మలు క్రమ

ముగా మాసిపోవుచున్న యీకాలమున నిట్టి సూత్రము చెల్లనేరదు. సాంఘికధర్మములు చక్కగా అనుష్ఠించబడుచుండిన యాకాలమున శాస్త్రబద్ధమైన క్రియలు చేయకుండుట గొప్ప తప్పిదమేమో! అట్లు ధర్మదూరులైనవారు అప్పటిసంఘనియమములను పాటించి పలుశిక్షలకు పాత్రులగుచుండిరి. కనుక ఈసూత్రము మాత్రము అప్పటి సాంఘికాచార వ్యవహారములకు చెక్కుచెదర నీక నిలుపుటకై యేర్పడినదని చెప్పవలసియున్నది.

పురుషసంతానములేనివారితో సంబంధము నిషేధించబడినది. ఎందులకనగా అట్టివంశములో గీసికొన్న స్త్రీకి పురుషసంతానము కలుగుట దుర్లభము. 'అపుత్రస్య గతిర్నాస్తి' అనుసూత్రమునందు భక్తివిశ్వాసములు గలిగియుండిన మనపూర్వుల లక్ష్యము వివాహవిషయమున ఎప్పుడును పుత్రసంతానవాంఛయే ముఖ్యముగా గలిగి యుండెడిది. ప్రతిసంతతియందును పురుషసంతాన ముండిననేగాని ఆవంశమువారితో సంబంధము పురుషసంతానము నివ్వజాలదని మనవా రనుభవము చేతనే కనిపెట్టిరి. (చూడుము. 'అక్టోబరు భారతి') సంతానమునందలి స్త్రీపురుష నిర్దేశమున పురుషబీజమే ప్రధానపాత్ర ధరించినను, తర్వాత మాతృగర్భమున జరుగు రక్తప్రసారణములోని లింగకారక వస్తువిశేషములపై చాలవరకు నాధారపడియుండును. పురుషసంతానమే లేనిస్త్రీతో సంబంధము నెరపినచో నామెగర్భమునందలి పిండమునకు బోవు రక్తప్రసారము పుంలింగ కారక వస్తువిశేష విహీనమైనదిగనే యుండును గనుక సంతానమంతయు స్త్రీలుగనే యుందురు. ఇందులకు దారాళముగ నెన్నియో వంశము లున్నవి.

విద్యలేనివారిని, పొడుగాటి వెంట్రుకలు గలవారిని వర్జించవలయునని శాసించబడినది. మాతాపితలు, ముఖ్యముగా మాత విద్యాశూన్యురాలైనచో ఇక సంతానమునకు వైదుష్యాధ్యాపకవాంఛ యెక్కడిది? చాలపొడుగైన వెంట్రుకలు విశేషముగా కలవారు బుద్ధిహీను లని మనవారియూహ. బౌద్ధకాలము నాడును ఈ యభిప్రాయము వాడుకలో నున్నట్లు బోధిసత్త్వుని కథలవలన తెలియనగును. సూక్ష్మమగు బుద్ధిబలమును గుర్తెరుంగుటకు మనవారు పైని జెప్పిన స్థూలచిహ్నమును పరీక్షించుచుండిరి. (చూడుము అక్టోబరు భారతి) ఇందునను మెండెలుసూత్రముల రహస్యము ఇమిడియున్నది.

తరువాత కొన్నివ్యాధులను పేర్కొని అట్టి వ్యాధులు గలిగిన వంశములవారి పొత్తు పనికిరా దని త్రోసివేసినారు. ఈవ్యాధులన్నియు వంశానుక్రమముగ వచ్చునవే యని ఇప్పటి వైద్యశాస్త్రము సహితము ఒప్పుకొనుచున్నది. అచ్చటచ్చట కొందరు భిన్నాభిప్రాయములను వెలిబుచ్చుచున్నారు. ఇంకను అవి రూఢిపరచబడలేదు. కుష్ఠు, క్షయరోగ, అపస్మారకము మొదలగు వ్యాధులు కేవలము అంటువ్యాపకములే కావు. కొందరు క్షయరోగుల సమీపముననే ఎంతకాల మున్నను వారికి క్షయవ్యాధి సోకుటలేదు. మఱి కొందరు ఎంతజాగ్రత్తగ మెలగుచుండినను క్షయ నోకి తీవ్రబాధ కలుగజేయును. ఇందులకు గల కారణమునుగూర్చి వైద్యశాస్త్రమున "ఆస్లార్" దొరగారు ఈక్రిందివిధముగ జెప్పుచున్నారు:

అంటువ్యాధులకు సూక్ష్మములగు క్రిములే ముఖ్యకారణము. ఈసూక్ష్మజీవులు ప్రతిచోట విస్తారముగ వెదజల్లబడియుండును. క్షయరోగకారకములగు క్రిములు గాలిలో నన్నిచోట్లను నుండుననుటలో సందేహములేదు. ప్రతిమానవునికిని గాలి మిక్కిలియావశ్యకము గనుక వాయువుతోబాటు ప్రతియొక్కరును క్షయక్రిములను బీల్చుకొనుచునేయుందురు. కాని అందఱును క్షయరోగపీడితులు కాలేరు. ఏ కొలదిమందియో మాత్రమే ఆవ్యాధికి ఆహుతి యగుచుందురు. ఇందులకు గల కారణమునుగూర్చి వివరించుచు 'ఆస్లారు'గారు బైబిలులోని "విత్తువాడు, విత్తనములు" అను కథను Parable of the sower and seeds బోల్చుచున్నాడు. వ్యాధికారకము లగుక్రిములేవిత్తనములు. మానవులవివిధదేహతత్త్వములే పలువిధములైన భూములు. బైబిలుకథలోని విత్తనములవలెనే యీక్రిములు ప్రవేశించు కొన్ని మానవశరీరములు బలిష్ఠములైయుండి క్షయక్రిములను వృద్ధి కానీక అపుచుండును. అట్టివారికి వ్యాధి కలుగనేరదు

గదు. క్షయక్రిములు క్షీణించి పోవును. ఇట్టివే బండమీద పడిన విత్తనములు. కొందరిలో క్రిములు ప్రబలమగును. కాని వారు సరియైన ఆహారము, మంచి దేహపరిశ్రమ, చక్కని అలవాటులు కలిగినవారగుచో ప్రబలమగువ్యాధిని త్వరలో నణగద్రొక్కుటకు వారి దేహారోగ్యము చాలియుండును. ఇవియే వారిప్రక్కను, దున్నని నేలయందును బడిన గింజలు. మఱికొందఱి దేహతత్త్వములు చాలబలహీనములై వ్యాధిక్రిములు ప్రబలమగుటకు మిక్కిలి అనుకూలముగా నుండును. ఇట్టివారు ఎంతజాగ్రతగ మెలగుచుండినను అకస్మాత్తుగ నెప్పుడో యొకసారి వ్యాధికారకములగు క్రిములు ప్రవేశించెనా అది నిర్మూలింపబడుట అరుదు. వారు తప్పక వ్యాధిపీడితులై దుర్మరణము బొందుదురు. ఇట్టివే చక్కగా దున్నిన నేలపై బడిన విత్తనములు. కావున వ్యాధులు సోకుటకు కేవలము బాహ్యపరిస్థితులే గాక, ప్రతిమానవుని దేహతత్త్వము (Tissue soil) గూడ ముఖ్యకారణమై యున్నది. ఇట్టియెడ ఔషధాదిప్రయోగములు చాలవఱకు అనుకూలింపవు. ఈకారణమువలననే వంశానుక్రమముగ కొన్ని రోగములు పొడగట్టుచుండుటను మనము గమనింపవచ్చును. ఏలననగా ఆవంశములోని వారి దేహతత్త్వములన్నియు ఆవ్యాధియభివృద్ధికనుకూలించునట్లుగా నుండును. నేను సేకరించిన ఈక్రింది అంశములు ఈవిషయమును స్థిరపఱచుచున్నవి.

A సుమారు ౧౯ సం. రముల వయస్సుగలిగిన పిల్లవాడు. అవివాహితుడు. చాల ఆరోగ్యవంతుడు. పొగత్రాగడము, బ్రాంది వగైరా ఏలాటి మత్తుద్రవ్యములను వాడు దురలవాటు బొత్తుగా నెఱుగడు. మదరాసునందు ఇంటర్మీడియేటు పరీక్షకు చదువుచుండి క్షయవ్యాధి సోకుటచేత తన ఇరువదియవ సం. మున నితడు మరణించెను.

ఈతడు క్షయవ్యాధిచేత నంతశీఘ్రముగా మరణించెనన్నవార్త నా కాశ్చర్యము కలుగజేసినది. "మంచి జవసత్త్వములు గలిగిన యువకుడు. ఇతనికి క్షయ ఎట్లు సోకినదా!" యని నేను నివ్వెరపడితిని. సేరున నే నాతని సందర్శించినప్పుడు తనకు వ్యాధివచ్చిన విధమునుగూర్చి యాతడు నా కిట్లు చెప్పెను:

"నేను కడచిన నవంబరుమాసాంతమున దేశీయక్రైస్తవసమావేశమునుజూచుటకై కోయంబుత్తూరున కేగియుంటిని. అప్పుడచ్చట నేను చల్లని ఈదగాలిలో కొంతసేపు తిరుగవలసివచ్చెను. సమావేశానంతరము నేను తిరిగి యథాప్రకారము మద్రాసు చేరితిని. కోయంబుత్తూరు నుండి వచ్చినప్పటినుండియు జలుబు, దగ్గులతో కొన్నినాళ్లు బాధపడుచుంటిని. కాని నేను దానిని లక్ష్యము చేయలేదు. కొన్నాళ్లయనంతరము నాకుజ్వరముసోకినది. జ్వరముతోబాటు దగ్గును ఎక్కువగుచువచ్చెను. గొప్పగొప్ప వైద్యులెందరో పరీక్షించిరిగాని లాభము లేకపోయెను. మలేరియాజ్వరమని అనేకౌషధములు సేవించితిని. అచిరకాలములోననే నడచుటకుగూడ నశక్తుడనై మంచము పట్టితిని. ౧౨౦ పౌనుల బరువుండిన నా దేహము శల్యప్రాయమై ౯౦ పౌనులకుతగ్గిపోయెను. అటుతరువాత నేను నా తండ్రిగారికి తంతివార్తనంపి, నా చదువుకు స్వస్తిచెప్పి ఇల్లువచ్చిచేరితిని. ఇచ్చటికి వచ్చిన తర్వాత జిల్లావైద్యులు (సేలం) నా ఉమ్మిని పరీక్షించి క్షయవ్యాధి యని రూఢిపఱచిరి."

ఈవిధముగ నాతడు సుమారు ఆరునెలలకాలము రోగపీడితుడై యుండి మరణించెను. దృఢకాయుడైన యీతని కీవ్యాధి ఎట్లు తగిలెను? తగిలినతర్వాత నంత శీఘ్రముగ వృద్ధినందుటకు కారణమేమి? ఆతనికి తగిన వైద్యసహాయము లేకపోలేదు. ఎట్టియాహారమైనను, ఎంత విలువైన యౌషధమైనను సేవింపగల సమర్థుడే. అయినను అతనియెడ అన్ని ప్రయత్నములు నిరర్థకములయ్యెను. ఆతని వంశచరిత్రను విచారించగా ఈక్రింది అంశములు తెలియవచ్చెను. ఇతనితాత E. (చూడుము చిత్రము 33) (తండ్రికి తండ్రి) క్షయవ్యాధిచేత మరణించెను. ఇతని పెద్దతండ్రి C. క్షయరోగముచేతనే పాతికేండ్లప్పుడే పరమపదించెను. ఇతని మేనమామ B. ఆరోగముచేత కాలధర్మము చెందెను. ఈతని అమ్మమ్మయు D. క్షయరోగముచేతనేమరణించెను. ఈతనివంశ




చిత్రము 33

చరిత్ర యింతవరకు మాత్రమే దొరికినది. దొరికినవరకు ఈ మూడు తరములలో వ్యాధి వంశానుక్రమముగ నెట్లు పొడసూపినదో గమనించుడు. కేవలము శీతోష్ణస్థితి యందు కొంచెము మార్పు గలిగినంతనే 'ఎ'కు వ్యాధి పొడసూపి అచిరకాలములోననే ప్రబలమైపోయెను. మాతాపితల రక్తజనితమైన యామె దేహతత్త్వము క్షయ క్రిములదాడి ఢీకొని జయించలేకపోయినది. మీదు మిక్కిలి క్షయక్రిముల యభివృద్ధికి చాల అనుకూలించు నట్టిదిగా నుండెడిది. కనుకనే యామె దేహారోగ్యము నకై చేసిన సమస్తప్రయత్నములు లాభదాయకములు కాలేదు.

ఇట్టి వంశచరిత్ర లేని వ్యాధులు సాధారణముగ తగిన వైద్యసహాయముచే నయమగును. ఈ విషయమై




చిత్రము 34

లభ్యపడిన అనేకాంశములు "ఇండియన్ మెడికల్ గెజెట్" అను పత్రికవలన మన మెఱుగవచ్చును. కుష్ఠు రోగ సంబంధమైన ఒక్క అంశము మాత్రము మీకు దెలుపు చున్నాను. ఎ. అను బాలిక ఒక బ్రాహ్మణ కుటుంబము నకు చేరినది. (చూడుము చిత్రము 34) ఈ చిన్నదాని యింటి సమీపమున 'బి' అను కుష్ఠురోగి యుండెడి వాడు. తలిదండ్రుల అజాగ్రత్తచేత చిన్నప్పటినుండియు 'ఎ' బి సమీపముననే ఆడుకొనుచు ఎప్పుడును వాని యొద్దనే యుండెడిది. ఆమె పెద్దదై, వివాహమై, ఒక బిడ్డను కనువరకు నామె క్షేమముగనేయుండెను. రెండవ కాన్పు అగుసరికి ఆమెకు కుష్ఠురోగము కనబడెను. ఎ వంశమున కుష్ఠులెవరును లేరు. ఇది కేవలము అంటువలన నామెకు వచ్చినదే. చిన్నప్పటినుండియు రోగియగు 'బి' సమీపముననే మెలగుచుండినందున నామె కీవ్యాధి చాల దినముల క్రిందటనే తగిలియుండెను. తనవంశ మారోగ్య వంతమైనది గనుక ఆమె దేహతత్త్వము చాల బలిష్ఠ మైనది. కుష్ఠువ కాకరమైనది కాదు. కనుకనే చాలదినము లావ్యాధి బైటపడలేదు. వివాహమై బిడ్డలు కలిగిన తోడనే యామె దేహబలము క్షీణించినందున వ్యాధి ప్రబలజొచ్చెను. ఆమె తగిన ఔషధసేవచేత తనవ్యాధిని పోగొట్టుకొనెను. చూచితిరా! వంశావళియందు వ్యాధిలేకుండిన కారణముచేత నామెదేహము కుష్ఠుక్రిముల ప్రబలత కేమాత్రమును అవకాశమివ్వలేదు. ఔషధసేవ సహితము లాభకారి యయ్యెను. ఇదేవిషయములు తక్కిన అన్నివ్యాధుల కును అనువర్తించును. మనవారు చెప్పిన వ్యాధులు గలంశములలోని పిల్లను వివాహమునకు దీసుకొనరాదన్న విషయములోని సత్యమిప్పుడైనను మనకు స్పష్టమగు చున్నదిగదా!

తెలిసియో తెలియకయో మనపూర్వులు మెం డెలు సూత్రగర్భితములైన, ముందు పేర్కొనబడ్డ కొన్ని నియమములను అనుసరించుచుండిరి. సంఘదురా చారములు ప్రబలుచున్న యీకాలమున నవన్నియు త్రోసివేయబడుట సంతాపకరము. వివాహవిషయమున మనవారిదృష్టి యంతయు "కులగోత్రములు సరిగా

నున్నవా? కూటికి గుడ్డకు కొదువ లేదా?" అను వంశములమీదనే లక్ష్యమై యుండునుగాని, ఈతనికిచ్చిలనో దేశక్షేమమునకై ఉత్కృష్ట సంతానమును బడయగలదా, లేదా? ఈతని వంశచరిత్ర ఎట్టిది? ఈతని తండ్రి తాతల కెట్టి యలవాటులుండెను? వారెంతవరకు బ్రతికి యుండిరి? ఏకారణముచేత మరణించిరి? ఈతని వంశావళిలో ఏయే రోగములున్నవి?" అను ముఖ్యమైన అంశములను దలపెట్టరు. ఎంత బలహీనుడైనను, ఎట్టి రోగవంతుడైనను తన కులమువాడుగ నుండి, ఏదో యింతకలిగినవాడుగ నుండెనా, అప్పుడే కన్యనిచ్చివేయుదురు. మన దేశము బాగుపడవలయునేని మన మిట్టి యాచారములు క్రమముగా మానివేయవలయును. స్వలాభము, స్వక్షేమము ప్రాధాన్యముగా గాక దేశక్షేమమును మన మాదర్శముగా గొనవలయును. అభివృద్ధి వినాశకమైనగుణములకు సాంఘికపు కట్టుబాట్లను త్రోసివేయవలయును. ఆధునిక ప్రకృతిశాస్త్రముల ఫలితములను ఆచరణలో పెట్టవలయును.



హిందూమహమ్మదీయ సమస్యా పరిష్కారము —యం. ఎస్. శర్మ.

# ఉనికి — ఎఱుక

## వేలూరి శివరామశాస్త్రి

### ఉ ని కి

కుండ ఉన్నది, రాముడు కలడు' అనునెడ కుండయొక్కయు రాముని యొక్కయు 'ఉనికి' లేక 'కలిమి' మనకు గోచరించుచున్నది. 'కుండలేదు, రాముడు లేడు' అనునెడ కుండయొక్కయు రాముని యొక్కయు ఉనికికి వేఱయిన లేమి గోచరించుచున్నది. ఉనికి యనగా కలిమి, అస్తిత్వము లేక సత్త.

ఏదేని ఉన్నయెడలగాని ఏదేని అయినయెడల గాని దాని దాని ఉనికి కల దని చెప్పవచ్చును. ఉనికి లేనివస్తు వేదియు లేదు.

మనము న్నాము. మనచుట్టును వస్తువు లున్నవి. వాని కావల ప్రపంచ మున్నది. దాని కావల దేశము, దాని కావల కాలమును ఉన్నవి. ఇటులు ఉనికి యన నేమో మన మెఱుగుదుము. ఈ యునికినిగుఱించి విజ్ఞులలో చాల నభిప్రాయ భేదములు కలవు.

ఉనికి లేక సత్త యనునది జాతివిశేషమని నైయాయికు లందురు. జాతి యనునది ద్రవ్యగుణకర్మలయందుండును. ఇది నిత్యము.

అర్థక్రియాకారిత్వమే ఉనికి అని కొంద అందురు. దేనిచే ఏ పనియు కాజాలదో మఱియు దేనిపని ఎచటను కనబడదో అట్టి దొకటి కలదని యెటులు చెప్పగలము? కావున అర్థక్రియాకారిత్వమే ఉనికి.

ఇటు లగుచో నిచట ఈ ప్రశ్న ఉదయించుచున్నది.—ఏదే నొకవస్తువుయొక్క అర్థక్రియాకారిత్వమును ఉనికియును ఒకపదార్థమే యగునా?

క్రియనుబట్టి ఒకానొకవస్తువు కల దని మన మూహింతుము కాని కార్యమే ఉనికియా? ఏదేని పని జరుగవలసియున్నచో దానికిముందు అవశ్య మొకవస్తువుండవలయును. క్రియయే ఉనికి యేకమాత్రనిదర్శన మయినను పరపటిక్రియయు తొల్లిటి ఉనికియు ఏక పదార్థము కాజాలదు.

కాలముతో సంబంధపడుటయే ఉనికి యని కొంద అందురు. కాలముతో దేనికి సంబంధము కలదో అది ఉన్నది అని మన మనుకొనవచ్చును.

కాలముతో సంబంధపడియుండుటయే యునికి కాదు. ఏల యనగా నిన్ననో మొన్ననో యొకకుండ పగిలిపోయెను. ఆ కుండ ఉన్నది అని మన మనగలమా? కావున ఉనికి యనుదానికి వర్తమానకాలముతో సంబంధము చెప్పవలెను. కాగా వర్తమానకాలముతో సంబంధపడినదానికే ఉనికిని చెప్పవలయునని కొంద అందురు.

అసలు ఉనికి అనుదాని తావు దేశకాలములలో కల దని మఱికొంద అందురు.

కల వని మనము తలచు వస్తువు లన్నియు దేశకాలములతో సంబంధపడియేయున్నవి. వీని కలయిక లేని వస్తువే లేదు. దేశకాలముల కలయిక లేనిస్థితి యనున దొకటి యుండునెడల ఆ స్థితిలో ఏ వస్తువునకును ఉనికి లేకపోవచ్చును గాని ఆయాయీవస్తువుల యునికియే దేశకాలసంబంధ మనజెల్లదు. కుమ్మరి నిన్న నొక కుండ నొనరించెను; నేడొకటి చేయుచున్నాడు. ఈ రెండు కుండలయునికియు దేశకాలములతో సంబంధపడెను. ఆ యునికియు ఈ సంబంధమును ఒకటియా? ఆకుండల కేదేని యునికి కలుగుచో ఆ యునికి దేశకాలములతో కలయిక చెందునుగాని ఆ కుండలు తా మునికి లేనివై దేశకాలములవలన ఉనికి గొనవు. ఇంతియకాక, దేశకాలములకుగూడ నొక యునికి కలదే. వానికి ఆయునికి యెటనుండి వచ్చెను? ఇతర వస్తువులవలెనే అవి తాము లేకపోయి తమ కలయికవలన ఇతర వస్తువులన్నిటికిని

ఉనికిని చేకూర్చిపెట్టు నట్టి నమ్ముఁ జెల్లదు కదా! కావున ఉనికియు దేశకాలసంబంధమును ఒకటి కాదు.

అబాధితత్వమే ఉనికి యని కొందఱ యభిప్రాయము. అనఁగా కాలత్రయమునందును నాశము లేని దేది కలదో అదియే ఉనికి.

ఉత్పత్తివినాశములు రెండును ఈ విశ్వమునందు పన్నిదము వేసికొనినటులు పనిచేయుచున్నవి. కారాకులు రాలుచున్నవి. క్రొత్తాకులు పొడముచున్నవి. ఇటులు ప్రకృతిధార ఇగిరిపోవుటలేదు. అయినను నిన్నటి వస్తువు నేఁటి లేదు, నేఁటి వస్తువు రేపు లేదు. ఉన్న వస్తువును ఉన్నదనుచున్నాము. లేనిదానిని లే దనుచున్నాము. పారిభాషికమైన పై యునికిసంగతి మన కగోచరము. కాని వాడుకలోనున్న ఉనికి మన కందఱకును తెలిసినదియే.

ఎఱుక

ఎఱుక యనఁగా తెలివి, లేక జ్ఞానము. మన యెదుట నొక కుండ కలదు. దానితో మనకు పనియున్నది. దానిని మనము చూచితిమి. ఇది కుండ యను ఎఱుక మనకుఁ గలిగెను.

కృష్ణుఁడు రామా అని పిలిచెను. రాముఁడు ఆశబ్దము విని ఆఁ అని బదులు పలికెను. మనము పూవులను మూరుకొని వాని తావిని తెలిసికొనుచున్నాము. గాలి నీరుల చల్లఁదనమును వెచ్చఁదనమును గ్రహించుచున్నాము. తినుబండముల పులుపు తీపి మొదలగు చవుల నెఱుఁగుచున్నాము. ఇటులు పంచేంద్రియములతోడను ఆయా యీ విషయములఁ దెలియుచున్నాము.

ఆత్మ మనస్సుతోడను మనస్సు కన్ను మొదలగు నింద్రియముతోడను ఇంద్రియము కుండ మొదలగు ద్రవ్యముతోడను సంయుక్తమయినపుడు ఇది కుండ ఈ మొదలగు ఎఱుక మనకుఁ గలుగుచున్నది.

మన కపుడపుడు మన యెదుట లేని కొన్నికొన్ని విషయములు కలుగుచుండును. సుఖదుఃఖాదు లనుభూతము లగును. కలలలో పలు విషయములు కానవచ్చును. ఇటులు ఎఱుక యనునది విషయముగను విచిత్రముగను అనంతముగను ఉన్నది.

ఎఱుక లేనిదే ఎవరికిని ఏవ్యవహారమును సాగదు. ఎఱుకయే లేనిచో ప్రపంచమంతయు చీకటికొట్టు. జాగ్రదవస్థలో మన మెల్లపుడును దేనినో యొకదానిని తెలిసికొనుచునేయున్నాము. అటులనే సుషుప్తియందును మన కెఱుక కలదని* కొందఱందురు.

సుషుప్తియందును మూర్ఛయందును మన కెఱుక యుండెనుగాని మనము మాత్ర ముందు మని కొందఱందురు. దీని నందఱంగీకరింపరు. అంగీకరించినవారు గూడ దీనికి ప్రత్యక్ష ప్రమాణము చూపఁజాలరు. అప్పటి మన యునికికి అనుమానప్రమాణము కలదుగాని అస్థితిలో మన కెఱుకయుండెనుగాన ఆ యునికి యెటులుండునో మనము చెప్పఁజాలము.

'సర్వ వ్యవహారములకును హేతువైనది బుద్ధి; అదియే జ్ఞానము'† అని నైయాయికు లందురు. జ్ఞానము ఆత్మగుణ మని కొందఱును మనోగుణ మని కొందఱును ఆత్మాశ్రయమగు ప్రకాశమని మఱికొందఱును చెప్పిరి.

ఎఱుక యన నేమియో అందఱకును అలఁతిగనో వలఁతిగనో తెలియును. ఎఱుకయన నేమియో తెలియని వారికిని ఎఱుక అనుచో దేనిని తెలిసికొను టుచితమో దానిని తెలిసికొనని వారికిని పై లక్షణములేవియు నుపయోగింపవు.

## వస్తుజ్ఞానవాదములు

ఉనికికిని ఎఱుకకును ఏమయినను సంబంధము కలదా? ఉనికియెఱుకలు రెండును అన్నదమ్ములు.

---

* యద్వై తన్న పశ్యతి పశ్యన్వై తద్ద్రష్టవ్యం న పశ్యతి నహి ద్రష్టుర్దృష్టే ర్విపరిలోపో దృశ్యతేఽవినాశిత్వాత్.

† బుబోధయిషాపూర్వకవాక్ప్రయోగః, అథవా తాదృశ వ్యవహార జనకతావచ్ఛేదక జాతిమత్త్వమ్.
[వాక్యవృత్తి-భాషాపరిచ్ఛేదము.]

ఉనికి వ్యాపకము. ఎఱుక వ్యాప్యము. ఉనికి లేని దేదియు లేదు. ఎఱుక లేని పదార్థములు ఘటపటాదులు చాలఁగలవు.

ఓయీ! ఘటపటాదులకు ఎఱుక లేకపోయినను లేకపోయె; వానియెఱుక మానవులకుఁ గలదుకదా! ఎవరికో యొకరి కిట్టి యెఱుక లేకపోయినచో 'ఇది ఘటము,' 'ఇది పటము' అని యెటులు నిరూపింపఁబడును? మఱియు జ్ఞానము వస్త్వధీనము. జ్ఞానము ఉండవలయుచో వస్తువు ఉండితీరవలయును. వస్తువు లేనిచో దేనియెఱుక యుండును? కాని వస్తువు ఉండవలయుచో ఎఱుక ఉండితీరవలయునను నియమ మక్కఱలేదు అని వస్తువాదు లందురు.

'జ్ఞాననిరపేక్షముగా వస్తువు ఉన్నదనుటకు ప్రమాణ మేమియు లేదు. వస్తువు ఉండవలయుచో దాని యెఱుకయు ఉండితీరవలయును. ఎఱుకవినా వస్తువు యొక్క అస్తిత్వమునకు ప్రమాణము లేదు, అర్థము నులేదు.' అని జ్ఞానవాదు లందురు.

## బర్క్‌లీ

అనునతఁడు జ్ఞానవాది. ఇతని మతమున ఉనికియు ఎఱుకయు నొకటియే. 'ఒకానొక వస్తువు ఉన్నది. మనకు దానియెఱుక కలుగుచున్నది.' అను నీ రెండును వేఱుకావు. ఈ జగత్తులోఁ గాని మఱియొచటఁగాని ఏదే నొకవస్తువున్నదనఁగా నేమి? దానియెఱుక మనకు కలదనియే యర్థము. ఎఱుకలోఁ జేరని వస్తువునకు భాన మెటులు?

ఇంద్రియములచే * ఎఱుఁగఁబడున దంతయు దృశ్యము. ఈ జగత్తంతయు దృశ్యము. ఈ దృశ్యము జ్ఞానసాపేక్షము. దర్శనమువినా దృశ్యమునకు వేఱు అస్తిత్వము లేదు. దర్శనవ్యతిరిక్తమగు దృశ్యమునకు ప్రమాణమును లేదు, అర్థమును లేదు. పంచేంద్రియములకును విషయమయిన విశ్వ మెవరికిని తెలియదని కల్పన చేయఁజాలము. చూడఁబడని రూపమునకుఁగాని చవిచూడఁబడని రసమునకుఁగాని మూర్కొనఁబడని తావికిఁగాని వినఁబడని శబ్దమునకుఁగాని ఉనికి కలదని మన మనఁకొనఁజాలము.

దృశ్యమునకు ఎఱుకకన్న వేఱుగా ఏదో యొక రూపము ఉన్నచో అది అందఱకును ఒకమాదిరిగనే ఎఱుకపడవలసియుండును. కాని అది అటులు జరుగుట లేదు. ఒకవస్తువే పలువురకు పలురీతులుగా కానిపించును. మఱియు ఒకనికే వేఱువేఱు అవస్థలలో వేఱువేఱు రీతులుగా కానిపించును. నేనీ దిక్కునుండి ఈ బల్లను చూచుచున్నాను. ఇంకొకఁడు దానికెదురునుండి చూచును. ఈబల్ల నాకేరీతిగా కనఁబడునో ఆవలినుండి చూచువానికి ఆరీతిగా కనఁబడదు. కనఁబడునదియే దృశ్యము గనుక ఎవరిదృశ్యము వారిదే యని అనవలసియుండును. దృష్టిభేదముచే దృశ్య మవశ్యము భిన్నమయిపోవును. కావున దృశ్య మెప్పుడును దర్శనసాపేక్షము.

మన దృష్టిఁబట్టియే దృశ్య ముండునని అంగీకరింతము. అయినను మనము చూడని వస్తువులు చాల నున్నవే! అవి యెటు లున్నవి?

మనము చూచినంతమాత్రమునను, చూడఁజాల నంతమాత్రమునను అవి లేకపోవు. అవి ఉన్నవి. మానవులు చూడఁజాలనివి భగవానుని యెఱుకలో నున్నవి. మనము సర్వజ్ఞులము కాము. కాని భగవానుఁడు సర్వజ్ఞుఁడు. ఈయెడ సందియము లేదు.

'గుణమే మన కెఱుక యగుచున్నది. రూప రస గంధములు గుణములు. గుణము కల గుణి యొకటి యున్నది. అది మన జ్ఞానసాపేక్షము కాదు' అని యనిని యెడల నిటులు ప్రత్యుత్తరింతుము:

రూప రస గంధములు మనచే అనుభూతము లగుచున్నవి. అవి యున్నవని అంగీకరింపవచ్చును గాని వాని అడుగుననో, లోపలనో ద్రవ్యమను పేర నేదికలదో దానిని మనము చూడఁ బడయఁజాలము. కావున అట్టి ద్రవ్యము కల దని అంగీకరించుటకు ప్రమాణము లేదు.

* Esse is percipi.

రూపాదుల నెఱుఁగఁగల మనజ్ఞానము బాహ్య పదార్థములవలన ఉత్పత్తిల్లిన దని మనమనకునకు వచ్చిన యెడలనే గుణములవెనుక ఒకానొక జడద్రవ్యము కలదని అంగీకరింపవలసివచ్చును. కాని కేవలము బాహ్య జడ పదార్థములవలననే మనకు జ్ఞానోదయ మగుచున్న దనుటకు వీలు లేదు. సాక్షాద్ భగవంతుని సన్నిధానము వలననే మనకు అట్టి జ్ఞానము కలుగును బాహ్యపదార్థములు మన యింద్రియములమీఁద ప్రవర్తించి విషయ జ్ఞానమును కలిగించు నని అంగీకరించుటకంటె భగవంతుఁడు తన యిచ్ఛాశక్తిచే ఈజ్ఞానముల నన్నింటిని మనలో పుట్టించు నని అంగీకరించుట రాచబాటగా కానిపించును. దృశ్యజ్ఞానము నవలంబించియేకదా మీమాంస. జ్ఞానోపపత్తికొఱకు నానాజడపదార్థముల నంగీకరించుటయు వానిక్రియవలన మూర్తిరూపమగు నుపాయముచే అజడమగు నొకానొక జ్ఞానము సృష్టింపఁబడుననియు నంగీకరించుటకన్న భగవంతు నంగీకరించుటయే లాఘవము. నిక్కముగ మనకు కేవలము మనము ఉన్నాము, భగవంతుఁడు ఉన్నాఁడు. బాహ్యమగు జడపదార్థము లేదు. భగవంతుఁడు తన యిచ్ఛాబలమున మనలో నానాదృశ్యపదార్థముల జ్ఞానమును పుట్టించును. ఇది బర్క్‌లీ మతము.

## కాంట్

విషయరూపముగా గోచరించు జగత్తంతయును దృశ్యమే*. పదార్థములకు బౌద్ధములగు కొన్ని యాకారములు† పెట్టి మనము పదార్థములను జ్ఞానమునకు విషయములనుగాఁ జేసికొందుము. మఱియు దేశము కాలము కార్యకారణ సంబంధము ఏకత్వము బహుత్వము మొదలగువానివలన మనము విషయమును అవగత మొనరించుకొందుము. దేశమునందుఁగాని కాలమునందుఁగాని లేనిదియు కార్యముగాని కారణముగాని కానిదియు ఏకముగాని అనేకముగాని కానిదియు నగు పదార్థమును మన మెఱుఁగము. దేశకాలములు గాని ఏకత్వ బహుత్వములుగాని ద్రవ్యత్వము గాని సాక్షాద్విషయధర్మములు కావు. కాని విషయముబుద్ధిలో భాసింపవలయు నేని వీని యన్నిటి సహకారము కావలయును.

విషయముగాని విషయతత్త్వముగాని‡ బౌద్ధమగు ఆకారముతాల్చి దృశ్య ప్రపంచరూపముతో మన జ్ఞానమున అవగహించును. ఈ యర్థమున దృశ్య ప్రపంచము జ్ఞానసాపేక్షము. కాని వ్యక్తిగతమగు జ్ఞానముచే దృశ్య ప్రపంచము నియంత్రితము కాదు. మానవజ్ఞానమునకు సర్వ సాధారణములగు ఆకారములు చాల నున్నవి. దృశ్య ప్రపంచము వాని యన్నిటిచేతను నియంత్రితము. దృశ్య ప్రపంచమునందలి విషయరాశి వ్యక్తిగతమగు జ్ఞానదృష్టిలో వేఱయినను శేషదృష్టిలో జ్ఞాననిరపేక్షము కాదు.

అసలువిషయములకు అన్ని దృష్టులలోను స్వతంత్రమగు ఉనికి కలదు. విషయముల అసలు రూపము మన మెఱుఁగము, ఎఱుఁగనుజాలము. బౌద్ధములగు ఆకారములు తాల్చి విషయములు ప్రతీతమగునంతవఱకే మనము విషయముల నెఱుఁగుదుము. వాని నిజరూపమును అవి మనకు వెల్లడిచేయవు. రంగుజోడు పెట్టుకొని చూచినచో పదార్థముల అసలురంగు తెలియనట్టులు బౌద్ధములగు ఆకారములవలన విషయముల నిజరూపము తెలియదు. తెలియుటకును వీలులేదు. విషయముల నిజస్వరూపము జ్ఞానసాపేక్షముకాదు. ఇది కాంట్‌మతము.

## హెగెల్

మనకు సంపూర్ణముగా తెలియనిదియు తెలిసికొనుటకు వీలులేనిదియు నగు నొకానొక రూపము ఉన్నదనియే మన మెఱుఁగఁజాలము. మన మెన్నఁడును ఎఱుఁగఁజాలని వస్తువొకటి కలదని అంగీకరింపఁజేయు ప్రమాణమేదియు మనకులేదు దృశ్యప్రపంచమును మాత్రమే మన మెఱుఁగుదుము. దీనివెనుక నేని లోపలనేని అంతట నేని ఎఱుఁగబడనిదియు ఎఱుఁగఁబడఁజాలనిదియు నగు నొకానొకరూపముతో వస్తువుగాని, వస్తురాశిగాని అధిష్ఠితమయిగాని అధిష్ఠానముగాని ఉన్నదని అంగీకరిం

* Phenomenal. † The forms of the Understanding. ‡ The things in themselves.

చినందువలన ప్రయోజన మేదియు లేదు. కావున దృశ్య ప్రపంచమునకు మనయెఱుకకుఁ దగిలిన యునికియే కాని వేఱు యునికి లేదు.

ప్రపంచముయొక్క యునికి దృశ్యాతిరిక్తము కానియెడల నది జ్ఞానసాపేక్షము. దృశ్యప్రపంచము ఉండకపోయినచో జ్ఞానముకూడ ఉండవలెను. 'దృశ్యప్రపంచమే కలదు, జ్ఞానము లేదు.' అని యనుట 'రూపాయకు బొమ్మ పెడ కలదు, అక్షరముల పెడ లేదు.' అని యనుటవంటిది. దృశ్యమును జ్ఞానమును అసలు వేఱు కావు. అవి రెండును రెండుపదార్థములు కావు. అవి చరమ పదార్థముయొక్క రెండు పెడలు, లేక రెండు రూపములు.

వస్తువునకు స్వగతరూపము లేదు. జ్ఞానమొసఁగిన ఆకారమును తాల్చియే వస్తువు జ్ఞానమునకు విషయమగును. నిర్జీవమును జడమును అగు రూపము కల వస్తువే లేదు. జ్ఞానాకారము తాల్చి వస్తువు లన్నియు సచేతనములయియున్నవి.

ఇఁక జ్ఞానమన్నచో శూన్యమును నిర్విషయమును నగు చిత్తు కాదు. విషయాలింగితమయియే ఎఱుక యునికి గొనును. నిరాకారమగు వస్తువు లేదు. రూపములన్నియు జ్ఞాననిర్మితములే.

ఉనికియు ఎఱుకయు సాక్షాత్తు వేఱు కావు. ఎఱుఁగఁబడిన ఉనికియే ఉనికి. ఆయునికి జ్ఞానరూపములో మలచఁబడియే భాసమగును. విషయములవలన ఎఱుకయొక్క శూన్యత పోవును. ఎఱుకవలన విషయముల జడత్వమును అంధ్యమును లోపించును. విషయముతోఁ గలిసిన యెఱుకయే యెఱుక. ఎఱుకతోఁ గూడిన విషయమే విషయము. ఇది హెగెల్ మతము.

బర్క్లీ జీవనానాత్వమును భగవంతుని అంగీకరించును. జ్ఞానవిషయమయిన విషయములఁ గూడ నంగీకరించును. జీవునకును, భగవంతునకును జ్ఞానము కలదనునుగాని వారును జ్ఞానమును ఏకమని యనఁడు. అటులనే విషయములకు జ్ఞానము కలుగుననునుగాని విషయమును జ్ఞానమును ఒకటి యని యనఁడు.

హెగేలుమతమున జ్ఞానము ముఖ్యతత్త్వము. అయినను అది విషయసాపేక్షము. బుద్ధి నిర్మించిన ఆకారముకంటె విషయమునకు వేఱు ఆకారము లేదు. విషయముయొక్క మార్పు అట్టిది.

## అద్వైతవాదులు

కేవలము జ్ఞానమే కలదు, విషయము లేదు. విషయములు మన కెఱుక యగుచున్నవే! విషయము లేదనినచో మన ప్రతీతిని అపలపించుట కాదా?

నిక్కమే. విషయ మెఱుక యగునుగాని దానికి ఉనికి లేదు. మనము చూచు విషయముల యునికి ప్రాతిభాసికము. వాని యునికిగాని, మన ప్రతీతిగాని యెఱుకలోనే పర్యవసన్నము. ఎఱుక వినా వానికి వేఱు యునికియే లేదు. ఎఱుకచేతనే ఉనికియొక్క యర్థము వ్యక్తమగును. ఎఱుకకు రాని యునికికి అర్థము లేదు. ఎఱుఁగఁబడని యునికియు లేమియు నొకటియే. కావున ఉన్న యునికి యంతయు ఎఱుకలోనే కలదు. ఎఱుక వినా వేఱేమియు లేదు.

ఎఱుకలోఁగాని ఎఱుకను ఆశ్రయించికొనిగాని విషయము కలదా? విషయమునుగూర్చి యెఱుక యెప్పుడుండెనో విషయముగూడ నప్పు డున్నటులే కదా!

కాదు. ఎఱుకను మించిన ఉనికికి అర్థమేమియు లేదు. కావున ఎఱుక వినా ఉనికి లేదు. మఱియు ఎఱుకయొక్క ఉనికిచేతనే విషయము ఉనికిగొనుచున్నటులు పైకిఁ గనఁబడుచున్నను లోఁతుగా చూచినచో విషయమునకు ఉనికి లేదని తేలును. ఎఱుకకు వేఱు యునికి యెప్పుడు లేదో అప్పుడు ఎఱుకతో కలిసియే విషయము ఉనికి కలది కావలసియుండును. కాని విషయ మెఱుకతో నెటులు కలిసిపోఁగలదు? మఱియు ఎఱుకతో కలిసిపోయినచో విషయమునకు విషయత్వము ఉండదు. ఇంతియగాక విషయము ఎఱుకతో ఏరూపముగను సంబంధపడఁజాలదు. సంయోగసంబంధముతో సంబంధపడు సనుటకు వీలులేదు. సంయోగము ద్రవ్యములకు ఉండును. ఎఱుక ద్రవ్యము కాదు. సమవాయ సంబంధ మసలే రాదు. అది గుణగుణులకు ఉండును.

విషయమునకును, జ్ఞానమునకును గుణగుణిభావము లేదు. సంయోగసమవాయాతీతమగు మఱియొక వాస్తవసంబంధము మనయెఱుకలో లేదు. కావున విషయమని మనయెఱుకకు విషయమైనది మిథ్యాప్రతిభాసము. దీనికి నిక్కమగు ఉనికి లేదు. కావున ఎఱుకయే నిక్కమగు నునికి. ఇతర రెండవదానికి లేదు.

## వస్తువాదులు

జ్ఞానవాదులకును, వస్తువాదులకును చుక్కెదురు. వారి వాద మిది: 'ఎఱుకకు వేఱుగ ఉనికి ఉపలబ్ధము కాదు. ఉపలబ్ధముకాని విషయ మున్నదనుటకు ప్రమాణము లేదు. కావున విషయము లేదు' అందురు కదా జ్ఞానవాదు లాస్తిపలికెదరు. ఈమాట సరియయినదేనా?

'వస్తువు కలదనుటకు ప్రమాణము లేదు' అనుటయు 'వస్తువే లేదు' అనుటయు ఒకటి కాదు. ఏలనఁగా ప్రమాణమును వస్తువును ఏకవస్తువుకాదు. ప్రమాణముల వలన వస్తువుయొక్క అస్తిత్వము సిద్ధము కావచ్చును. ప్రమాణము దొరకనిచో వస్త్వస్తిత్వము సిద్ధము కాలేదనవలెనుగాని వస్తువే లేదనరాదు కదా! పశువులు పండితులు తమ తమ మత విశేషములను పోషించుకొనుటయందలి పట్టుదలచేత స్పష్టమగు ఇట్టి భేదమును తెలియఁజాలక వస్తువును నిర్ధారింపఁజాలక పోవుటయే వస్త్వభావసిద్ధియను పట్టు పట్టుదురు. ప్రమాణములేనిచో వస్తువు ఉన్నదనినను చెప్పఁజనదు, లేదనియుఁ జెప్పఁ జనదు. లేకపోవచ్చునేమో అను సంభావనయు ఉండవచ్చును కాని ఈ సంభావననే వస్త్వభావములో ప్రత్యక్షప్రమాణరూపముగా గ్రహించుట మిగుల యుక్తివిరుద్ధము.

౧. ఎఱుకకు అవలఁగూడ వస్తువు ఉన్నదను కొందము. 'ఎఱుకకు అవల' అని యనఁగనే ఆవస్తువును మన మెఱుఁగమన్నమాటయేకదా! మన మెఱుఁగఁజాల మన్న మాత్రమున వస్తువే లేదని త్రోసివేయఁజనదు.

౨. ఒక వస్తువే పలువురకు పలు రీతులుగా గోచరించుటబట్టి వస్తువునకు జ్ఞానవ్యతిరిక్తమగు నిజరూపము లేదనరాదు. ఒక వస్తువును గుఱించి పరస్పరవిరుద్ధములగు బహు రూపములు సత్యముకాకున్నను వస్తువునకు రూప మేదియు లేదనుట మాత్రము ప్రమాణసిద్ధ మెటులగును? దాని వాస్తవరూపము మనకు తెలియకపోవచ్చును. అంతియకాని వస్తువు లేకపోదు. వస్తువు సరిగా తెలియకపోవుటయు వస్తువే లేకపోవుటయు ఒకటి కాదు.

3. 'వస్తువులు జ్ఞానాకారము తాల్చియే జ్ఞానమునకు విషయము లగును' అని చెప్పువారు 'జ్ఞానమునకు నిజాకార మేదియు లేదు' అను మాట మఱతురు. బౌద్ధములగు ఆకారములు† కేవల విషయముల సాధారణ రూప మాత్రములు. ఎఱుకచే మనము వస్తుగతములగు ఆకారములనే గ్రహింతుము. కాని బుద్ధిగతములగు ఆకారములను విషయములకూడ మడ్రింపము. విషయమే యాకారముతో మనకుఁ గానిపించునో అది జ్ఞానగతము కాదు. కావున ఆయాకారము కల విషయముయొక్కయునికితో జ్ఞానముయొక్కయునికికి సాహచర్య మంగీకరింప నక్కఱలేదు.

'ఎఱుకకు కాని యునికికి ఏమియు వర్గము లేదు.' అను అద్వైతసూక్తిను అంగీకరింపవచ్చును. ఏలయన ఎఱుక కాని వస్తువును తెలిసికొనఁజాలము కదా! కాని ఒక విశేషము. ఎఱుకచే ఏ వస్తువు నయినను తెలిసికొనుట యనఁగా ఆ వస్తువును ఆ యెఱుకయు ఒకటి యనుటమాత్రము కాదు.

ఉనికియొక్క యర్థమెఱుకచే నెఱుఁగఁదగియుండు ననుట నిక్కము. కాని ఆ యర్థమును ఎఱుకయును ఒకటియే యని యనుకొనుట మాత్రము కల్ల. ఉనికియు ఎఱుకయు ఏకార్థకము లగునేని ఎఱుకకంటె వేఱుగా ఉనికి ఉన్నదా లేదా యను ప్రశ్న మెన్నఁడును పొడగట్టదు. ఉనికి యనఁగా ఎఱుకయే యని కొందఱు తలఁపోయవచ్చునుగాని వారికి ప్రశ్న మెన్నఁడును తట్టదు. సత్తాజ్ఞానములు రెండును ఏకార్థకములు కావు గనుకనే మనకిట్టి ప్రశ్న యుదయించెను. తద్విచార స్వరూపముగా సత్తాజ్ఞానము లొకటి యని తేలినది అని అనరాదు.

---

† The forms of the Understanding.

పైఁజెప్పిన హేతువులవలన ఎఱుకకంటె వస్తు వేదియు లేదు. అను జ్ఞానవాదులవాదము నిర్వివాదము కాదని తేలుచున్నది. వారియుక్తులు ప్రమాపకములు కావు.

'ఎఱుకకంటె వేఱు ఉనికి కలదా?' అను విచారణయందు 'జ్ఞానమును దానివిషయమును ఎన్నటికిని ఒకటికావు' అనుమాట లెస్సగా తెలియవలసియున్నది. తెలియఁబడినది తెలివితో నేకమగునెడల తెలియఁబడున దేదియు నుండదు. కావున జ్ఞేయమగు విషయము జ్ఞానముకన్న పృథక్భిన్నము.

మన మెఱిఁగిన వస్తువునే ఉన్నదని యందుము. లేనివస్తువు నెఱుఁగుటకు వీలులేదు. విషయము తెలివిడి వెనువెంట విషయము ఉన్నదనియు మనకు ఉపలబ్ధమగును. ఏలనఁగా ప్రమాపముగానే విషయమును మన మెఱుఁగుదుము.

విషయము జ్ఞానముకన్న భిన్నము. కావున విషయముయొక్క యునికి ఎఱుకకు వేఱయియుండుటుచితము. విషయముయొక్క యునికి ఎఱుకతో నేకమయి పోవునెడల విషయమునకు విషయత్వమే యుండదు. జ్ఞానమునందే అది లోపించిపోవును. సూక్ష్మదర్శులగు అద్వైతవాదు లిది తెలిసికొనియే అసలు విషయమునకే అభావ మొప్పిరి. కాని ఎంతవట్టు విషయప్రతీతి కలుగుచున్నదో అంతవట్టు విషయమును ఒప్పుకొనకుండఁ జాలము. ఈరీతిగా విషయమును ఒప్పుకొనినచో ఎఱుకకన్న వేఱయిన ఉనికిని ఒప్పుకొనకుండు టెట్లు? కేవల జ్ఞానముచే ఏవస్తువుగాని కూర్పఁబడియుండ లేదు. ఎచట ఎల్లయునికియు ఎఱుకలోనే పర్యవసన్నమో ఎచట కేవల మెఱుకయే కలదో అచట విషయ మనున దేదియు నుండఁజాలదు. జ్ఞానాతిరిక్తములే జ్ఞానమునకు విషయము లగుట సంభవించును.

ఎఱుకకును, విషయమునకును ఎఱుకలోనే భేదము కలుగునుగాని ఎఱుకకు వెలుపటఁ గలుగదు. కావున విషయముగూడ ఎఱుకలోనే ఇమిడియున్నదని కొంద అందురు.

'ఈయెఱుకలోపల' అనుదాని కర్థ మేమి? అని మన మడుగవలసియున్నది. పప్పుప్పులు పెట్టుకొనఁదగిన కుండయా జ్ఞానము? జ్ఞాన మనఁగా అవబోధనము. దానికి బహిరంతర్భాగములు లేవు. విషయము జ్ఞానములోఁ జొరఁబడి జ్ఞానముకన్న వేఱుగా తనవిషయత్వము నెటులు కాపాడుకొనును?

'జ్ఞానవిషయములు రెండును చరమమగు ఏకపదార్థముయొక్క రెండుముఖములు' అను హెగెలును ఇటు లడుగవలయును. చరమమగు ఆయేకపదార్థ మెట్టిది? అది జ్ఞేయమా, అజ్ఞేయమా? జ్ఞేయ మనుచో అదియు విషయ మయిపోవును. మఱియు దానియందు జ్ఞానము ఉండఁబోదు. అజ్ఞేయ మగుచో జ్ఞానవాదుల మతము చొప్పున అజ్ఞేయమగు పదార్థమునకు ఉనికి యెటు లొప్పఁజనును?

జ్ఞానముతోడను విషయముతోడను గలిసిన ఒకానొక పదార్థమును మనము కల్పింపఁ జాలఁ గలుగుదుమా? హెగెలుమత మొప్పుకొనినను జ్ఞానము చరమపదార్థముయొక్క ఒకవైపు కాదా! ఉనికియో ఇరువైపుల నున్నది. కావున జ్ఞానాతిరిక్తమగు నునికి ఒక అంశమునం దంగీకరింపఁబడినటు లాయెను.

ఎఱుకకంటె వేఱుగా విషయముయొక్క యునికిని ఒప్పుకొనినను విషయ మెన్నఁడును జ్ఞానముతో అసంబద్ధమయి యుండలేదు. కాని దాని యునికియు ఎల్లయపుడును జ్ఞానముతో సంబద్ధమయియే యున్నది. విషయముయొక్క విషయత్వమే జ్ఞానముమీఁద ఆధారపడియున్నదని కొందఱు చెప్పుదురు.

విషయత్వ మన నేమి? ఏదేని వస్తు వెపుడెఱుఁగఁబడునో అపుడే అది ఎఱుకకు విషయమయినది అని చెప్పవలయును. కావున విషయత్వ మనునది ఏ వస్తువుయొక్కయు అంతర్నిహితధర్మము కాదు. ఎఱుకతో సంబంధపడుట యనునదే వస్తువుయొక్క విషయత్వము. ఈసంబంధ మెట్టిది?

వస్తు వెటు లున్నదో సరిగా అటులు తెలిసికొనునదే జ్ఞానము. వస్తువునకు రూపాంతర మొసఁగునది సత్య

జ్ఞానము కాదు. కావున జ్ఞానముతో సంబంధపడినందు వలన వస్తువునకు రూపాంతరము కలుగదని తప్పక ఒప్పుకొనవలయును. వస్తువును కేవలము ప్రకాశింపఁజేయుటయే జ్ఞానస్వభావము. జ్ఞానమునకు కార్యమును పుట్టించు శక్తి లేదు. జ్ఞానము రూపాంతర మొసఁగలేదు. క్రొత్త సృష్టి చేయలేదు. ఇది నిక్కముగు నెడల విషయత్వము వలన వస్తుగుణముగాని ధర్మముగాని మాఱదని ఒప్పుకొనినటులగును. జ్ఞానమునకు వస్తువును సృజింపఁగలశక్తిగాని రూపాంతరము కలిగింపఁగల శక్తిగాని లేక వస్తువును ప్రకాశింపఁజేయుటయే దాని పనియగు నెడల జ్ఞానముతో సంబంధపడినందువలన వస్తువునకు విషయత్వము వినా వేఱు ధర్మము కలుగదు. ఆ హేతువుచేతనే జ్ఞానముతో సంబంధపడకపోయినను వస్తువు తన గుణమునుగాని ధర్మమునుగాని కోలుపోదు. కావుననే జ్ఞానముతో సంబంధపడని అవస్థలో వస్తువుయొక్క యునికి అక్షుణ్ణముగా నుండు నని అంగీకరించుటకు బాధ యేమియు లేదు. జ్ఞానముతో సంబంధము చెందని వస్తువు ఉనికిని ఆర్జించుకొను నెడల అనఁగా జ్ఞానము వస్తువును సృజించు నెడల జ్ఞానవ్యతిరిక్తముగా వస్తువు ఉండఁజాలదు. ఇటులు కానిచో జ్ఞానముతో సంబంధము లేకపోయినను వస్తువెన్నఁడును ఉనికిని పోఁగొట్టుకొనఁజాలదు. సర్వజ్ఞుఁ డొకఁ డుండవచ్చును. కాని వస్తువుయొక్క ఉనికియు ఆయనయొక్కయు ఒకటి కాదు. వస్తువుయొక్క ఉనికి వస్తువునందే యుండును. ఏదేని వస్తువు కలయంతమాత్రమున ఎవరో యొకరు గాని నెఱుఁగితీరవలయునను నియమము వస్తువుయొక్క యునికిలో నెంత వెతికినను కానరాదు. కావున ఉనికికి ఎఱుకతో నేమిపని?

| పైవ్యాసమున ఉపయోగించుకొనిన ముఖ్యగ్రంథములు. | ముఖ్యగ్రంథకర్తలు |
| --- | --- |
| బృహదారణ్యక. | మధుసూదన సరస్వతి. |
| తర్కసంగ్రహ. | రసవిహారి. |
| వాక్యవృత్తి. | |

# అదృష్టవంతుడు

కూర్మా వేణుగోపాలస్వామి,
శేషుబాయి గోపాలస్వామి

టెలిఫోన్ గంట మోగడం మొదలెట్టింది. ఆతురతతో తీసి వినేటప్పటికి మృదు మధుర వాక్కులు వినబడ్డాయి. "నా భర్త ఊళ్లో లేడు. రాత్రి నాతో భోంచేస్తావా?" నే నానంద వార్ధిలో నోలలాడిపొయ్యాను. ఇదే సమయం అనుకున్నా. "ఓ, తప్పకుండా వస్తా. అయితే మీ ఇల్లెక్కడ?" ఈమాటలు నేననేసరికి ఆమె రౌద్రంవల్ల టెలిఫోన్ వణికిపోయింది. "నాపేరు ఉమాబాల. నీకు జ్ఞాపకం ఉందో లేదో గాని నీ చెల్లెల్ని నేను" అనేటప్పటికి రాత్రేమో రసికత్వం ఒలికించేద్దామని ఊరి పోతున్న నా ఆశలన్నీ ఒక్కసారిగా పటాపం చలమయ్యాయి. నాకు ఒళ్లు కంపించిపోయింది. "నేనెవర్ననుకున్నావు? నీకేమో పసిపాటా లేదని ఇతరులెవరికీ కూడా పసీ పాటా లేదను కున్నావా? మొట్టమొదట నీపేరు చెప్పనంత మాత్రంచేత నీవెవరో నాకు తెలియదను కున్నావా? ఏదో నిన్ను ఉడికించాలని ఆలా గన్నాను. ఇల్లు కదలి రావడానికి ఒక్క నిమి షంఅయినా నాకు టయిము లేదు." అన్నాను. కాని ఆమె నాన్నతో నా వేషాలన్నీ వెల్లడి చేసి నాకు నెలనెలకూ ఇచ్చే మనువర్తి ఊడ గొట్టిస్తానని బెదరించేటప్పటికి తోక ముడుచు కుని 'వస్తా'నన్నాను. నాకు ప్రాయశ్చిత్తంగా టాజ్ మహల్ హోటేలుకు తీసుకుని వెళ్లు దువుగాని, ఈవనింగు డ్రెస్సు వేసుకోమంది. ఉక్కిపోతోన్నా నాకర్మం కాలినట్లు అట్టలాం టి సర్టువేసుకుని ఊరేగవలసివచ్చింది.

టాజ్ మహల్ హోటల్ సంగతి మీకు తెలుసుగా. సముద్రానికి అనుకొనిఉంది. బొంబాయిలో కాసులు కానులుగా ఖర్చు పెట్టే ప్రతికుర్రాడు అక్కడే ఉంటాడు. అక్క డికి భోజనానికి వచ్చేవాళ్లు, బొత్తిగా దేశం చూడ్డానికి వచ్చిన పరదేశస్థులయితే తప్ప, ఒకళ్లకొకళ్లు తెలిసే ఉంటారు. అక్కడికి ఇం కెవరూ దొరకనట్లు చెల్లెళ్లను, భార్యల్ని వెం టబెట్టుకునివెళ్తే లోకువ అయిపోతాం. కాని కష్టకాలం ఎవరికైనా వస్తుంది. ఆనాడు "కే బరే" ఉందని ఉమా కనిపెట్టింది. మెల్లగా డాన్సుహాల్లోకి దారి చూపింది. నేను జేబు తడుముకున్నా — తెచ్చినడబ్బు చాల్తుందో లేదో అని.

మధ్య డాన్సుఫ్లోరు నునుపువల్ల మెరు స్తోంది. దానిచుట్టూ కుర్చీలూ, బల్లలూ గోడ లకు అంటుకునేటట్టు అమర్చబడియున్నాయి. ఇంక దీపాల వెల్తురు చెప్పనక్కరలేదు. గోడల్లో పెద్దపెద్ద అద్దాలు ఉండటంచేత ఎటుచూచినా వేలకొలది మా ప్రతిబింబాలే

కనుబడుతోన్నాయి. మేము టేబిల్ రిజర్వు చేసుకోలేదు. ఆలస్యంగా వచ్చాం. గది జనంతో క్రిక్కిరిసిపోయి ఉంది. అందుచేత ఏ మూలనయినా ఇరుక్కుందామని నే నిటూ అటూ బల్లకోసం చూస్తోంటే, మా ఉమా హాలంతటిలో ముఖ్యమైన స్థలంలో ఉన్న బల్లదగ్గఱ ఎవరూ లేకుండా ఉండడం కని పెట్టి దర్జాగా దానిదగ్గఱకు వెళ్లి మఖాం వేసింది. ఇక నేను పికినీస్‌కుక్కలాగ వెంట బడి పోవలసివచ్చింది. ఖంగారు పడుతూ హెడ్ వెయిటర్ అక్కడికి వచ్చాడు. అతను వచ్చేలోపల ఆబల్లమీద ఉన్న రిజర్వేషన్ కార్డును మా ఉమా ఒకచేతివూపుతో తోసి పారేసింది. హెడ్ వెయిటర్ వంక కళ్లు ఎఱ్ఱ చేసేటప్పటికి అతను ఖంగారుపడిపోయి ఏమీ అనలేక, వేరే ఒకబల్ల తెప్పించి మాప్రక్కన వేయించి కుర్చీలు అమర్చి రిజర్వేషన్‌కార్డు బల్లమీద పెట్టాడు. నేను భోజనానికి ఆజ్ఞ ఇస్తూ, "పానీయం ఏంకావలె" నని అడిగితే ఉమా "ష్యాంపెయిన్" అంది. "ఎప్పటినుంచీ మొదలెట్టావు సురాపానం" అన్నా. "అబ్బే, నే నసలు ముట్టుకోనుగాని ఇక్కడ ష్యాంపె యిన్ తెప్పించకపోతే పరువుతక్కువ" అంది నాకు నాలుగాకులు నేర్పుతూ.

మేము భోజనం మొదలెట్టేటప్పటికి ఇత రులు ముగిస్తూ ఉన్నారు. డాన్సువాయిద్యం ఇతరబల్లల దగ్గఱ ఉన్నవార్ని ఆకర్షించ డం మొదలెట్టింది. కొంచెంసేపట్లో డాన్సు ఫ్లోరు నిండిపోయింది. దొరలూ దొరసా నులూ, ఇంగ్లాండులో ఏళ్లతరబడి నెలకొలది వెచ్చించి డిగ్రీలు లేకపోయినా డాన్సింగు నేర్చుకున్న నల్లదొరలూ, తెల్లవా రెంచేస్తే కోతుల్లా తాముకూడా అదేచేయాలనే పార శీక కాంతలూ శరీరాలు ఊపడం మొదలెట్టారు. ఇదొక పెద్ద ఆట. డాన్సుఫ్లోరులో ఎక్కడైనా ఒక అడుగుస్థలం కనబడ్డంతోనే ఒక మొ గాడూ ఒక ఆడదీ కలిసి దానిమీదకి ఉరక డం. కౌగలించుకుని, కళ్లు, ఒళ్లు, కాళ్లు కద పడమే కాని జరగడం ఏం కనపడదు, స్థలం లేకపోబట్టి. ఇదే డాన్సింగు అంటారు. ఈ లోపల ఏ లావుపాంటి ఆయనో ఒక ఊపు ఊపేటప్పటికి అనేకమంది ఒకరిమీద ఒకరు పడి క్షమాపణ వేడుకుంటారు. ఇదొక ఆనందం.

ఈ నాట్యసముద్రంమీదనుంచి నా చూపు మరల్చేటప్పటికి, మాప్రక్కన క్రొత్త గా వేసిన బల్లదగ్గఱ ఒక హిందూ పెద్దమను ష్యుడు కూర్చునిఉండడం కనబడింది. ఎన్నో కుర్చీలున్నా ఆయన వంటరిగానే ఉన్నట్లు నాకు తోచింది. చాలా పొడవుగా ఉం టాడు. మా ఉమా అంటుంది అందంగా ఉంటాడని కూడా. ఈలోపల డాన్సింగు ఆగిపోయింది. ఎవరిబల్లకు వారు చేరుకు న్నారు. కొంచెంసేపట్లో బల్లలదగ్గర ఉన్న దీపాలన్నీ ఆర్పేశారు. డాన్సుఫ్లోరుమీద మాత్రం ప్రకాశిస్తోన్న స్పాట్ లైట్ ఒకటి కనబడుతోంది. ఒక దొరా ఒకదొరసానీ వచ్చి నృత్యం చూపించారు. ఇదేనటకే బరే

అంటారు. వారిస్మృత్యం అయిపోవడంతోనే మళ్ళీ మాబల్లదగ్గర దీపాలు వెలిగాయి. మా ప్రక్కబల్లదగ్గర కూర్చునిఉన్నాయన మళ్లీ నాదృశ్యానికి అడ్డుపడ్డాడు. అతనికళ్లనుండి నీళ్లు బొటబొట కారుతున్నాయి. అది ఉమా కూడా గమనించింది. "ఒకపెగ్ ఎక్కువై ఉంటుం"దన్నాను ఆమె అడిగని ప్రశ్నకు ప్రత్యుత్తరంగా. "నీకేమీ తెలియ"దంది ఉమా. ఎప్పుడూ అలాగేఅంటుంది. "అతనికేదో పెద్ద ఉపద్రవం సంభవించిఉంటుంది" అంది. "తప్పకుండా జరిగి ఉంటుం"దన్నానేను. "అతడు ఇక్కడికి తీసికొనివద్దా మనుకున్న గుంట చానట్లుంది" అన్నా నేను. ఉమా నన్ను "నోరుమూయు" మంది. నాదురదృష్టానికు శాస్తిగా అతన్ని మాబల్లదగ్గరకు పిలవమంది. నేను డంగయిపోయా. "బాంబాయిలో ఊరూ పేరూ తెలియనివాళ్లతో అధికప్రసంగానికి దిగితే రెండుచెంపలూ వాయిస్తా"రన్నా. "ఆయనకై రిజర్వుచేసిన బల్లు మనం ఆక్రమించాంగా. ఆమాత్రం పరిచయం చా"లంది ఉమా.

"అయ్యా, క్షమించాలి. పొరపాటున మీబల్లు మేం ఆక్రమించాం. మీరు కూడా ఒంటరిగా ఉన్నట్లున్నారు. దయచేసి మాతో కలిసి ఏదైనా పానీయం పుచ్చుకుంటే మాకు చాలా ఆనందం కలిగిస్తుంది." అన్నా ఆయనదగ్గఱకు వెళ్లి. ఆయన మెల్లగా లేచి వచ్చి మాబల్లదగ్గర చేరాడు. ఇంకో గ్లాసు అతనికోసం తెప్పించి ష్యాంపెయిన్‌తో నింపి ఇచ్చాను. "మీ హెల్త్" అని ఒకగుటక లో కొట్టేశాడు. కాని కన్నీంట నీళ్లు ఇంకా వస్తూనే ఉన్నాయి, అతను నవ్వుతో మాట్లాడాలని ఎంతప్రయత్నించినా. "అమ్మా, మీరు నన్ను క్షమించాలి. నే నవేళ డాన్సు చేసస్థితిలో లేను." అన్నాడు. నాకు పట్టరాని నవ్వొచ్చింది. మాఉమాకు డాన్సు ఒకఅడుగైనా వేయడం రాదు. ఇలాంటి విషయాల్లో ఆమెకు పూర్వకాలపు చేవస్తం మెండు. కాని ఎవరికైనా తెలిస్తే తన నవనాగరకతకు భంగం వస్తుందనిభయం. నే నేమైనా తనసంగతి వెలిబుచ్చేస్తానేమో నని బల్లక్రింద నాకాలును గట్టిగా తన్నుతూ ఆయన కేదో నాలుగు మంచిమాటలు చెప్పింది. తన్నులవల్ల కల్గిన బాధలో ఆసంభాషణ నాకు వినిపించ లేదు. అప్పు డతడన్నాడు—"మీరు చాలా దయార్ద్ర హృదయులుగా కనుపిస్తున్నారు. మీకు వినగ కలిగిదంటే ఒకచిన్న కథ చెప్తా"నన్నాడు. "ఏమాత్రం కలగ"దని అంటూ నేను మరల అతనిగ్లాసు ష్యాంపెయిన్‌తో నింపాను. "మీ హెల్త్" అంటూ ఒకగుటకలో మ్రింగేసి కథచెప్పడం మొదలెట్టాడు.

"ఒకపురుషుడు ఒకస్త్రీ ఉండేవారు. ఆ పురుషుడు ఆస్త్రీని అధికంగా ప్రేమిస్తుండేవాడు. ఆమెను స్త్రీఅనవలసిందే. వర్ణించడానికి మాటలు చాలవు. దేవకన్యకలంటే మీరు నమ్మరు. ఆమెపేరు చెప్తే మీకే తెలుస్తుంది. కాని చెప్పనందుకు క్షమించాలి. ఆమె ఈదేశంలో చాలా ప్రసిద్ధికెక్కిన స్త్రీ.

పుట్టుకవల్లా, సౌందర్యంవల్లా ఆమెకు సాటి వారు ఈతరంలో లేరు. చరిత్రలో కూడా అంతటిస్త్రీ లేదు. మోహినిని మించిపోతోంది. మోహిని దేవదానవులకు ఘోర వైరం కలిపించింది. కలహం ఎవరైనా కలిగించవచ్చు. దేవదానవుల్ని కూడా, ఐక్యంచేసే టంతశక్తి ఈమెకు కలదు. అంతకంటె గొప్పేముంది? ఆమె సౌందర్యంతో పురుషులకు చేయజాలనిదేం లేదు. అంతటి సౌందర్యం ఈదేశంలోనే కాదు, ఇతరదేశాల్లో కూడా ఉండదు.

"ఆపురుషుడు ఈస్త్రీని చూడ్డంతోనే అమోఘమైన మోహంలో మునిగిపోయ్యాడు. ఇది సాధారణమైన ప్రేమకాదు. ఆమె యవ్వనవతి. తనచుట్టూ తిరుగు వేలకొలది పురుషుల్లో ఈతనిపైన తన అనుగ్రహం ప్రసరించింది. అంతా వీరిద్దరి పేర్లూ కలిపి చెప్పుకోవడం మొదలెట్టారు. ఆయన చాలా పొడవైనవాడు; అందమైనవాడు. ఆధునికకవుల్లో అగ్రగణ్యుడు. ఆయనది గొప్పకుటుంబం. ఆమె భువనైకసుందరి.

"ప్రప్రథమంలో ఆమె ఆతన్ని పూర్తిగా అంగీకరించలేదు కాని వారిద్దరు కలుసుకోని రోజు లేదు. ఏనాటికైనా వివాహం చేసుకోటుందనే నమ్మకతో అతను ఆనంద సముద్రంలో మునిగిపోయ్యాడు. అప్పటి అతని ఆనందం అపరిమితం."

ఈమాటలు ఉచ్చరించేటప్పటికి అతని కళ్లవెంట మళ్లీ నీళ్లువచ్చాయి. ఆతనిగ్లాసు మళ్లీ షాంపెయిన్‌తో నింపా "మీహెల్త్" అని మళ్లీ ఒకగ్రుక్కతో మింగేశాడు.

"ఆమె అసమానసౌందర్యం సంగతి మీకు ఇదివరకే చెప్పా. అదచాలక ఆమెకు అపరిమితమైన ఆశ ఒకటి ఉండేది—దేశంలో తాను గొప్పనాయకురాలుగా ఉండాలని. ఈ ఉద్దేశ్యంతో దేశనాయకులకడ చేరి కష్టమైన విషయములు అనేకములు చర్చిస్తుండేది. ఆమెకు దేశస్థితి బాగుచేయాలని మిక్కిలి కుతూహలం. అంచేత స్త్రీలకు ఓట్లురావడానికి ముందునుంచీ కూడా స్త్రీల హక్కుల కొఱకై జండా ఎత్తి రాజకీయ విషయాల్లో చాలా తెలివైనదని పేరుపొందింది. స్త్రీలకు ఓట్లు రావడంతోనే ఆమె శాసననిర్మాణ సభకు ఎన్నుకోబడ్డది. రాజకీయ విషయాల్లో ముందంజవేసి ఉపన్యాసాలిచ్చే స్త్రీల రూపురేఖా విలాసాలు మీకు తెలిసిందేగా. వాటిలో ఆమెసౌందర్యం ఎలాగ ప్రజ్వలిల్లిందో మీరే ఊహించవచ్చు.

"ఈకాలంలోనే నేచెప్పిన పురుషుడు ఆమెజీవితంలో ప్రవేశించాడు. ఆతని స్నేహం ఆమెకు చాలా అదృష్టదాయకం. ఆతను లేకపోతే ఆమెరాజకీయజీవితం నిష్ఫలం అయ్యేది. ఆమెకు ఉపన్యాసం తయారుచేయడం రాదు. కాని వల్లెవేసి ఎట్టి ఉపన్యాసాన్నైనా ఇయ్యగలిగేది. ఆమె ఉచ్చారణ, పద ప్రయోగం, వాక్యాల అల్లిక, మృదుమధుర కంఠధ్వని విని జను లందరూ ఆశ్చర్యపడేవారు. కాని ఆమెకు

ఉపన్యాసం తయారుచేయడం ఏమాత్రం రాదు. త్వరితంగా ప్రసిద్ధికెక్కిన ఆమెఉపన్యాసాలకు ఆటపట్టులయిన ఊహ లామెవి కావు. ఆమెస్నేహితుడు ఆమెఉపన్యాసాల్ని వ్రాసి ఆమెకు ఇస్తుండేవాడు. అలా వ్రాయడం ఆయనకు చాలాసరదా. ఆమెకు కొంచెంఅయినా తాను ఉపయోగపడుతోండడం తనకు చాలాగౌరవంగా తల్చేవాడు. అతడు ఆమె ఇచ్చే ఉపన్యాసాల్ని తయారుచేయడంలో సాహాయ్యపడుతోండేవాడేకాని తన ప్రతిఉద్దేశం, ప్రతిపదం, ప్రతివాక్యం అతని దేనని ఆమెకు ఏనాడూ తోచలేదు. ఆమె అవలంబించిన రాజకీయపక్షం అతని కేమాత్రం ఇష్టంలేకపోయినా, ఆమెవల్ల ఆమె అవలంబించిన పక్షం అభివృద్ధికై తన యావచ్ఛక్తి వినియోగించుచున్నాడన్న సంగతి ఆమె తెలుసుకోలేక పోయింది. అతని మెదడు బెజవాడ జంక్షనులాగ ఒకేసారి అనేక మార్గాల్లో పోతోండేది. అతడు తలచుకొంటే రాజకీయ విషయాల్లో సుప్రసిద్ధమైన పేరు పొంద గలిగేవాడు. కాని కవి అగుటచే రాజకీయ విషయాల్లో కుతూహలం లేక ఆమెకు సాహాయ్యం చేయాలనే ఉద్దేశంతప్ప వేరు విషయం అతడు ఆలోచించనే లేదు. తన కీర్తికై ఏమాత్రం అపేక్షించలేదు.

"ఈలోపల మరియొక పురుషుడు ఆమె జీవితంలో ప్రవేశించాడు. అట్టి ధైర్యంగల యోధుడు మనకాలంలో లేడని అంటారు. కాని అతడు ధైర్యవంతుడో, అదృష్టవంతుడో మనం చెప్పలేం. తనవంటి అదృష్టవంతుడు లేడని అతడే అంటూఉంటాడు. 'నేను ఎప్పుడూ ఓడిపోజాలను' అని విచారంగా అంటూఉండేవాడు. అతడు ఏదిముట్టుకుంటే అది బంగారం అయ్యేది. అతడు ఏదిఒగ్గినా గెలిచేవాడు. అతని పేరు కెప్టెన్ విజయ్; సార్థకనామధేయుడు. అతడు ముట్టిందంతా జయం. అతడామెను శాసననిర్మాణసభలో అధ్యక్షుని గేలరీనుంచి మొట్టమొదట చూచాడు. ప్రసిద్ధకెక్కిన ఆమెఅందం అతనెరిగిందే పత్రికల్లో ఆమె చిత్తరువు ఎన్నోసారులు చూచాడు. కాని అప్పటివఱకూ ఆమెసౌందర్యం అతన్ని ఆకర్షించలేదు. చిత్తరువులకు ప్రాణం లేదు గదా. ప్రాణంతోవున్న ఈ అసమానసౌందర్యాన్ని ఇప్పుడే కనిపెట్టాడు. ఆనాడామె మరింతమధురంగా ఉపన్యసించింది. స్త్రీ హక్కులసంబంధమైనచట్టం ఒకటి ఆనాడు చర్చింపబడుతోంది. హైందవస్త్రీల దుర్గతినిగురించి ఆమె ఆలాపించేటప్పటికి పురుషుల పాషాణహృదయాలుకూడా కరిగిపోయ్యాయి. ఆమె ఉపన్యాసమే ఆనాడు ఆమెపక్షం జయించడానికి కారణం అని అంతాఅంటారు. వీరుడగు విజయుడు ఆమెసౌందర్యానికి, తెలివికి ముగ్ధుడైపోయ్యాడు. ఆమెతెలివి, ఆమెజ్ఞానం, ఆమె చురుకుదనం ఇవన్నీ ఆమెచక్కదనంతో కలవడంతోనే విజయుని హృదయాన్ని బానిసగా చేసివేశాయి. అత డెప్పుడూ ఓడిపోలేదుగా! ఆనాటిరాత్రే ఆమెను ఒకవిందులో కలుసుకున్నాడు.

"మూడువారాల్లోపల ఆప్రాతస్నేహితుడు, ఆమెకు సాహాయ్యం చేసినవాడు, ఆమె కెప్టెన్ విజయుని వివాహమాడనున్నదని పత్రికల్లో చదివాడు. నిర్ఘాంతపడిపోయ్యాడు. తనకన్నులను తను నమ్మలేక

పుట్టుకవల్లా, సౌందర్యంవల్లా ఆమెకు సాటి వారు ఈతరంలో లేరు. చరిత్రల్లో కూడా అంతటిస్త్రీ లేదు. మోహినిని మించిపోతోంది. మోహిని దేవదానవులకు ఘోర వైరం కలిపించింది. కలహం ఎవరైనా కలిగించవచ్చు. దేవదానవుల్ని కూడా, ఐక్యంచేసేటంతశక్తి ఈమెకు కలదు. అంతకంటె గొప్పేముంది? ఆమె సౌందర్యంతో పురుషులకు చేయజాలనిదేం లేదు. అంతటి సౌందర్యం ఈదేశంలోనే కాదు, ఇతరదేశాల్లో కూడా ఉండదు.

"ఆపురుషుడు ఈస్త్రీని చూడ్డంతోనే అమోఘ మోహంతో మునిగిపోయ్యాడు. ఇది సాధారణమైన ప్రేమకాదు. ఆమె యౌవనవతి. తనచుట్టూ తిరుగు వేలకొలది పురుషుల్లో ఈతపైన తన అనుగ్రహం ప్రసరించింది. అంతా వీరిద్దరి పేర్లూ కలిపి చెప్పుకోవడం మొదలెట్టారు. ఆయన చాలా పొడవైనవాడు; అందమైనవాడు. ఆధునికకవుల్లో అగ్రగణ్యుడు. ఆయనది గొప్పకుటుంబం. ఆమె భువనైకసుందరి.

"ప్రథమంలో ఆమె అతన్ని పూర్తిగా అంగీకరించలేదు కాని వారిరువురు కలుసుకోని రోజు లేదు. ఏనాటికైనా వివాహం చేసుకొంటుందనే నమ్మకతో అతను ఆనంద సముద్రంలో మునిగిపోయ్యాడు. అప్పటి అతని ఆనందం అపరిమితం."

ఈమాటలు ఉచ్చరించేటప్పటికి అతని కళ్లవెంట మళ్లీ నీళ్లువచ్చాయి. ఆతనిగ్లాసు మళ్లీ షాంపెయిన్‌తో నింపా "మీహెల్త్" అని మళ్లీ ఒక్కగుక్కతో మింగేశాను.

"ఆమె అసమానసౌందర్యం సంగతి మీకు ఇదివరకే చెప్పా. అదిచాలక ఆమెకు అపరిమితమైన ఆశ ఒకటి ఉండేది—దేశంలో తాను గొప్పనాయకురాలుగా ఉండాలని. ఈ ఉద్దేశ్యంతో దేశనాయకులకడ చేరి కష్టమైన విషయములు అనేకములు చర్చిస్తోండేది. ఆమెకు దేశస్థితి బాగుచేయాలని మిక్కిలి కుతూహలం. అందుచేత స్త్రీలకు ఓట్లురావడానికి ముందునుంచీ కూడా స్త్రీల హక్కుల కొరకై జండా ఎత్తి రాజకీయ విషయాల్లో చాలా తెలివైందని పేరుపొందింది. స్త్రీలకు ఓట్లు రావడంతోనే ఆమె శాసననిర్మాణ సభకు ఎన్నుకోబడ్డది. రాజకీయ విషయాల్లో ముందంజవేసి ఉపన్యాసాలిచ్చే స్త్రీల రూపరేఖా విలాసాలు మీకు తెలిసిందేగా. వారిలో ఆమెసౌందర్యం ఎలాగ ప్రజ్వరిల్లిందో మీరే ఊహించవచ్చు.

"ఈకాలంలోనే నేచెప్పిన పురుషుడు ఆమెజీవితంలో ప్రవేశించాడు. అతని స్నేహం ఆమెకు చాలా అదృష్టదాయకం. అతను లేకపోతే ఆమెరాజకీయజీవితం నిష్ఫలం అయ్యేది. ఆమెకు ఉపన్యాసం తయారుచేయడం రాదు. కాని వల్లెవేసి ఎట్టి ఉపన్యాసాన్నైనా ఇయ్యగలిగేది. ఆమె ఉచ్చారణ, పద ప్రయోగం, వాక్యాల అల్లిక, మృదుమధుర కంఠధ్వని విని జనులందరూ ఆశ్చర్యపడేవారు. కాని ఆమెకు

ఉపన్యాసం తయారుచేయడం ఏమాత్రం రాదు. త్వరితంగా ప్రసిద్ధికెక్కిన ఆమె ఉపన్యాసాలకు ఆటపట్టులయిన ఊహ లామెవి కావు. ఆమె స్నేహితుడు ఆమె ఉపన్యాసాల్ని వ్రాసి ఆమెకు ఇస్తుండేవాడు. అలా వ్రాయడం ఆయనకు చాలాసరదా. ఆమెకు కొంచెం అయినా తాను ఉపయోగపడుతోండడం తనకు చాలాగౌరవంగా తల్చేవాడు. అతడు ఆమె ఇచ్చే ఉపన్యాసాల్ని తయారుచేయడంలో సాహాయ్యపడుతోండేవాడే కాని తన ప్రతిఉద్దేశం, ప్రతిపదం, ప్రతివాక్యం అతనిదేనని ఆమెకు ఏనాడూ తోచలేదు. ఆమె అవలంబించిన రాజకీయపక్షం అతనికేమాత్రం ఇష్టంలేకపోయినా, ఆమెవల్ల ఆమె అవలంబించిన పక్షం అభివృద్ధికై తన యావచ్ఛక్తి వినియోగించుచున్నాడన్న సంగతి ఆమె తెలుసుకోలేక పోయింది. అతని మెదడు బెజవాడ జంక్షనులాగ ఒకేసారి అనేక మార్గాల్లో పోతోండేది. అతడు తలచుకొంటే రాజకీయ విషయాల్లో సుప్రసిద్ధమైన పేరు పొంద గలిగేవాడు. కాని కవి అగుటచే రాజకీయ విషయాల్లో కుతూహలం లేక ఆమెకు సాహాయ్యం చేయాలనే ఉద్దేశంతప్ప వేరు విషయం అతడు ఆలోచించనే లేదు. తన కీర్తికై ఏమాత్రం అపేక్షించలేదు.

"ఈలోపల మరియొక పురుషుడు ఆమె జీవితంలో ప్రవేశించాడు. అట్టి ధైర్యంగల యోధుడు మనకాలంలో లేడని అంటారు. కాని అతడు ధైర్యవంతుడో, అదృష్టవంతుడో మనం చెప్పలేం. తనవంటి అదృష్టవంతుడు లేడని అతడే అంటూఉంటాడు. 'నేను ఎప్పుడూ ఓడిపోజాలను' అని విచారంగా అంటూఉండేవాడు. అతడు ఏదిముట్టుకుంటే అది బంగారం అయ్యేది. అతడు ఏదిపట్టినా గెలిచేవాడు. అతని పేరు కెప్టెన్ విజయ్; సార్థకనామధేయుడు. అతడు ముట్టిందంతా జయం. అతడామెను శాసననిర్మాణసభలో అధ్యక్షుని గేలరీనుంచి మొట్టమొదట చూచాడు. ప్రసిద్ధికెక్కిన ఆమెఅందం అతనాకర్షించే పత్రికల్లో ఆమె చిత్తరువు ఎన్నోసారులు చూచాడు. కాని అప్పటివఱకూ ఆమెసౌందర్యం అతన్ని ఆకర్షించలేదు. చిత్తరువులకు ప్రాణం లేదు గదా. ప్రాణంతోవున్న ఈ అసమానసౌందర్యాన్ని ఇప్పుడే కనిపెట్టాడు. ఆనాడామె మరింతమధురంగా ఉపన్యసించింది. స్త్రీవాక్కులనం బంధమైనచట్టం ఒకటి ఆనాడు చర్చింపబడుతోంది. హైందవస్త్రీల దుర్గతినిగురించి ఆమె ఆలాపించేటప్పటికి పురుషుల పాషాణహృదయాలుకూడా కరిగిపొయ్యాయి. ఆమె ఉపన్యాసమే ఆనాడు ఆమెపక్షం జయించడానికి కారణం అని అంతాఅంటారు. వీరుడగు విజయుడు ఆమెసౌందర్యానికి, తెలివికి ముగ్ధుడై పొయ్యాడు. ఆమెతెలివి, ఆమెజ్ఞానం, ఆమె చురుకుదనం ఇవన్నీ ఆమెచక్కదనంతో కలవడంతోనే విజయుని హృదయాన్ని బానిసగా చేసివేశాయి. అతడెప్పుడూ ఓడిపోలేదుగా! ఆనాటిరాత్రే ఆమెను ఒకవిందులో కలుసుకున్నాడు.

"మూడువారాల్లోపల ఆప్రాతస్నేహితుడు, ఆమెకు సాహాయ్యం చేసినవాడు, ఆమె కెప్టెన్ విజయుని వివాహమాడనున్నదని పత్రికల్లో చదివాడు. నిర్ఘాంతపడి పొయ్యాడు. తనకన్నులను తను నమ్మలేక

పోయ్యాడు. వాలిపోయిన ట్లామెదగ్గరకు పరిగెత్తాడు. ఆమె అతనిస్థితిని చూచి ఖింగారుపడిపోయింది. 'నన్ను క్షమించాలి. నీకు చాలా కష్టంకలిగించాను' అన్నది. కాని తాను అప్పుడే ఒక ప్రేమసముద్రంలో మునిగిపోయ్యానన్నది. విజయ చాలా మంచివాడు, మహా గొప్పవాడు. కాని అతనికి కొన్నిలోపాలు ఉన్నాయి. ఇతరులలో అట్టి లోపాలు లెక్క చేయ నక్కరలేదు. కాని అంతటిగొప్పవానిలో లోపా లుండకూడదు. తన ప్రేమ, తన జాగరూకత అతన్ని ఈలోపాల్నించి రక్షిస్తవి. అట్టివానికి తన ప్రేమ నర్పించడం అత్యావశ్యకం, అతన్ని రక్షించడం ముఖ్యావసరం అంది.

"ఈ మాటలు వినడంతోనే అతడు, ఆమె ప్రాతస్నేహితుడు వెళ్లిపోయ్యాడు ఇంకెప్పటికీ తిరిగి రాకుండా. అతడు మరలతిరిగి రాలేదు. అతడు మరలతిరిగిరాడు. అది విధి లిఖితం. ఇక విజయుడో, ఎన్నడూ ఓడని విజయుడో, ఆమెను పెండ్లియాడెను. తన స్వప్నకాంతను పెండ్లియాడెను. ..."

మేం ఏమి అనగలం? మేం ఓదార్చడానికి ప్రయత్నించాం. అతడు కండ్లనీళ్లు ఆపలేకపోయ్యాడు. విషాదాన్ని అంతరింపజేయడానికి నాకు తెలిసినమందు ఒకటేకనుక అతనిగ్లాసు మళ్లీ ష్యాంపెయిన్‌తో నింపాను. "మీ హెల్త్" అని మళ్లీ ఒక గుక్కతో మింగేశాడు.

"కాని ఆమె తిరుగ ఉపన్యసించలేకపోయింది. ఎట్లు ఉపన్యసించగలదు? తన ప్రాతస్నేహితుడు లేకపోవుటవల్ల ఆమెఅందంమాత్రం మిగిలింది. తనజీవితంఅంతా విజయుని రక్షించుటతో ఆవరించుకునిపోయింది. ఆమెప్రాతస్నేహితుడుఆమె జీవితంలోంచి అంతరించిపోయాడు. అతడు ఆమెను అధికంగా ప్రేమించాడు. ఇంకా ప్రేమిస్తోన్నాడు. కాని తిరిగిరాడు, ఎన్నటికినీ తిరిగిరాడు, ఎన్నటికినీ......"

అతడు తన కుర్చీమీదనుంచి లేచి తన విచారనిమగ్నమైన ముఖముతో మావంక చూచాడు. ధైర్యం అభినయించి చిరునవ్వు నవ్వ ప్రయత్నించాడు.

ఉమాబాల అతన్ని ఓదార్చడానికి ప్రయత్నించింది. కాని లాభంలేకపోయింది.

ఒంగిపోయిన అతని పొడుగాటి శరీరం ద్వారంలోనుంచి బయటకు వెళ్లిపోవడం చూచాం. మాకు చాలావిచారం కలిగింది.

ఈ లోపల హెడ్‌వెయిటర్ మాబల్ల దగ్గఱకు వచ్చాడు. "ఇప్పుడు మమ్ములను విడిచి వెళ్లిన ఆపొడవుగానున్న పెద్దమనిషి ఎవ"రని ఉమాబాల అతన్ని అడిగింది.

"ఆయనా" అన్నాడు హెడ్‌వెయిటర్. "అమ్మా, ఆయన మన దేశంలో అందరికంటే ప్రసిద్ధికెక్కిన యోధుడు కెప్టెన్ విజయ!"

# కొండకోన

## మండపాక పార్వతీశ్వర శాస్త్రి

నా రాణి, నావేల్పు, నా ప్రేమవల్లిరో,
కోపంబు నాపైనిఁ గొనకుమా, చేమోడ్తు;
కండచక్కెరపల్కు-గములొల్కు-నునుఁబల్కు-
లాడువేళలను నిన్నరసి మై మఱచితిని;
ముత్తీవబారులై ముద్దుగారెడుచూపు
గమిగాంచువేళ నిన్గాంచి మైమఱచితిని;
తేటవెన్నెలచాలు పాటిల్లు లేనవ్వు
వెదచల్లువేళ నిన్గదిసి మై మఱచితిని;
నినుఁదలఁచి మురిసితిని, నినుఁజూచి వలచితిని;
నినుఁదలఁచి వలఁచి మదినిలిపి, మైమఱచితిని;
నినుఁదలఁచి, నినువలచి, తనిసిమైమఱచితిని;
మనసు నీపై నిల్పి, మనికి నీకై నిల్పి,
తనువు నీలో నిల్పి, తాళిమై మఱచితిని.

కలకలని ముద్దులొల్కఁగ రేఁగి, రేఁచితివి,
ననుఁజూచి నవ్వితివి, నాగుండె లదరినవి;
కనుసైగఁబిల్చితివి; కదిసి యాననుగొంటి;
ననుఁజూచి నవ్వితివి, నాగుండె లదరినవి;
చేయిచేఁబట్టితివి; చేరవచ్చితి నేను;
ననుఁజూచి నవ్వితివి, నాగుండె లదరినవి;
పలుకరించితివీవు; పలికి దరి నిల్చితిని;
ననుఁజూచి నవ్వితివి; నాగుండె లదరినవి;
కౌఁగిటఁబట్టితివి; కరగి నీరైపోతి;
ననుఁజూచినవ్వితివి, నాగుండెలదరినవి;
ముద్దాడుచుంటివి; మురిసి మై మఱచితిని;
నవ్వినానో లేదొ నా కెఱుక లేదయ్యె;
నాతనువు మఱచితిని, నామనికి మఱచితిని,
నీలోన నిల్చితిని; నిన్ను లోనిల్పితిని.

నునుసిగ్గుదొంతరలు దనుక, మోమరవంచి,
యోరపాటుగఁజూచు చొదిగి నీ వుండఁగా,
ఒయ్యారమొలికించు చొదిగి నీ వుండఁగా,
బిరబిరని దరిఁజేరి, పిలిచి చేఁబట్టుకొన
గమకింపఁ జెమ్మటలు గ్రమ్మచేఁ జేఁ ద్రోసి
యోరపాటుగఁజూచు చొదిగి నీవుండఁగా,
ఒయ్యారమొలికించు చొదిగి నీవుండఁగా,
నినుఁజూచి మురిసితిని, నినుఁజూచి వలచితిని,
నినుఁజూచిచూచి మొదఁ దనిసి మైమఱచితిని;
నిమునమాలోచించి, నినుఁ బలుకరింపఁబోఁ,
బలుకు బైటకురాక, వడవడ వడంకితిని;
నినుఁ జూచిచూచి మదినిలిపి, మై మఱచితిని;

నీమేనఁ జెమ్మటలు, నామేనఁ జెమ్మటలు
నిలువునను నిలిచితిమి కొలువుబొమ్మలఁబోలె.

నీకు నాపై వలపు నిలిచెనో లేదో—
దవ్వుదవ్వుల నేల తారుచున్నావు?
నిన్నుఁదలఁచినతలఁపు నేర దితరముతలఁప,
నినుఁదలఁచినంత మది నిలిచె నీమీఁదనే;
నిన్నుఁజూచినకనులు నేర వితరముఁజూడ,
నినుఁజూచినంత మది నిలిచె నీమీఁదనే;
నీపలుకు వినుచెవులు నేర వితరమువినఁగ
నినువిన్నయంత మది నిలిచె నీమీఁదనే;
నినుఁదలఁచి, నినుఁజూచి, నీపలుకులాలించి,
నిలిచినది నామనము నీపైని నిండుగా;

నాతనువు నీకిచ్చి, నామనము నీకిచ్చి,
నామనికి నీకిచ్చి, నన్నునే మఱచితిని;
నీవు నాలో నిల్చి, నీలోన నను నిల్పి,
నీవు నేనొక్కటై నిలిచియుందాము.

నినుఁజూడ కిన్నాళ్లు నిలిచి యెట్లుంటినో,
ప్రియురాల, దరికేల వేవేగ రావు?
కపటమింతయులేని కనులసోయగముతో,
చిగురుచేతుల నాదు చేఁబట్టి నిలుచున్న
నీబాలరూపంబు నిలిచి యెప్పటికైనఁ
దలఁచినంతనె యెదుట విలసిల్లి వలపించు,
నినుఁజూడ కిన్నాళ్లు నిలిచి యెట్లుంటినో;
అరవిడ్డ కెందమ్మి యందముగఁ జేఁబట్టి,
మురిపించి, మురిసినను ముద్దుముద్దుగఁ బిల్చు
నీ లలితరూపంబు నిలిచి యెప్పటికైన
తలఁచినంతనె యెదుట విలసిల్లి వలపించు,
నినుఁజూడ కిన్నాళ్లు నిలిచి యెట్లుంటినో,
ప్రియురాల దరికేల వేవేగరావు?
నినుఁజూడ కిన్నాళ్లు నిలుపఁగల నీతనువు?

తప్పుచేసితినంచు, దయమాలి ప్రియురాలు,
ననువిడచి, యేడకో చని మరలి రాకుండె,
తేఁటిబిడ్డా నీవు తెలిసికొని రారాదె?

ఆనందవనములో, అమృతంపుఁ గొలనికడ,
పారిజాతపుఁజెట్టుప్రక్కఁ బూఁబాన్పుపై
నతివ కూర్చుండునం చాలించితిని నేఁడు
నీ వచటి కేగి యింతినిజూచి రారాదె?
నీపాట లాలించి నెనరుచెందితి నేను,
నను నింతిఁ గూర్తువని నమ్మకం బుదయించె;
ప్రియురాలికడ కేగి ప్రియముగొల్పఁగరాదె?
నాయింతి కడకేగి, నావగపు వినుపించి,
యింతిఁదోడ్కొనుచు నీయింటికే చనుదెమ్ము;

నీయింటిలోననే నాయింతితోఁగూడి
నిముస మానందాన నిలిచి మైమఱతు;—

నను విడిచి ప్రియురాలు చనియె నేడకోగాని,
యంచబిడ్డపోయి యరసికొనిరారాదె ?
ఆనందవనములో నమృతంపుఁ గొలనొప్పు;
వేయిరేకులతమ్మి వెలయు నాకొలనిలో,
తమ్మిలోపల డాగె దయవీడి ప్రియురాలు;
ప్రియురాలికడ కేగి వినుచుమా నామాట;
దయచూపియటచనుమ, దారిచెప్పెద వినుము

నాల్గారు పది పైని నలువొప్పఁ బంద్రెండు
పదునారు రెంటపై పరగు రేకులతమ్మి
వరుసగల దావరుస వడివడిగ దాటి చను;
అవలఁ గన్పడు నీకు నమృతంపుఁ గొలనొకటి;
కొలనిలో వేయిరేకులతమ్మి యలరారు;
ఆతమ్మిలో డాగె నతివనీ వట కేగి,

వినిపింపు నామాట - ననుఁగూర్పు మింతితో.

ప్రియురాల నన్నిట్లు వేఱుచేసితివేల?
నిను వీడి వేఱుగా నిలిచి తాళఁగఁగలనె?

నిండుపున్నమనాటి పండువెన్నెలలోన
క్రొమ్మావిగున్నకడ గొనబుగుల్కుచు నిల్చి,
చేసైగ నను బిల్చి, చెంత, కౌఁగిటఁజేర్చి,
యానందమునఁ దేలియాడుచుండిన వేళ,
మఱపునకువచ్చునా మఱచిపోదామన్న?
మఱితలంపుకుఁ బాఱె, మఱియుమఱియుగ రాద?
మఱవనెంచితి వేల? మనసు నీ కెటులొప్పె!
వేఱుచేసితి వేల ప్రియురాల నన్నిట్లు
నిను విడిచి దవ్వుగా నిలిచి తాళఁగఁగలనె?
గాలిపిల్లలు మనలఁ గని నవ్వుకొనుచుండ,
నొండొరుల కౌఁగింట నొదిగి, సిగ్గును వీడి,
కరగి వెన్నెలలోనఁ గలసిపోయిన మాట
మఱపునకు వచ్చెనా?

# నక్షత్ర కుటుంబము

డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

నక్షత్రములలో నేమున్నది ? అందును భూగర్భకాళములు, చెట్లుచేమలు, జీవరాసులు ఉండునా ? ఘన, ద్రవ, వాయుపదార్థములు భూమియందువలెనే అందును గలవా ? నక్షత్రము లెట్టిపదార్థములతో చేయబడియున్నవి ? వానికిని, సూర్యునికిని లేక మనకును ఏమైన సంబంధము గలదా ? మున్నగు ప్రశ్నలకు సరియైన సమాధానము లభించినగాని మనకు విశ్వసృష్టియందలి వైచిత్ర్యము సులభముగ బోధపడదు.

కాని ఈవిషయములను గూర్చి చర్చించునపుడు నక్షత్రము లెంత యధికమగు ఉష్ణస్థితియందున్నవో మాత్రము జ్ఞాపక ముంచుకొనవలెను. పరస్పరోపమాన మున చల్లని వనదగు నక్షత్రములుగూడ ౩౦౦౦ సెంటిగ్రేడు డిగ్రీలకు మించిన యుష్ణస్థితియందున్నవి. జ్వర మెంత యధికముగ కాచినను మానవుని శరీరోష్ణము ౪౦ సెంటిగ్రేడు డిగ్రీలకు మించదు. అట్టిచో ౩౦౦౦ సెంటిగ్రేడు డిగ్రీలకు మించిన యుష్ణస్థితియం దెట్టి జీవ రాసు లుండగలవో యూహించుటకైనను సాధ్యము గాదు. జీవరాసు లటుండ నిర్జీవములగు పదార్థములు గూడ మన భూమిపై నున్నట్టి స్థితిలోనే అచ్చటను గాన్పింప వీలులేదు.

ఏపదార్థమునైనను అధికముగ కాచినచో అది రూపభేదమును జెందును. ఈభేదము పదార్థముల యాకారావస్థలయందు మాత్రమే కాక వాని వ్యక్తిత్వము నందుగూడ నేర్పడవచ్చును. ఒక చిన్న మంచుగడ్డను దెచ్చి దాని నొకపాత్రలోవేసి కాచినచో అది ద్రవ రూపమును జెంది నీరుగ మారునని యందరికిని దెలిసిన విషయమే. ఇంకను అధికముగ కాచినచో ఆ నీరు వాయురూపమును జెంది నీటియావిరిగ మారును. ఇంత వరకును ఉష్ణసంపర్కమువలన రూపభేదమును, అవస్థా భేదమును మాత్రమే కలిగినది. కాని ఎట్టి మూలద్రవ్య సంయోగమున ఈపదార్థము నిర్మితమైనదో, దానికి మాత్ర మెట్టిమార్పును కలుగలేదు. కనుక అవస్థాభేదము సంభవించినను పదార్థపు వ్యక్తిత్వము మారనేలేదని చెప్పవచ్చును.[1]

రెండు అణువులు హైడ్రొజన్ (Hydrogen) అను మూలద్రవ్యమును, ఒక అణువు ప్రాణవాయువు (Oxygen) అను మూలద్రవ్యమును సంయోగము చెంది ఒక జలకణముగ నేర్పడును. ఈ జలకణము మంచుగడ్డ రూపమున నున్నను, నీటియావిరిరూపముగ నున్నను, ఈ ద్వివిధమూల ద్రవ్యముల పరిమాణమునందుగాని, వాని

౧. భూమియందున్న సకలవస్తువులును ఇంచుమించుగ ౯౨ విధములగు పదార్థముల భిన్నభిన్న సంయోగముల వలన నేర్పడినవి. వివిధలోహములు, మనము తిను నాహారము, మనదేహమునందలి వివిధభాగములు, చెట్లుచేమలు, రాళ్లురప్పలు, జీవరాసులు అన్నియుగూడ ఈ ౯౨ విధములగు పదార్థములతోనే చేయబడినవి. భౌతికనిర్మాణమున కంతటికిని ఈ ౯౨విధములగు పదార్థములే మూలపదార్థములు గాన వీనిని మూలద్రవ్యము లనవచ్చును. పాదరసము, అల్యూమినియము, బంగారము, వెండి, ప్రాణవాయువు, సీసము, బొగ్గు, రాగి మొదలగునవి కొన్ని మూలద్రవ్యములు. ఇత్తడి, నీరు, బొగ్గుపులుసువాయువు మొదలగునవి సంయుక్తద్రవ్యములు (Compounds). అనగా ఇవి పైజెప్పిన ౯౨ మూలద్రవ్యములలో నేవో కొన్ని పదార్థము లొకపద్ధతిని కలిసినందున ఏర్పడినవని యర్థము! మూలద్రవ్యములు సాధారణముగ వెండి, బంగారము మొదలగువానివలె ఘనరూపముగనో, ప్రాణవాయువు (Oxygen), నైట్రొజన్ (Nitrogen) మొదలగువానివలె వాయురూపముగనో ఉండును. ద్రవ్యరూపముగ పాదరసము (Mercury), బ్రొమైన్ (Bromine)అను రెండు మూలద్రవ్యములు మాత్రమే కలవు.

పరస్పర సంబంధమునందుగాని ఎట్టి భేదమును ఏర్పడదు. కాని నీటియావిరిని ఇంకను అత్యధికముగ కాచినయెడల ఈ అణువుల ప్రత్యేక సంయోగము నశించి ప్రాణవాయువు అణువులును, హైడ్రోజిన్ (Hydrogen) అణువులును వేఱుపడును. ఇప్పటికి ఈపదార్థపు వ్యక్తిత్వము నశించినదని చెప్పవచ్చును. ప్రాణవాయువును, హైడ్రోజిన్ వాయువును మూలద్రవ్యములు (Elements) గాన వీని సెంతగా కాచినను వీనియం దెట్టి మార్పును కలుగదని మన మనుకొనవచ్చును. కాని నక్షత్రములందలి అత్యంతోష్ణ పరిస్థితులందు అణువులుగూడ అవస్థాభేదమును పొందుటవలన మూలద్రవ్యముల వ్యక్తిత్వమునందు గూడ కొంత భేదము కలుగుచున్నది. కాన నక్షత్రములం దేయే పదార్థము లున్నవో పరీక్షింపవలెనన్న భూమియందుండు పరిస్థితులకును, నక్షత్రములందుండు పరిస్థితులకును ఎంత భేదమున్నదో మును ముందు జ్ఞాపకముంచుకొనవలెను.

స్పెక్ట్రాస్కోప్ (Spectroscope) అను చిన్న యంత్రసహాయమున నక్షత్రములం దేయే పదార్థము లున్నవో కనుగొనవచ్చునని వెనుకటి సంచికయందు దెల్పితిని. ప్రతి ద్రవ్యమునకును నియతమైన ఒక ప్రత్యేక స్పెక్ట్రి ముండుటవలన జాలన వ్రేలి గుర్తులను పరీక్షించి ఎట్టివారి నైనను కనుగొనగలిగినట్లు స్పెక్ట్రిమును పరీక్షించి అట్టి స్పెక్ట్రిము నే ద్రవ్యమిచ్చునో కనిపెట్టవచ్చును. కాని నక్షత్రములందు నానావిధములైన ద్రవ్యము లున్నందున, ఏ నక్షత్రము స్పెక్ట్రిమునందైనను నానాద్రవ్యముల స్పెక్ట్రిము లన్నియు కలిసి ఒకదానిపై నొకటి యచ్చొత్తినట్లు మనకు కనిపించును. డెబ్బది ఎనుబది మంది జనుల వ్రేలిగుర్తులన్నిటిని ఒకదానిపై నొకటి ముద్రించి ఇచ్చినయెడల ఒక్కొక్కరి వ్రేలి గుర్తును విడదీసి అది ఫలానావారిదని చెప్పుట ఎంత కష్టమో యోచించుకొనవచ్చును. ఇట్టి కష్టసాధ్యమైన కార్యమును శాస్త్రజ్ఞు లెట్లు నిర్వహింతురో వర్ణింప సాధ్యముగాదు.

కాని ఒక్క ముఖ్యాంశమునుమాత్ర మీ సందర్భమున పరిశీలింపవలయును. నక్షత్రము లెన్నియో రకములుగ నున్నట్లు మనకంటికి గాన్పించుచున్నను స్పెక్ట్రిములనుబట్టి చూడ అన్నియు నొకటేరకపు పదార్థములతో జేయబడియున్నవని తెలియుచున్నది. సూర్యుడు, నవగ్రహములు, నక్షత్రములు అన్నియును ఒకటే రకపు ద్రవ్యముతో చేయబడియున్నవి. అన్నియును ఒక్క తెగకు జేరినవే. సూర్యుని స్పెక్ట్రిమును, కొన్ని నక్షత్రముల స్పెక్ట్రిములను ఒకదాని ప్రక్క నొకదానిని పెట్టి పరీక్షించినయెడల ఈ విషయము విశదమగును. కొన్ని నక్షత్రముల స్పెక్ట్రిములకును, సూర్యుని స్పెక్ట్రిమునకును కొంత భేదము గాన్పించినను ఆ భేదము ఉష్ణపరిస్థితియందలి హెచ్చుతగ్గులచే నేర్పడినదేగాని నిర్మాణద్రవ్యమునందలి భేదమునుబట్టి వచ్చినదిగాదు. అనగా అన్ని నక్షత్రముల స్పెక్ట్రిములును ఒక్కటేవిధముగ నున్నవని యర్థముగాదు. ఒకమనుష్యుడు బాల్యమునుండి రెండుసంవత్సరముల కొకతూరి ఆజన్మాంతము ఫోటోలను దీయించుకొనుచుండినయెడల ఆ ఫోటోలన్నియు నొక్కటేవిధముగ నుండజాలవు. రెండేండ్లనాటి ఫోటోకును, అరవైఏండ్లనాటి ఫోటోకును ఎంతయో భేద ముండి రెంటిని ఒకని ఫోటోలుగ గుర్తుపట్టుటకైనను వీలులేకుండ నుండవచ్చును. కాని ఈ భేదము క్రమముగ సంభవించినదేగాని హఠాత్తుగావచ్చినదిగాదు. కాన ఉన్న ఫోటోలన్నిటిని ఒకక్రమపద్ధతిగ నేర్పరచి పరీక్షించినయెడల వానియందున్న సామ్యము విశదముగ దెలియును. అప్పు డాఫోటోలన్నియు నొక్కనివే యని నిస్సంశయముగ జెప్పవచ్చును. అట్లే వేర్వేరు నక్షత్రముల స్పెక్ట్రిములందు వివిధభేదములు గాన్పించుచున్నను వానినన్నిటిని ఒక క్రమపద్ధతి నేర్పరచినయెడల, ఈ భేదములం దొక క్రమపరిణామము గలదనియు, భేదములకన్న ఇందు గానవచ్చు సామ్యములే యధికమనియు, అందువలన ఈ నక్షత్రము లన్నియు ఒక్కతరగతికి జెందినవనియు, ఒకటేరకపు పదార్థములతో నిర్మితములైనవనియు నిర్ధరింపవచ్చును. నక్షత్రముల యుష్ణస్థితియందు పరస్పర భేదము లధికముగ నున్నందుననే స్పెక్ట్రిములందును ఇట్టిభేదములు గాన్పించుచున్నవి గాని నక్షత్రము లన్నియు నొక్కటే ఉష్ణ

స్థితియం దుండినయెడల వాని స్పెక్ట్రము లన్నియు నొక్కటేవిధముగ నుండును. ఒక చిన్ననక్షత్రమును గైకొని దానిని శీతలముగజేసి, పిమ్మట దానిని కాల్చుచు పోయినయెడల ఎన్నివిధములైన నక్షత్రములు గలవో అన్నివిధములుగ నిదియుగూడ క్రమముగ మార్పుజెందు చుండును.

పైకారణములనుబట్టి నక్షత్రము లన్నియు మన భూమితరగతికి జేరినవేయనియు, భూమియందలి ద్రవ్యములే నక్షత్రములందును (కొన్నికొన్ని స్వల్పభేదములతో) కానవగు ననియు శాస్త్రజ్ఞులు నిర్ధరించి యున్నారు.

జంటనక్షత్రములు:— నిర్మిత పదార్థమునందు నక్షత్రములన్నియు నొక్కటేయైనను ప్రవర్తనమునందు మాత్ర మొక్కటిరుగ లేవు. సూక్ష్మముగ పరిశీలించినచో కొన్నినక్షత్రముల ప్రవర్తనము చాల విచిత్రముగనున్నట్లు తోచును. నక్షత్రములలో కొన్ని జంట నక్షత్రములనియు, ఈ జంటనక్షత్రములు పరస్పర మొకదాని చుట్టు నొకటి తిరుగుచుండుననియు గతవ్యాసమున దెల్పితిని. ఇట్లు ఒకదానిచుట్టు నింకొకటి ఒకమారు ప్రదక్షిణము చేయుటకు కొన్నిజంటనక్షత్రములకు కొన్ని సంవత్సరముల కాలముమాత్రమే పట్టును. మరికొన్నిటికి వేలకొలది సంవత్సరముల కాలముకూడ పట్టగలదు. ఎంత కాలముపట్టు నను సంశము నక్షత్రముల పరస్పర దూరమును బట్టియుండును. పరస్పర మవి చాలదూరమున నున్నయెడల వాని పరస్పరాకర్షణశక్తి తక్కువై పరిభ్రమణమున కెక్కువకాలము పట్టును. ఉదాహరణముగ సూర్యునియంత పరిమాణము మాత్రమే గల జంటనక్షత్రములను గైకొందము. వాని పరస్పరదూరము ౫౮ కోట్ల మైళ్లుండినయెడల అవి యొకమారు ఒకదానిచుట్టు నొకటి ప్రదక్షిణము చేయుటకు ౧౦ సంవత్సరముల కాలము పట్టును. పరస్పరదూరము ౨౫౦ కోట్లమైళ్లుండిన యెడల ౧౦౦ సంవత్సరముల కాలమును, ౧౨౦౦ కోట్లమైళ్లుండినయెడల ౧౦౦౦ సంవత్సరముల కాలమును పట్టును.

పరస్పర మత్యంత సమీపమునసున్న జంటనక్షత్రములు కొన్ని ౫ సంవత్సరముల కొకమారు ఒకదాని చుట్టు నొకటి ప్రదక్షిణము చేయుగలవు. వీని పరస్పర దూరము భూమిసూర్యుల పరస్పరదూరమునకంటె నాలుగురెట్లకన్న నధికముగ నుండజాలదు. కాని ఇట్టి నక్షత్రములు మన కత్యంతదూరమున నున్నందున ఎంతటి సూక్ష్మదూరదర్శినీయంత్రముతో పరీక్షించినను ఇవి రెండును భిన్నముగ గన్పడవు. ఇట్టి సందర్భములందు జంటనక్షత్రములను గనిపెట్టుటకు కొన్ని ప్రత్యేక మార్గములు కలవు. కాని వాని నన్నిటిని ఇట వివరింప సాధ్యముగాదు.

సమీపముననున్న ఒకజంట నక్షత్రమును పరీక్షింతము. ఆకాశమునందున్న ఉజ్జ్వలనక్షత్రములలో అల్గల్ (Algol) ఒకటి. ఇది చూచుట కొక్కటేనక్షత్రముగ గాన్పించుచున్నను దూరదర్శినీయంత్రముతో పరీక్షించిన యెడల రెండు నక్షత్రములుగ గన్పడును. వీనిలో నొకటి పెద్దది, మరొకటిచిన్నది. వీని భ్రమణమార్గము మనదృక్పథమునకు సూటిగా నెదురుగా నున్నందున ఇవి పరస్పర ప్రదక్షిణము చేయునపుడు ఒకదాని కొకటి అడ్డము వచ్చుచుండును. అప్పుడు వెనుకనున్న నక్షత్రము కాంతి మరుగుపడి మనకు గానవచ్చెడి కాంతి తగ్గును. మరల రెండవనక్షత్రము మన దృక్పథమును దాటి ప్రక్కకు జరిగిన వెంటనే పూర్వపు ఉత్కృష్టకాంతి మరల దృగ్గోచరమగును. భూసూర్యులకు నడుమ చంద్రుడు వచ్చినయెడల సూర్యగ్రహణము సంభవించి సూర్యుడు కాంతిహీనుడైనట్లే దీనిని ఎంచవచ్చును. కాని చాల మంది ఈవిషయమును సరిగ నర్థముచేసికొనక ఈనక్షత్రమునకుగూడ చంద్రునికివలెనే వృద్ధిక్షయముల నాపాదించిరి. అరేబియాదేశస్థులు ఈనక్షత్రపు వైచిత్ర్యమున కచ్చెరువుచెంది దీనికి రాక్షసనక్షత్ర (Demon Star) మని పేరిడిరి.

జాగ్రత్తగా పరీక్షించినచో ఈ నక్షత్రము సరిగా ౬౦ గంటలకాల మత్యుజ్జ్వలముగ ప్రకాశించి తటాలున కాంతిని గోల్పోవ నారంభించును. ఈకాంతిహీనతి వేగవేగముగ నధికమై సరిగ ౫ గంటలకు పూర్వ

మున్న కాంతిలో మూడింట రెండుపాళ్లు నశించియుండును. మరల కాంతి యధికమగుటకు నారంభించి ౨౫ గంటలలో పూర్వకాంతి యంతయును చేకూరును. ఇక ౬౦ గంటలవరకును ఇంకెట్టి మార్పును ఉండదు.

ఇట్టి జంటనక్షత్రము లెన్నిగలవో సరిగా తెలియదు. కాని మనకంటికి కనబడువానిలో సుమారు ఐదింట నొకపాలు జంటనక్షత్రములని శాస్త్రజ్ఞులు సిద్ధాంతముచేసియున్నారు. అట్లయినచో సూక్ష్మముగ గాన్పించు నక్షత్రములలో మాత్రము జంటనక్షత్రముల సంఖ్య ఇంతకన్న నేల తక్కువగనుండును? నక్షత్రములలోగూడ ఇన్ని జంటలుండుట యాశ్చర్యమే. విశ్వలీల దురవగాహము.

స్పందనముచేయు నక్షత్రములు (Pulsating Stars):— జంటనక్షత్రములు కాంతిహీనత జెందిన ట్లగపడుటకు కొన్ని ప్రత్యేకకారణములు గలవు. కాని ఇట్టికారణములేవియు లేకనే జంటలుగాని కొన్ని నక్షత్రములందు ఇట్టిమార్పులు కలుగుచుండును. ఈరకపు నక్షత్రములలో మొదట కనిపెట్టబడినది డెల్టా సిఫై (Delta cephei) అను నక్షత్రము. దీనినిబట్టి ఈ రకపు నక్షత్రములన్నిటిని సిఫైడ్ వేరియబిల్సు (Cepheid variables) అని యందురు. డెల్టా సిఫైని పరీక్షింతము. నిండుతేజములోనున్న ఈ నక్షత్రము కాంతిని గోల్పోవ నారంభించి సరిగా నాలుగుదినములకు సగము కాంతిని గోల్పోవును. పిమ్మట కాంతి క్రమముగ నధికమగుచువచ్చి సరిగా ౧౩ దినమునకు కోల్పోయిన కాంతినంతటిని మరల సంపాదించుకొనును. నక్షత్రపు పరిమాణమునందుగల మార్పులే ఈ విచిత్రప్రవర్తనమునకు గల కారణము. ఎందుచేతనో తెలియదుగాని ఈ నక్షత్రములు కృశించి కృశించి సన్నములై పరిమాణమున పూర్వముకన్న చాలతక్కువయగును. పిమ్మట క్రమముగ వృద్ధిజెందుచు మరికొంతకాలమునకు పూర్వపుస్థితిని జెందును. కొన్ని నక్షత్రములు క్షీణతజెందినపుడు వానివ్యాసము యథాస్థితికన్న ఇంచుమించుగ కోటిమైళ్లుగూడ తగ్గుటగలదు. ఇట్టినక్షత్రము లన్నియు తక్కువ సాంద్రతగలవి. కొన్నిటి సాంద్రత నీటిసాంద్రతలో ఇరవైవేలపాళ్లలో నొక్కపాలుగూడ నుండదు. కాని పరిమాణమునందును, భారమునందును, కాంతియందును, ఇవి సూర్యునికన్న ఎన్నియోరెట్లు అధికముగ నుండును.

ఈ నక్షత్రముల సహజకాంతికిని అందలి క్రమభేదములకును ఒక నియత సంబంధము గలదు. ఇట్టి క్రమ పరిణామవికాసములకు ఒక్కొక్క నక్షత్రమున కెంతకాలము పట్టునో పరీక్షించి అందుండి ఆ నక్షత్రపు సహజ కాంతిని కనుగొనవచ్చును. వీని సహజ కాంతికిని దృగ్గోచరమగు కాంతికిని ఉన్న తారతమ్యమును బట్టి గత వ్యాసమున చెప్పిన రీతిని ఇవి మన కెంత దూరమున నున్నవను సంశయమును గూడ ఇందుండి సులభముగా తెలిసికొనవచ్చును ఈ విధముగ నెట్టి చిక్కును లేక కడు దూరముననున్న నక్షత్రములనుగూడ పరీక్షించి అవి మనకు సరిగా ఇంత దూరముననే గలవని దృఢముగా జెప్పవచ్చును. కాంతిసంవత్సరముల లెక్కనగణించినను కొన్ని లక్షల కాంతిసంవత్సరముల దూరమునందున్న నక్షత్రములు ఈ విశ్వమునందు గలవు. అట్టి ఈ విశ్వమును గొల్చుటకు ఈ సిఫైడ్ వేరియబిల్ నక్షత్రము లెట్టి యమూల్యసాధనములో ఊహించుకొనవచ్చును.

కాంతియం దిట్టి మార్పులు మన సూర్యునికిగూడ నున్నట్లు తోచుచున్నది. భూమి యుద్భవించిన పిమ్మట ఏ కారణముచేతనో ఒకమారు భూమియందలి ఉష్ణము చాల భాగము నశించి, సర్వమును ఘనీభవించి ఉత్తర ధ్రువమందువలెనే భూమధ్యరేఖకు చాల సమీపమువరకును భూమి హిమావృతమాయెనని మనకు భూగర్భశాస్త్రమునుండి తెలియుచున్నది. ఇందునకు కారణము బహుశః సూర్యతేజమునందు కలిగిన మార్పులే. ఇట్టి మార్పు లింకొకమారు వచ్చినయెడల ఉత్తరమున నున్న ఐరోపాదేశముల గతి ఏమగును?

క్రొత్త నక్షత్రములు (New stars):— పేరున కివి క్రొత్త నక్షత్రములేగాని యుద్భవించి ఎన్ని కోట్ల సంవత్సరములైనవో. వీని కిట్టి పేరు కలుగుట కొక చిన్న కారణము గలదు. ఆకసమునందు మన కిన్ని నక్ష

త్రములు గాన్పించుచున్నను, ఉన్నవానిలో నివి చాల అల్పభాగమే యనియు, చాల నక్షత్రములు అత్యంతాధికములగు దూరముల నున్నందున అవి సహజముగ సూర్యునికన్న ఎన్నియో వేలరెట్లు కాంతివంతములైనను మనకు కనబడుటకు సాధ్యముగాదనియు ఇదివరకే చూచితిమి. కాని ఒక్కొకమారు మన కంతవరకును కనబడని నక్షత్రము దృగ్గోచరమగును. దృగ్గోచరమైన వెనువెంటనే అట్టి నక్షత్రముల కాంతి యధికమై ఒకొకమారు అన్ని నక్షత్రముల కన్నను, కడకు బృహస్పతి గోళముకన్నను కాంతివంతముగ గన్పడి పిదప క్రమముగ కాంతిని గోల్పోయి యదృశ్యము లగును. రెండేండ్లకు పూర్వము క్రీ. శ. ౧౯౩౪ నందుగూడ "క్రొత్తనక్షత్ర" మొకటి కాన్పించెనని వార్తాపత్రికలనుండి తెలియుచున్నది. అంతకు పూర్వము ౧౯౨౫, ౧౯౨౦, ౧౯౧౮ సంవత్సరములందు గూడ ఇట్టి నక్షత్రములు గన్పడెను. దూరదర్శినీ యంత్రముతో పరీక్షించినయెడల సంవత్సరమునకు సుమారు ౩౦ "క్రొత్త నక్షత్రములు" గన్పడుచుండును.

క్రీ. శ. ౧౯౩౪ నందు గన్పడిన క్రొత్త నక్షత్రమును ప్రథమమున జూచినవాడు జె. పి. ఎమ్. ప్రెంటిస్ (J. P. M. Prentice) అను నొక బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు. మొదట జూచినప్పుడు దీని కాంతి మూడవతరగతి నక్షత్రము కాంతివలె నుండెను. కాని త్వరలోనే కాంతి యంతకంతకు అధికమై ఒకటవతరగతి నక్షత్రమునుగూడ మించిపోయెను. సహజకాంతి కన్న మార్పుచెందిన పిమ్మట ఆనక్షత్రపుకాంతి నాలుగు లక్షలరెట్లు అధికమాయెనని శాస్త్రజ్ఞులు నిర్ధారించియున్నారు. ఈనక్షత్రము సుమారు నాలుగునెలలు కంటికి కనబడుచునేయుండెను. కాని పిమ్మట దాని కాంతి నశించి త్వరలో నదృశ్యమాయెను.

ఇట్టి యపురూపపుచర్యకు కారణమేమి? ఏకారణముననో నక్షత్రపు ఉపరితలము అనిర్వచనీయమైన ఉష్ణస్థితిని బొందియుండవలెను. లేదా నక్షత్రపు పరిమాణమే అత్యధికమై యుండవలెను. స్పెక్ట్రాస్కోప్ సహాయమున పరీక్షింపగా అట్టి అనిర్వచనీయమైన అధికోష్ణపరిస్థితులు ఈ "క్రొత్తనక్షత్రము"లందు గానరావు. కాన వాస్తవకారణము దాని పరిమాణమునందు కలిగిన మార్పే అయి యుండవలె నని తోచుచున్నది. ఉన్నట్లుండి ఒకనక్షత్రపు పరిమాణమేల యధికము గావలెనో తెలియరాదు. బహుశః ఇది నక్షత్రపరిమాణ వికాసములందలి యొక సహజావస్థయేమో. నక్షత్రములుగూడ విశ్వమునందలి సమస్త పదార్థములవలె క్రమపరిణామవికాసములకు లోనైయున్నవి. కాని అట్టి పరిణామవికాసములకు చాల కాలము బట్టునుగాన మానవదృష్టికి ఒక్కతరమునందు గాని, కడకు ఒక్కశతాబ్దమునందుగాని ఎట్టి భేదమును గాన్పింపకపోవచ్చును. కాని మార్పులున్నవని మాత్రము శాస్త్రజ్ఞులు నిర్ణయింపగలిగియున్నారు. ఇట్లు మారుచు బోయినయెడల కొంతకాలమునకు (కొన్ని కోట్ల కోట్ల సంవత్సరములకే యనుకొందము) ప్రతినక్షత్రమును అవస్థాభేదమును చెందవలసినదే. సర్వమును అనిత్యము. నక్షత్రములకుగూడ నేడున్న స్థితియే శాశ్వతముగాదు. మారుచు బోయినయెడల ఏనక్షత్రమైనను ఒక్కొకమారు తనపూర్వస్థితి నతిక్రమింపవలసినదే. ఒకకూజాను కొంచెమొకవైపునకు త్రోసితి మనుకొందము వెంటనే అది ఈప్రక్కకు నాప్రక్కకు కదలుచు కొంతసేపటికి యథాస్థితి నొందును. మరికొంచె మధికముగ త్రోసినను కూజా కొంతసేపటికి యథాస్థితిని బొందగలదు. కాని చాలగట్టిగా త్రోసినయెడల కూజా యథాస్థితిని బొందజాలక తటాలున బోర్లపడి ఇటునటుదొర్లి కొంతసేపటికి మరియొక ప్రత్యేకస్థితి నొందును. ఈ నూతనస్థితి కూజా బోర్లపడినగాని సంభవింపదాయె. అట్లే ఒక్కస్థితియందున్న నక్షత్రము వేరొకస్థితికి మారుటకు పూర్వము కొంత యనర్థము సంభవించియేతీరును. ముఖ్యముగ ఆనక్షత్రమునందలి యధికశక్తిలో కొంత భాగము ఈసందర్భమున విశృంఖల మగును. ఈశక్తి బహిర్గత మగుటలో నక్షత్రము ఉబికినట్లై పరిమాణము హెచ్చును. కాని విశృంఖలమైనశక్తి బహిర్గతమైన వెంటనే నక్షత్రమునందలి ద్రవ్యమంతయు గట్టిగా

అదిమినట్లై సాంద్రత హెచ్చి, అల్పతేజముగల యొక చిన్న నక్షత్రముగ మారిపోవును.

ఈయవస్థాభేదము ప్రతి నక్షత్రమునకును సంభవించుననియే. నక్షత్రముల జీవితకాలము చాలఅధికమైనచో ఇట్టి యవస్థాభేదము లొకొక నక్షత్రమునకు ఒకమారేగాక ఎన్నియోమార్లు గలుగవచ్చును. సూర్యుడుగూడ ఇట్టి యవస్థాభేదమునకు లోనైనవాడే. కాని ఇంతవరకును అట్టిమార్పేదియు సూర్యునికి సంభవించిన ట్లగుపడదు. అట్లయినచో ఈమార్పు ఎప్పుడు రానున్నదో! ఎంతయో కాలము లేదని కొందరు శాస్త్రజ్ఞులు వాదించుచున్నారు. ఒకవేళ అట్టిమార్పు సంభవింపనే సంభవించిన యెడల ఒక్క స్వల్ప కాలములోనే మనభూమండలమంతయు కాలిపోయి, కొన్నిగంటల కాలములోనే ఈభూమి కేవల మొక వాయుసమూహముగ మారిపోవును. లేక సూర్యగోళమే అంతకంతకు పెద్దదై, అత్యధిక పరిమాణముగలదై భూమినిగూడ మ్రింగివేయునేమో! ఎట్లయినను మనకు గాని, మనక్రింది నూరు తరముల వారికిగాని ఇట్టి యుపద్రవము వాటిల్లదు. ఎంత త్వరలోనైనను కొన్నిలక్షల సంవత్సరములకు గాని ఇట్టి మార్పు సంభవింపజాలదు.

నక్షత్రములు, పరస్పరాకర్షణము:— ఇదివరకును నక్షత్రము లెంతెంత భారముగలవో, ఎంతెంత పరిమాణముగలవో, ఎట్టి పదార్థములతో చేయబడినవో కనుగొంటిమి. కాని ఇంతయధిక భారమును, పరిమాణమును గల నక్షత్రములు ఒకదానిపై నొకటి పడి నాశనము జెందవా యను సందేహము కలుగవచ్చును. ఒకొకమారు రాత్రి మన కించుమించుగా నడునెత్తిన గాన్పించు ఆర్ద్రానక్షత్రముగాని, మరి ఇంకే ఇతర నక్షత్రముగాని ఇంతయధిక భారముకలదని తెలిసిన యెడల పొరబాటున నొకవేళ అది మనభూమిపై పడినసెట్లు అనికూడ తోచవచ్చును.

కాని భారమన నిజముగ ఆకర్షణశక్తియేయనియు, భూమికి ఆకర్షణశక్తి కలదు గాననే నిరాధారముగ నేవస్తువైనను భూమిపై నిలువజాలదనియు ముందు వ్యాసమున దెల్పితిని. ఒక చిన్న రాతినిగాని, చెండు ముక్కనుగాని మేడపైనుండి క్రిందికి జారవిడచినవెంటనే యది క్రిందకు వ్రాలును. అధికభారము గలదైనను, అల్పభారము గలదైనను కడకు ఒకచిన్న ఆవగింజయైనను క్రిందకు బడవలసినదే. కాని చిన్నచిన్న కాగితపు ముక్కలుగాని, ఈకలుగాని ఈవిధముగా త్వరగా క్రిందకుబడవు. అవి తేలికగ నుండుటగాదు ఇందులకు కారణము. ఈకలును, కాగితపు ముక్కలును ఆవగింజలకన్న నెక్కువ బరు వుండవచ్చును. కాని ఆవగింజవలె నివి గాలిపొరలను సులభముగ భేదించుకొని పోజాలవు. ఒక చిన్న యట్టమీద నొక యీకను బెట్టి క్రిందికి జారవిడచినచో ఈకయు గూడ అట్టతో బాటు నేలపైబడును. అట్ట వాయువును భేదించుకొనిపోవుచు సుగమమార్గ మేర్పరచినందున ఈక నేలపై బడుటకు పూర్వమువలె ఆలస్యము గాజాలదు.

నేలపై బడుట యనగా క్రిందకు బడుట యని మనము భావింతుము. కాని "పైన" "క్రింద" యను పదములు కేవల మొక్క తారతమ్యభావమును మాత్రమే దెల్పునను అంశము ప్రక్క పటమును జూచినచో బోధపడును. భూమి గుండ్రముగ నొక నారింజపండువలె నున్నదని యందరెరిగిన యంశమే.

ఇట్లే కుజగోళమునందివసించు వారీ విషయమును గూర్చి చర్చించుచుండినయెడల వారును తమ గోళము వైపు అధోభాగమనియు, దాని కెదురువైపు ఊర్ధ్వభాగమనియు తలచెదరు. కుజగోళము భూమిపైన ఉన్నదని మన మనుకొనునట్లే వారును భూమి కుజగోళముపైన ఉన్నదనియు అనుకొనవచ్చును. మనము కుజగోళము భూమిపైన బడవచ్చునని శంకించుచుండ వారు భూమి కుజగోళముపై బడవచ్చునని శంకింపవచ్చును. ఇట్టిశంకలు కేవల మజ్ఞానజనితములు. ముఖ్యవిషయ మొక్క ఆకర్షణశక్తియే. ఆకర్షణశక్తి ఏ వైపున కీడ్చినయెడల అదియే క్రిందిభాగ మనిపించును.

భూమి తనవైపున కన్నిపదార్థములను ఆకర్షించుకొనుచున్నట్లే ప్రతినక్షత్రమును తనవైపునకే సకల

# శ్రీ అరవింద జీవితము

వీరిజీవిత మింతవఱకు నేభాషయందు నింతవివరముగా ప్రకటింపబడలేదు.

ఇందు వీరిజీవితవిశేషములు, వీరియోగము, ఆశ్రమవిషయములే గాక

వీరి జాతకము, ధర్మపత్రికి ౧౯౦౯లో వీరువ్రాసిన అద్భుతలేఖలు

'స్వాతంత్ర్య నిర్వచనము', 'జాతీయత', 'ప్రాచ్యులు - పాశ్చాత్యులు'

అను శీర్షికలక్రింద వీ రా కాలమున రచించిన వ్యాసముల

కనువాదములు, వీరి ఉత్తరపరోపన్యాసము,

౧౯౦౯ లో వీరుప్రకటించిన నాదేశీయుల కొకబహిరంగలేఖా సంగ్రహము

మున్నగువిషయము లెన్నియోగలవు.

శ్రీ అరవిందుల, ఆశ్రమకట్టడముల ఫోటోలు గలవు.

ఫెదరువైటుపేపరు — పెద్దక్షరములు — చక్కనికూర్పు — వెల ౧-౦-౦.

# శ్రీ అరవింద దర్శనము

శ్రీ అరవిందుల అపూర్వ తత్త్వసారమంతయు నిం దున్నది.

లైఫ్‌డివైన్ - (Life Devine) అను తమగ్రంథమున శ్రీఅరవిందులే

సంగ్రహముగా రచించినభాగము ననుసరించి

బ్రహ్మశ్రీ వేలూరు చంద్రశేఖరంగారు వ్రాసినారు

శ్రీ

అరవిందులు స్థాపింపనెంచు దివ్యజీవనము, భాగవతజీవనము, స్వర్గరాజ్యము ఏలో

ఆదివ్యపరిణామ మెట్లురాగలదో ఈగ్రంథమును పఠించినవారికి తెలియగలదు.

తత్త్వజిజ్ఞాసగలవారందఱు చదువవలసినగ్రంథము.

ఫెదరువైటుపేపరు — పెద్దక్షరములు — చక్కనికూర్పు - వెల ౧-౦-౦.

☞ ఈ గ్రంథముల విక్రయధనము శ్రీ అరవిందులకు సమర్పింపబడును.

దొరకువారు:—

ఆంధ్ర గ్రంథమాల, తంబుసెట్టివీధి, మదరాసు.

పదార్థములను కొంచెముగనో, గొప్పగనో ఆకర్షించుచునేయుండును. కాని యిట్టి యాకర్షణమును తప్పించుకొనుటకుకూడ కొన్నిమార్గములు కలవు. వాయువిమానములు చాల బరువే. వాని పురోభాగమున గిరగిరతిరుగు ప్రొపెల్లర్లు (propellers) సరిగ తిరుగకపోయినయెడల ఒకత్రుటికాలములోనే విమానము గుభాలున నేలబడి నాశనము చెందవలసినదే. కాని విమానమునందలి యంత్రము సరిగా నడచుచు ప్రొపెల్లర్ సరిగా తిరుగుచున్నంతకాలము భూమియాకర్షకశక్తి వీని నేమియు చేయజాలదు. ఇంత యేల, గిరగిరతిరుగుచున్నంతకాలము బొంగరముకూడ భూమియాకర్షణము నెదిరించి చక్కగ నిలుచుకొనియేయుండును. కాని భ్రమణపుబిగి తగ్గినవెంటనే భూమియాకర్షణకు లోనై బొంగరము త్వరలో బోర్లబడును. ఈవిధముగనే భూమియు, గ్రహములును, నక్షత్రములును సతతభ్రమణమువలన తమపై ప్రసరించుచున్న ఆకర్షకశక్తులను కొంతమట్టుకైనను తప్పించుకొనగల్గుచున్నవి.

భూమి భ్రమణముచేయుట కెప్పు డారంభముచేసెనో తెలియరాదు. కాని సృష్టిమొదలు నిట్టులే యుండెననుటకు బలవత్తరకారణము లున్నవి. నిమేషమాత్రకాలమయినను భ్రమణముచేయక భూమి నిశ్చలముగ నుండినయెడల ఏమగునో ఊహించుకొననైన జాలము. ఒకవేళ నిజముగ నట్లే జరిగినచో భూమి తన నియతపథమును వదలి, యంత్రముచెడిన విమానమువలె ఆకర్షణ మెక్కువగనున్నవైపునకు దొర్లి పడిపోవునేమో. ఇతరగ్రహములస్థితికూడ నింతే. కడకు "నిశ్చలనక్షత్రము" (fixed star) అని పిలువబడు ధ్రువనక్షత్రముకూడ అత్యధికవేగముతో చలించుచునేయున్నది.

ఇంతేకాక నక్షత్రములన్నియు తమతమ పరిమాణమునుబట్టియు, భారమునుబట్టియు, తామున్న దూరమునుబట్టియు తమ యాకర్షకశక్తులను సర్వదిశలను ప్రసరింపజేయుచు కొన్ని యొకప్రక్కకును, మరికొన్ని వేరొకప్రక్కకును ఈడ్చుచున్నందున ఈ ఆకర్షకశక్తులన్నిటిని సమన్వయముచేసినగాని ఒకనక్షత్రముగాని, గ్రహముగాని ఏవైపున కాకృష్టమగునో చెప్పజాలము.

కాని యిట్టి పరస్పరాకర్షకశక్తుల నన్నిటిని గుణించి లెక్కచేసినచో ప్రతినక్షత్రమును, గ్రహమును ఏల ఒక ప్రత్యేకమార్గముననే భ్రమణముచేయుచుండునో తెలియగలదు.

ఒక గుడారమును వేయునపుడు మధ్యనున్న స్తంభమును భూమిలో భద్రముగ పాతిపెట్టకపోయినను నాలుగుదిక్కులకును భద్రముగ త్రాళ్లతో నీడ్చికట్టినయెడల పదిలముగనే యుండును. అప్పు డా స్తంభముపై నేవైపునుండి గాలివీచినను పడిపోకుండునట్లు నాల్గువైపులను త్రాళ్లుకట్టియున్నందున స్తంభము పదిలముగ నుండగల్గును. ఇప్పు డొకవేళ నలుదిశల గట్టిన త్రాళ్లలో తూర్పువైపుననో, మరి యింకేవైపుననో ఉన్న ఒక త్రాటిని కోసివేసినయెడల, ఇతరత్రాళ్లున్నను కోసివేసిన త్రాటి కెదుటివైపున స్తంభము వ్రాలుట కాస్పదము గలదు.

ఈవిధముగనే సర్వదిశలనున్న నక్షత్రములనుండి వచ్చు ఆకర్షకశక్తులు ఏనక్షత్రముపైనగాని సరిసమానముగ ప్రసరించుచున్నందున ఆనక్షత్రము ఏ వైపునకు ఆకర్షింపబడుటకును వీలులేదు. ఒకవేళ ఏ కారణము చేతనైనను ఒకవైపునుండి వచ్చు ఆకర్షకశక్తి యత్యధికమైనయెడల ఆ ఆకర్షణకు లోనగు నక్షత్రము లన్నియు తమ నియతమార్గములను వదలి ఆవైపునకు ప్రయాణము చేయుననుట నిశ్చయము. ఏదో యొక కారణమున ఆర్ద్రానక్షత్రపు ఆకర్షకశక్తి యత్యధికమై ఆ యాకర్షకశక్తిని ప్రతిఘటించు ఇతరనక్షత్రముల ప్రత్యాకర్షకశక్తియంతయు అల్పమైనదనుకొందము. అప్పుడు ఈ ఆకర్షణమునకు లోనైన గ్రహములును, నక్షత్రములును అన్నియు తమ నియతపథములను వదలి, ఆర్ద్రానక్షత్రమువైపు ప్రయాణముచేసి, కడకు ఆనక్షత్రముపైనపడి ఐక్యమైపోవలసినదే. అట్టి ప్రళయస్థితియే సంభవించినయెడల ఇతరనక్షత్రములు తనలోబడి ఐక్యము చెందినకొలదియు ఆర్ద్రానక్షత్రము అంతకంతకు పెద్దదై, ఆకర్షకశక్తి యందు గూడ అసమానమైనదగుచు, క్రమక్రమముగ నక్షత్రముల నన్నిటిని తన మీదికే యాకర్షించుకొని

ఒకటే బ్రహ్మాండమగును. కడకు విశ్వమునందు అనంత కోటి బ్రహ్మాండములుగాక ఒక్కటే బ్రహ్మాండ ముండును. ఇప్పటికి మనకు తెలిసినంతవరకును ఆర్ద్రానక్షత్రమునకుగాని, ఇంకే నక్షత్రమునకుగాని ఈ విధముగ ఆకర్షకశక్తి యధికమై, విశ్వమునందలి ఆకర్షకప్రత్యాకర్షకశక్తుల శాంతసమన్వయమును బోగొట్టి ప్రళయావస్థను బుట్టించునని తోచదు. కాని విశ్వలీల నెవ రెరుగుదురు? సూర్యుడు, చంద్రుడు, భూమి, సకల నక్షత్రములు అన్నియుగూడ విశ్వసృష్టికి పూర్వ మొకప్పుడు ఒక్క యాండమువలె నుండె నని ప్రాచీనఋషులు వక్కాణించిరి. అవసానకాలమునందు గూడ సర్వమును ఒక్కటిగ ఐక్యమైపోవునేమో?



నాసిక దృశ్యము

# బోర్నియో ద్వీపవాసులు

## డ్యాకులు-వారి ఆచారసంప్రదాయములు

మలయా, సుమత్రా ద్వీపాలకు తూర్పుగాను జావాకు ఉత్తరంగాను "బోర్నియో" అనే పెద్ద ద్వీపం వొకటున్నది. వైశాల్యంలో ఇది గ్రేటుబ్రిటనుకు మూడింతలుంటుంది. ఈద్వీపంలో నివసించే అనేక తెగల్లో "డ్యాకు" లనేవారు అధిక సంఖ్యాకులు. వీరి సంఖ్య ౨౫౦౦,౦౦౦ అని మతింపు "పూనన్" అనే తెగవారికికూడా ఇదే జన్మస్థానం. పూనన్ తెగవారికంటె డ్యాకుతెగవాండ్లు ఎక్కువ తెలివితేటలు, శక్తి సామర్థ్యాలు కలవారు. పూననులకు అరణ్యాలే కాపురస్థలాలు. జలవిహారం అంటె కొంచెం జంకుతారు. పాశ్చాత్యులు నివసించే ప్రదేశాలకు తరుచు రారు. కాని వేటలో వీరికి సమానులు లేరు. ఇంతే కాకుండా వీరు మంచి మెళుకువ కలిగిన పనివాండ్లని కూడా చెప్పవచ్చు. చెట్లవేరళ్లు మొదలైన వాటినుండి సుతిమెత్తని సన్నని దారాలు తీసి నాణ్యమైన గుడ్డలు తయారుచేసుకుంటారు. ఐతే వీరికి డబ్బు విలువమాత్రం తెలియదు. పనిచేసి పెట్టినందుకుగాను ఒకసూరి ఒక పూనన్ తెగవాడిచేతిలో కొన్ని నాణెములు పెట్టితే, సంతోషంతో నాణెము పుచ్చుకున్నాడు. "ఆనాణేలతో నీవేంచేస్తావు" అనిఅతణ్ణి ప్రశ్నిస్తే మొదట ఏంచెప్పటానికీ కొంచెం వెనకాముందాడి చివరకిలాచెప్పాడు "చేపలు పట్టుకుండేవల బరువుగా వుండేందుకు కొసలకు కట్టటానికి ఈవస్తువులు భేషుగ్గా పనికొస్తవి!"

బరువులు చుట్టూ కట్టిన గుండ్రని వలను చేదుకొనుచున్న డ్యాకు

డ్యాకు తెగవాళ్ల జీవితంలో "దోనె" అనే చిన్నపడవయొక్క ప్రయోజనం ఇంతా అంతా అని చెప్ప వీలులేదు. దాదాపు గ్రామాలన్నీనదులకు సమీపంలోనే వుండటంచేతనూ, నదిగట్లుల నానుకునే వరిచేలు వుండటంవల్లనూ నదులే ప్రయాణాని కెక్కువగా ఉపకరించేవి. ఒకచోటనుంచి మరోచోటికి చిన్నపడవలమీద సామానులు మోసుకపోవటానికి, వేట సంరంభాలకుగూడా ఈనదులే రహదారులు. వాటమైన ఒక చెట్టు బోదెను నరికి, దానిలోభాగం వలితిగా తొలుస్తారు. రెండు అంచులూ దళసరిగా వుండేట్టు

చెక్కుతారు. పగుళ్లు, రంధ్రాలేమైనా వుంటే బెరడుతో వానిని మూసివేసి బిగిస్తారు.

సామాన్యంగా "డ్యాకులు" ఈచిన్న పడవలను కూర్చొనే నడుపుతారు; కాని వేగంగా పోవలసి వచ్చినా, వరదల్లో పడవనడుపవలసి వచ్చినా నిలబడి నడుపుతారు. పడవ తొణకకుండాను, తలక్రిందులు గాకుండాను కాపాడటంలో డ్యాకు తెగవాడియొక్క సమయస్ఫూర్తి, అతని చాకచక్యమూ నిజంగా మెచ్చుకోదగినవి. పిన్నలూ పెద్దలూ, స్త్రీలూ జలక్రీడలు చేయటం చూట్టానికి ఎంతో ముచ్చటగా వుంటుంది. ఈ తెగవాళ్లందరూ నేర్పరులైన ఈతగాండ్లు, ఎంతటి ప్రవాహానికైనా ఎదురు నిలువగలరు.

ఐతే మొసళ్లంటే వారికి తగనిభయం. నదిగట్టు మీద మొసలి కనబడిందంటే 'డ్యాకు' నీళ్లలో కాళ్లుపెట్టడు. మొసలి తన్ను చూచింది కాబట్టి తప్పకుండా తనవెంటబడుతుందని అతని అనుమానం. ఆజంతువు కంటబడనంతవరకు మాత్రం నీళ్ళంటే అతనికి చెలగాటం. వాణ్ణిపట్టపగ్గాలుండవు.

గృహనిర్మాణంలో కూడా పూనవుల కంటె డ్యాకులు ఎక్కువ నైపుణ్యంకలవాళ్లు పదిహేసి అడుగుల ఎత్తుగా స్తంభాలు వరుసగాపాతి, ఆ స్తంభాలపైన, అంతయెత్తున ఇండ్లన్నీ కట్టుకుంటారు. ఈ యిండ్లలో



డ్యాకులఇల్లు

అనేకకుటుంబాలు నివసిస్తారు. ఇంత ఎత్తున యిండ్లు కట్టడానికి కారణమేమంటే ఒకటి, పాము బుట్రవల్ల భయం. రెండవది నదులకు దగ్గరగా వూళ్లుండటంచేత నదులు పొంగి యిండ్లపైన బడతవనే భీతి. కాని వీటి రెంటికన్నా ముఖ్యమైన కారణంవున్నది. అనారోగ్యమైన నేలలోనుంచి, మలేరియాసంబంధమైన అడవుల్లోనుంచి ఆరోగ్యానికి భంగకరమైన చెడువాయువులు బయలు దేరుతుంటవి. బోర్నియోలో సంవత్సరంలో తొమ్మిది మాసాలు కుంభవృష్టిగా వర్షిస్తుంది. మూడువేళలా కురుస్తుంది కూడా. అడపాదడపా ఈ నదులు ముప్పయి అడుగుల ఎత్తున పొంగటమూ చుట్టుప్రక్కల భూములన్నిటినీ జలమయం చేసి, సమస్త చరాచర పదార్థాన్ని పొట్టపెట్టుకుంటూ వుండటమూ పరిపాటే. దట్టంగా పెరిగిన అడవుల్లోనుంచి బ్రహ్మరక్కస్సుల్లాంటి మహావృక్షాలను సైతం కుంకటివేళ్లతో పెకలించుకొని ఈనదీ జలాలుకొట్టుక పోతూంటవి.

నూతనగృహనిర్మాణానికి పిమ్మట ఎన్నెన్నో తంతులు జరగవలసి వున్నది. పురోహితుడి అనుమతి లేనిదే అటుపుల్ల ఇటు పెట్టటానికి వీలులేదు.

ఆకాశంలో పక్షుల గమనాన్ని బట్టి దేవతలఆమోదంవున్నదా లేదా అనే విషయం నిర్ణయిస్తాడు. పురోహితుడు ఒకపక్షం దినాలవరకు దూలాలు, పలకలు, చెక్కలు అన్నీ నదిగట్టుమీద పడివుంటవి. పురోహితుడి అనుమతి అయిందనంగానే యిండ్లు కట్టుకోబోయే ముప్పది కుటుంబాలవారూ వాండ్ల వాండ్ల బంధువులు, మిత్రుల సహాయంతో గృహనిర్మాణం ప్రారంభిస్తారు. నిర్మాణం పూర్తి అయ్యేవరకు నగారాలాంటి దానిమీద మూడుకళలా వాయిస్తుంటారు. పక్షులకూత లేవీ వినపించకుండా వుండేందుకు ఈనగారామోత. నిర్మాణం జరిగే లోపుగా బుడ్లకుబుడ్లు, సీసాలకు సీసాలు మద్యం వగైరా పానీయాలు ఎగిరిపోతూ వుంటవి. రెండురోజుల్లో ఇల్లంతా సిద్ధమౌతుంది; క్రిందంతా బొయ్యి చట్టంతో బిగించివేస్తారు. ముప్పయి కాపురాలకు ముప్పయి గదులుగా విభాగం చేస్తారు. ద్వారానికి

ప్రక్కగా, ఒక కొయ్యతలుపు అడ్డంగా వుంటుంది. దాని వెనుకనే ఒచిన్నగది వుంటుంది. ఈగదిలో ఆడవాళ్లు వంగి కూర్చుని బిడ్డలనుకంటారు. వాటిప్రక్కనే



స్తంభాలమీద కట్టినఇల్లు నిచ్చెనమీదఎక్కి లోపలికి పోవలెను

కొన్ని గదులుంటవి, వాటిని పడకగదులుగా వుపయోగిస్తారు. తలుపుకు వెలుపల ప్రక్కన పచ్చి ఆకులతో చిన్నకొమ్మ ఏదైనా వ్రేలాడగట్టినట్టయితే ఆయింట్లో కాపురంచేసే వాళ్లు దేవతలనో, భూతాలనో ఆహ్వానిస్తూ వున్నారన్నమాట. అందుచేత అంతవరకూ యిరుగుపొరుగు వాండ్లు ఆయింట్లో అడుగుపెట్టరాదు.

డ్యాకులు తలపెట్టే ప్రతిపనికీ ఒక దేవుణ్ణో దేవతనో ఉపాసన చేయాలి. ఏ పనికి ఏదేవతను ఉపాసించాలో ఎప్పటికప్పుడు పురోహితుడు నిర్ణయం చేస్తూవుంటాడు. అలా విధించినప్పుడల్లా దేవుడిపేరు పెట్టి పురోహితునికి ఒక గొఱ్ఱెనో, మేకనో, కోడినో ఏదో ఒక జంతువును సమర్పించుకుంటుండాలి. నెలనెలకు వచ్చేపండగలు, పర్వాలు మాత్రమే కాకుండా మధ్యమధ్య కొన్నితంతు లేర్పాటు చేస్తారు. గ్రామస్థులు, పరాయివూరివాండ్లు అంతా పురోహితుడియింటి వద్ద చేరుతారు. వాద్యాలు మోగుతూవుంటవి. యుద్ధపు ఉడుపులు ధరించి, చేతిలో కత్తి డాలు పుచ్చుకొని, తలమీద పొంగైన శిరోవేష్టం వుంచుకొని, అగ్నిగుండానికి ఎదురుగా పురోహితుడు ఆట ప్రారంభిస్తాడు. రెండుగంటలవరకు పురోహితుడలా విసుగు, విరామం లేకుండా ఆడి ఆడి, ఆవేశంతో, శివంతో వొళ్లు తెలియకుండా పడిపోతాడు. ఒక్కొకప్పుడు నాలుగైదు గంటలవరకు ఆడి అలిసిపోయి, భూమిమీద పడిపోతాడు. పరవశత్వంలో వున్నప్పుడే, ఈ గణాచారి దేవతలతో ప్రసంగిస్తాడు. దేవత బదులుచెప్పేటప్పుడు టెలిఫోనుదగ్గర చెవి పెట్టినట్టు ఈ గణాచారి కత్తిని చెవి కానించుకుంటాడు. తనేదో అవ్యక్తమైన భాషలో చెప్పుకుంటాడు. ముందు రాబోయే అశుభాలను అతిశయంచేసి, భీతిపుట్టించేట్టుగా వివరిస్తాడు; ఈ నృత్యం చేసేసమయంలో సామాన్యంగా ఒకజంతువును బలి కోరుతాడు. వధింపబడ్డ ఆజంతువు తలను అతని సలహా కోరినవాండ్ల దేహాలకు తాకించుతాడు. సమయాన్ని బట్టి, సందర్భాన్ని చూచి, కనుకట్టు, ఇంద్రజాలం కూడ చేస్తుంటాడు. హస్తలాఘవంచేత రహస్యంగా దగ్గర వుంచుకొన్న ఒక కాగితంలోనుంది రాళ్లు, జ్ఞాపకంకులు, జంతువుల తలలు, వీటి నన్నింటినీ ప్రత్యక్షం చేస్తాడు. వీటి నన్నిటినీ రోగుల దేహంలోనుండి మంత్రంవల్ల తీసినట్టుగా అందరికి ప్రకటిస్తాడు. ఈ తంతు ఎంత బూటకంగా తోచినప్పటికీ బలవంతంగానైనా చాలామంది దీనిని నిజమని భ్రమిస్తారు. ఒక్కొక్కప్పుడు ఒకగంటసేపు వట్టికాళ్లతో నిప్పులను తొక్కుతూ నృత్యం చేసినప్పటికీ కాళ్లుకాలినట్టుగాని పాదాలు బొబ్బలెత్తినట్టుగాని వుండదు. గణాచారికి దేవతలకు రాజీ కుదరకపోయిందా, తగాదా పరిష్కారం కావటానికి దేవతలతో పాచికలాడుతాడు. ఇక ఏ పాచిక పారకపోతే చివరకు కోడిగుడ్డుతో ఒకతమాషాచేస్తాడు. ఒక కోడిగుడ్డును చేతిలో పెట్టుకొని కొంతసేపునాట్యం చేసినతరువాత, చివరకా గుడ్డును అక్కడ కూర్చున్న వాండ్లలో ఒకరి తలమీద పగులకొట్టుతాడు. ఆగుడ్డులో నుంచి కేవలం నీళ్లుమాత్రమే రావటంచూచి అందరూ నిర్విణ్ణులౌతారు. ముందుగా అలాంటి గుడ్డు నొకదానిని తయారుచేసి పట్టుకెళ్లుతాడు అనేవిషయం అక్కడ చేరినవా రెవ్వరూ అనుకోరు.

ఐదుసంవత్సరాల క్రిందట బోర్నియోలో నరవధ నిషేధింపబడింది. ఎక్కడనో అరణ్యాలమధ్య ఇప్పటి

కి విషప్రయుక్త శరాహతిచేత ప్రాణాలు కోల్పోయే వాడెవడైనావుంటే వుండవచ్చునేమో! కాని ఆ దురాచారం చాలావరకు తగ్గిపోయింది. విల్లంబులచేత ఒక



గ్రామపెత్తనదారుడు ద్యాకు యువకులమీద నెత్తురుచల్లుట

ప్రాణి తల తెగవేసినట్లయితే అతడు వీరుడనీ, వివాహమాడటానికి అర్హుడనీ పరిగణింపబడతాడు. తెగకు నాయకుడు గావటానికికూడా అటువంటివాడికి అవకాశం వుంటుంది. మగవాడు ఒక తలను నరికి, ఆతలను తెచ్చి చూపించిన తరువాత అతడు తలపైన గండభేరుండ పక్షి యీకెలను కిరీటంగా ధరించవచ్చు; ఎక్కువ



తలవేట ఉత్సవానికి ప్రత్యామ్నాయంగా జరిపే తంతు

ఆభరణాలు ధరించవచ్చు; పచ్చ పొడిపించుకోవచ్చు, ఎన్ని తలలు నరికి ఇంటిలో వుంచితే అంత కుటుంబ వృద్ధి అవుతుందని వారి నమ్మకం. అలా వధింపబడ్డ మనిషి ఈ యింట్లో పునర్జన్మ దాలుస్తాడట!

పంటలు పండక కాటకం వగైరా సంభవించినప్పుడు కుటుంబకలహాలు జనించటం సామాన్యం. క్షామం కలిగిన గ్రామస్థులకు పొరుగూరివాండ్లు విత్తనాలకు ధాన్యం అప్పుగా యివ్వాలి. అప్పు పుచ్చుకొన్నవారు వాయిదా ప్రకారం చెల్లింప లేకపోవచ్చు, లేదా అసలే తిరిగి యివ్వలేకపోవచ్చు. ఒక గ్రామానికి మరో గ్రామానికి కూడా మొత్తంమీద యిలాంటి తగాదాలు కలుగుతుంటవి. వ్యక్తులకు సంబంధించిన తగాదాలను పంచాయితీదార్లే పరిష్కారం చేస్తారు. రెండు గ్రామాలకు తగాదా సంభవిస్తే వుభయ గ్రామాల ముతాదారులు మరి యిద్దరు పంచాయితీదార్లు కలిసి పరిష్కారం చేస్తారు. సమాధానం ఏర్పడినందుకుగాను అందరూ కలిసి వేడుక చేసుకుంటారు. ఆడవాండ్ల తగాదాలు మాత్రం అంత సులభంగా పరిష్కారంకావు. బోర్నియోలో మగవాడు తన స్వగ్రామంలో ఒక్క స్త్రీని మాత్రం పెండ్లి చేసుకోవచ్చు. మరో స్త్రీని వివాహం



ద్యాకుల పెండ్లి

చేసుకోవలెనంటే ఇంకో గ్రామంలో స్త్రీనిమాత్రమే వివాహం చేసుకోవాలి. ఎందరు భార్యలనైనా, పోషించే భారం మగవాడిమీదనే వుంటుంది. భార్య తలిదండ్రులు తమ అల్లుణ్ణి జామీనుగా పట్టుకోటానికి

అధికారంవున్నది. అందుచేత తగాదాలు తరుచూ సంభవిస్తూనే వుంటవి. పురోహితుడువచ్చి, ఎదిరేపక్షుల గమనాన్ని చూచి పోరాడటంకంటె సమాధానపడటమే ఉత్తమమని నిర్ణయించుతాడు. అందుచేత అతనికి కూడా చాలా లాభం వుంటుంది. అతనిభాగానికి, కావలసినన్ని కోళ్లు, గొఱ్ఱెలూ. ఉభయగ్రామాల పురోహితులున్నూ, ప్రక్కగ్రామంలోని నాయకుడివద్దకువెళ్లి, అతనిచేతి మీద చిన్నగాయంచేసి, ఒక వెదురుగొట్టంలోకి కొంత రక్తంకార్చి, ఆరక్తం చెరికాస్త పుచ్చుకుంటారు; అంతట ఉభయులు వంటికిరక్తం పూసుకొని, ఒకరి కత్తు లొకరు మార్చుకుంటారు. అనంతరం విందులూ, ఆరగింపులు జరగటం మామూలు.

బోర్నియో ద్వీపవాసులకు కావలసిన ఆయుధసామగ్రి చాలా స్వల్పమే. "మాండో" అనే ఖడ్గము, బల్లెమూ, వూదుగొట్టమూ, విషప్రయుక్తమైన కొన్ని అంబులు ఇవి వారి ఆయుధాలు. డ్యాకులూ, ప్లానసులు ఆయుధాలన్నిటినీ వాళ్లంతట వాళ్లే తయారుచేసికొంటారు. వీటన్నింటిలోకి వూదేగొట్టాలు అంబులు తయారుచేసే విధానమే చాలా తమాషగా వుంటుంది. గట్టిదైనతోగరుచెక్క చెట్టుతో వూదుగొట్టాలను తయారు చేస్తారు. పన్నెండు మొదలు పదునారు అంగుళాల వలయం వుండేదిన్నీ, ఆరేడు అడుగుల పొడవు వుండేది కొయ్య నొకదాన్ని పది అడుగుల ఎత్తున చెట్టుకు వ్రేలాడగట్టుతారు. దాని క్రిందుగ చెట్టుకొమ్మల్లో ఒక వేదిక నమర్చుతారు. డ్యాకువాడా వేదికమీద కూర్చొని అడుగునుంచి ఆ కొయ్యమానులోకి రంధ్రంతొలుస్తాడు. పైనుంచిగాని, మానును అడ్డంగా పెట్టిగాని రంధ్రం చేయటం ఇంతకంటె సులువైన మార్గమే. ఐనప్పటికీ డ్యాకులు అంత యోచనలేనివాండ్లు కారు. కారణం లేకుండా ఏ పనీ వాళ్లు చెయ్యరు. పై భాగంనుంచి గనక రంధ్రం చేయసాగితే, తొలవబడ్డకొయ్యమానులో నుంచి కొయ్యముక్కలను బయటికి తీసి పారవేయటానికి ప్రతి దఫా ఆ మానును ఆస్థానంనుండి కదిలించవలసి వస్తుంది. అలా గాకుండ క్రింది నుంచే రంధ్రంచేసే పక్షంలో కొయ్యముక్కలు,పొడి, వాటంతట అవేరాలి క్రిందపడిపోతుంటవి. కడవరకు రంధ్రం చేయటం పూర్తికాగానే పదహారంగుళాల మందంగల ఆ మానును రెండంగుళాలవరకు వచ్చేట్టు కత్తితో చెక్కేస్తారు. అంతటితో వూదుగొట్టం పూర్తి అయినట్టే.

అంబులకు పట్టించే విషాన్ని తయారుచేసే విధానం అతి గోప్యంగా వుంచుతారు; ఈ ప్రక్రియ మగవాండ్లకు మాత్రమే తెలిసివుంటుంది. పూరినెలుపల రాత్రిళ్లలో ఈమందు కలుపుతారు. ఈవిషంవల్ల జంతువుగాని మనిషిగాని నిమిషమాత్రంలో మడియవలసిందే. ఈ విషం కండరాలనుకాల్చివేస్తుంది గాని రక్తాన్ని అంటదు. విషప్రయోగం జరిగిన నిమిషాల్లోనే గుండె కండరాల శక్తినశించి, పనిచేయకుండా నిలిచిపోవును. అంతటితో ఆ జీవితం ముగిసినట్టే. విషప్రయుక్తమైన అంబు ఒక్కొకటీ జాగ్రతగా ఆకుల్లోచుట్టబడి పొదిలో భద్రంచేయబడి వుంటుంది; విషాన్ని తయారు



గొట్టములు

చేయటంలో బోర్నియో దేశస్థుడు ఎంత నేర్పరిఐనప్పటికీ ఈ విషానికి విరుగుడుమాత్రం కనిపెట్టలేకుండా వున్నాడు. ఎన్నడైనా ప్రమాదవశంచాత ఎవరికైనా ఈ అంబువల్ల గాయం తగిలిందా అంతటితో అతడికి

ఆయువుమూడినట్టే. అందువల్ల ఈ ఆయుధాలను ఇంత జాగ్రత్తగా కాపాడుతుంటారు. నూటయిరవై అడుగుల దూరంలోనుంచి ఈ వూదుగొట్టం సహాయంతో చిన్న పిట్టను సైతం చంపగలడు బోర్నియో దేశస్థుడు. అంత గొప్ప లక్ష్యంవుంటదన్నమాట ఈ తెగవాండ్లకు. అలా గురిపెట్టి చంపేటప్పుడు బరువైన వూదు గొట్టాన్ని ఒక్కచేతితోనే పట్టుకుంటారు.

అనాగరకజాతులందరి మాదిరిగానే బోర్నియో నివాసులలోకూడా దేహసౌందర్యాన్ని పోషించుకోవాలి అనే అభిలాషవున్నది. పచ్చపోయించుకోవటం, చెవులకు పోగులు వగైరా కుట్టించుకోవటం ముఖ్యమైన అలంకార విశేషాలు. ఈ రెండూ సౌందర్యవిశేషాలుగ పరిగణింపబడటంచేత ప్రతిసంవత్సరమూ వందలకొలది ప్రజలు విపరీతంగా బాధపడుతుంటారు. పచ్చపొడవటము, చెవులుకుట్టటంలో వీళ్లెంత చాకచక్యం కనుపరచినప్పటికీ ఆరోగ్యసూత్రాలను వీరెంతమాత్రం పాటించటంలేదు. వాడిగల ఇనుపసూదులతో పచ్చపొడవటంవల్ల కలిగేబాధ సహించరానిది. బాలికలకు శైశవంనుంచే పచ్చపొడవటం ప్రారంభం చేస్తారు. చర్మం పొంగుతూనే వుంటుంది; పుండ్లు పడ్తిగానే వుంటవి. వారంవారం ఈ హింసమాత్రం తప్పదు. గోరుచుట్టుమీద రోకలిపోటన్నట్టు ఈగలు, దోమలు ఝుమ్మని ఈ పుండ్లపైన ముసురుకుంటూ పుండ్లలోకి కూడా ప్రవేశిస్తుంటవి. మగవాండ్లు యోధులుగా ప్రకటింపబడ్డ తరువాతనే పచ్చపొడిపించుకుంటారు.

చెవులుకుట్టటం మాత్రం బాలికలకుగాని, బాలురకుగాని ఒకే యీడులోనే ప్రారంభమవుతుంది. చెవిపైభాగాన్ని చెవితమ్మెను ముందుకుట్టి, ఆ రంధ్రాలలో చిన్నచిన్న వెదురుముక్కలను దూర్చుతారు. కొన్నిరోజులైన పిమ్మట ఆ కొయ్యముక్కలకు బదులు జంతువుల దంతాలను అలంకారార్థం ఏర్పాటుచేస్తారు. చెవితమ్మెలకు బరువులు వేలాడగట్టుతారు. బాలకుల ఆభరణాలు అంతబరువుగా వుండవు. బాలికలకు మాత్రం బరువుగానే వుండాలి. కొన్ని సంవత్సరాలైన తరువాత చెవితమ్మెలు కిందికి సాగి భుజాలనంటుతుంటవి. వూరివెలుపలగాని బాలికలకు పచ్చపొడవరు. పచ్చపొడిపించుకొండేంతవరకు వాండ్లనెవ్వరూ కంట చూడరాదు. ఆడపిల్లలు నొప్పికల్ల ఏడవవచ్చు, కేకలెయ్యవచ్చు. మగపిల్లకాయలు మాత్రం ఎంతబాధైనా సహించుకుని కుళ్లనీరు కుళ్లల్లోనే కుక్కుకుంటూ వూరుకోవలసిందేగాని రోదనంచేయరాదు. ఏడ్పువినిపించిందా ఆజన్మాంతం వాణ్ణి పిరికిపందకింద జమకట్టుతారు. గాయాలకు కట్టుకట్టటంగాని, సూదులు వగైరా శుభ్రంచేయటంగాని వారెన్నడూ ఎరుగనే ఎరగరు. ఐనప్పటికీ, ఈ సౌందర్య శస్త్రచికిత్సలవల్ల బాలబాలికలు ఎక్కువమంది చావకుండా వుండటం ఆశ్చర్యకరమైన విషయమే. "దేవుడిదయవుంటే పుండ్లుమానటం ఎంత ?" అంటారు ఆ దేశస్థులు. కాలునొప్పిఆయినా, కడుపునొప్పి వచ్చినా ఆకులు, పసరులూ, వేళ్లూ ఈ మొదలైన వాటితో చికిత్సచేస్తుంటారు. కాళ్లుచేతులు విరిగితే



వైద్యము: దుర్బలులు, క్షుద్రవాండ్రు ఆరోగ్యాన్నియిచ్చె బురదలో చాలాసేపుంటారు

శాస్త్రీయంగానో, అశాస్త్రీయంగానో సరిచేసి కట్టుకటతారు. కాని పుండు తానంతట అదే మానాలి. అందుకుమందులేదు. రోగి నిరోగుడైతే భగవంతుణ్ణిప్రార్థిస్తారు. ఒకవేళవ్యాధి అతన్నిమింగేసిందా, అదికూడా భగవంతుని అనుగ్రహమే అనుకుంటారు.

డ్యాకులకు, పూనసులకు చావంటే భయం లేకపోలేదు. మరణంవల్ల స్వరూపనాశనం కలుగుతుందనే

థితే ప్రధానంకాదు; తన ఆత్మ ఏమౌతుందనేదే అతనికి ముఖ్యమైన ఆందోళన. మరణానంతరం తన ఆత్మ శవంలో నుంచి ఎగిరిపోయి మరో పదార్థంలోగాని, మరో మానవుడిలోగాని ప్రవేశిస్తుందని అతని నమ్మకం. అందుచేత మానవుడి చావంటే బోర్నియో దేశస్థుడికి సంకట విషయమే. గ్రామాలలో శవాలను మోసుకపోవటమూ, వాటిని భూస్థాపితం చేయటమూ ఈ తంతంతా చాలా ఆడంబరంగానూ, అట్టహాసంతోనూ జరుగుతుంది గంటలు గణగణా మోగిస్తారు. చెవులు బద్దలయ్యేట్టు డప్పులు వాయిస్తూ ఏవేవో భయంకరమైన మాట లుచ్చరిస్తూ శవంతో బయలుదేరుతారు. ఒకవైపున తింటం, తాగటం, తందనాలు త్రొక్కటమూ, మరోవైపున ఏడవటం, ఏ వస్తువూ ముట్టుకుంటేటమూ రెండూ ఏకకాలంలోనే జరుగుతుంటవి

బంధువులు, మిత్రుల సహాయంతో గతించిన వాని కొమారులు శవపేటికనొకదాన్ని తయారు చేస్తారు. ఒక లావుపాటి దుంగ తెచ్చి రెండుగా చీలుస్తారు. ఒకభాగంలో పెద్ద గాడి చేస్తారు. ముందుగా కొలతలు చూసుకోరు కాబట్టి సాధారణంగా శవాన్ని ఆ రంధ్రంలోకి ఇరికించవలసివస్తుంటుంది. ఈ శవాన్ని భూస్థాపితం చేయకుండా పూరికి దూరంగా అడవిలో ఎక్కడనో వుండే ప్రేతగృహానికి మోసుకెళ్లి ఆ యింట్లో పడవేస్తారు. ఆ దేశపు వేడిమికి శరీరం త్వరలోనే జీర్ణించిపోతుంది. శవాన్ని ప్రేతగృహానికి తీసుకపోయే ముందు యింటివద్ద కొన్ని సంస్కారాలు జరుగుతవి. గతించిన వ్యక్తి పూర్వం నివసించిన యింట్లో ఆ శవాన్ని ఒక గుంజకు ఆనించుతారు. పురోహితుడు దేవతలను వుపాసనచేసి మరణించిన వాని ఆత్మ మరొక మంచి దేహంలో ప్రవేశించును గాక అని ప్రార్థిస్తారు. తదుపరి ప్రార్థన జరుగుతుంది. చివరకు సంతర్పణ. అనంతరం గతించినవాని ఆస్తిని పంచిపెట్టుతారు. అతని వస్తువులన్నీ ఆ శవం చుట్టూ పెట్టుతారు. పురోహితుడు శవం చేతిని పట్టుకొని ఒక వస్తువును చూపి, బంధువర్గంలో ఒకనివైపు చేయి చూపిస్తాడు. ఆ చచ్చినవాడే తన కత్తినో, కటారినో తాను దానం చేశాడన్నమాట. ఇలాగా వున్న వస్తువులన్నీ అందరికీ పంచిపెట్టేస్తారు. భూములను కూడా ఇదే విధంగా పంచిపెట్టుతారు. పురోహితుడే న్యాయాధికారి. మరణశాసనాలను అమలు జరపగలవాడు అతడే. అతడి నిర్ణయం అక్రమమని శంకించటానికి వీలులేదు. మనిషి గతించిన ౨౪ గంటలలో అతని విషయం పూర్తిగా మరిచిపోతారు. ఇక ఎవరి పనికి వారు వెళ్లిపోతారు. పురోహితుడు మాత్రం తన గుడిశె కొలుపల కూర్చొని ఏ విధంగా మళ్లీ ఒక జంతువును బలి తెమ్మనవచ్చునా అని యోచిస్తుంటాడు.

[జాగ్రాఫికల్ జర్నలు నుండి]

# నక్షత్రమండలము

(ధాతృ సంవత్సర కార్తిక మాసము)

గొబ్బూరు వేంకటానంద రాఘవరావు

ఉత్తరము




దక్షిణము

ఆకాశమున గ్రహనక్షత్రాదులను పరికించువారు ఈపటమును తలమీదుగా, ఆయాదిక్కులు నప్పునట్లు పట్టుకొని చూడవలెను. ఇందు చూపబడినట్లు నక్షత్రాదులు

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| డిసెంబరు | 8 | తేదీని | రాత్రి | గం. | 8-53 | డిసెంబరు | 29 | తేదీని | రాత్రి | గం. | 7-28 |
| ,, | 15 | ,, | ,, | ,, | 8-25 | 1937 జనవరి | 1 | ,, | ,, | ,, | 7-16 |
| ,, | 22 | ,, | ,, | ,, | 7-16 | ,, | 7 | ,, | ,, | ,, | 6-56 |

కనబడును. (శుక్రుడు త్వరగమనము కలవాడు. డిసెంబరు 30 తేదిని కనబడునట్లు చూపబడినది)

Heaven's utmost deep
Gives up her stars and like a flock of sheep
They pass before our eyes; are numbered and roll on.
Heaven! hast thou secrets?
And the abyss shouts from her depths laid bare, "Man unveils me; I have none."
—Shelly.

(ఊర్ధ్వలోకము మహాగంభీరమగు తనగర్భమున నిడికొనిన నక్షత్రముల నన్నింటిని బైటవైచి ప్రకాశింపచేయుచునే ఉన్నది. పల్లముల దాగి మెఱకలబయల్పడు గొఱ్ఱెలవలె ఆ నక్షత్రములు ఉదయించి మన దృష్టిపథమున బడి కొండ నెక్కినట్లు ఆకాశమధ్యమున కెక్కి మరల దిగి కనబడకపోవుచున్నవి. విజ్ఞానదక్షులు ఆ చుక్కలను గుర్తించి సంఖ్యలువేసి గమనించుచునే ఉన్నారు. స్వర్గమా! నీకడ మరేమైన రహస్యము లున్నవా అని ప్రశ్నింపగా, ఆలోకము అగాధమైన తనగర్భమున నిముడియున్న సమస్తమును స్పష్టముచేయుచు "నాకడ ఇకనేమి రహస్యములున్నది నాయనా! మా మానవులు నాగుట్టు బట్టబయలుచేసినారు." అని గంభీరముగా చఱచి ప్రత్యుత్తరమిచ్చుచున్నది.
—షెల్లీమహాకవి.)

ఈ ధాతృసంవత్సర కార్తిక బహుళదశమి మొదలు మార్గశిర బహుళ ఏకాదశివఱకును అగు మాసములో రాత్రి తొలిజామున మన కగపడు గ్రహనక్షత్రాది ఊర్ధ్వలోక సంచారులను గమనింతము.

## (Milky way)
## పాలవెల్లి - ఆకాశగంగ

"హరు జటాస్థలికిని తోడనైన యేరు" అని మన పురాణములలో ప్రశంస నొందుచున్న మిన్నేరు ఈమాసములో తూర్పుసమీపపు ఆగ్నేయము నుండి వాయవ్యమునకు ధనురాకారముగల వక్రగతితో ఆకాశమున కడ్డుగ వ్యాపించియున్నది. మృగవ్యాధరుద్రుని జటాజూటమునకు చుట్టిన మొగలిరేకువలె ఈ దృశ్యము ధవళమై, మనోహరమై మిక్కిలి ఒప్పారుచున్నది కృత్తికాగ్ని ప్రభావముచేతనో అన్నట్లు ఈ యేరు కృత్తికల కడ సన్ననై యున్నను, ఆవల ఊర్వశీపురూరవసుల కడ మిగుల విరివియై శ్యామసీమ లను రెండు లంకలతో కూడి పిమ్మట వాయవ్యమున ఛాయాపథముకడ రెండు పాయలుగా చీలుచున్నది.

## (First Magnitude Stars and Planets)
## మిక్కిలి తేజోవంతములైన నక్షత్రములు-గ్రహములు

ఇంతవఱకును పడమటి ఆకాశమున నుజ్వలముగా మెఱయుచుండిన గురుడు ఈనెల ౨౧ తేదీని అస్తమించుచున్నాడు. శుక్రుడు మకర కుంభరాసులలో ఈనెల సంచరించుచున్నాడు. ౨౨-౧౨-౩౬ తేదీనాటి శుక్రుని శ్రవణాంతస్థానము పటమున చూపబడినది. శని కుంభము నందే పూర్వాభాద్ర ౨వ పాదమున బుజాగతుడై యున్నాడు. పడమట గురుడును, శ్రవణమును అస్తమించుటచే ఆ దిక్కు ఇపుడు తేజముతగ్గి యగపడినను, తూర్పున మొదటి తరగతి వని చెప్పతగిన నక్షత్రము లనేకము లుదయించుటచేత మొత్తముమీద ఆకాశశోభ తగ్గి కనబడదు. వీటిని వరుసగా పరిశీలింతము.

౧. అస్తమింపనైయున్న శ్రవణము. (Altair in Aquila.)

౨. ఇంద్రద్యుమ్నుడు (Fomalhaut)
3. శంతనుడు (Acherner)
౪. రోహిణి (Aldebaran)
౫. బ్రహ్మహృదయము (Capella in Auriga)
౬. ఆర్ద్ర (Betelgeaux)
౭. వ్యాధపాదము (Rigel రిగెల్)
౮. మృగవ్యాధరుద్ర (Sirius)
౯. పూర్వశ్వానము (Procyon)
౧౦. సాంబమూర్తి (Pollux)

ఇప్పుడు పడమటనుండి తూర్పునకు క్రాంతిరేఖ సామీప్యమున శుక్రుడు, శని, రోహిణి, ఆర్ద్ర, సాంబ, పూర్వ శ్యానములు వరుసగా కానవచ్చుచున్నవి. ఈ దివ్య తోరణమునకు ఎగువ శ్రవణ, బ్రహ్మ హృదయములును, దిగువ మృగవ్యాధ, వృత్రపాద, కంతిను, ఇంద్రద్యుమ్నులును మెఱయుచు, నభోరంగమును మిగుల తేజోవంతముగా చేయుచున్నారు.

## ఉత్తరాకాశమున

చిన్న యెలుగుతోకచుక్క ధ్రువుడు ఉత్తరమున మెఱయుచున్నాడు. తోకలో అగ్ని, మహేంద్ర, కశ్యప నక్షత్రములును, ఉత్తరమునకు వ్రాలి ధాత, విధాత, మిత్రనక్షత్రములును చూడనగును. ధ్రువక్షితి కావల వాయవ్యభాగమున నరకుడును, ఈశాన్యభాగమున పితృశ్వరుడును కొంచెముగా కనబడుచున్నారు. ధ్రువసమీపమునుండి వెడలి ఊర్ధ్వశిరూపకులు పాలవెల్లిలోనికి వ్యాపించియున్నారు.

## పడమట

రాజహంస- బ్రహ్మకు వాహనమైన రాజహంసయును (Cygnus) విష్ణువకు వాహనమైన గరుడమూర్తి శ్రవణమును త్వరలో అస్తమింపనయియున్నారు. మకర కుంభరాసులుకూడ క్రమముగా అస్తమించును. శుక్రుడు ధనువునుండి క్రమముగా శనిగ్రహమును సమీపించుచుండును.

## దక్షిణమున

ఇంద్రద్యుమ్నమహారాజు తనమిత్రులు - నాళీకజంఘుబకము (Grus), ప్రావారకర్ణఘూకము (Phoenix) యుగంధరకమఠములతో పడమటకు వ్రాలి దక్షిణాకాశమున మెఱయుచున్నాడు. యమున వెక్కువంకరలు తిరిగి కంతనుని చేరుచున్నది. ఆ ప్రక్కనే ఉపరిచర వసువు విమానములో విహరించుచున్నాడు. అతని వీర్యమును గ్రహించిన అద్రిక దిగువ వలచేరుచున్నది (Reticulam).

## తూర్పున

పునర్వసు మహామీనమువలె ఉదయించినది. అందు పూర్వశ్యాన, సాంబనక్షత్రములు మిగుల ముఖ్యములు. వాల్మీకి దృష్టికి మహామీనమై తోచిన పునర్వసు శ్రీ సాధునికంఠమునకు తగిలి వ్రేలు ముత్యాల హారమై తోచినది. ఆ ముత్యాలహారమునకు నాయకమణివలె పూర్వశ్యానము చక్కగా మెఱయుచున్నది. ఈ పునర్వసునకును, యామ్యోత్తరరేఖకును మధ్య Orion చుక్కలు దివ్యముగా మెఱయుచున్నవి.

Manicius అను మహాకవి దీనియాకారమును ఇట్లు వర్ణించినాడు.

His arms extended strech over half the skies,
His strides as large, and with a steady pace
He marches on, and measures a vast space,
On each broad shoulder a brightstar displayed
And three obliquely grace his hanging blade,
In his vast head immersed in boundless
spheres,
Three stars, less bright, but yet as great,
he bears,
But farther off removed, their splendours last;
Thus graced and armed, he leads the
starry host.

ఈ యోధుడు తన విశాలభుజములను చాచి నభోరంగమున సగమాక్రమించినాడు; వాని యడుగులును అంత పెద్దవే. అట్లు పెద్ద పెద్ద అడుగులువేయుచు బహుదూరము గడచిపోవుచుండును. ఆ మహాకాయుని ఒకొక్క భుజముపై ఒకొక్క దివ్యనక్షత్రము మెఱసిపోవుచున్నది. వాని నడుముపటకానుండి మూడు చుక్కలు ఖడ్గమువలె వ్రేలుచున్నవి. వాని శిరస్సు మిక్కిలి పెద్దది. అది అగాధగోళముల మధ్య మూడు చిన్న చుక్కలవలె మిణుకుమిణుకుమనుచు తక్కువ కాంతితో కనబడుచున్నవి. కాని వాని పరిమాణము మాత్రము తక్కువకాదు. దూర మెక్కువచేత అవి చిన్నవిగా కనబడుచున్నవి. అంతే: ఇట్లు భూషితుడై ఆయుధపాణియై ఈ యోధుడు నక్షత్రసేనానాయకుడై ముందు నడచుచున్నాడు!

ఈ వర్ణన యెంత మనోహరముగా ఉన్నది!

రాక్షసకులనాయకు డనియు, రాక్షసోత్తము డనియు చెప్పబడిన వృత్రాసురుడు-వేదపురాణ ప్రసిద్ధుడైన వృత్రాసుర డీయోధుడే. వీని ప్రభావమునకు నోడియో యన్నట్లు ఇంద్రుడు (జ్యేష్ఠ నక్షత్రము) ఇపు డెందో దాగియున్నాడు. వృత్రాసురుని జన్మ కారణములు భాగవతములో చక్కగా వర్ణింపబడినవి. (మా. షష్ఠ-౪౫౫ — ౫౦౩)

చిత్రకేతుడను విద్యాధరరాజు కైలాసమునకు వెళ్లి ఈశ్వరుడు దేవతలు సేవింప నిండుకొలువుండి తన యూరు పీఠంబున నున్న భవానిం గౌగిటం జేర్చుకొని యొడ్డోలగంబున నుండుట చూచెను చూచి చిత్రకేతుడు పకపకనవ్వి, ఆదేవి వినుచుండ నిట్లనియె:

"కామకొప్పగా లోకగురుడును గడలేని
ధర్మస్వరూపంబు దానయగుచు
జడలు ధరించియు సరిలేనితపమున
పొడవైన ఈ యోగిపుంగవులును
బ్రహ్మవాదులుగొల్వ భాసిల్లు కొలువులో
మిథునరూపంబున మెలతతోడ
ప్రాకృతుం కనుబోలె బద్ధానురాగుడై
లాలితుండయ్యె నిర్లజ్జత నిట
నకట ప్రకృతిపురుషుడైన దానేకాంత
మందు సతులతోడ నలరుగాని
ఇట్లు ధర్మసభల నింతులతోగూడి
పరిఢవింపలేను భ్రాంతినొంది."

అని. చిత్రకేతు డిట్లాక్షేపింప ఈశ్వరుడేమియు మాటలాడక మిన్నకుండెను. ఈశ్వరి కోపించి ఈశ్వరు నెగ్గులుపలికిన పాపాత్ముడు దండనార్హుడని నిశ్చయించి "ఓరి దురాత్మక! ఈ పాపంబునం బాపస్వరూపంబైన రాక్షసయోనిం బుట్టు మని శపించి "ఇంతనుండి మహాత్ములకు నవజ్ఞనేయకుండు"మని పలికెను.

"ఇట్లు శాపహతుండైన చిత్రకేతుండు త్వష్ట నేయు యజ్ఞంబున దక్షిణాగ్నియందు దానవయోనిం బుట్టి వృత్రాసురుండన విఖ్యాతుండయ్యె"—భాగ. VI ౫౦౩

భాగవతమున దక్షిణాగ్నియందు వృత్రుడు పుట్టెనని వ్రాయుట వేదవిరుద్ధము: వేదమునందు వృత్రుడు ఆహవనీయాగ్నియందు జన్మించెనని చెప్పబడియున్నది.

చిత్తగింపుడు. యజుర్వేదము. II-౪.౧౨

"...య దత్యాశిష్యాత త్త్వష్టాహవనీయ ముప ప్రావర్తయా ఘ్నాన్వహేంద్ర.....వృణో తద్వృత్రస్య వృత్రత్వం తస్మాదింద్రో బిభేదాపి"......

ఇట్లుద్భవించిన వృత్రుడు,

"త్వష్టృకలితంపుహోమమున బుట్టినొంది
యఖిలలోకంబులెల్ల దా నాక్రమించి
వృత్రనామాఖ్య దేవతాకారుడగుచు
దారుణాకారు డఖిలదుర్దముడు మెఱసె."
భాగ VI. ౩౨౦

మధ్యను

వృత్రమండలమున కెగువ సారథిమండలమునం దుత్తర భాగమున బ్రహ్మహృదయము దివ్యకాంతితో మెఱయుచున్నది. అజశావకము లా సమీపముననే మిణుకుమనుచున్నవి. రథశిఖరమున అగ్నినామకమైన నక్షత్ర మొకటి కలదు. ఈ రథమునకును యామ్యోత్తర రేఖకును మధ్య భృగుపరశుమండలము కలదు. అచట పాలవెల్లి అంచున పులోమరాక్షసుడు గ్రుడ్లు మిటకరించుకొనుచు కానవచ్చుచున్నాడు. పాలవెల్లిలో గగన మధ్య రేఖను గడచి అప్సరసలు పడమటకు వ్రాలియున్నారు. ఆ దిగువ పులోమబాధితరయి గార్హపత్యాగ్నినుండి దూరముగా కొనిపోబడుచున్న ఇంద్రమదయు ఇంద్రమద గర్భచ్యుతుడైన భార్గవోత్తముడు చ్యవనుడును కలరు. పడమట న స్తమింపనైయున్న శ్రవణ, ధనిష్ఠ నక్షత్రములకును ఇంద్రమదకును మధ్యగా వేద్యఘార్శ్వ చతురస్రము (The square of Pegasus) ఉన్నది. అందు తూర్పున రెండును ఉత్తరాభాద్ర; పడమటి రెండును పూర్వాభాద్ర. ఈ చతురస్రమునకు దక్షిణమున నొకటి, తూర్పున నొకటి రెండు చేపలున్నవి. ఈ రెండు చేపలే మీనరాశి. వీటికి పరస్పర సంబంధము కలుపుచు నొక సూత్ర మున్నది. రేవతీనక్షత్ర మందే

గలదు. రేవతికిని, ఇప్పటి యామ్యోత్తర రేఖకును మధ్య అశ్వముఖముతో అశ్విని కలదు. అశ్విని కావల ప్రాయిక్ పాక్కొళ్లవలె మిణుకు మిణుకుమను మూడుచుక్కలతో భరణియు, భరణి కావల క్షురాకారముతో పిల్లలకోడి కృత్తికయు కలవు. కృత్తిక దిగువ ఎద్దు కన్నువలె ఎఱ్ఱగా రోహిణి ఉన్నది. వీటి దిగువ యమునకును, కుంభరాశికిని మధ్యగా శింశుమారము కలదు. వృషభ శింశుమారములు వాహనములుగా గల రథము నెక్కి అశ్వినులు వెడలుచుండుట వేదప్రసిద్ధమగుట మనము బహు పర్యాయములు చూచియుంటిమి.

## కుమారస్వామి

పటములో యమునవంకరలలో ఒకచోట - కృత్తికదిగువను కుమారస్వామిని 'కుమార' అని సూచించి యున్నాము. కుమారస్వామి విశాఖుడు. భరణితో నక్షత్రము లంతముకాగా కృత్తికతో వేరొకశాఖకు మరలుచున్నవి. పురివిప్పిన నెమలివంటి యాకారముతో ఇక్కడి చుక్కల దృశ్యము కడుమనోహరము. మార్గశిర శుద్ధషష్ఠి స్కందషష్ఠి. ఆనాటిసాయంకాలము సూర్యాస్తమయము కాగానే కుమారదర్శనము మన కగుచున్నది. ఆ వివరములు మరొకప్పుడు మనము చూడగలము.

## విశేష విషయములు

ఈ మాసములో ౧౮-౧౨-౩౬ స్కందషష్ఠి

,, ౨౧-౧౨-౩౬ సూర్యుని ఉత్తరగమన ప్రారంభము. పరమల్పదినము.

,, ౨౪-౧౨-౩౬ దత్తాత్రేయోత్పత్తి.

,, ౨౬-౧౨-౩౬ హనుమద్వ్రతము.

,, ౨౮-౧౨-౩౬ పరశురామజయంతి.

కాలగతిచే కొన్ని సవరణ లవసరమైనను ఈ యంశము లన్నియు ఖగోళమునందలి నక్షత్రముల ఉదయాస్తమయ విశేషములతో సంబంధముకలిగి యున్నవని మనము తెలిసికొనగలము.



నాసికదృశ్యము

# ప్రాచీనాంధ్ర కవులు తాళ్లపాకవారు

## నిడుదవోలు వేంకటరావు

### తాళ్లపాక చిన్నన్న

ఈతని పుట్టుక పేరు తిరువేంగళనాథుఁడైనను వాడుక పేరగు చిన్నన్న తెలుఁగువారికి వాఙ్మయమున వాడుక యైనది. ఈతఁడు పెదతిరుమలాచార్యుని తనయుఁడు.

అష్టమహిషీకల్యాణము, పరమయోగివిలాసమను రెండు ద్విపదకృతు లీతనివి గానవచ్చుచున్నవి. అష్ట మహిషీకల్యాణ మముద్రితము. పరమయోగి విలాసము శ్రీ. శే. గౌరాలో ముద్రితము.

ద్విపదకవితావాఙ్మయ మనకు ద్వితీయఘట్ట మీతనితోఁ బ్రారంభము. ద్విపదలయందుఁ బాల్కురికి సోమనాథునివలె ప్రాసయతి నీతఁడు పాటింపలేదు. ద్విపదరచనము దీర్ఘముగాక భావములను సాధ్యమగునంత దనుక ద్విపదము నొకదానిలోన నిముడ్చుటయు, నను ప్రాసముల ద్విపదాంతమునఁగాక పాదము మొదలనే కూర్చుటయు నీతని కవితలోఁ గనఁబట్టుచున్నవి.

దినమునకు వేయి ద్విపదలను, అందు వర్ణనలతో-అగుయుఁ గవిశిరఃకంపనయోగ్య రసప్రభావముగాఁ-జెప్పఁగలవాఁడట చిన్నన్న. ద్విపదరచనమున నీతఁడు పేరుగాంచుటచే సమకాలికుఁడగు తెనాలి రామలింగ కవి 'చిన్నన్న ద్విపద కెరఁగును' అని పేర్కొనినాఁడు.

కస్తూరివీణె గోఁకినకరణి, కప్పురపుఁ గ్రోవిఁ దెఱచినసరణి, విరివాదిపాట్లంబు విడిచినమాడ్కిఁ బరిమళించు కవితచేఁ గీర్తిసువాసనలు వెదఁజల్లినాఁ డీకవి. తాళ్లపాకవారిలో నీతఁడు సుప్రఖ్యాతిఁ గడించుటచేఁ దరువాతివారు కీర్తనరచనములు, సంకీర్తనము లన్నియు రస వత్తరములనియు, అంతకుమించిన రచనములు లేవనియుఁ దలఁచుచుండిరి. కావుననే యధునాతనులు కొందఱు

'అల తాళ్లపాక చిన్నన్న రోమమ్ములైన
తంబురాదఁ డౌరఁ దంత్రులౌనె ?

'తాళ్లపాక చిన్నన్న దండెమీటులు గావు' అని కొంచెము హేళనతోఁగూడిన వక్రోక్తిగాఁ జెప్పినారు.

అష్టమహిషీకల్యాణమునఁ దొలిమూఁడాశ్వాసములఁ గృష్ణుని బాల్యక్రీడలును, నాల్గవయాశ్వాసమున రుక్మిణీ కల్యాణమును, దక్కిన యైదాశ్వాసముల శ్రీకృష్ణుఁడు తక్కిన యేడ్గురు భార్యలను పెండ్లిచేసికొను కథలును వర్ణింపఁబడినవి.

పరమయోగివిలాస మెనిమిది యాశ్వాసముల కావ్యము. అష్టమహిషీకల్యాణము శ్రీ వేంకటేశ్వరునికిని, పరమయోగివిలాస మలమేల్మంగకును గృతి యొసఁగినాఁడు. పరమయోగివిలాసమునఁ బన్నిద్దఱాళ్వారుల చరిత్రము దెలుపఁబడినది. ఇందుఁ దృతీయాశ్వాసమున మధురకవియతినాథచరిత్రమునఁ గవితాప్రశంస యిట్లు చిన్నన్న కావించియున్నాఁడు.

"పలికినపలుకెల్ల పన్నీరుచెంబు
గులికినచందానఁ, గ్రొన్నెలసోఁగ
నొలసినరీతి, కర్పూరంబు లప్ప
లోలుకుకైవడి, మించు లుడుగక మెఱయు
ననువునఁ, జల్లగా నమృతంపుసోన
చినుకుసోయగముఁ, జీకరత్నములు
మెలఁగెడుజాడ, బ్రాఁమినుకువజ్రములు
తులగింప జలజలఁ దూర్పెత్తినట్టి
మెలుపున, వలపుదిమ్మెరలు వేడించు
నలువునఁ గ్రొత్తకట్టాణిముత్తెములు
డాలించుసరణి బటారంబు లొకట
గీలించుకరణి జక్కఁటి లుప్పతిలగ
మగనిపైఁ గూర్మి రమాదేవి చూపు
నిగుడించుభాతి దేనియ లుట్టిపడగ
గవిత మాధవుమీఁదఁగావింప మధుర
కవిపేరు జనుకుఁ డాఘనునకు నొసఁగె."

వైష్ణవులకేకాక వాఙ్మయప్రియులకు, భక్తులకే కాక పండితులకు, ప్రౌఢులకేకాక బాలురకు పరమోపా-దేయమగు పరమయోగివిలాసము పఠింపఁదగిన కావ్యము.

### తాళ్లపాక చినతిమ్మన

పెదతిరుమలాచార్యుని తనయులలో గ్రంథరచనమున నెన్నికగన్నవారిలోఁ జినతిమ్మన యొకఁడు. ఈతఁ డష్టభాషాదండకము రచియించినవాఁడు. షడ్విధప్రాకృతములు, సంస్కృతము, దేశియు నిందుఁగలవు. ఆద్యంతములు సంస్కృతముననే కలవు. తొలిశ్లోకముల నాంద్రకవితకు నియతమగు ప్రాస పాటింపఁబడినది. "శ్రీకాంతా కాంతవక్షోమణి ఘృణిరవిసంఫుల్లరాజీవనాభీరాకాలోకానుకారిస్మితవికచరమానేత్రనీలోత్పలస్యన్ సాకం నాకేశసంఘై ర్నుతవిధిహర మఖ్యార్చితాంఘ్రిస్సమంతా వాకంఠోత్కంఠ దాసక్రియకరణపటుః పాతునో వేంకటేశః. శ్రీ వేంకటాద్రీశ జీమూత నీలాంజన గ్రావబృందప్రభా భాసమానాంగ శృంగార, శృంగారరూపోల్లసత్కోటి కందర్ప లావణ్యవారాన్నిధే! ... ... మన్నిధే!"

తుది-

> వాణీవీణానినాదప్రతిమచతురవా
>
> క్తాళ్లపాకాన్వయార్యః,
>
> తత్పుత్ర స్తిమ్మయార్యో జితఫణిఫణితి
>
> స్తత్సుతే నాష్టభాషాః,
>
> కృష్ణోఽయం తిమ్మయే ణారచితరుదగతి
>
> ర్వేంకటాద్రీశభర్తు
>
> స్తస్యార్యస్యోత్కృష్టికేతు ర్జగతి విజయతాం
>
> దండకం పండితేడ్యం.

దండకపుఁబ్రాతప్రతిచివర "హేవలంబిసంవత్సర మార్గశిర ౫ బుధవాసరమున, తాళ్లపాక చినతిరుమలాచార్యులు ఆనతిచ్చిన అష్టభాషాదండకం తామ్రశాసనస్థంగాను వ్రాయిస్తిమి" అని కలదు. దీనిఁబట్టి దండకము చినతిమ్మన రచితమని తెలియుచున్నది. కాలసూచినిబట్టి పైకాలము క్రీ. శ. ౧౫౩౭ అగుచున్నది. దండకరచనాకాల మిదికావచ్చును.

### తాళ్లపాక తిరువేంగళసూరి

చిన్నతిమ్మన్న పుత్రుఁడగు నీతఁడు సంస్కృతాంధ్రములరెంటను మంచి పండితుఁడు. సంస్కృతాలంకారశాస్త్రమున నత్యంతప్రఖ్యాతివడసిన కావ్యప్రకాశికకు వ్యాఖ్యాత. ఇంతకంటె మిన్నగ అమరమునకుఁ డీకవ్రాసి యాంధ్రులకు పరమోపకార మొనర్చినవాఁడు. ఆంధ్రమున నీతఁడు వ్రాసినటీకను వైకుంటికచరిత్రకారు లెరుఁగుదురు. తెలుఁగువారికి తెలియదు. ఈతని తెలుఁగుటీకతో ముద్రింపఁబడిన 'గురుబాలప్రబోధిక' ప్రాఁతప్రతులలో నీవిషయమునుఁ దెలుపుచుండెడి యవతారిక శ్లోకముల నీతరువాత నా గ్రంథము నచ్చువేసిన వారెల్లవారు తొలఁగించినారు. వ్రాఁతప్రతుల యందీశ్లోకములు గలవు. ఈతని తెలుఁగుటీక యెంత యుపయోగమో యా గ్రంథము జదివినవారెల్ల తెలిసికొందురు. ఈతఁడు కూచిరాజు ఎఱ్ఱయ కొక్కోకమునకు నాయకుఁడగు గుంటముక్కల భైరవమంత్రి గురువు. క్రీ. శ. ౧౫౬౦ సంవత్సరప్రాంత మీతనికాలము.

### తాళ్లపాక తిరువేంగళప్ప

ఈతఁడు పెద తిరుమలాచార్యుని మనుమఁడు. వేంకటేశదీక్షితపుత్త్రుఁడు. ఈతఁ డమరుకమును నాంధ్రమునఁ బరివర్తన మొనరించినాఁడు. అది యముద్రితమే. అమరుకాంధ్రీకర్తలలోఁ దొలివాఁడు. ప్రతిపద్యమునకుఁ దొలుత వచనవివరణము గలదు.

మొదలు

"శ్రీరుచిరాంగనాభ్రమ విచిత్రిత భూషణ సూనచందనో, దార విలాసదీపితముపై యసితోత్పలకాంతి మించి శృంగారరసంబుఁ దోఁచెననఁ గన్నులపండువునైన మేనితో, యాశ్రితులఁ జూపు వేంకటనగాధిపుఁ డీవుత మాకుఁ గోరికల్."

తుది

"యావరపార్శ్వమున్ గిసలయారుణ కోమలమున్ విభూత్కరత్నాళినూపురంబును మదాలసభావమునా పదంబుచే, సేవరపూరుషుండు ప్రణయేర్ష్యఁ బరాంగన చేత దాడితుండై విలసిల్లువాఁడు కుసుమాయుధదేవునకున్ బ్రియుండగున్."

# "అలుక"

పూడిపెద్ది వెంకట రమణయ్య

"ఔనురా విశ్వం! ఎంతసేపని నీకోసం కని పెట్టుకొని ఉండడం? కార్తీకసోమవారం; పగలల్లా మాడి ఇన్ని మెతుకులు కోటకొట్టుకుని పెందలాడే పడుక్కుందా మనుకున్నాను. ఇప్పటికీ లేదాయనా, అప్పటికీ లేదాయను నీరాక! బాగుం!" కొడుకును అసంతుష్టితో చూచింది మల్లమ్మ ఎగాదిగా.

విశ్వ:—ఎందు కారాసరోసలమ్మా నీకిష్టముంటే ఇంత అన్నంపెట్టు లేకపోతే పోనీ.

మల్ల:—అలాగేగాని, అవతల ఏమిటిరా నీకుపని? ఉద్యోగాలా, ఊళ్ళా? చదువు సంతకెళ్లిందిగదా? తిని తిరగడాని కింతతీరుబాటు లేకపోవడమా?

విశ్వ:—నాయిష్టం.

మల్ల:—(కోపంగా, భయంగా వానిముఖం చూచి) అలాగా? అందుకే అన్నీ ఆలాదిబ్బ జేరుతున్నాయి. నిరుడు నీకు పిల్లనిస్తానన్న నీలాద్రిరాజుగారేడుమరో సంబంధం చూచుకున్నారు? ఎవరిస్తారు, ఎందుకిస్తారు? విద్యచూచా? బుద్ధిచూచా?

విశ్వ:—అక్కరలేని చదువులేం చదువుకుమీ! (ఎఱ్ఱగా చూచేడు తల్లివైపు)

మల్ల:—అయ్యో నాతండ్రీ! ఏమిటిరా అలా చూస్తావు? భయపిస్తావేమిటి? గ్రుడ్డువచ్చి పిల్లనాభ్రమించిందట.

విశ్వ:—మాట్లాడకు.

మల్ల:—నాయింట్లో నీయాజ్ఞ ఏమిటి? నీకిష్టముంటే రా! ఇంతముద్దపడేస్తాను, తినిపో!

విశ్వ:—నాకక్కరలేదు నీముద్దా ముక్కలూను.

మల్ల:—(జంకింది) ఏమో! ఎప్పటికేనా బుద్ధి వస్తుందో [illegible]కాలో అని అన్నాను, నాకేలా? చిన్నపిల్లడవుకావుగదా! రా. లోపలకువచ్చి అన్నం తిను.

విశ్వ:—నేను తినను. నాకక్కరలేదు.

మల్ల:—పీటావిస్తరీ వేసేను. వేసిన విస్తరి తియ్యకూడదు. రా, కాళ్ళుకడుక్కో.

విశ్వ:—నాకువద్దంటే తెలీదేమిటి? నాకక్కరలేదు. (కచ్చితంగా చెప్పేడు.)

మల్ల:—ఇంకెప్పుడూ నీకూడు పెట్టనులే! (విషాదంగా నవ్వింది)

విశ్వ:—నేనురాను.

మల్ల:—నాతండ్రివికావూ! చాలారాత్రి అయిపోతూంది. ముసలిముండామాటురనా. చలికాలం. యనా? నన్ను దుఃఖపెట్టకు. ఇదిగోపాత్రిపంచ-" అంటూ పాత్రిపంచ చేత్తోపట్టుకొని కొడుకుదగ్గరా వెళ్ళింది.

వి:—(కోపంగా) నేనక్కడుంటేగద ఇంత అల్లరి చేస్తావు? నేపోతాను.

అని గబగబా వీధిలోకి వెళిపోయాడు "ఆఁ! ఏమీ! నన్నెందుకనాలి? నే నొప్పుకోను."

గుమ్మంలోకి వెళ్ళింది మల్లమ్మ. విశ్వం వడివడి నడిచి వెళిపోతున్నాడు. "ఒరే విశ్వం! బాబూ! ఇదిగో నామాట వినవూ?" అని జాలిగా పిలిచింది - మాటమణుగుతూన్న మాపటివేళ నిశ్శబ్దం నిండుతూంది. విశ్వం జవాబు చెప్పకుండా వెళిపోతున్నాడు.

విశ్వం, గూడగట్టూ, లలాటంకప్పివ క్రాపింగు ముంగురులూ పొట్టిచేతులలాల్చీ - రస్తాప్రక్కను వెలిగే దీపాలూ అలాగే ఉన్నాయి. తొందరతొందరగా నగుస్తున్నాడు విశ్వం నిర్లక్ష్యసూచకంగా ఈల పాడుతూ ఊహించుకుంటూ. టక్కుమని ముందుకు

త్రుళ్ళి ఆగుతున్నాడు.-‘అమ్మ!’ అన్నాడు. కుడి పాదం రెండవ వ్రేలు రాతిని తాకింది. శీతకాలం దెబ్బ. విలవిలలాడేడు విశ్వం. దీపస్తంభం చేరుకునబోయి వ్రేలు తడిమిచూచుకున్నాడు. తడిమాత్రం తెలిసింది. నెత్తురు వస్తూంది కాబోలు:- జేబులో చేయిపెట్టి చేతిరుమాలు తీసి దానినిచించి చిన్న పీలికతీసి వ్రేలికికట్టుకున్నాడు. ‘ఇదొక లక్ష్యమా’ అన్నట్టు తిరుగా నడక ప్రారంభించేడు. పదుమలుపుదగ్గర నిలచేడు. “బాబూరావు బసకు పోతాను. పడుక్కొంటికి పరుపేస్తాడు. చాలు. అంతే. నాతో ఒకటేపంతం. కానీచూదాం” అనుకొని పందుమళ్ళేడు. బాబూరావుగది మేడమీదవుంది. దీపంవెలుగులేదే! నిదానించి తేరిపార్తి అగదివైపు చూచేడు. “పిల్లి లాగు వీడు చలికి ముడుచుకొనిపోతాడు. అన్నితలుపులూ మూసుకుని ఆగదిలో చదువుతూ ఉంటాడు” వీధితలుపు తట్టేడు - జవాబులేదు. బాబూరావ్ బాబూరావ్ అని రంయిమని కేకపెట్టి పిలిచేడు. ఎవరో గొణుగుతుంటూ వీధితలుపు తెరచేరు. చీకటి. ఒకే బాబూరావ్ అంటూ లోపల ప్రవేశించబోయాడు విశ్వం. “ఎవరు నాయనా నువ్వు? తలుపులు బ్రద్దలుకొట్టేస్తున్నా వర్ధరాత్రివేళ. బాబూరావులేడు గాబూరావులేడు.”

విశ్వం:—(ఆడుగొంతకవిని తెల్లబోయి నిలబడి) మేడమీదగదిలో ఉన్నాడన్నా; అతిపెమ్మా బాబూరావంటేను.

(లోపలనుంచి) ఇంట్లో లేండే!

విశ్వం:—ఎక్కడికి వెళ్ళారు?

(లోపలనుంచి) “బాగుంది! నాకేం తెలుసు. నాతో చెప్పివెళ్ళాడా ఏమిటి” అంటూ తలుపుగడియ టక్కునవేసింది.

వీధిఅంచున నిలబడి చీకటిలోకి అటూయిటూ చూచేడు. ఏం చేయడం? రాత్రి ముదిరింది. అందరూ పడుకునేవేళ కూడా అయిందేమో. ఎక్కడకు వెళ్ళడం? నిశ్చయించుకోకుండా మెట్లుదిగేడు. చలిగాలి రంయిమని వీచింది. చేతిరుమాలుతీసేడు జేబులోనుండి - తలకు చెవులుకప్పి కట్టుకుంటే కొంత చలితగ్గుతుందని. అది పొడుగం క్రిందికి దిగిందికాదు. దానిలో పీలికతీసి వేసేడుకాదూ! గాయం స్మరణకువచ్చింది. వ్రేలు పోటు పెడుతూంది. నడక మందగించింది. దూరంగా ఏదో దుకాణం కనిపించింది చిన్నదీపపు వెలుగులో. ఏదైనా తిందామనిపించింది విశ్వానికి. అటునడుస్తూ జేబు తడుముకున్నాడు. ఉంది వెండిపావులా. చాలు. దుకాణదారుడు సామానులు సద్దుకుంటున్నాడు గదిలో. ఓయ్ - ఓయ్ అంటూ విశ్వం వానిని సమీపించేడు. వాడు విశ్వాన్ని అనుమానంగా, ప్రశ్నార్థకంగా చూచేడు - రెండు కమలాపళ్ళియ్యి అని దర్జాగా జేబులోనుంచి పావులాతీసి బల్లమీదపడవేసేడు. దుకాణదారు పావులాను - చాలీచాలని దీపపువెలుగులో పరీక్షించి పరీక్షించి- “వద్దు బాబూ! నాకీపావులా చెల్లదు” త్రుళ్ళిపడ్డాడు విశ్వం. ‘ఏదీ?’ అని ఆపావులా అందుకొని తాను పరీక్షించడం మొదలెట్టేడు. దబదబా కొట్టు సర్దుకుని దుకాణదారు దీపమార్పేశాడు. విశ్వం నిర్విణ్ణుడయి నిలచిపోయాడు. ఈనిరర్థకత వానిలో ఆకలిని కదిపింది - ఆకలివేస్తూంది. ఏమిటి తినడం? ఎక్కడా ఏమీ దొరికే ఉపాయంలేదు. “ఆకలి! ఆకలి! ఇంతా అయితే ఆకలి నన్నేంచేస్తుంది! ఏమీ చెయ్యలేదు. దానికి లొంగుతే అది మనలనే మ్రింగుతుంది. అల్పవిషయాల నటుండమనాలి.” అనుకున్నాడు. రెండడుగులు వేసేడు. “కానీ” కడుపునిండా నీళ్ళు త్రాగేస్తే ఆకలిచస్తుంది. అంటూ ఆచేరువనున్న కొళాయికట్టడాన్ని సమీపించేడు. కొళాయి మూసినోళ్ళాడు ‘గుంయ్’ మని హోరుపెట్టిందాకొట్టాం.“ అయ్యో! మరచిపోయాను. రాత్రులు కొళాయి ఉండవు. ఇంతకీశీతాకాలం దాహమంటే నాకే నవ్వువస్తూంది. ఆకలిమరచిపోవడానికి నీరు త్రాగాలనుకున్నాను గాని నిజంగా నీరుజరూరు లేనేలేదు. చిన్నపోవడం ఎందుకూ?” అనుకుని అలా తిరుగా రోడ్డుమీదనుండి నడిచిపోతున్నాడు. “కాలు పోటుపెడుతూంది. ఈ అరుగుమీద కూర్చుంటే కొంచెం ఉపశమిస్తుందేమో!” అనుకొని అక్కడ యింటి పెద్ద అరుగుమీదికెక్కేడు. “బాగుంది అరుగు తెల్లగా, నున్నగా

కాని పొద్దుముండాకాలం - చుర్రుమంటూంది కాలం టుతే. కొంతసే పలాగుంటుంది. మనశరీరం వేడితగు త్తే చలువా గిలువా ఎగిరిపోతుంది." చలికిలపడ్డాడా అరుగుమీద. "బాబూరా వేమయినాడో! పొద్దుముండా పంపులా చెల్లిందికాదుగదా! బాబూరావెందుకూ?" అరుగంతా కలయజూచి "ఇక్కడ పాగోరితే నిద్రపట్టి పోతుంది. నిద్ర సుఖమెరగదు. కళ్ళుమొయ్యా నిద్రవస్తే ఆకలిమాత్రం ఎవడుగుర్తిస్తాడు?" మెల్లగా ఆ అరుగు ధూళిదులుపుకొని పడుకున్నాడు. ఒడలు జల్లుమంది ఆ చల్లదనానికి. గుండెలోనుండీ కుదుపువచ్చింది. లేచి కూర్చున్నాడు. గూటకట్టువిప్పి నేలనుపరచి చెడ్డీతో పడుకున్నాడు. అంతవరకూ బట్టలోనున్న కాళ్ళ క్రిందిభాగాలలోనుండీ చలిరేగింది. ముడుచుకొని పడుకున్నాడు, చలితగ్గలేదు. లేచికూర్చున్నాడు. మొల కట్టుపంచ తలమీదనుండీ కప్పుకున్నాడు. కొంచెం చలి తగ్గినట్టనిపించింది. "ఏంతగ్గడం - చలిచేరరాకుండా దానివాకిట్లో ఇలాగు కావలి కూర్చోవాలి కాబోలు!" అరుగంచున స్తంభానికి చేరబడి అదోలాగు చూచేడు. ఎదురుగా అరుగుమీదికే ఒకమూయబడ్డ ద్వారం కనుపించింది. వీధికొట్టంటారు దాన్ని. అది కాళీగానే ఉంటుంది. ఎప్పుడో అవసరంపడితే ఆయింటివాళ్ళు వాడుకుంటారు. దగ్గరలేచి ఆతలుపుగొళ్ళెం తీసేడు విశ్వం. - చీకటిని చించుకొని గది పరీక్షించేడు. నిర్మలంగా ఉన్నట్టే ఉంది. నైర్మల్యంమాట దేవుడెరుగును, వెచ్చగా ఉంది. "ఆఁ! బాగుంది. - చలిబాధతగ్గి నిద్ర పడితే అన్నిబాధలూ తగ్గుతాయి. ముసుగుపంచ నేలను పరచుకొని, కాలిక్రేలికట్టు తడిమి సరిచూసుకుని, పడుకున్నాడు బ్రతుకుజీవుడా అనుకొని. వానికి కూర్కుపడుతూంది తెలివివస్తూంది. తలుపు చేరవేట్టు కున్నాడు. చలిగాలి వీస్తూంది. కన్నులు బరువుగా విప్పేడు. ఎదుట దీపపువెలుగు కనిపించింది. ఒక విధం గువ్వు ముసలిది దీపంచేతపట్టుకొని వచ్చింది. ఆమె కొట్లోకి చూచి,

"ఎవడో ఉన్నాడే కాముడూ ఇందులోను" అంది.

చిన్నబోయేడు విశ్వం. దగ్గరలేచి యీవలకు వచ్చేడు. ఎవరు నాయనా నువ్వు, ఇందులో దూరేవు? వెళ్ళు. బాగున్నావు దొంగలాతలా నువ్వూను" మెట్లు దిగేశాడు విశ్వం. ఎటైనా పోదామనుకున్నాడు. ఆ మాత్రం వెచ్చదనం మరిగిన వాని శరీరం చలికి మరింత గడగడలాడుతూంది. అక్కడింకా మసలుతే ఆయింటి వాళ్ళు అనుమానిస్తారు. గూటకట్టు పంచ తిరుగా తల మీదనుండీ ముసుగుపెట్టుకొని ఓరఓరలనుబట్టి నడిచి వస్తున్నాడు. ఎటువెళ్ళడం? ఎంతరాత్రి అయిందో. ఏసంవడీలేదు వీధిలో. నడచిపోదామన్నా కాళ్ళురావు. కడుపుబాధిస్తూంది - కాలివ్రేలు సలుపుతూంది. చలికి శరీరం కొంకరపోతూంది ఆపైనింకా రోషం తల చూపుతూనే ఉంది. ఇంతచలిలోనూ నెత్తుటిఉడుకు! "నాకేమిటి? ఎక్కడికిపోయినా పోతాను. ఇదో లక్ష్యమా? తుపానుపెట్టి నన్ను తృణంలాగు తూల్చేసి నా పిట్టలా గెగురుతానుగాని పిరికిదనం మొలకెత్తనిస్తానూ?" నిజంగా పిరికిదనం వానిహృదయాన అంకురిస్తూంది. ఆందోళన సజీవంగా పంచలిస్తూంది. అపార్థం చేసికొంటున్నాడు. నిరాశా, నీరసంకూడా వాని కనుచకులయి అవలాయీవలా కదలుతున్నాయి. అలక్ష్యం, శౌర్యం ముందంజవేస్తున్నాయి. తనలో తానయినా ఒప్పుకోనొల్లని ఒకవిధమయిన దైన్యం అప్పుడే ఆవహించింది. వానిని దిగలాగడం మొదలెట్టింది.

వ్రేలు రువ్వురువ్వుమని సూదులతో పొడిచినట్టు పోటుపెడుతూంది. అడుగులు ఊది వేస్తున్నాడు. ఎంచేతోగాని ఈడ్డిలపడుతున్నాయి అడుగులు. "ఔను! ఎందుకిలా వెళ్ళడం? ఎక్కడకు? వెనుకకుపోతేనే నయం. ఈపాటికి బాబూరావు ఇంటికి వచ్చేఉంటాడు. అటు పోతేనే మంచిది. ఇంకా జాముహాత్రికిపైగా ఉంటుంది కాబోలు. ఎక్కడో ఒకచోట తలదాచుకోవాలి, కాదు మిగిలినరాత్రిగడపాలి" "కొన్ని అడుగులు పెట్టేడు? ఆలోచన మారి అలానిలచేడు. బాబూరావుంటే మాత్రం? వాడివీధితలుపు పోవ్యాపఘట్టం. ఎవరు తీస్తారు. మనకేక వాడికే వినబడుతుందా ఏమిటి? ఇరుగుపొరుగువాళ్ళులేచి నన్ననుమానించడం, విరుకోడం ఇదేమిగులు.

ఇంతకూ వాడుంటాడో, ఉండడో! ఏలా వృథా ప్రయత్నం?" అలాఅనుకుంటూ రోడ్డుప్రక్కనున్న యిండ్లన్నీ కన్నులింతేసిగా విప్పి చూస్తున్నాడు అడుగులు మందగించేయి. ఆనిదానంలో చోటుకనబడ లెక్కడాను. "సత్రానికిపోతేనో! అయ్యో! ఎంత తెలివితక్కువ! ఇంతసేపూ నా కీఉపాయం స్ఫురణకేవచ్చింది కాదు. అని అందరిసాత్తూను. అడ్డేవాళ్ళూ, పొమ్మనే వాళ్ళూ, అధికారం చెలాయించే వాళ్ళూ ఉండరుగదా!" మెడ్డులోనే మెలకువచూపెడుతూ చురుకుగా అటునుండి ఇటుతిరిగి పదిఅడుగులకుపైగా నడచి, "అన్నట్టు అక్కడ కావలివాడుంటాడు వాడు నేను పరదేశీయుడనంటే నమ్మి చోటుపెడతాడా? అనుమానించి అందరినీ లేపి చూపుతాడేమోనన్న" అలా నిలబడిపోయాడు. ఏంచెయ్యడం అన్న ఆంతరంగిక ప్రశ్నకూడా శబ్దించలే దాహాహాప్రదేశంలో. ఊహాలేని ఎడారిలాగు శూన్యతే ఆవరించింది వానిమనస్సును క్షణకాలం. కీగ్రుమనికీచుశబ్దం రేగింది చేరువగా. నిద్రపోతున్న సైనికదళంలాగా ఊహావీథి కల్లోలమయింది. కళవళపాటు యుద్ధభేరీలాగు నినదిస్తూంది వానిచెవులలో. భీతి ప్రాకిం దాహృదయాకర్షణలోకి. దానిని సూచించుట కాకిళ్ళబద్దరికాసమయంలో వాని గుండె దడదడలాడింది. జారిపోతుందేమో నన్నట్టు అరచేత గుండెనదుము కొన్నాడు. గట్టిగా అకారణభయంతో "అదేమిటి చెప్మా" అని ఆలోచించేడు. ఏమయితే ఏంచేయగలను? ఎందుకూ ఆ ఆలోచన? సంశయాస్పద దృక్కులు సాగించి చూచేడు. జాడేమీ దొరకలేదు. పిట్టకూతకాబోలు. ఇంకా రాత్రి ఎక్కువగాఉంది కాబోలు. నిలబడేచూస్తున్నాడు అన్నిదిక్కులూ. నీడలాగా కొసనకనుపించిందేదో కదుల్తూ. మనుష్యుడే. ఇద్దరు కాబోలు. ఇటేవస్తున్నారేమో. సమీపిస్తున్నారు. బారెడుదూరంలో ఉన్నారు. జోడుకాళ్ళచప్పుడు వినబడుతూంది. పోలీసువాళ్ళు. 'విజిలు' వేసి కలుసుకున్నారు. విశ్వాన్ని సమీపిస్తున్నారు.

విశ్వ మేం చేస్తాడు?

# ఆంధ్ర వాఙ్మయ సూచిక

## (ముద్రితాముద్రిత గ్రంథముల పట్టికలు)

ఈ పుస్తకమున ౧౯౩౬-వ సంవత్సరము చివరవరకు అచ్చయిన తెలుగుపుస్తకముల పట్టిక ఒకటి, ఆ పుస్తకములను వ్రాసినవారి పట్టిక ఒకటి, విషయమునుబట్టి విభాగించి ఆ యా విభాగముల క్రింద వచ్చిన పుస్తకముల పట్టికలు, ఇంకా కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు లైబ్రరిలోను, తంజావూరు సరస్వతీ లైబ్రరిలోను, చెన్నపురము ఓరియంటల్ లైబ్రరిలోను ఉండే వ్రాతపుస్తకములలో ఇప్పటికి అచ్చుకాకుండ ఉన్న తెలుగుపుస్తకముల పట్టికలును, ప్రత్యేకము అకారాదిగా ఉన్నవి. ఆంధ్రవాఙ్మయవిమర్శనరూపమయిన ప్రకాశికలపీఠిక ౧౦౫ పుటల పరిమితి గలది యీపుస్తకమున ఉన్నది.

తెలుగుభాషలో పుట్టిన పుస్తకములను, వానిలో, ఈపుస్తకము ముగియునప్పటికి అచ్చయినవానిని, కానివానిని తెలిసికొనుటకు ఈ సూచిక చాల ఉపయోగకరము.

భారతిసైజు పుస్తకము, పుటలు ౬౩౦, మంచికాగితములు. వెల రు. ౧-౦-౦ మాత్రమే.

మేనేజరు, ఆంధ్ర గ్రంథమాల, నెం. 7, తంబుసెట్టివీథి, మద్రాసు.

# తెలుగుటాకీ వ్యాపారము క్రొత్త పరిస్థితులు

ఏ. వి. సీతారామయ్య

తెలుగుటాకీల నిర్మాణవిధాన మెంత అవకతవకలలో కూరుకొనియున్నదో కొంతకాలము క్రిందట వ్రాసియున్నాను. కార్యాంతరమున నేను ఇటీవల కలకత్తా బొంబాయి నగరములు పోయినపుడు మన తెలుగుటాకీలు తయారుచేయుటలో వ్యాపార దృష్టిని మరికొన్ని విచిత్రములైన విషయములు బయలుపడినవి. అవి తెలిసికొనినపుడు ప్రతి ఆంధ్రునికిని విచారము కలుగకమానదు. అవి వినుటకు హాస్యకరములుగా నున్నప్పటికిని వాటివలన తుట్ట తుదకు మన సినిమాపరిశ్రమకు, మనకు సంభవించు నష్టము అపారమని కొంచెము దూరదృష్టితో ఆలోచించు ప్రతివారికిని స్ఫురించగలదు. వీటిని బయలుపెట్టుటలో గల నా ఉద్దేశము ఆ విధముగా అవమానకరములైన అనుభవములను పొందుచున్న తోటి తెలుగుఫిలింవర్తకులను హేళనచేయుట గాక రాబోవు వర్తకులకు హెచ్చరికగా నుండగలదను నమ్మకమే.

తెలుగుటాకీలు తయారుచేయుటకు ప్రయత్నించు ఫిలింవర్తకు లనేకులు ఇప్పుడు కలకత్తా వీధులలో తరుచు కనిపించుచుంటారు. వీరిలో చాలమంది తెలుగువారే. కాని కొందరు ఇతర రాష్ట్రీయులుకూడ మన వారిని కొందరిని దగ్గరకు తీసి ప్రయత్నములు చేయుచుండువారు.

స్వంతముగా ఫిలిములు తీయువారిలో కొన్ని రకములవా రున్నారు. ఇందులో కొందరు ఫిలింపరిశ్రమను గురించి బొత్తిగా ఏమియు తెలియక ధనము మాత్రము పూర్తిగా గలిగి అదివరకే జీవితములో అనుచరులుగా నున్నవారి సలహాలమీదను, సహాయముతోడను ఫిలిం తీయుటకు సమకట్టువారు. ఈ మాదిరి ఫిలిము తీయబడు కాలములోనే స్టూడియోలోని సాంకేతిక (Technical) శాఖలవారి హేళనకు గురియై తయారగుచుండును. వారును 'తెలుగుదేశములోని అభిరుచికి ఈ విధముగనే తయారుకావలయును కాబోలు' ననుకొని ఆశ్చర్యపడుచుందురు. లేక వారిలో నెవరైన తెగించి మన ప్రొప్రయిటరునుగాని, తెలుగువాడైన యెడల డైరెక్టరునుగాని అడిగినయెడల 'మా దేశంలో ఈ విధంగా వుంటేనే ఫిలిం చలామణీఅవుతుంది.' అని వీరు జవాబివ్వడం కూడా కద్దు. ఆ ఫిలిం చివరకు తయారైన తరువాత ప్రజల హేళనకు పాత్రమై కళాదృష్టిలోనే కాక ఆర్థికంగా గూడ అపజయంపొంది పెట్టుబడిదారుని ఇన్‌సాల్వెన్సీకి ఈడ్చుచున్నది.

రెండవరకముగా తయారగునవి. కొంతడబ్బు పెట్టుబడిదారు, మిగిలినది స్టూడియోవారు కలిపి తయారుచేసేది. ఈవిధానంలో ఏ ఒకటిరెండు స్టూడియోలవారో తప్ప ప్రతిస్టూడియోవారూ సాధారణంగా విపరీతమైన అంచనా (Estimate) వేసి తెలుగువాడినెత్తిన వేసి రుద్దటానికి ప్రయత్నిస్తారు. స్వంతంగా తీసుకుంటే షుమారు రూ 30,000 లు ఖరీదయే ఫిలిం స్టూడియోవారితో కలిసితీయడానికి పూనుకోగానే, స్టూడియోవారు దానికే షుమారు రు౬౦,౦౦౦లు అంచనావేస్తారు. ఎంత తెలివితేటలలో మాట్లాడినా అనేక 'అయిటములు' వేసి హడలగొట్టి 'ఇవన్నీ ఎందుకయ్యా' అంటే 'అవన్నీ వుంటేనే గాని మాకు తృప్తికరంగా వుండదు ఫిలిం' అని అంటారు. స్వంతంగా తీసుకోవడంకంటె జాయింటుగా తీస్తే చాలా బాధ్యత తగ్గుతుందనీ, స్టూడియోవారు ఎక్కువపట్టుదలతో పని చేస్తారనీ అనుకొని కొందరిట్లా మోసపోయి అవస్థల పాలవుతున్నారు. నమ్మకంగా పనిచేస్తే ఇది లాభదాయకమే గాని దీనిలో స్టూడియోవారి మోసం ఎక్కువగా వుంటుంది. ముఖ్యంగా తెలుగు ప్రొప్రయిటరుయొక్క అజ్ఞానం ఆధారంగా, మనంగనక విష

యం గ్రహించు వారిని అడిగినామా అసలు మనకూ వారికీ ఎగ్రిమెంటే వుండదు. ఈపద్ధతిలో ఇంకో చిత్రం.

కలకత్తాలోని ఇటీవలి తెలుగుటాకీల ప్రొడక్షనులో వచ్చిన ఇంకోచిత్రం ఏమిటంటే, జాయింటుగా ఫిలిం తయారుచేయడానికి పూనుకొన్నపుడు 'రా ఫిలిం' (Raw Film) ఖర్చు విధిగా తెలుగువాడే భరించాలి. అసలు అది స్టూడియోఖర్చుకింద వచ్చి వారే భరించే వారు. ఇప్పు డిదేమిటయ్యా అని అడిగితే ఫిలిములో ఎక్కువ 'రిటేకు'లు (Retakes) అనగా పాడైపోవటంవలన తీసినదే తిరిగి తీయవలసి రావడం - తీయవలసి వస్తుందనే దృఢవిశ్వాసం కారణం అంటారు. దానివలన బోలెడంత ఖర్చు. తెలుగుఫిలిం తీసేసమయంలో ఎక్కువ 'రిటేకులు' వస్తాయని వారి అనుభవము! అసలు సెట్టుమీద ఏదైనా ప్రమాదమువలన దప్ప 'రిటేకు' చేయవలసివచ్చిందంటే దానికి కారకులైనవారి కది చాల అవమానకరంగా వుంటుంది. ఒకనటుడి భావప్రకటనగాని, ఒకపాటగాని, లేక ఏ యితర శబ్దోచ్చారణగాని మరల తీయవలసివచ్చిందంటే అది ఆనటుడికి చాల అవమానకరము. ఫిలిం యొక్క బాగుకుగాను రెండుమూడు రకములుగా తీసుకొనవచ్చును. కాని దానికి నటుడియొక్కగాని, ఏ సాంకేతిక శాఖవానియొక్కగాని నిర్లక్ష్యత, తెలివితక్కువదనములు కారణములు కారాదు. ఒక ప్రసిద్ధ తెలుగుటాకీలోని ఒక ప్రసిద్ధతెలుగునటుడు తనకు డైరెక్టరుకంటె ఎక్కువ తెలియునను గర్వముతో తన పాత్రధారణలో అవసరమైనప్పటికిని గడ్డముపెట్టుకొన నిరాకరించగా, ఆవిధముగనే అతనితో ఒకసీనంతయు తయారుచేయబడి తెరమీద చూచుకొని బాగుండకపోవడంవలన ఆనటుడి కోర్కెమీదనే అతనికి గడ్డముతగిలించి ఆ సీనంతా తిరిగి తయారుచేయవలసివచ్చినదట! వచనము సైతము సరిగా చెప్పలేని మరియొక నటశిఖామణి తనకు సంగీతము బొత్తిగారాదని తెలిసియు, తోటివారునూ డైరెక్టరునూ వద్దనుచున్ననూ వినక ఒకేపద్యమును ఆరుమారులు తీయవలసివచ్చునట్లు పాడినాడట! కథ సైతము సరిగా తెలియక, ఫిలింపరిశ్రమయందు దీర్ఘకాలము నుంచి పనిచేయుచుండుటవలన కలిగిన 'అనుభవము' తోడుగా, మంచిదైననూ నటకులతో సంప్రదించుట అవమానకరముగా దలచి ఫిలిము తయారుచేసి, తిరిగి కథ అంతటికినీ అక్కడక్కడ కొన్ని 'రిటేకుల'ను తగిలించిన గాని ఫిలిం పనికిరానట్లు చేసిన డైరెక్టరు గలడట! అందువలన 'రా ఫిలిము' నకు ఎక్కువ డబ్బు ఖర్చుచేయవలసివచ్చుచున్నదట! ఒక స్టూడియో మేనేజరు ఉదాహరణగా రెండు తెలుగుఫిలిములను సూచించి వాటికి మరల 'రిటేకులు' తీయవలసివచ్చుటచేత స్వదేశమునకు పోయిన నటులను వారుకోరిన హిరణ్యాక్షవరములనిచ్చి వారిని తీసికొనివచ్చి బోలెడంత డబ్బు ఖర్చుచేసి ఫిలిములను పూర్తిచేయవలసిరావడం వగైరా పురాణమంతా చెప్పినాడు. మరి యటువంటివారివలన 'రిటేకులు' తత్కారణముగా అమిత ధనవ్యయము కలుగుచున్నందున 'జాయింటు ప్రొడక్షను'లో 'రాఫిలిం' ఖర్చు మాత్రం విధిగా తెలుగువాటాదారుడే పెట్టుకోవాలని వాళ్లు కోరడంలో తప్పేమున్నది? ఇది తెలుగు ఫిలిం వర్తకులకే కాక తెలుగునటులకు డైరెక్టరులకుగూడ మిక్కిలి అవమానకరమైన విషయము.

మరోవిషయం :

ఒక సంవత్సరమునకుముందు రూ. 3,000 లకంటె ఎక్కువ విలువచేయని ఒక నటవర్గానికి (Troop) రాను పోను రైలుఖర్చులు మినహా తక్కిన ఖర్చులు యావత్తూ భరించి ఫిలింతయారుచేసి లాభములలో ౨౦% యి[illegible] ఒక ఫిలింకంపెనీ యిప్పుడు షుమారు రూ ౧౨,౦౦౦ లకు తక్కువ లేకుండా విలువచేయగల ట్రూపునకు స్టూడియోఖర్చులు మాత్రమే తాము భరించి లాభములలో ౨౫% మాత్రమే యిచ్చుటకు సిద్ధపడినారు. కారణము మన నటులు కలకత్తా ఫిలిం వ్యాపారస్థులవద్ద తమవిలువను అగాధంగా కోల్పోయినారు. ఐదారువేల రూపాయలకు సమస్త ఖర్చులు భరించి నటవర్గాన్ని సరఫరాచేసేందుకు సిద్ధపడుతున్న కంట్రాక్టరులు నటులు తయారవుతున్నారు. ఆవిధంగా ఇటీవల ఒక కలకత్తా ఫిలిం కంపెనీకి ఒక

ఫిలిమునకుగాను, నట నటీ మణులను రానూ పోనూ రైలుఖర్చులు అక్కడ కలకత్తాలో ఫిలిం తయారైన దాకా భోజనవసతులూ భరిస్తూ ఒక తెలుగుకంట్రాక్టరు రూ ౬,౦౦౦ లకు వొప్పుకున్నాడు! చిట్టచివరకుగాని తెలియ దాతనికి అందుగల లాభనష్టములు! దీనివలన మన తెలుగువారు నష్టపడి కష్టపడి అన్యరాష్ట్రీయులకు సంపాదించి యివ్వడమగుచున్నది!!!

ఒక కొత్త ప్రమాదం

డబ్బంతా పెట్టగలమని అనుకొని వ్యాపారములో దిగినతరువాత డబ్బు సేకరించుకొనలేక కలకత్తా పెట్టుబడిదారుల చేతిలో పడి నలిగిపోతున్న తెలుగు సినిమా వర్తకులు-ఒక కొత్తరకం వారు—తయారవుతున్నారు. ఇటువంటివారిని పసిపట్టితెచ్చుటకు కలకత్తా పెట్టుబడిదారులు మనరాష్ట్రములో కార్యాలయములను తెరచి, మనవారినే కొందరిని ఏజంట్లుగా నియమించి అమాయకులూ, అజ్ఞానలూ అయిన మన కొద్దిపెట్టుబడిదారులను క్షౌరము చేయుచున్నారు. ఫిలింవర్తకుడొకడు ఫిలిమును గురించి యడ్వర్‌టయిజమెంటయినను ప్రారంభించకముందే ఆకార్యాలయముతాలూకు ఏజంట్లు విషయము ఆమాకీతీసి అనాహూతులుగానే వచ్చి— వాళ్లు మన తెలుగువాళ్లేగాబట్టి—'సగం మేంకూడా పెట్టుబడి పెడతాం. మమ్మల్ని గూడా వాటాదారులనుగా చేర్చుకోండి' అని కోరగానే దానికి తెలుగువాడు సంతోషంగా వొప్పుకోవడం జరుగుతుంది. ఆవిధంగా పాలెగూడులో ఈగ జొరబడినట్లు వారి చేతిలో పడిపోతాడు. ట్రూపంతా కలకత్తా చేరగనే వారో డైరెక్టరును తగిలిస్తారు. వాడు మనగుంపునంతా నోరుమూయించగలవాడై వుంటాడు. కారణం మన గుంపులోనుండేదంతా నాటుజనమే గాబట్టి, ఇద్దరు వాటాదారులను కలిపినది తెలుగువాడైనప్పటికీ వాడు వారి ఏజంటుగా వుంటాడుగాబట్టి. ఫిలిం మొదలెట్టగనే —రిహార్సల్సు జరుగుతుంటాయి ప్రతిరోజూ— వారితో లాలూచీగావుండే ఆడైరెక్టరు ఆనటుడు పనికిరాడనీ, ఈనటి పనికి రాదనీ పని అపుచేల చేస్తాడు. దానితో తెలుగు ప్రొప్రయిటరుకు విసుగుకలిగి చేతినైనంతవరకు పట్టుదలకొరకు ఖర్చుచేసి తుదకు అంతా కలకత్తావాడిచేతులో వదలివేసి ఇంటికిరావడం జరుగుతున్నది. ఇట్టికార్యాలయాలను మనరాష్ట్రంలో పాతుకుపోకముందే తెలుగు సినిమా పారిశ్రామికులు లేవగొట్టాలి. లేకపోతే మన పెట్టుబడిదారులు అనేకులు వారిచేతిలోపడి నాశనమౌతారు.

ట్రూపును కలకత్తాగాని, బొంబాయిగాని తీసికొనిపోకముందే తనతోనున్నవారి మంచిచెడ్డలు విచారించుకొని, అక్కడ వుండవలసిన కాలమునకు వలయునంత ధనమును సేకరించుకొని ఆయా శాఖలకు తగిన ప్రవీణులను నియమించుకొని-ఇది చాలా ముఖ్యము- ప్రొడక్షను విషయం బాగా తెలిసినవాడ్ని ఒకడ్ని మేనేజరుగా పెట్టుకొని బయలుదేరాలి. లేకపోతే చాలా యిబ్బందులు పడాల్సి వస్తుంది. ముఖ్యంగా 'జాయింటు'గా తీయుచున్న పరిస్థితులలో. ఉదాహరణగా ఇటీవల కలకత్తాలోని ఒక తెలుగు ట్రూపునకు జరిగిన అనుభవాలు: తెలుగుటాకీ నొకదానిని తీయడానికి మన తెలుగువాడొకాయన ఫిలింపరిశ్రమ విషయం బొత్తిగా తెలియని కొందరు అనుచరులను వెంటవేసుకొని, ఒక కలకత్తా పెట్టుబడిదారుతో అతని ఏజంటువలన భాగస్థుడుగా చేరి, కలకత్తా సెట్టును తీసికొనిపోయినాడు. వారు పనికిరారు, వీరు పనికిరారు అని బెంగాలీ భాగస్థుడంటుంటే కొత్త కొత్త నటులకొరకు డబ్బు తగలేసుకుంటూ తెలుగుదేశమంతా తిరగడం మొదలెట్టాడు. ఈవిధంగా మూడునెలలకాలం పనిలేకుండా ఏబదిమందిగల ఆ సెట్టు కలకత్తాలో తింటూ కూర్చున్నారు. వెంట సరియైన నటులను ఎన్నగలవారూ లేరు. బెంగాలీ డైరెక్టరు యిచ్చవచ్చినట్లు వారు పనికిరారు వీరు పనికిరారు అంటూంటే 'ఎందుకు పనికిరారు?' అని అడగడానికి తగ్గ శాస్త్రజ్ఞానం దమ్మూ కలవారూ లేరు. అంతా కలకత్తా చూచినట్లవుతుందనీ, స్టూడియోలలో పని నేర్చుకోవచ్చుననీ పోయిన ఉత్సాహమాత్రులైన యువజన సంఘం. ఇంక ప్రొప్రయిటరని పిలువబడే తెలుగు వాటాదారుడు డబ్బులేక కష్టపడలేక తీసుకువెళ్లిన నటులమీద గంతులేసి వారికి తిండి సరిగా పెట్టక వారి కివ్వవలసిన డబ్బు యివ్వక వారిని పైగా నానామాటలూ అని బెదరించుచుంటే వారు కలకత్తా పోలీసువారి సహాయంతో లాడ్జిబయటపడి రైలుఖర్చులు లేక నగలూ నాణ్యాలూ తాకట్టుపెట్టుకొని అష్టకష్టాలతో కొంపలు

చేయుచుంటున్నారు. కలకత్తా చేరి మూడునెలలు దాటినా ఫిలిం అరవరంతయినా తయారుగాక యింకా ప్రధాన నటులకొరకు వెదకుకొంటూ, వున్నవారు వెడలిపోయి దావాలువేస్తుంటే వారికి జవాబులుయిచ్చుకుంటూ అవతల బెంగాలీవాటాదారుడి దూకుడుకు తలవొగ్గుతూ తయారుచేసే ఫిలిం ఎట్లా తయారవుతుంది? డబ్బు రమ్మంటే ఎట్లా వస్తుంది?

వెనుక ఎప్పుడో మూడునాలుగు సంవత్సరాలకింద పరరాష్ట్రపు సినిమా పెట్టుబడిదారుల చేతులలో అష్టకష్టాలు పడినామని ఘోషించిన నటుల అనుభవాలు తిరిగీ యీనాటికి మననటులు మన పెట్టుబడిదారుల చేతులలోనే అనుభవించుచున్నారంటే అది ఆంధ్ర వ్యాపారస్థులకు తీరని అవమానము. ఫిలిమునకు ఒకడే డబ్బుపెట్టలేని పరిస్థితులలో సాధ్యమైనంతవరకు మనవాళ్లే నలుగురుచేరి కంపెనీ పెట్టుకోవడం మంచిదిగాని, వెంట పరిశ్రమ తెలిసినవారు లేక, పరిశ్రమలో నిగ్గుతేలిన అన్యరాష్ట్రీయులతో చేరిన అవస్థలపాలుగాక తప్పదు.

ఇప్పుడు కలకత్తాలో మన తెలుగువాళ్లు ముఖ్యంగా ఏ ఫిలిం పరిశ్రమవలనైతే గొప్పగా చూడబడినారో ఆ ఫిలింపరిశ్రమవలననే యి తహీనంగా చూడబడుచున్నారు. కలకత్తా స్టూడియోలలో మనవాళ్లంటే ఆర్థికంగానేగాక కళావిషయకంగా కూడ వొట్టిచవ్వ పెద్దమ్మలనే నమ్మకం వారికి బాగా కుదిరిపోయింది. కలకత్తాలోని ఫిలిం పారిశ్రామికులలో అగ్రస్థానంలోనున్న ఒక స్టూడియో స్వంతదారుతో ముచ్చటిస్తుండగా మా తెలుగువారిని గురించి ఈ పరిశ్రమలో మీ అభిప్రాయం ఏమిటంటే, ఆయన ఏమీమాట్లాడకుండా ఒక పెద్దరిజస్టరు తీసి చూపించాడు. ఆశ్చర్యపడిపోయాను. రెండుసంవత్సరాలక్రింద ఆయన స్టూడియోలో తయారు చేయబడిన ఒక తెలుగుఫిలిము తాలూకు యింకా ఆయనకు రూ ౧౬,౫౦౦ లు యివ్వాల్సివున్నాడు మన తెలుగు ఫిలిం వర్తకుడు. బొంబాయిలో యిటీవల తీయబడిన ఒక తెలుగుటాకీలోని నటులను గురించి ఆ కంపెనీలోనే పనిచేయుచున్న ఒక నటీమణిని ప్రశ్నిస్తే ఆమె చెప్పినమాటలు: "ఆ ట్రూపంతా చాల తక్కువ మొత్తానికి పనిచేయడానికి వొప్పుకున్నారు. కథరాసిన ఆయనకు భోజనంపెట్టి సిగరెట్ డబ్బాలు యిచ్చేట్టు షరతట. మిగతా నటులు ఏ యిద్దరు ముగ్గురో దక్క తక్కినవారు భోజనవసతులతోనే తృప్తిపడి నటించడానికి వచ్చిన ఉత్సాహమాత్రులు. పాపం! ఒక్కొక్కగదిలో పాతికమంది చొప్పున రెండుగదులలో కాలక్షేపం చేశారు ఐదారునెలలు. రైలుఖర్చులు లేక యిబ్బందులు పడుతూ యింకా యిక్కడేవున్నారు కొందరు."!!!

ఇట్లానే పరిస్థితులు కొన్నిదినాలు సాగితే చక్కని ఈవ్యాపారము అన్యరాష్ట్రీయుల చేతిలోపడిపోతుందని మాల నొకమారు మన సినిమాపారిశ్రామిక ప్రముఖులను హెచ్చరించుచున్నాను.

ఇందువలన;

౧. తగినంత ధనములేనిదే ఎవరునూ ఫిలిము తీయడానికి ప్రారంభించరాదు.

౨. ఒకరికి శక్తిచాలక నలుగురు కలసి చేయదలచుకుంటే తెలుగువారే కలసిచేయడం మంచిది. ఈ పరిశ్రమకు చెందిన అన్యరాష్ట్రీయులతో కలవడమంత మంచిదిగాదు.

౩. ధనం సమకూరిన తరువాత ఆయాశాఖలలో ప్రవీణులను నియమించాలిగాని నాలుగుమారులు స్టూడియోలు చూచివచ్చాంగదా అని గాని, నాలుగు టెక్నికల్ మాటలు నేర్చాంగదా అని గాని, సర్వమూ తెలిసినవారిమాదిరి తామే చేయబూనుకొంటే అనవసరంగా బోలెడు ధనవ్యయం జరుగుతుంది. మన తెలుగు టాకీలలో కొన్ని నిజానికి రూ ౪౦,౦౦౦ లకంటె ఎక్కువ విలువచేయనివి గూడ రూ ౧,౦౦౦,౦౦ లకంటె ఎక్కువఖర్చు గావడానికి కారణమయినదే.

౪. మనరాష్ట్రంలో ఫిలింవెర్రి విపరీతంగా వ్యాపించి అనేకమంది ధనవంతులైన యువకులను ముందుకు లాగుతున్నదని గ్రహించి అటువంటివారిని పట్టి 'భాగస్థుల'ను వంకతో చేరి వారిని నాశనము చేయుచున్న అన్యరాష్ట్రీయుల కార్యాలయములను మనరాష్ట్రమునుండి సాధ్యమైనంత త్వరలో లేవగొట్టాలి.

అప్పుడుగాని మనపరిశ్రమ బాగుపడదు.

# మీగడ తరకలు

## దంపుళ్ల బియ్యమా?

దేశంలో యెక్కడ విన్నా దంపుళ్ల బియ్యపు ప్రచారం వినపడుతోంది.

పెళ్లి పెళ్లిగా పాడుతూనూ వుంది.

గిరాకీ కూడా బాగానే తగులుతోంది.

వందలకొద్దీ బస్తాలు తయారు చేయించే సావుకార్లు బయలుదేరుతున్నారు.

ప్రతీ బజారులోనూ సరుకున్నూ దొరుకుతూ వుంది.

"మేము దంపుళ్ల బియ్యమే వండుకుంటున్నాం" అని చెప్పుకోవడం గొప్పగా భావించేవారు ముందుకు వస్తున్నారు.

ఇన్నాళ్లూ లేనిది, రోగులకు దంపుళ్ల బియ్యమే వండించి పెట్టించే అల్లోపతీ డాక్టర్లు కూడా కనపడుతున్నారు.

సరేసరి, కాంగ్రెస్సువారు దంపుళ్ల బియ్యపు ప్రచారం తమ కార్యక్రమంలో సహాయనిరాకరణం కంటేనూ ప్రధానమైనదని చెబుతున్నారు.

మొత్తంమీద దంపుళ్ల బియ్యం మళ్లీ వొకవెలుగు వెలిగేటట్టున్నాయి.

బాగానే వుంది.

"చేసేది తప్పు" అని తెలుసుకోవడం చాలా మంచిదే.

తప్పు వొప్పుకోవడంకూడా మరీమరీ మంచిదే.

తప్పుపని మానెయ్యడానికి ప్రయత్నం చెయ్యడంలో చాలా విశేషమే వుంది.

కాని,

తప్పున్నది విడిచిపెట్టాటప్పుడు, బాగా — స్వయంగా విచారణచేసి, అసలు మంచిదేదో దానికోసం ప్రయత్నించక మధ్యేమధ్యే పానీయాలకోసం యెగబాకడం వివేకం కాదు.

నిజానికి, వరిబియ్యంలో సత్తువ తక్కువ అని మనకి పూర్తిగా తెలుసు.

అందులోనూ మరబియ్యం "వొట్టితుక్కు" అని కూడా బాగా తెలుసు.

తవుడుతో కూడివున్న చేబియ్యం పుష్టికరమైనవంటే యెవరూ కాదనడం లేదు.

కాని, షష్టికాదులలో చేరిన యీవరిబియ్యం, జబ్బుపడి, జఠరదీప్తి యింకా బాగా కలగక, క్రమక్రమంగా అన్నహితవు కలిగించుకునే రోగులకూ, రోగముక్తులకూ పథ్యంగా పెట్టవలసిన వస్తువు అని ఆయుర్వేదం చెబుతూ వుంది.

మనంకూడా కొంచెం విచారణ చెయ్యగలిగితే, వరి అన్నం, తవుడుపోని బియ్యంతో తయారుచెయ్యబడ్డదయినా ప్రాణాలు నిలిపివుంచడానికి మాత్రమే చాలింది; కాని నరాలకు బింకం కలిగించ గలిగింది కాదని చక్కగా తెలుస్తుంది.

"మరి, జపానువారు వరిఅన్నమే తింటున్నారు కారూ?" "వారు మనతో పోల్చడానికి వీలులేనంతటి వజ్రశరీరులై వున్నారు కారూ?" "వారికలాంటి విశిష్టత కలిగిస్తూవున్నది చేబియ్యంతో తయారయిన వరి అన్నమే కామా?" అంటే కాదనను.

అయితే, వారు వాడే చేబియ్యం మిల్లులో తయారైనవి కావని, మన దంపుళ్లబియ్యపుప్రచారకులు, ఇంతవరకూ నిదర్శనాలు చూపించలేదు.

పైగా వారి ప్రవక్త, జీవహింస తప్పని యెంత నిషేధించి వున్నా, వారు, మత్స్యమాంసాలు పూర్తిగా తింటున్నారు.

"మనలోమాత్రం ఏబ్రాహ్మలో, ఏవైశ్యలో, మరెవరో కొద్దిమంది తప్ప తతిమ్మా అందరూ మత్స్యమాంసాలు తింటున్నవారే కారూ?" "వారు జపానీయులంతటి బలశాలురు కారేం?" అంటే, మనవారికి భోజనవిషయంలో జపానువారి కున్నంత వివేచన యేదీ?

అసలు అదృష్టేవా యేదీ?

ఈభౌతికశరీరం ప్రపంచం అంతటిలోనూ అత్యుత్తమ మైన దని జపానీయులకు బాగా తెలుసు.

ఇది లేకపోతే మరేమీ లేదని వారికి పూర్తిగా తెలుసు.

మనవారి కిలాంటి భావా లేవీ?

పోనీ, మనతోపాటు యీవరిబియ్యమే తింటూ వున్న మాహమ్మదీయుల యెదట మత్స్యమాంసాలు పూటుగానే వాడుతూవున్న మనవాళ్లు అన్నివిధాలా తీసికట్టుగా వుంటున్నారేం?

భిన్నసిద్ధాంతాలవారిదాకా యెందుకూ?

ఒక్క మాస్తరు వరిబియ్యమే తింటూవున్న అరకలసహా, మరి పిండశక్తి విషయంలో అంతతేడా యెందుకు కనపడుతూవుంది?

ఇంతకీ:

వరిఅన్నమే తినవలసివస్తే, తవుడు పోకుండా మారుకోవాలంటే మాత్రం వొప్పుకుంటాను.

కాని మన ఆంధ్రుల ముఖ్యాహారం వరి అన్నం మట్టుకు కాదు.

పూర్వకాలపు తెనుగువారు "మాది శూరజాతి" అని జబ్బ చరుచుకు నిలవగలిగినప్పుడు— కోటలు కట్టి తెనుగుజెండా యెగరవెయ్యగలిగినప్పుడు — సామ్రాజ్యాలు నిర్మించి పరరాజుల మణిస్థగిత కిరీటాలు పాదపీఠాలుగా వాడుకోగలిగినప్పుడు—అటు కన్యాకుమారి దాకానూ, ఇటు మగధదాకానూ తెనుగుపెత్తనం సాగించగలిగినప్పుడు—తురకలను పొలిమేర అవతల నిలవగొట్టగలిగినప్పుడు ఈచప్పచప్పని వరిఅన్నం తిని యెరగరు.

"తెనుగుగడ్డ" వరి అంతటి చచ్చు ఆహారపదార్థాలు మాత్రమే పండించే చవుటిపర్ర కానేకాదు.

అయితే:

"గోధుమపంట యెప్పుడూ యిక్కడ లేదు కాదూ?" అంటే నిజమే.

కాని, గోధుమలు లేనందుకు మనం విచారించ నక్కరలేదు.

"మాకు గోధుమలు పంపించండి బాబూ" అని మనం యేవుత్తరాదివాళ్లనీ ప్రాధేయపడ నక్కరాలేదు

గోధుమఅన్నం మనకి కొన్ని యిబ్బందులు కలిగిస్తుంది.

ఇక్కడి ప్రకృతికి అది యెంతమాత్రమూ అనుగుణ మయినది కాదు.

ఇంచేతనే ఆపంట యిక్కడ లేకపోయింది.

పోగా, మనఆంధ్రుల ప్రధానాహారం జొన్నన్నం.

జొన్నన్నమూ, వేయించిన కందిపప్పూ, కందకూరా, దోసకాయపచ్చడీ, ఆవకాయ ఊరుగాయా గుమ్మడికాయ ధప్పళమూ, గోంగూర పులుసూ, ఆపైని గేదె పెరుగూ—ఇవీ మన తెనుగుజాతి భోజనపదార్థాలు.

చోడి అంబలి [illegible] ధాతుసామ్యం చెడకుండా పోషించే పానీయం.

కేతిగారెలు తెనుగుజాతి గడించుకున్న గొప్ప కృష్యయోగం.

ఈవస్తువుల యెడ:—తవుడు పోకుండానే వుండుగాక, దంపుళ్లబియ్యంతో తయారుచెయ్యబడ్డదే అగుగాక, వరిఅన్నం అంటే పశువులు లొక్కసిన చెత్త కాదూ?

అయితే:

ఇవాళ జొన్నన్నం తినడం అంటే మోటుగా అనాగరికంగా కనపడుతుంది.

కాలం ముందుకు వెడుతూవుంటే మనం వెనక్కి వెళ్లడంలాగ వుంటుంది.

అసలు, జొన్నన్నంతిని జీర్ణించుకోవడంకూడా యిప్పుడు కష్టమే.

కాని నిన్నటిదాకా జొన్నన్నమే తిన్న వృద్ధులు—ఇప్పటికిన్నీ తింటూనే వున్నవారు లేకపో లేదు.

వారిలో అరవై, డబ్భైయేళ్లవాళ్లతో సరిగా, దంపుళ్లబియ్యపు అన్నమే తింటూవున్న యిప్పటి పాతి కేళ్లవాళ్లు పనిచెయ్యాలేరు.

నడవలేరు. నంచోలేరు. కూచోలేరు. పడుకోనూ లేరు.

తినాలేరు తినకుండానూ వుండలేరు.

పైగా, వారు టోకాయించి మాట్లాడితే, వీరు ముక్కునా నోటా రక్తం కక్కుకుంటారు.

మహారాష్ట్రిలలో యిప్పటికీ జొన్నరొట్టెవాడకం యెక్కువ.

తత్ఫలితంగా వారిలో జబ్బపుష్టికలవారెక్కువ.

ఉడుముపట్టు పట్టేవారున్నూ యెక్కువే.

నవనాగరికతలో — నాజూకుతనంలో అమెరికావారియెదట మన లెక్కా పత్రమూ లేదు.

ప్రతీ విషయంలోనూ వారికి సున్నితం ప్రధానం.

కాని, వారు జొన్నరొట్టెలు తింటారు. మొక్క జొన్నరొట్టెలు కూడా తింటారు. దంపుళ్ల (వరి) బియ్యం వారు పశువులకున్నూ పెట్టరు.

అన్నట్టు, జొన్నకుడితి తాగిన పశువులు ఎక్కువ పాలు ఇస్తాయి.

ఆపాలలో జిడ్డు ఎక్కువగా వుంటుంది.

అవి చాలా బలం కలిగిస్తాయి.

ఆపాల రుచే వేరు.

ఇలాగ, యెటు చూసినా జొన్నలు మిన్నగా వున్నాయి.

కాని, మన పరిశోధకుల దృష్టీ, మన దంపుళ్ల బియ్యపు ప్రచారకుల బుద్ధీ అంతవరకూ పారలేదు.

మరబియ్యపు అన్నం తింటూవున్న యిప్పటి వాళ్లకంటె మిల్లుబియ్యం — అసలు మిల్లే యెరగని వెనకటి తరంవాళ్లు దృఢంగా వుండివుండడమే వారికి కనపడింది.

అంతే కాని,

వెనకటి తరంవారి ఆదార్ఢ్యం దంపుళ్ల బియ్యపు అన్నం తినడంవల్ల కాక, జొన్నన్నం తిన్నవారి రక్తం వారి శరీరంలో యథారూపంతో ప్రవహించడంవల్లనే కలిగిం దని వారికి తోచలేదు.

జొన్నన్నం తిన్నవారి తరాలు దూరం దూరం అయిపోతూ వుండడంవల్లా, వడపోతమీద వడపోత తగలడంవల్లా ఆరక్తం బిగి విరిగిపోయి యిప్పటివాళ్లిలా పిండిబొమ్మలుగా తయారవుతున్నారే; గాని, మనకి యీ పుట్టిమునక కేవలమూ మరబియ్యంవల్లనే వచ్చింది కా దని వారికి తట్టలేదు.

వరిబియ్యమేనా మాగాణిపంటకంటే మెట్ట పంట శ్రేష్ఠ మనికూడా వారికి తెలవలేదు.

దీన్ని పట్టి చూస్తే:

ఈ దంపుళ్లబియ్యపు ప్రచారం మన ప్రచారకులకు పరోపదిష్ట పాండిత్యం కాని స్వయంభువు కానే కాదు.

కొంచెం పరకాయించగలిగితే:

వరిపంట మన భూమిని పాడుచేస్తోంది.

వరిఅన్నం మన జీవితాలు కుశింపచేస్తోంది.

వరిపంట ప్రబలాక ఆత్మశక్తి క్షీణించి, మన జాతికి భావదాస్యం పట్టుకుంది.

చివరికి, ఈదంపుళ్లబియ్యపు ప్రచారం కూడా మనకు భావదాస్యంగానే పరిణమించింది.

జొన్నఅన్నం విడిచిపెట్టి - పైగా వరిఅన్నం తినడం మొదలుపెట్టడంవల్ల తెనుగువాడికి రక్తం విరిగి పోయి, నరాల పట్టు తప్పిపోయి, కళ్లు చీకట్లు కమ్మి, బతుకు భార మయిపోవడం కూడా తెలవని స్థితి సంభ వించింది.

ఈస్థితిలో దంపుళ్లబియ్యపు ప్రచారం చాలా గొప్పది గానే కనపడుతుంది.

కాని అది, సిగరెట్టు మానేసి బీడీ కాల్చడం వంటిది.

దానివల్ల జాతి పురెక్కదు.

అసలు. ఈపాటికి మనం మన ప్రత్యేకతను గుర్తించుకోవాలి.

ఏకాగ్రతా, దీక్షా అలవర్చుకోవాలి.

ఆత్మవిశ్వాసం సంఘటించుకుని, ఆత్మగౌరవం గడించుకోవాలి.

శుచీ అనేది చూపించడం అలవాటు చేసుకో వాలి. మన తెనుగువా డంటే మనమే నిర్లక్ష్యంగా చూడడం మానెయ్యాలి.

వెకిలితనం విడిచిపెట్టెయ్యాలి.

అన్నిటికంటే ముఖ్యం, మన భోజనపదార్థాలు మార్చుకోవాలి.

భోజనపద్ధతులలో కూడా మార్పులు తెచ్చి పెట్టుకోవాలి.

అప్పుడు గాని మన చరిత్ర మళ్లీ ప్రారంభం కాదు.

—శాస్త్రి



శివభక్తమాహాత్మ్యమునందలి కిరాతాఖ్యానమున మఱియొకరంగము
(శ్రీకాశీనాథరావుగారి తంజాపుర ప్రాచీనచిత్ర సంగ్రహమునుండి)



"కన్నమ్మ ఓ మాపు తడికాడ పురికొస పేస్తావుంది. పోతన్న ఓలిసనక్కర అల్లుతా వున్నాడు."

ముసిలిదాని మాట విన్నాడు కమోసు దూరాన్నుంచి "ఒలేవు! సీయిల్లు మాసి
ఆంజనేయులుమనిషి – ఆ వెంటనే తా నెత్తు పోను. ఆడినెత్తెక్కి కూకునేకన్న ఇక్కడ
కున్న పిల్లని తీసుకొచ్చి పోతన్న నెత్తిమీద కూకుని యీపేళ్లు మణిసిపెడితేం? అణాడబ్బు
కూర్చోపెట్టి "నీపెత్రాం నాకెందుకురా? లోస్తాయికాదే బుట్టకి!" అని కూకేసింది.
నీపెత్రాం నాకెందుకురా?" అని వాడి నెత్తి గుంట పాతిపోయింది. గుంట వెనకాతలే
మీద కూర్చోపెట్టినట్టు కూర్చోపెట్టి కిందకు పోతన్న చూపులు చెమ్మగిల్లాయి.
జార్చి తాను మాయమైపోయాడు. బిక్క
మొగాల్తోనూ, ఏడుపు మొగల్తోనూ వున్న
పిల్లకాయలంతా వెనక్కి చూస్తూ ఆ ఆంజ
నేయులుమనిషి చేష్టకు పకపకా పకాపకా
నవ్వినారు. వాళ్లన్న మాటేమిటి? గూడెం
యావన్మందీ ఆ వినోదంలో పాల్గొన్నారు.

గుంటకు ఎనిమిదేళ్లుంటాయి. పోత
న్నకు - మత్తేమన్నా - సంద్రాండేళ్లుంటాయి.
ఆపొద్దు మొదలూ పోతన్న తన ప్రణయ
గాథకు పునాది వేయడం. గుంటపై రేపటా
అని ఆలోచించేవాడు దాన్ని పిలిచేవాడు
నోటెంట. పిల్లతండ్రి ఎవరా అని తిలకించే

పోతన్న అన్న పైగుంటదు తన నెత్తెక్కి వాడు దాన్ని బజారుకు తీసుకెళ్లే మగా
డిగిన గుంటను చూచేడు. ఆ గుంటతల్లి డొంక. పిల్ల నవ్వాలికిస్తాంటే ఇక పోతన్న



రూపం తబ్బిబ్బైపోయింది! గబగబా వెళ్లి “ఒలేవు! కన్నమ్మా!” అని కావులించుకు ఎత్తి కుదేసేవాడు. ఒళ్లంతా సలిపేసేవాడు.

కన్నమ్మకు తొమ్మిదేళ్లొచ్చాయి పోతన్నకు మతేమన్నా పదమూడేళ్లొచ్చాయి.

పైబడ్డ ఏడాదిలో ప్రాసెంటంకే — ఆమే దరగూడెంలో వాళ్లిద్దరికీ మహాజత అని అనుకునేవారు పిల్లలంతా. పెద్దవాళ్లున్నూ అనుకునేవారు, “ఇక వాళ్లిద్దరికీ పెళ్లి తప్పని సరిగా చేస్తేనే యీ ప్రపంచంలో ఈడూ జోడూ అనేపదానికి సార్థకం” అని.

గుంటకి పదేళ్లొచ్చాయి. గుంటడికి మతేమన్నా పధ్నాలుగేళ్లు వచ్చాయి.

ఈయేడాదిలో ప్రాసెంటంకే — పోతన్నకూ, కన్నమ్మకూ పెళ్లైందని అష్టాదశ వర్ణాల్లోను పట్నమంతా మోగిపోయింది. కన్నమ్మమెళ్లో పుస్తెమెఱుపు, పోతన్న కళ్లల్లో నిదానంగా సెడట్టుకు నిల్చిపోయాది.

పోతన్న కోఇరవైయేళ్లొచ్చాయి' కన్నమ్మ కోపదారేళ్లొచ్చాయి. కన్నమ్మ అత్తింటి కొచ్చి పోతన్నతో సరాసరి కూచుని, పేడుతియ్యాడం, అంచుకొయ్యాడం, పెనక్లు మొయ్యాడం, పడపదుయ్యాడం, ఇలాంటి కులవృత్తిపనుల్లో మసిలేది.

మనువుచనువుకొద్దీ, ఓరోజు మరీ దగ్గరనా ఆరుబయట కూర్చున్నారు పోతన్నా కన్నమ్మా యిద్దఱూను. కన్నమ్మ ఓచూపు తడికెను పుల్లాస పోస్తూవుంది. పోతన్న ఓపిసనకర్ర అల్లుతూవున్నాడు.

ఆసమయంలో వాళ్లచుట్టూవున్న జగత్తు ఎలావుందో ముందుగా ఆకలించి, తరువాతను వాళ్ల ఆంతరంగికప్రవృత్తి యోజిస్తే ఎటువంటి వానికైనా బోధపడుతుంది. ఈజగత్తు మిథ్య అనీ, మిథ్యకాదు అనలే లేదను, అక్కడున్న దల్లా పోతన్నా కన్నమ్మా ఇద్దఱే అని బోధ పడుతుంది.

నిజంగా చుట్టూవున్న పెంటపోగుల ధూళి, కసాయిదుకాణంమీదుగా ఎగిరివచ్చే గద్దయీగాల, గుడారోళ్ల కుక్కమొఱుగు, గుడిసెలయిఱుకు, ఇవేమిన్నీ వాళ్ల మనస్సుల్లో మననం గొల్పడంలేదు. వాళ్ల మనస్సుల్లో పనిచేస్తూవున్న దొకానొక ప్రేమ తరంగము! చిన్ననాటి వాళ్లయొక్క యొకానొక కల!—ఆకలవెలుగునే మెలకువగానే వాళ్లదైన యొకానొక నిదురజోగు.

కన్నమ్మ అంది పోతన్నతో — “ఈయేళ సివిసనకర్ర ఎవరిచేతుల్లో పడి మెరిసి

పోతుందో?" అని. పోతన్న "మహారాజులుంగారు పురమాయించేరే ఇది. ఆయనే విసురుకుంటారుట దీంతో" అన్నాడు. కన్నమ్మ వెంటనే అది "అబ్బో! అబ్బో! ఆకూంత విసినికర్రకే నీ వంత కులుకు కులికిపోతే నేనెంత కులికేదిరా యీ చూపుతడిక్కి! ఇది మహారాణీగారు పురమాయించేరు. ఆవిడ దీని వెనకాతనుండి నాట్యమాడతారంట" అంది.

సంతోషాశ్రులు ఇద్దరికీ వెల్లివిరిసిపోయినాయి పైసల్లాపంతో. ఇద్దరూ వారివారి చేతల్ని అమ్మజూపడానికి ప్రయాణమయినారు.

ఆరోజు చాలా ఉక్కగావుంది. అంజనీప్రియుడు మళ్లోతూరి ఏడుఘడియలు ఉగ్గబట్టడం ఆరోజునే అన్నట్లు మిక్కిలీ ముక్కిపోతూవుంది జగత్తు అంతా.

మహారాజావారూ, మహారాణీగారూ ఇద్దరూ కోటగోడలమధ్యన వుండి అనుకుంటూవున్నారు.

మహారాజావారు "ఇంకా పురమాయించిన విసనకర్ర రాలేదేమిరా?" అని. మహారాణీగారు "ఈగోడ తీసివేసి యిక్కడో చూపుతడికె కట్టించినా బాగుండేది. రవ్వంత యూపిరాడేదేమో!" అని.

ఎంతకూ మేదరవాళ్లెవళ్లూ విసనకర్రగాని, చూపుతడికెగాని తీసుకుని వచ్చిన జాడ కనపడలేదు. అందుమీద సేవకుల్ని పిలిచి, మహారాజావారు వెళ్లి కనుక్కొని ఆమేదరవాళ్లను రెక్కలు విరిచికట్టి తీసుకు రమ్మన్నారు.

సేవకులు కోటలోంచి వీథిలోకొచ్చి మేదరవాళ్లు వస్తున్నారేమోనని చూచేరు. మేదరపోతన్న, తా నానాడు మహారాజులుంగారికోసం అల్లి మహారాజులుంగారికోసం తీసుకువస్తూవున్న విసనకర్ర చేతపుచ్చుకుని తానే విసురుకుంటూ వీథంట నడుస్తూ, కోట కూడా దాటి అవతలవీథి కెక్కడకో పోతూ వున్నాడు.

అందుమీద సేవకులు మేదరపోతన్నను కూకేశారు. కాని పోతన్న వెనక్కు తిరిగి చూడ్డాయె. వాని నడకే పరుగులాగుంది. చేతిలోని విసనకర్రతో తన వొళ్లు విసురుకుంటూ పోతూవున్నాడు. వెనకచూపు లేనేలేదు వాని కళ్లల్లో. పోతన్న పెళ్లాం కన్నమ్మ అయినట్టాయినా చూపుతడిక నెత్తి నెట్టుకుని ఒకటేనడక ఒకటేనడక ఊరావలి ఉజ్జ్మండలంకేసి. తన సడను మాత్రం తనతోకూడా రమ్మన్నట్టు సంజ్ఞామాత్రంగా మునివ్రేళ్ల పూమట్టెల్ని సవ్వడిగావిస్తూంది.

సేవకులు వెళ్లి ఆరెండువింతలూ గెంపు మహాసమస్యల్లాగు రాజదంపతులకు విన్నవించారు. రాజదంపతులు ఆమేదరవాళ్ల వెఱ్ఱి యెట్టిదో గ్రహించుదామని, మేడదిగి,



పోతన్న:—ఓసీ! ఈ రోజున ఒక్క శరీరానికి చెమటపోయడమే కాదే, హృదయానిక్కూడా పోస్తూవున్నట్టుంది.”

13.  12.  10౨  [illegible]

కోటకొలువడి, తోటవిడిచి, పేటలోపడి, ఊరావలకు చేరుకున్నారు. రాజదంపతుల్తో అమాత్యాదులు, అమాత్యాదుల్తో ప్రజలు, ప్రజల్తో పశువులు, యావన్మందీ ఆ ఉక్క-పోతలో, ఎవళ్లయూర్పులగాలితోనే వాళ్ల వళ్లు ఆర్పుకుంటూ నడవసాగేరు.

చివరకు వింటే ఆ మేదరదంపతుల నోటి నుంచి తేలిన రహస్యం ఇది —

కన్నమ్మ: —"పోతన్నా! నీ వినసకర్ర మహారాజులుంగారి కివ్వక నివ్విసురుకుంటూ వున్నా వేమిరా? బాగుంటుందిరా? ఆ సంగతి చూస్తే మహారాజులుంగారు రుచ్చుకుంటార్రా" అంది.

పోతన్న: —"ఓసి! ఈ రోజున ఒక్క శరీరానికి చెమటపోయడమేకాదే, హృదయానిక్కూడా పోస్తూవున్నట్టుంది. చూడు, ఆలాంటప్పుడు నే ముందు విసురుకోకుండా యింకోళ్ల కీవినసకర్ర ఎలా ఇవ్వగలను చెప్పూ!" అన్నాడు.

"అదే నే నాలోచిస్తూవున్నదీని. ఈ రోజున ఉక్క-పోత నాలుగ్గోడమధ్యనీ వున్నట్టుగాలేదురా పోతన్నా! ఈ బ్రహ్మండలాన్ని కూడా తీసిపారేసి, ఆదిగ్భిత్తికి బయలుగా ఈచూపుతడికె కడితే ఎలావుంటుందో అని ఆలోచిస్తూపోతూవున్నాను" అంది కన్నమ్మ.

"అప్పుడు నీచూపుతడికెలోంచి స్వర్గం కనిపిస్తుంది" అన్నాడు పోతన్న.

విన్నవాళ్లంతా తాం భూమ్మీద పడుతూవున్న ఉక్క-బాధ మరిచిపోయి వాళ్లను వెఱ్ఱిగా చూడదొడగేరు. మహారాజులుంగారూ, మహారాణీగారూ కూడాను!



# నానాదేశ సందర్శనము

'గ్రహ' వీక్షణము

## 5. జర్మనీ

యూరపుఖండము మొత్తమునకు జర్మనీ పరిశుభ్రతలో నగ్రతాంబూలమునకు హక్కు గడించుకొన్నది. తీర్చైనరూపము, నీటయినశరీరము జర్మనుల కొక యపూర్వమైన అందమును సమకూర్చుచుండును. వారి గృహములు సైతము తుడిచిన యద్దములవలె శుభ్రముగ నుండును. గృహిణుల కార్యములలో గృహపరిష్కృతి ప్రముఖమైనది. జర్మనురైళ్లలో ప్రయాణికుల నిమిత్తము సబ్బులు, తువాళ్లు సదా పరచియుందురు. శుభ్రతలో వారి జాగ్రత్త అంత మేరమీరినది.

వారి రెండవనియమము క్రమపద్ధతి. దేశమునకు, కాలమునకు, వ్యక్తులకు అది మారుపడదు. విహారవనములందును కాలిబాటలలోనే ఒకక్రమమునకే పారాడవలయును. పచ్చికపరపులపై నడయాడుట తప్పు.

ప్రకృతిసౌందర్యవాంఛ బ్రిటిషువారి కున్నంత జర్మనులకు లేదు. కాని మందులు మాకులు మొదలగు వాని ప్రకటనపత్రములతో కట్టడముల, వీథుల, బజారుల అందమును రూపుమాపుట వారోర్వరు. వాస్తుశిల్పమున వారి కభినివేశము తక్కువ. బెర్లిను అంత రమణీయమైన నగరమేమియు కాదు. కాని ప్రకటనపత్రములకు మాత్రము మందు బ్రిటనులోవలె స్థానము దొరకుటయే లేదు. వాణిజ్యదృష్టి, పరకుల నమ్ముకొనవలయుననుమాత్రము వారి కున్నదేకాని వ్యాపారపటిమ వారికి పరిచితము కాని విద్య.

జాతీయక్రమశిక్షణకు, సంసిద్ధతకును జర్మనులు ప్రథమస్థానము నొసగెదరు. వీనికి తరువాతనే వ్యాపారము. జర్మనీకొరకు వ్యాపారము!

పెక్కు వర్తకసంస్థలు తమ విదేశీయ వాణిజ్య ఋణములను ఎప్పటికప్పుడు విడుదల చేయుచుండును. అది యొక మంచి వ్యాపారసరళి. సందేహము లేదు. విదేశములందు గల పరపతిని ఆ సంస్థలవారు కోలుపోవ నిచ్చగింపరు. కాని ఆ విడుదల ఆయానాటి మారకపు విలువ నిర్ణయముల ప్రకారము జరుగుచుండును. వ్యక్తులవలెనే సంస్థలును క్రమశిక్షణకు లొంగితీరవలసినదే.

జర్మనీ పాతమార్కు విలువను తగ్గించి, లక్షలాది జనములను వ్యాకులపాలు చేసినప్పుడు కూడ ప్రజలలో గగ్గోలు పుట్టలేదు. 'ఇది యేటి న్యాయ'మని నోరు మెదపినవాడు లేడు. జర్మనీకొరకు నష్టమునకును తలయొగ్గి తీరవలయును.

ఏ పనికి పూనుకొన్నను పరిపూర్ణముగ చేసి ముగించు నేర్పులో జర్మనులకు కొరత లేదు. పరిపూర్ణతయనునది జర్మనుల ఆదర్శము.

పాండిత్యమునగాని, పరిశోధనలో గాని జర్మనీ వెనుకాడలేదు. పండితులు, పరిశోధకులు అక్కడ వేనవేలు గలరు. కాని బోధకులు అంత తక్కువ. పలువురు మూర్తీభవించిన విజ్ఞానసర్వస్వము లున్నారు. కాని తమకు తెలిసినవిషయముల నితరులకు బోధపరచు నేర్పు మాత్రము వారికి లేదు.

అధికారులకుగాని, అనధికారులకుగాని ఆదరణీయమైనది విషయసమగ్రజ్ఞానము. మిడిమిడిజ్ఞానము-నూటికి నలుబది మార్కులవంటిది- జర్మనులలో నొక లెక్కకు రాదు. పరీక్షలలోకూడ నిదే పద్ధతి. ౧౯౧౪ లో రషియను సైన్యమును మార్కొన్నప్పుడు హిండెన్‌బర్గు ఆ సమరాంగణ ప్రాంతమందలి యొక్కొక్క పాదను విశేవారిగా నెరిగియుండెనట.

ఉద్యోగులు పరిపూర్ణమైన విషయజ్ఞానము కలిగియుండునట్లు శిక్షింపబడుదురు. ఏదో తెలుసునన్నచో చాలదు; వారు నికరమైన తెలివిడి కలిగియుండవల

యము. ఈ నియమమునే తక్కిన అన్ని విషయములం దును వారు పాటింతురు. నియమబద్ధత, విధేయత వారి సహజప్రావృత్తులు. అవి వారికి 'వేదచోదితమైన' ధర్మములు.

కర్మాగారముల ప్రణాళికలందును, యంత్రసా మగ్రి సమాదరణమునను, కాయకష్టమును తగ్గించుట యందును, ప్రమాణీకరణమునను జర్మనులు అహమహ మికతో నరుకుచుందురు. యాంత్రికశక్తికి కాయకష్టము నాహుతిచేయుటకును వారు వెనుకాడరు. జర్మనీలో నిరుద్యోగగణము ప్రబలుటకిదియు నొకహేతువు కాక పోదు.

జర్మనీలో వీరారాధన ప్రబలము; కాని సాను భూతి తక్కువ. ఫ్రాన్సు, ఇంగ్లండులవలె జర్మనీ యుద్ధము కారణముగా గుఖపడలేదు. యుద్ధమున నాత్మా ర్పణము కావించిన వీరులకై యది పరితపించలేదుగాని వారి ధైర్యసాహసముల కది మురిసినది.

కుటుంబానుబంధము జర్మనులలో మిగుల ప్రశం సాపాత్రముగ నుండును. భర్త - తండ్రి కుటుంబమున కంతకు పెద్ద; సర్వాధికారి. కుటుంబము యొక్క క్షేమశిక్షణ యతని యదుపుఆజ్ఞలలోనుండును. అతని మాట వేదవాక్కు, శాసనము. ఈ సర్వాధికారము తను సన్నలచేమాత్రమేకాని హింసాపద్ధతుల కందు జోక్య ముంపనేరదు. భార్యలను కొట్టుట యక్కడస్వప్నమం దును ఎరుగరానిది. త్రాగుడు జర్మనులలో చాల పరిమిత ము. జర్మనుల జీవనము మొత్తము మీద ఆడంబర మెరుగ నిది; సామాన్యమైనది మితవ్యయము వారి కాలంబనము.

బాలురకు విద్యనేర్పుట, వ్యాయామశిక్షణ నొసగుట తలిదండ్రుల ప్రథమవిధి. బాలికల గమ్యములు గృహనిర్వహణ కృత్యములు గావున వారి విషయమున తలిదండ్రులొకింత యుపేక్ష వహించినను తొందరలేదు. కాని బాలుర విషయమున నేమరుపాటు సహింపరానిది. ఇంగ్లండులో వలెనే యింతటి నిర్బంధము కానరాదు.

పాఠశాలలలో నుపాధ్యాయులుగూడ బాలుర విద్యవిష యమున దయాదాక్షిణ్యముల కాస్పద మీయరు. వారి విద్యావిధానములు చాల పొందికగానుండి మరులుగొల్పు చుండును వారి సాంకేతికవిద్యాశిక్షణ పరవశి కాదగినది.

విద్యాగంధములేని కాయకష్ట మాధునిక ప్రపం చమున కక్కరకురానిదని జర్మనులు నిక్కచ్చిగ నెరుగుదురు. యాంత్రికపరికరములయు, తదుపయోగ సాధనములయు శిక్షణ జర్మనువిద్యార్థులకు పాఠశాలలు అహంతతో నొసగును.

జర్మనులలో దీర్ఘకేశపాశములు గాయకుల హక్కు. ఇతరులు వాని నేవగింతురు. సామాన్యముగ నక్కడ అందరివి పొట్టిజుట్లే. కొందరుకొందరు సన్యాశిరమును శోభింపజేయునంతటి తీరున వెండ్రు కలను కత్తిరించుకొందురు. వారి శిరములను చూచినం తన అప్పుడే జెయిల్లనుండి విడుదలయివచ్చిన ఖైదీల శిరములు జ్ఞప్తికి వచ్చును జర్మనులు తమ శిరస్త్రాణము లను ప్రక్కల కొరగచేసికాక నడినెత్తిని ధరింతురు. చొక్కాయిల అడుగుగుండీలు తీసియుంచుట జర్మను లలో గొప్పతప్పిదము.

జర్మనులవ్రాతలు మిగుల నిడుదలు. విషయము లను యథార్థముగ, మరుగువరచక వివరించుట కీదైర్ఘ్య మును నారవలంబించుచుండుట యుక్తముగనే తోచుచున్నది. ఆవ్రాతలలోను నిడుదలగు సమాసపదములు మరింత ప్రాముఖ్యమును బడయుచున్నవి.

జర్మను యువకులు కోరదగినది, నిర్భుక్తమైనది, పరమార్థతః సాధింపదగినది శారీరక, మానసికపుష్టిగల తనయులను దేశమునకు ప్రసాదించి, దానిని బలవత్తరము చేయుట. గృహకార్యములు స్వయముగ నిర్వహించుట వారు పవిత్రధర్మముగ భావింతురు. ఈధర్మనిర్వహణము నకై వారికి గృహకార్యముల ప్రత్యేకశిక్షణ యొసగ బడుచున్నది. ఈపవిత్రధర్మమును నిర్వహించుటకు జర్మ ను యువతులు కుతుకపడుచుందురు.

# పంచదార పరిశ్రమ

## నాడు—నేడు

గూడూరు వెంకటాచలం

పంచదార పరిశ్రమ చరిత్ర చక్కనికథ. ఈకథ బాగుండకపోతే కథకుని లోపమేగాని చరిత్ర లోపం కాదు. ఈకథలోని అంకాలు ప్రత్యేక పవాలు, శ్రమనిస్తాయి. కాని భారతపరిశ్రమల నిమ్నోన్నతాలు చూచినపుడు ఆశ్రమ తప్పనిసరి/తప్పించవ్యం.

పంచదార ఉపయోగించని రోజు లేదు. అయినా అయిదారేళ్ల క్రిందటివరకు దానిని గురించి ఆలోచించ లేదు. అనాదికాలంనుంచి వస్తున్న మాంద్యంలో మరిచిపోయాము. రెండుమూడేళ్ల క్రిందటనుంచి ఆంధ్రుల ఆదరం ఎక్కువయింది. టారిఫ్ బోర్డువారు పంచదారకమిటీలు వచ్చి, రాజాశ్రయం, రక్షణశక్తివలనైతే పంచదారకు పలుకుబడి రపతి ఎక్కువయింది. మనరాజధానిలో అయిదేళ్ల క్రితం పంచదార ఫ్యాక్టరీలు కేవలం నాలుగుమాత్రమే ఉన్నాయి. ౧౯౩౩ ఆఖరుకి ౧౩ అయినవి. ఇంకా క్రొత్తవి బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నాయి. ఈపరిశ్రమ, గతమూ, ప్రస్తుతంకూడ ప్రోత్సాహకరంగానే ఉన్నవి. కాని ౧౯౩౪ ఏప్రిల్ నందు షుష్టరుగారు ప్రసాదించిన అదనపుపన్ను, విదేశపుపంచదారమీద అదనపురక్షణసుంకము తీసివేయడం చూస్తే భవిష్యత్తంత ప్రోత్సాహకరముగా లేదు. అయినా దేశీయుల ఉత్సాహకార్యకలాపాలంతో ఇవన్ని గడిచిపోయి ఇతరదేశములతో తుల తూగుతూ ఉండవచ్చును.

### ఇతిహాసము

పంచదార మనదేశము ౨౦౦౦ సంవత్సరముల క్రితముకూడా ఉన్నటుల నిదర్శనములు కన్పించు చున్నవి. శబ్దవిచక్షణచేయగా 'శర్కర' అని సంస్కృతములో, 'శక్కర' అని ప్రాకృతంలోను అనాది ప్రయోగము లున్నవి. వైదిక ధర్మములలో అనేకచోట్ల శర్కర ఉపయోగమును వివరించినారు. క్రీ. వె. ౬౨౭-౬౪౦ టాయిసంగ్ అను చైనాచక్రవర్తి కొంతమంది విద్యార్థులను చెరుకుపంటను పరిశ్రమను పరిశీలించుటకు బీహారు పంపినాడు. మొత్తముమీద చెరకుపంట పరిశ్రమకూడ ౧౯ వ శతాబ్దారంభమువరకును బాగుగనే వృద్ధిపొందినది. అప్పుడు భారతదేశము ఇతరదేశములకు కూడ ఎగుమతి చేయుచుండెడిది ౧౭ వ శతాబ్దాంత్యమందు భారతదేశపు పంచదారకు విలువ బాగుగా ఎక్కువయినది. అప్పుడు ఈస్టుఇండియాకంపెనీవారు ఈ అదనుగైకొని పంచదారను ఇక్కడ చవుకగాకొని ఇంగ్లండునందు లాభమునకు అమ్ముకొనుచుండెడివారు. ౧౭౯౧ నందు నాల్గుపళ్లీల పంచదారను బెంగాలునుండి ఎగుమతిచేసినారు. ఆపంచదారను వీశెకు రు ౨-౫-౬ మొ॥ రు ౪-౩-౬ వరకు విక్రయించిరి. ఈ బేరములో కంపెనీవారికి మొత్తముమీద నూటికి ౬-౦-౦ లాభము గిట్టుబాటయినది. తరువాత మనదేశమునుండి పంచదార ఎగుమతులు బాగుగా వృద్ధిపొందినవి. ౧౮౪౬ లో మన దేశమునుండి ౨౮౦౦౦౦ పుట్ల పంచదారను ఎగుమతి చేసినారు. అజీజ్‌పూరు, గోరఖ్‌పూరులందు ఫ్యాక్టరీలు స్థాపించినారు. ౧౮౬౫ లో మద్రాసురాజధానియందు ప్యారీ, బిన్నీ కంపెనీలవారు పంచదార ఫ్యాక్టరీలను స్థాపించినారు. ఈ సమయమున ఇంగ్లండు స్వేచ్ఛావర్తకనీతికి గడంగినది. దీవులయందు బానిసలను బాధించి వారికి కూలిలేకుండచేసి తయారుచేసిన పంచదార ఇంగ్లండులోనికి ఎగుమతి అగుట ప్రారంభమయింది. మన దేశములో కూలిఇచ్చి పనిచేయించుటవలన దీవులనుండి వచ్చిన పంచదార అంతచవుకగా గిట్టుబాటుకాలేదు. అందుచేత పరిశ్రమ క్రమేణ క్షీణించుట మొదలిడినది.

౧౮౮౧ ఈ పరిశ్రమను పునరుద్ధరించుటకు షుమారు ఏబది సంవత్సరములు పట్టినది. అయినా కేవల బీదవచ్ఛదంగానే ఉన్నది.

ఆధునికయంత్రసామగ్రితో కూడిన ఫ్యాక్టరీలను ౧౯౦౩ లో బీహారులో మొట్టమొదట స్థాపించినారు. ౧౯౦౦ నుండియు మన దేశములోనికి పంచదార దిగుమతి ఎక్కువయినది. ఆయేడాదికాయేడాదికి బాగుగా వృద్ధి పొందినది. యుద్ధసమయములో మాత్రము కొంచెము సన్నగిల్లినది.

| సంవత్సరము | దిగుమతిఅయినపంచదార | విలువ |
|---|---|---|
| ౧౯౧౦-౧౪ | ౩౩౭౯౨౭౦ పుట్లు | రు ౧౨౭౧౦౦౦౦౦ |
| ౧౯౧౪-౧౯ | ౨౫౯౧౩౨౬ పుట్లు | రు ౭౪౯౦౦౦౦౦ |

యుద్ధసమయములో విలువ ఎక్కువయినను తక్కువపుట్లను దిగుమతి చేసికొనినాము.

మరల ౧౯౨౩ నుండియు దిగుమతి బాగుగా ఎక్కువయినది. ఈవిధముగా ౧౯౨౯-౩౦ వరకు వృద్ధి పొందినది. ఆ సంవత్సరములో ౯౩,౭౯౭౦౦ పుట్ల పంచదారను దిగుమతిచేసికొన్నాము. ఇంత ఎక్కువగా ఏ సంవత్సరములోను దిగుమతికాలేదు.

ఈసంవత్సరమే మనముకళ్లు తెరిచాము. మనకు పంచదార అనేకదేశములనుండి వచ్చుచున్నది. అందులో జావా, మారిషస్‌దీవులు ప్రాముఖ్యత వహించినవి. ఈక్రింది పట్టికయందు ఏయేదేశములు మనదేశమునకు ఎన్నిటన్నుల పంచదారను దిగుమతిచేయుచున్నవియు, వానివిలువయు తెలుపబడియున్నది.

| దేశము | ౧౯౧౩--౧౪ | ౧౯౨౬--౨౭ | ౨౭-౨౮ | ౨౮-౨౯ | ౨౯-౩౦ | ౩౦-౩౧ | ౩౧-౩౨ | ౩౨-౩౩ |
|---|---|---|---|---|---|---|---|---|
| యునైటెడ్ కింగ్‌డము | ౯౦౦ టన్నులు | ౯౨౦౦ టన్నులు | ౪౦౦ టన్నులు | ౪౮౦౦ టన్నులు | ౫౯౩౦౦ టన్నులు | ౮౪౦౦ టన్నులు | ౨౯౯౦౦ టన్నులు | ౩౪౯౦౦౦ టన్నులు |
| సిలోను | ౧౦౦ ,, | ౨౧౦౦ ,, | ౨౮౦౦ ,, | ౪౦౦ ,, | ౩౬౦౦ ,, | ౫౭౦౦ ,, | ౧౧౦౦ ,, | ౧౦౦ ,, |
| జావా | ౫౮౩౦౦౦ ,, | ౬౧౧౭౦౦ ,, | ౬౯౨౨౦౦ ,, | ౮౫౧౮౦౦ ,, | ౭౮౧౧౦౦ ,, | ౮౦౯౭౦౦ ,, | ౩౬౬౮౦౦ ,, | ౯౪౮౦౦ ,, |
| మారిషస్ | ౧౩౯౬౦౦ ,, | ౧౦౦ ,, | .......... | .......... | .......... | .......... | .......... | .......... |
| స్ట్రైటు సెటిల్‌మెంటు | ౨౯౦౦ ,, | ౧౧౦౦ ,, | ౧౨౦౦ ,, | ౯౦౦ ,, | ౬౦౦ ,, | ౫౦౦ ,, | ౪౦౦ ,, | ౨౦౦ ,, |
| చైనా | ౧౫౦౦ ,, | ౩౧౦౦ ,, | ౩౧౦౦ ,, | ౨౧౦౦ ,, | ౬౧౦౦ ,, | ౫౧౦౦ ,, | ౫౦౦౦ ,, | ౨౨౦౦ ,, |
| జపాన్ | ౧౦౦ ,, | .......... | ౧౦౦ ,, | ౩౦౦ ,, | ౫౦౦ ,, | .......... | ౧౦౦ ,, | ౪౦౦౦ ,, |
| జర్మనీ | ౭౦౦ ,, | ౪౯౨౦౦ ,, | ౧౬౦౦ ,, | ౩౦౦ ,, | ౧౫౨౦౦ ,, | ౧౧౭౦౦ ,, | ౧౫౪౦౦ ,, | ౬౦౦ ,, |
| ఆస్ట్రియా | ౭౪౦౦ ,, | ౯౮౦౦ ,, | ౩౦౦ ,, | .......... | ౧౪౦౦ ,, | .......... | ౪౦౦ ,, | .......... |
| హంగేరి | | ౨౬౬౦౦ ,, | ౨౩౦౦ ,, | ౨౧౦౦ ,, | ౩౬౫౦౦ ,, | ౧౩౮౦౦ ,, | ౬౦౦ ,, | .......... |
| నెదర్‌లాండు | ............ | ౩౭౦౦ ,, | ౭౦౦ ,, | ౧౬౦౦ ,, | ౨౫౦౦ ,, | ౬౦౦ ,, | ౬౦౦ ,, | ౫౦౦ ,, |
| బెల్జియం | ............ | ౧౩౮౦౦ ,, | ౪౦౦ ,, | ౩౦౦ ,, | ౧౮౦౦ ,, | ౩౦౦ ,, | ౨౦౦ ,, | ౨౫౦౦ ,, |
| జెకోస్లోవికా | ............ | ౨౮౦౦ ,, | ౧౧౦౦ ,, | ౪౦౦ ,, | ౯౭౦౦ ,, | ౬౦౦ ,, | ౧౧౦౦ ,, | ౫౦౦ ,, |
| ఇటలీ | ........ | ౩౭౦౦ ,, | ౨౦౦ ,, | .......... | .......... | .......... | .......... | .......... |
| యునైటెడ్ స్టేట్సు | ........ | ౧౫౫౦౦ ,, | ౫౦౦ ,, | ౨౦౦ ,, | ౨౦౦ ,, | ౨౦౦ ,, | ౩౦౦ ,, | .......... |
| ఇతరదేశములు | ౧౦౦ | ౪౮౯౦౦ ,, | ౧౮౯౦౦ ,, | ౨౦౦ ,, | ౯౨౦౦ ,, | ౪౪౬౦౦ ,, | ౧౦౧౨౦౦ ,, | ౯౫౦౦ ,, |
| మొత్తము | ౮౦౩౬౦౦ ,, | ౮౨౬౯౦౦ ,, | ౭౨౫౮౦౦ ,, | ౮౬౮౮౦౦ ,, | ౯౩౯౬౦౦ ,, | ౯౧౦౨౦౦ ,, | ౫౧౬౧౦౦ ,, | ౩౬౯౫౦౦ ,, |
| ఖరీదు | ౧౪ కోట్లు ౯౮ ల. | ౧౮ కోట్లు ౩౬ ల. | ౧౪ కోట్లు ౫౦ ల. | ౧౫ కోట్లు ౮౬ ల. | ౧౫ కోట్లు ౫౧ ల. | ౧౦ కోట్లు ౫౪ ల. | ౬ కోట్లు ౧ లక్ష | ౪ కోట్లు ౧౨ లక్ష |

## దిగుమతి పన్నులు

ప్రతిదేశమందును ఆదేశపు పరిశ్రమలను రక్షించుటకై దిగుమతిపన్నులను విధించెదరు. దీనివలన ఆదేశ పరిశ్రమలు అభివృద్ధిచెందుటకై సావకాశము దొరుకును. మనదేశమందు ఈ రక్షణ ఎప్పుడును సరిగాలేదు. మొదటలో మనదేశములోనికి దిగుమతియగు పంచదారపన్ను నామమాత్రముగా నుండెడిది అందుచే జావా, హవాయిదీవులలోని పంచదారయంతయు ఇక్కడి కగుమతియగుచు చెల్లిపోవుచుండెడిది. ప్రభుత్వమువారు గూడ ప్రజాందోళనము గుర్తెరింగి నెమ్మదిగా పంచదార మీద దిగుమతిపన్నును హెచ్చుచేయుచు తరువాత కేవలము రక్షణసుంకముగా ఒనర్చిరి.

౧౮౯౪ - ౧౯౧౫ వరకు నూటికి రు ౫-౦-౦
౧౯౧౬ - ౧౯౨౧ మార్చివరకు ౧౦౦-కి రు ౧౦ ౦-౦
౧౯౨౧ - ౧౯౨౨ జూన్ వరకు ౧౦౦-కి రు ౧౫-౦-౦
౧౯౨౨ - ౧౯౨౫ జూన్ వరకు ౧౦౦-కి రు ౨౫-౦-౦
౧౯౨౫ జూన్ - ౧౯౩౦ ఫిబ్రవరి పుట్టికి ౧౯-౪-౦ చొ (౯౦-౦-౦ టన్ను ౧-కి)
౧౯౩౦ ఫిబ్రవరి - ౧౯౩౧ సెప్టెంబరు పు. ౧-కి ౩౮-౧౩-౬ చొ. (టన్ను ౧-కి ౧౮౧-౪-౦)

పై పన్నులో ౩౦-౧౫-౨ మాత్రమే అసలైన రక్షణసుంకము. మిగిలిన ౭-౧౪-౪ అదనపురక్షణగావిధించిరి. దీనినిప్పుడు తీసివైచినారు. కనుక ఇప్పుడు విదేశపు పంచదారమీద పు ౧ కి ౩౦-౧౫-౨ రక్షణసుంకము మాత్రమే యున్నది. ౧౯౨౫ నుంచి పన్నులువిధించుచున్న పంచదార దిగుమతి ఆగలేదు. దీనివలన ప్రభుత్వము వారికి క్రిందతెలుపబడినటుల రక్షణసుంకమువచ్చినది.

| | |
|---|---|
| ౧౯౦౦ - ౧౯౦౧ | ౫౩ లక్షల రూపాయలు |
| ౧౯౨౯ - ౩౦ | ౮ కోట్ల ౭౦ లక్షలు |
| ౩౧ - ౩౨ | ౮ కోట్లు |
| ౩౨ - ౩౩ | ౬ కోట్ల ౮౪ లక్షలు |
| ౩౩ - ౩౪ | ౬ కోట్ల ౧౦ లక్షలు |

ఇంత రక్షణసుంకము వచ్చుటకుగాను ఎంత పంచదార దిగుమతిఅయినది ఈక్రింది పట్టికయందు తెలుపబడినది.

| సంవత్సరము | దిగుమతిఅయినపంచదార టన్నులు | ఖరీదు కోట్లు | లక్షలు |
|---|---|---|---|
| ౧౯౧౩-౧౪ | ౮౦౩౬౦౦ | ౧౪ | ౨౯ |
| ౨౬ ౨౭ | ౮౨౬,౯౦౦ | ౧౮ | ౩౬ |
| ౨౭-౨౮ | ౭౨౫౮౦౦ | ౧౪ | ౫౦ |
| ౨౮-౨౯ | ౮౬౮౮౦౦ | ౧౫ | ౮౬ |
| ౨౯-౩౦ | ౯౩౯౬౦౦ | ౧౫ | ౫౧ |
| ౩౦-౩౧ | ౯౦౧౨౦౦ | ౧౦ | ౫౪ |
| ౩౧-౩౨ | ౫౧౬౧౦౦ | ౬ | ౧ |
| ౩౨-౩౩ | ౩౬౯౫౦౦ | ౪ | ౧౨ |
| ౩౪ అక్టోబరు వరకు | ౧౬౨౦౦౦ | ౧ | ౭౦ |

౩౦-౩౧ లోని రక్షణతరువాత దిగుమతులు ఎటులతగ్గిపోయినదియు పైపట్టికవలన గోచరమగును. అయినను గత ఏప్రిల్ వరకును ఉన్న టన్ను ౧ కి ౧౮-౪-౦ రక్షణసుంకము ఎక్కువయని చెప్పుటకు వీలులేదు. ప్రక్కపుటలోని తొలిపట్టికలో గన్పరచినటుల విదేశములందు పంచదారమీద విధించు రక్షణసుంకమును గాంచిన ఇది తగుమాత్రమే యనిపించును.

౧౯౨౯ నాటికి ౨౭౫౦౦౦౦ యకరములు చెరుకుక్రింద సాగుబడిలో ఉన్నది. అనగా ప్రపంచమంతటను చెరుకు సాగుబడియగుచున్న భూమిలో నాల్గవవంతు ఖరీదుకట్టిన ఇండులో పండినచెరుకు ౪౨ కోట్ల రూపాయలగుచున్నది. అయినను అప్పటికి ఏటేటా ౨౧ కోట్ల రూపాయిల పంచదార దిగుమతి అగుచున్నది.

ఈ పరిస్థితులలో టారిఫ్‌బోర్డువారు ౧౯౩౧లో భారతదేశ పంచదార పరిశ్రమకు ౧౫ సం॥ రక్షణ కోరిరి. ౧౫ సంవత్సరములలో మొదటి ౭ సం॥లు టన్ను ౧-కి ౧౪౫-౦-౦ చొ॥ మిగిలిన ౮ సంవత్సరములును టన్ను ౧-కి ౧౨౫-౦-౦ ఉండవలెనని తెల్పియుండిరి. ప్రభుత్వమువారు ఈ సూచనల కంగీకరించి రక్షణ నొసంగిరి.

| దేశము | తూకము | రేటు | వివరములు |
| --- | --- | --- | --- |
| భారతదేశము | టన్ను ౧ కి | ౧౮౧-౪-౦ | ఇందులో ౩౬-౪-౦ అదనపుపన్ను ౧౪౫-౦-౦ మాత్రమే రక్షణసుంకము. అదనపు పన్ను గత ఏప్రిలునందు రద్దుచేయబడినది. |
| జర్మనీ | ౧౦౦ కిలోలకు (౨౦౨-౪ పౌను) | ౨౮-౧౨-౦ లేక టన్ను ౧ కి ౨౮౭-౮-౦ | |
| జకోస్లావికా | ౧౦౦ కిలోలకు | ౧౪-౦-౨ లేక టన్ను ౧ కి-౧౪-౦౧-౮ | |
| ఫ్రాంసు | ౧౦౦ పౌనులకు | ౧౪-౦-౨ లేక టన్ను ౧ కి ౩౧౩-౮-౦ | జర్మనీ, ఫ్రాన్సు, ఐరిషు ఫ్రీ స్టేటునందలి రక్షణసుంకములను భారత దేశము సుంకములతో పోల్చి చూడుడు. |
| యునైటెడ్ కింగ్ డమ్ | టన్ను ౧ కి | ౧౭౩-౧౦-౪ | |
| ఐరిషుఫ్రీస్టేటు | టన్ను ౧ కి | ౩౪౨-౧-౪ | |
| కెనడా | టన్ను ౧ కి | ౨౦౮ ౧౦-౦ | |
| ఆస్ట్రేలియా | టన్ను ౧ కి | ౧౩౨ ౦-౦ | |
| దక్షిణాఫ్రికా | టన్ను ౧ కి | ౧౨౦-౫-౦ | |

## రక్షణ ఫలితము

రక్షణవలన సద్యః ఫలితము వచ్చినదని చెప్ప వచ్చును. షుమారు ౧౦౦ క్రొత్తఫ్యాక్టరీలకు స్థాపించినారు. వీనిలో ఒక్కొక్కదానిలో సగటున ౬౦౦ టన్నులచెరకు ఖర్చగుచున్నది. ఫ్యాక్టరీలు హెచ్చగుట మనము ఏటేటా దిగుమతిచేసుకొనుచున్న పంచదార యంత్రాలయముల విలువ చూచిన బాగుగా తెలియును.

| సంవత్సరము | సామాను దిగుమతిఅయినదేశములు — సామానుఖరీదు, లక్షలలో | | | | |
| --- | --- | --- | --- | --- | --- |
| | యునైటెడ్ కింగ్ డమ్ | జర్మనీ | బెల్జియం | ఫ్రాంసు | మొత్తము |
| ౧౯౨౮ ౨౯ | ౧౬౩౦ | ౨౩ | ... | ౬౧ | ౧౭౧౪ |
| ౨౯ - ౩౦ | ౮౪౯ | ౮ | ౩ | ౩౦ | ౮౯౦ |
| ౩౦ - ౩౧ | ౧౦౮౨ | ౨౩ | ... | ౨౩౦ | ౧౩౬౮ |
| ౩౧ - ౩౨ | ౨౬౨౨ | ౧౧౮ | ౨౨ | ౨౨౨ | ౩౦౧౪ |
| ౩౨ - ౩౩ | ౯౧౪౮ | ... | ... | ... | ౧౫౩౧౧ |
| ౩౩ - ౩౪ | ౧౬౬౮౯ | ... | ... | ... | ౨౭౭౭౦ |

"త్రాగేవాడు ఇచ్చును తాళ్లపన్ను" అను సామెత యున్నది. ఆలాగున ఈపన్నులన్నియు కొనుగోలుదారు భరింపవలసియుండు ననుకొనెదరు. కాని అట్టి అవసర మేమాత్రమును లేదు. ఈపన్నులవలన స్వదేశీపంచదార విదేశీపంచదారకంటె మణుగు ౧కి ౨-౦-౦ తక్కువగా దొరకుచున్నది. అయినను మనదేశమందలి పంచదార చవుకఅయి అందరికి అందుబాటులో నుండుటకు అనేకసమస్యలున్నవి.

౧. యు. పి. బీహారునందు పంచదారఫ్యాక్టరీలు విపరీతముగా బయలుదేరినవి. మద్రాసు, బెంగాలు రాజధానులందు ఫ్యాక్టరీలు చాలా తక్కువగా నున్నవి. వివిధరాజధానుల కెగుమతిచేయుటకు రైల్వేరేట్లు అనుకూలముగా నుండవలెను.

౨. పంచదార పరిశ్రమయందు ప్రస్తుతము వ్యర్థాగా పోవుచున్న మొలాసుల నుపయోగపరుపవలయును.

౩. అధమము సాలుకి ఆరునెలలయినను యంత్రాలయములు పనిచేయుటకు వీలుండునట్లుగా చెరుకుపంట యుండవలెను.

## ఆధునికవిధానముల ప్రాముఖ్యత

మనదేశంలో చెరుకునుంచి బెల్లంవండడం తరతరాలబట్టి వస్తోంది. కాని ఇది ఆర్థికంగా ఆరోగ్యరీత్యా ఎంత లాభకరము అనేవిషయ మాలోచించాలి. ఆరోగ్యం గురించి వాదవివాదాలు ప్రబలాయి ఆర్థికరీత్యా ఇది దేశానికి నష్టకరమని సుప్రసిద్ధ ఆర్థికవేత్తల అభిప్రాయం. దీనిక్నే ౧౯౩౧లో పంచదార కమిటీవారు తమ నివేదికయందు తెలియపర్చారు.

"భారతదేశమందు పండు చెరుకులో నూటికి (రసములో) ౧౨ వంతులు పంచదారయుంటుంది. ఆధునికవిధానా లవలంబించిన నూటికి ౯త్త వంతులు తీయవచ్చు. ప్రస్తుతము బెల్లమువండుటచేత, నూటికి ౨/౭ వంతులుమాత్రం తీస్తున్నారు. జావాలో నూటికి ౧౧ వంతులు సామాన్యంగా తీస్తారు"

దీనినిబట్టి చూడగా జావాలోకంటె మనము రసంలోనుంచి నాల్గుకంతులు తక్కువ తీస్తున్నాము.

భారతదేశమందు చెరుకురసమునుండి తీయుచున్న పంచదార :

| సంవత్సరము | నూటికివంతులు | జావాలో |
|---|---|---|
| ౧౯౨౩ - ౨౪ | ౮. ౪౫% | |
| ౧౯౩౧ - ౩౨ | ౭. ౭౯% | ౧౧. ౯౨ |
| ౩౨ - ౩౩ | ౭. ౬౬% | |

ప్రస్తుతము మనదేశమందు కూడ కొన్ని ఫ్యాక్టరీలలో నూటికి ౧౧ వంతులు తీయుచున్నారు. ప్రాతపద్ధతులవలన మనదేశమందు షుమారు ౩౦ లక్షల టన్నుల బెల్లము తయారగుచున్నది. ఈ బెల్లము కొంత బెల్లముగనే ఉపయోగపడుచున్నది. మరికొంత బెల్లమునుండిపంచదారచేయు ఫ్యాక్టరీలయందు ఉపయోగించుచున్నారు. బెల్లమునుండి పంచదారతీయుట అంత లాభదాయకము కాదు. అందువలన అట్టిఫ్యాక్టరీల సంఖ్య మిగిలినవానితో పోల్చి చూచిన తక్కువగనే యున్నది.

ఈ క్రిందిపట్టికయందు బెల్లమునుండి పంచదార తయారుచేయుచున్న ఫ్యాక్టరీలసంఖ్యయు, ఎంతబెల్లము కరిగించినదియు, నూటికి ఎన్నివంతులు పంచదార వచ్చినదియు తెలుపబడినది.

| సంవత్సరము | బెల్లమునుండి పంచదారతీయు ఫ్యాక్టరీల సంఖ్య | కరిగించినబెల్లము టన్నులు | తయారయిన పంచదార టన్నులు | ౧౦౦కి ఎన్ని వంతులు అయినది |
|---|---|---|---|---|
| ౨౩-౨౪ | ౨౨ | ౧,౨౦౩౦౧ | ౫౬౪౦౬ | ౪౬.౭౭ |
| ౨౫ | ౧౩ | ౬౭౪౫౧ | ౩౫౫౯౩ | ౪౯.౦౮ |
| ౨౬ | ౧౯ | ౮౩౯౧౪ | ౩౭౪౦౯ | ౫౧.౯౬ |
| ౨౮ | ౨౨ | ౧౧౨౬.౮౧ | ౫౭౦౭౭ | ౫౧.౫౫ |
| ౩౧-౩౨ | ౧౮ | ౧౨౬౧౫౯ | ౬౯౫౩౯ | ౫౫.౧౨ |
| ౩౩-౩౪ | ౨౨ | ౧౬౨౦౦౦ | ౯౧౦౦౦ | ౫౬.౧౮ |

చెరుకునుండి బెల్లము, దానినుండి పంచదారచేయుటలో చాలానష్టమున్నది. ౧౦౦ మణుగుల చెరుకునుతీసుకొని బెల్లమువండి దానిలోనుండి పంచదారతయారుచేసిన ౫త్తి మణుగుల పంచదారవచ్చును. అనూరుమణుగుల చెరుకునుండి సరాసరి పంచదార తయారుచేసిన ౯ మణుగులవరకు వచ్చును. అనగా దీనివలన ౩త్త మణుగుల పంచదార లాభము వచ్చుచున్నది. అందువలన చెరుకు రసమునుండి పంచదారచేయు ఫ్యాక్టరీలసంఖ్య నానాటికి వృద్ధియగుచున్నది. ఈ దిగువపట్టికలో చెరుకురసమునుండి పంచదారను తయారుచేయుచున్న ఫ్యాక్టరీల సంఖ్యయు, వానిలో తయారయిన పంచదారయు, నూటికి ఎన్నివంతులు వచ్చినదియు తెలుపబడినది.

| సంవత్సరము | ఫ్యాక్టరీలసంఖ్య | తయారయిన పంచదార టన్నులు | ఎన్నివంతులు వచ్చినదియు నూటికి | జావాలో ౧౦౦కి ఎన్ని వంతులు వచ్చినదియు నూటికి |
|---|---|---|---|---|
| ౧౯౧౯-౨౦ | ౧౯ | ౨౩౩౦౦ | ... | ... |
| ౨౩-౨౪ | ౨౩ | ౩౮౩౧౨౪ | ౭.౪౫% | ౧౧ ౪౪% |
| ౨౬-౨౭ | ౨౫ | ౬౨౯౪౧ | ౮.౪౭% | ౧౦.౮౫ |
| ౩౦-౩౧ | ౨౯ | ౧౧౯౮౫౯ | ౯.౦౯ | ౧౧.౪౩ |
| ౩౧-౩౨ | ౩౨ | ౧౫౮౫౮౧ | ౮.౮౯ | ౧౧.౯౨ |
| ౩౨-౩౩ | ౫౭ | ౨౯౦౧౭౭ | ౮.౬౬ | ... |
| ౩౩-౩౪ | ౧౩౫ | ౭౦౦౦౦౦ | ౮.౯ | ... |

చివరను ఇచ్చిన ఫ్యాక్టరీలసంఖ్యలో కొన్ని ౧౯౩౪ జనవరి ౧౫నాడు వచ్చిన భూకంపమువలన పాడయిపోయినవి. రక్షణ ఇచ్చినప్పటినుండి రోజుకి రోజూ క్రొత్త ఫ్యాక్టరీలు, నూతన విధానా లవలంబించడంచేత మన దేశంలో ...... పంచదార పరిశ్రమ దినదినాభివృద్ధి పొందుచుండిన ఇతరదేశములందువలె మనదేశమందు కూడ పంచదార విస్తారముగా నిలువయుండిపోవునని సందేహముంప వచ్చును. ఇంపీరియల్ షుగర్ టెక్నాలజిష్టు శ్రీ వాస్తవాగారు ౧౯౩౫ ఆఖరుకు మనకు కావలసినదానికంటె ౬౦౦౦ టన్నులు నిలువయుండునని అంచనా వేసియున్నారు. ఆయన అంచనా ప్రకారము దిగువపట్టికయందు మనదేశము మొత్తమునకు కావలసిన పంచదార అంకులో మనదేశమందు తయారగుచున్న మొత్తమును తెలుపబడియున్నవి.

## పంచదార కావలసినదానికంటె ఎక్కువ తయారగుచున్నదా?

ప్రతిదేశమందును ఉత్పత్తికిని విడుదలకును సామరస్య ముండవలెను. లోగడ గనబరిచినటుల భారతదేశ

| పంచదార | ౧౯౩౧-౩౨ | ౩౨-౩౩ | ౩౩-౩౪ | ౩౪-౩౫ |
|---|---|---|---|---|
| ఖర్చుఅయిన లేక కావలసినది | ౯౮౨౫౪౦ ట. | ౯౪౦౦౦౦ట. | ౯౪౦౦౦ ట. | ౯౪౦౦౦౦ ట. |
| మనదేశమందు తయారయినది | ౪౭౮౦౦౦ ట. | ౬౨౬౦౦౦ ట. | ౮౮౬౦౦౦ ట. | ౯౪౬౦౦౦ |
| దిగుమతిఅయినది లేక మిగిలిపోయినది | ౫౦౪౫౪౦ట. | ౩౧౪౦౦౦ ట. | ౫౪౦౦౦ ట. | ౬౦౦౦ ట. మిగిలిపోవును |

పై అంకెలను బట్టిఅయినను ఈ ౬౦౦౦ టన్నులు ఎక్కువయని చెప్పుటకు వీలులేదు. ౩౧-౩౨ అంకెలను బట్టి చూచిన పంచదారఖర్చే తగ్గుట కానిపించుచున్నది. మనదేశమందు పరిశ్రమ బాగుగా వృద్ధిపొంది ఖరీదు తగ్గుటతోడనే ఇంకను ఎక్కువ ఖర్చు కావచ్చును.

(౧) వర్తకమాంద్యము తగ్గినకొలదియు ఎక్కువ పంచదార ఖర్చుఅగును.

(౨) పంచదారఖరీదు తగ్గిన కొనుబడి ఎక్కువగును.

ఇందుకు నిదర్శనముగా ౧౯౨౯-౩౦ లో మణుగు ౧ కి ౯-౦-౦ అమ్మినపుడు ౧,౨౧౫,౫౮౫ టన్నులు ఖర్చుఅయినది. ౧౯౩౦-౩౧ లో మ ౧ కి ౮-౧౧-౦ అయినప్పుడు ౧౩౨౪౯౨౩ టన్నులు ఖర్చు అయినది. దీనినిబట్టి మ. ౧కి ౦-౫-౦ తగ్గుటచే ౧౦౯౩౩౮ టన్నులు ఎక్కువ ఖర్చుఅయినది.

(3) ప్రజలు విస్తారము బెల్లము వాడుచున్నారు. కాలక్రమేణ బెల్లమంతయు పంచదారవాడుటలోనికి మారును.

ఈ క్రిందిపట్టిక నందు మనిషి ౧ కి ఎన్ని పౌనుల బెల్లము, ఎన్ని పౌనులపంచదార వాడుచున్నదియు తెలియబఱ్చబడినది

| సంవత్సరము | మనిషికి వాడిన పంచదార | మనిషికి వాడిన బెల్లము | మనిషికి మొత్తము వాడినబెల్లము పంచదారకలిపి |
|---|---|---|---|
| ౧౯౨౩-౨౪ | ౪ 3/8 పౌనులు | ౧౬ ౭/౮ పౌనులు | ౨౧ ౨/౪ పౌ |
| ౧౯౨౯-౩౦ | ౮ 3/5 ,, | ౧౧ ౯/౧౦ ,, | ౨౦ ౨/౩ ,, |
| ౩౦-౩౧ | ౭ ౫/౫ ,, | ౧౪౨ ,, | ౨౨ ౬/౫ ,, |
| ౩౧-౩౨ | ౬ ,, | ౧౭ 3/5 ,, | ౨౩ 3/5 ,, |
| ౩౨ ౩౩ | ౫ ౪/౫ ,, | ౨౦ ౨/౫ ,, | ౨౬ ౨/౯ ,, |

పై పట్టికను చూచిన అసలుపంచదార బెల్లము వాడుటయందే వృద్ధికన్పడుచున్నది దేశము ఆర్థికస్థితి బాగుపడిన ప్రపంచమందు అన్నిదేశములతో సమానముగ మనముకూడ వాడుతాము. ప్రస్తుతము పంచదార వాడుటయందు మనదేశము వెనుకబడియున్నది. ఈ దిగువపట్టికయందు మనిషి ౧ కి వాడుపంచదార మొత్తము తెలుపబడియున్నది.

సగటున మనిషికి వాడుచున్న పంచదార

| దేశము | ౨౯-౩౦ | ౩౦-౩౧ |
|---|---|---|
| యూరపు | | |
| జర్మనీ | ౫౫.౮ పౌనులు | ౫౫.౬ పౌనులు |
| జకోస్లావికా | ౬౧.౧ ,, | ౬౦.౨ ,, |
| ఆస్ట్రియా | ౭౨.౧ ,, | ౬౪.౪ ,, |
| స్విట్జర్‌లెండు | ౯౩.౭ ,, | ౯౮.౫ ,, |
| ఫ్రాంసు | ౫౫.౩ ,, | ౫౭.౩ ,, |
| బెల్జియం | ౬౧.౯ ,, | ౬౧.౭ ,, |
| యునైటడ్ కింగ్‌డమ్ | ౯౬.౮ ,, | ౧౦౮.౫ ,, |
| డెన్మార్కు | ౧౧౫.౭ ,, | ౧౧౯.౩ ,, |
| యూరపు సగటున | ౩౯.౫ ,, | ౪౨.౧ ,, |
| చైనా | ౪.౯ ,, | ౪ ,, |
| ఇండియా | ౨౦.౫ ,, | ౨౨.౨ ,, |
| జపాను | ౨౮.౨ పౌనులు | ౨౭.౨ పౌనులు |
| పర్షియా | ౨౪.౭ ,, | ౨౨ ,, |
| ఆసియాసగటు | ౧౫.౪ ,, | ౧౫.౯ ,, |
| ఆఫ్రికా | ౧౩ ,, | ౧౨.౩ ,, |
| అమెరికా | ౭౯ ,, | ౭౪ ౯ ,, |
| ఆస్ట్రేలియా | ౧౧౧.౧ ,, | ౧౦౭ ౮ ,, |
| ప్రపంచం మీద సగటున | ౩౦.౪ పౌనులు | ౩౦.౮ పౌనులు |

## చెరుకుపంట

పంచదారపరిశ్రమకుగాని, బెల్లమునకుగాని, తినుటకుగాని ఏటేట ౫ కోట్ల, ౫౦ లక్షల టన్నుల చెరకును పండించుచున్నారు. ఇందులో అధికభాగము యు. పి. యందు పండుచున్నది. సర్ టి. విజయరాఘవాచారిగారు బట్లరు పరిశోధనాలయముపట్ట ప్రదానోత్సవసందర్భమున మాట్లాడుచు మద్రాసు బొంబాయిరాజధానులందు పంటచెరకుబొక్క మీరటు, గోరఖపూరుజిల్లాలయందు పండుచున్నదని వ్రాసియున్నారు.

అయినను చెరకుపంట ప్రోత్సాహకరముగా యున్నదని చెప్పుటకు వలనుపడదు. చెరకునందు సరియైన విత్తనములు నాటుటలేదు. స్వభావతఃపూర్వాచారపరాయణులైన భారతదేశపురైతు వానిమరువా

గింపను. ఈపంట అన్నిరాష్ట్రములందును సమానముగ లేదు. ఈదిగువపట్టికయందు ఏయేరాష్ట్రములందు ఎన్ని యకరములు సాగుబడిలోయున్నదియు తెలుపబడినది.

| రాష్ట్రము | యకరముల సంఖ్య | మొత్తము సాగుబడిలో నూటికి వంతులు |
|---|---|---|
| యు. పి. | ౧౮౩౧౦౦౦ | ౫౧.౭ |
| పంజాబు | ౪౬౮౦౦౦ | ౧౪.౬ |
| బీహారుఒరిస్సా | ౪౧౭౦౦౦ | ౯ ౯ |
| బెంగాలు | ౨౫౧౦౦౦ | ౮.౨ |
| మద్రాసు | ౧౨౦౦౦౦ | ౩.౬ |
| బొంబాయి | ౧౦౨౦౦౦ | ౩.౩ |

ఇప్పుడిప్పుడు క్రొత్తవిత్తనముల వాడుటయందు యభివృద్ధి గాంపించుచున్నది. ౩౩-౩౪ లెఖ్ఖల ప్రకారము మొత్తము చెరుకుసాగుబడి సగముకుపైగా క్రొత్తవిత్తనములతో చేయుచున్నారు.

| సంవత్సరము | క్రొత్తవిత్తనములచేసాగగుచున్న యకరముల సంఖ్య |
|---|---|
| ౧౯౨౩-౨౪ | ౬౦౬౦౪ |
| ౧౯౩౦-౩౧ | ౭౧౮౦౪౯ |
| ౩౧-౩౨ | ౧౧౮౦౪౬ |
| ౩౨-౩౩ | ౧౭౧౪౩౭ |

విత్తనము ఉపయోగించుటయందు తగుజాగ్రత్త వహింపవలయును. యు. పి. వ్యవసాయశాఖవారి నివేదిక ప్రకారము కోయంబుత్తూరు నెం ౨౧౫ మామూలు పరిస్థితులయందు బాగనే యుండును. కాని దీనికి తెగుళ్లు వచ్చిన ఏమాత్రమును నిలుబడజాలదు. తెగుళ్లధాటికాగు ఒకు నెం॥ ర్లు॥ ౨౦౦-౨౪౭ బాగుగ యుండును. దేశవాళీవిత్తనమువలన య ౧-కి ౧౩ టన్నులవచ్చుండిన కోయంబుత్తూరువిత్తనములచే ౩౬ టన్నులవరకు పండుచున్నది.

మనరాష్ట్రమునందు ౧౯౩౨-౩౩ లెఖ్ఖల ప్రకారము లక్షఎకరములు చెరకు సాగగుచున్నది. ఇక్కడ ఉష్ణము ౨౦-౨౬ డిగ్రీ మధ్యయుండును. అందుచేత కోయంబుత్తూరువిత్తనములు బాగుగకావేమో! (?) అయినను కృష్ణాజిల్లాయందు కోయంబుత్తూరువాడినచోట ౪౦ టన్నులుకూడ అయినది. టారిఫ్‌బోర్డువారి లెఖ్ఖల ప్రకారము చెరుకు మ ౧-కి ౦-౨-౦ మొదలు ౦-౧౨-౦ వరకు ఖర్చగుచున్నది. కాని ప్రస్తుతము ౦-౪-౦ మొ॥ ౦-౬-౦ వరకు గిట్టుబాటగుచున్నది.

పండినచెరుకంతయు అనేకవిధముల యుపయోగించుచున్నాము.

౧. మామూలురసమునుండి పంచదార తయారుచేయుట

౨. బెల్లముచేయుట

౩. గ్రామాదులందు బెల్లపుపాకము, ముతకపంచదారచేయుట

౪. విత్తనములకు

౫. పచ్చిచెరుకునే ఉపయోగించుట

పై విధముల ఎంతఎంతచెరుకు ఏయేటు ఉపయోగింపబడుచున్నదో క్రిందిపట్టికయందు గన్పరుపబడినది.

| సంవత్సరము | ఫ్యాక్టరీలలో ఉపయోగించినది | బెల్లమునుండి పంచదార చేయుటకు | గ్రామములందు ముతక పంచదారకు | ఊరికే నములుటకు | బెల్లముగా ఉపయోగించుటకు | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| | టన్నులు | టన్నులు | టన్నులు | టన్నులు | టన్నులు | టన్నులు |
| ౨౩-౨౪ | ౫౧౪౦౦౦ | ౧౨౦౩౦౦౦ | ౪౦౦౦౦౦ | ౫౩౦౦౦౦౦ | ౨౮౪౪౭౦౦౦ | ౩౭౪౫౦౦౦౦ |
| ౨౫ | ౪౩౪౦౦౦ | ౬౭౫౦౦౦ | ౪౦౦౦౦౦౦ | ౫౧౨౦౦౦౦ | ౧౯౬౨౮౦౦౦ | ౨౯౩౬౬౦౦౦ |
| ౩౦ | ౧౩౧౮౦౦౦ | ౫౮౮౦౦౦ | ౪౦౦౦౦౦౦ | ౫౨౫౦౦౦౦ | ౨౪౬౩౬౦౦౦ | ౩౫౮౭౦౦౦౦ |
| ౩౧ | ౧౮౭౩౦౦౦ | ౧౨౬౨౦౦౦ | ౫౦౦౦౦౦౦ | ౫౪౦౦౦౦౦ | ౨౯౭౮౧౦౦౦ | ౪౩౩౧౬౦౦౦ |
| ౩౨-౩౩ | ౩౩౫౦౦౦౦ | ౧౬౨౦౦౦౦ | ౫౫౦౦౦౦౦ | ౫౫౦౦౦౦౦ | ౩౪౫౯౫౦౦౦ | ౫౦౦౦౦౦౦౦ |

చెరుకు పంటనుబట్టియే ఆయా రాజధానులందు ఫ్యాక్టరీలు వృద్ధిపొందుచున్నవి. ఈ దిగువపట్టికయందు ఆయా రాజధానులందు పనిచేయుచున్న ఫ్యాక్టరీలసంఖ్య తెలుపబడినది.

| రాజధాని పేరు | పనిచేయుచున్న ఫ్యాక్టరీలసంఖ్య | | | |
|---|---|---|---|---|
| | ౧౯౩౧-౩౨ | ౩౨-౩౩ | ౩౩-౩౪ | ౩౪-౩౫ |
| యు. పి. | ౧౪ | ౩౩ | ౭౦ | ౫౦ |
| బీహారు, ఒరిస్సా | ౧౨ | ౧౯ | ౩౪ | ౩౭ |
| పంజాబు | ౧ | ౧ | ౯ | ౧౨ |
| మద్రాసు | ౨ | ౨ | ౧౧ | ౧౩ |
| బొంబాయి | ౧ | ౧ | ౮ | ౧౦ |
| బెంగాలు | - | - | ౨ | ౬ |
| బర్మా | ౧ | ౧ | ౮ | ౧౦ |

పంటయందభివృద్ధి, పరిశ్రమయందభివృద్ధి గాంచిన ఇకంతయు రక్షణ ఫలితమని వేరు చెప్పపని లేదు. ౧౦-౭-౧౯౩౩ సిమ్లాలో జరిగిన షుగరు కాన్ఫరెన్సునందు అన్ని రాష్ట్రముల ప్రతినిధులును రెండు సంవత్సరముల రక్షణవలన ఊహాతీతమైన యభివృద్ధి బొందినదని తెల్పిరి. మనరాష్ట్ర ప్రతినిధి యగు పరిశ్రమాధికారి మద్రాసు రాజధానియందలి పరిశ్రమల పూర్వోత్తరముల నగ్గడించుచు మనరాష్ట్రమందు సంవత్సరమునకు లక్ష టన్నులు ఖర్చగుచున్నదనియు, అందులో ౫౫ వేల టన్నులు దిగుమతి అగుచున్నదనియు, ఈ దిగుమతి ఆగిపోవువరకు రక్షణ లాభముపొందినదని చెప్పుటకు వీలు లేదనియు ననెను.

## ఫ్యాక్టరీదారులకు, చెరుకు పండించు రైతులకు గల పరస్పర సంబంధము

౧౯౩౩ జూలైలో సిమ్లాలో జరిగిన షుగర్ కాన్ఫరెన్సునందే ఈ విషయమైకూడ చర్చ జరిగినది. రైతుల రక్షణకై చెరుకుధరను నిర్ణయించు చట్టము ఒకటి యుండవలెనను ఉపపాదన వచ్చినది. కాని చాలామంది దీనికంగీకరింపలేదు. ప్రస్తుతమిచ్చుచున్న ధరలు బాగుగనేయున్నవనిరి. ఇంపీరియల్ షుగర్ టెక్నాలజిస్టు శ్రీవాస్తవగారి సలహా బాగుగాయున్నది. ఆయన సలహా ప్రకారము ఒకమణుగు చెరుకునుండి తయారగు పంచదార ఖరీదులో సగము రైతుకియ్యవలెను. దీనినిబట్టి ఆరైతు చెరుకులో పంచదార ఎంతఎక్కువగా నుండిన అంత ధరవచ్చును. దీనినిబట్టి రైతు మంచివిత్తనముల నుపయోగించి తనచెరుకులో పంచదార నెక్కువచేయ ప్రయత్నించును. ఈ పంచదారమొత్తమును ప్రభుత్వమువారు నిర్ణయించవలెను. ఉదాహరణమునిమిత్తము ఈక్రింది పట్టికయందు చెరుకురసములో నూటికిగల పంచదారను బట్టి అప్పటికుగల పంచదారబజారుధర కనుగుణముగా మణుగు ౧ కి చెరుకుధర నిర్ణయించబడినది.

| పంచదార ధర మ. ౧ కి | మణుగుచెరుకునుండి తీయగల్గిన చెరుకును బట్టి చెరుకుధర మ. ౧ కి | | | | |
|---|---|---|---|---|---|
| | పంచదార నూటికి ౮. ౫ మ. అయిన | ౧౦౦ కి ౮. ౭౫ వంతున అయిన | ౯ వంతులు అయిన | ౯. ౨౫ వంతులు అయిన | ౯. ౫ వంతులు అయిన |
| | రు. అ. పై. | రు. అ. పై. | రు. అ. పై. | రు. అ. పై. | రు. అ. పై. |
| ౮-౦-౦ అయిన | ౦-౫-౬ | ౦-౫-౭ | ౦-౫-౯ | ౦-౫-౧౦⅓ | ౦-౬-౧ |
| ౮-౮-౦ | ౦-౫-౯ | ౦-౫-౧౧⅓ | ౦-౬-౧౪ | ౦-౬-౩ | ౦-౬-౬ |
| ౯-౦-౦ | ౦-౬-౧⅓ | ౦-౬-౪ | ౦-౬-౫⅓ | ౦-౬-౭⅓ | ౦-౬-౧౦ |
| ౯-౮-౦ | ౦-౬-౫⅓ | ౦-౬-౭⅓ | ౦-౬-౧౦ | ౦-౭-౦⅓ | ౦-౭-౩ |
| ౧౦-౦-౦ | ౦-౬-౯ | ౦-౭-౦ | ౦-౭-౩ | ౦-౭-౫ | ౦-౭-౭ |

13    12-    12

మొదటలో టారిఫ్ బోర్డువారు పంచదార తయారుచేయుటకు, ౮-౩-౩ అగుననియు తర్వాత ౬-౧౦-౯ కు తగ్గుననియు అంచనా వేసిరి. నూటికి రు. ౧౦-౦-౦ లాభము వేసినను మ. ౧ కి ౯-౫-౯ మొదట లోను, తర్వాత ౭-౧౨-౪ ౫౫ చొ. అమ్మవచ్చునని అంచనావేసిరి. కాని వీరు అంచనావేసినప్పుడు మొలా సులమీద మ ౧ కి ౦-౧౦-౮ చొ. బాగాసీ (చెరుకు పిప్పి)మీద మ. ౧ కి ౦-౬-౯ రావచ్చుననుకొనిరి. కాని ఇప్పుడు మొలాసులమీద దమ్మిడీ అయినను గిట్టుబాటు అగుటలేదు. అందుచేత టారిఫ్ బోర్డువారి అంచనా ప్రకారము మ. ౧ కి ౮-౧౧-౧౧ మొదటలోను తర్వాత ౭-౧-౬ ఖరీదు అగుచున్నది.

కాని యథార్థస్థితి గమనించిన మ. ౧ కి ౭-౦-౦ మొదలు ౭-౪-౦ గిట్టుబాటగుచున్నది. అమ్మకపు ధర ౮-౮-౦ యున్నది. ఈపరిస్థితులలో రైతులకు చెరుకునకు మణుగు ౧ కి ౦-౬-౦ చొ. ఇచ్చుచున్నారు. దీనివలన రైతున క్షేమియు నష్టములేదు. పరిశ్రమబాగుగాలేనప్పుడు రైతునకు మణుగు ౧ కి ౦-౧-౬ లేక ౦-౫-౦ మాత్రమే దొరుకుచుండెను. ౧౯౩౪ జనవరి ౪ వ తారీఖున పాట్నాలో జరిగిన షుగరుకాన్ఫరెన్సునందు బీహారువ్యవసాయ శాఖాధికారి మ. ౧ కి ౬౦౦, లేక ౮౦౦ మణుగుల చెరుకు తయారగుననియు, దీనికిగాను రైతుకు మ ౧ కి రు. ౧౨౫ లేక ౧౫౦ ఖర్చుఅగును. అందువలన రైతుకు మణుగు ౧ కి చెరుకు ౦-౨-౦ లేక ౦-౨-౬ ఖర్చు అగుచున్నది. ఇప్పుడు మ. ౧ కి ౦-౬-౦ దొరుకుచున్న మొత్తముమీద రు ౧౫౦ మొదలు ౨౦౦ వరకు లాభము వచ్చుచున్నది.

జావాయందు చెరుకుపండించురైతులే ఫ్యాక్టరీల యందు వాటాదార్లు అయియున్నారు. ఈపద్ధతినే ప్రస్తుతము కృష్ణాజిల్లాయందుస్థాపించిన ఫ్యాక్టరీలయందు అనుసరించియున్నారు. ప్రతివాటాకును కొన్ని ఎకరముల చెరుకుసాగు ఉండవలయును. దీనివలన నాల్గు లాభము లున్నవి.

౧. ఫ్యాక్టరీయందు అధికలాభమునకై మంచి విత్తనము వేసిన చెరుకునందు పంచదార వృద్ధిచేయును.

౨. సరియైనకాలమునందు ఫ్యాక్టరీకి చెరుకు అందుబాటులో యుండును.

౩. ఫ్యాక్టరీల పోటీవలన చెరుకుకు ఎక్కువ వెల నీయవలసిన యవసరముండదు.

౪. ఫ్యాక్టరీలాభమే తనలాభముగ రైతు గ్రహించును.

కాని ప్రస్తుతము కృష్ణాజిల్లాచెరుకుపంటవిషయము ఆర్థికముగలాభదాయకముగాదేమోఅనిసంశయముప్రబలుతోంది. దీనికి ముఖ్యంగా ఫ్యాక్టరీదారులు, ప్రభుత్వమువారి సహాయముతో ప్రస్తుతము యు. పి. బీహారునందున్న కేనుకంట్రోలుఆక్టును అములులోనికి తెచ్చిన బాగుండును. ఫ్యాక్టరీదారులు రైతులకు చెరుకువిత్తనముల సప్లయిచేయుటలో ఈదిగువ విషయములను గమనించవలెను.

౧. ఫ్యాక్టరీయజమానులు రైతులందరకు ఒకే నెంబరు విత్తనమునివ్వక వివిధనెంబర్ల విత్తనమును ఇవ్వాలి. ఇది ముఖ్యము. ఆయానెంబర్లు పంటగు వచ్చు కాలమును గుర్తించి ఇవ్వవలెను. కోయంబత్తూరు విత్తనములు ఏడునెలలు మొదలుకొని పదుకొండు నెలల వరకు పంటకువచ్చేవి ఉన్నాయి. తక్కువ కాలంలో పంటకు వచ్చువానియందు చెరుకు తక్కువగా పండును. అయినప్పటికి దీనివలన ఫ్యాక్టరీ త్వరగా పని ప్రారంభించడానికి వీలవుతుంది. అందుచేత తక్కువకాలముల పంటకువచ్చు చెరుకును పండించు రయితులకు చెరుకుకు కొంచెము ఎక్కువధర ఇచ్చినవారికి ఆనెంబరును పండించుటకు ఉత్సాహకరంగా ఉంటుంది.

౨. చెరుకుపండించు రైతులందరకును ఆఫ్యాక్టరీ అందుబాటులో నున్నవారందరికిని చెరుకు మ. ౧ కి ౦-౫-౬ కంట్రోలు ఆక్టుప్రకారం గ్యారంటీచెయ్యాలి.

౩. రైతుకుగాని, ఫ్యాక్టరీదార్లకు గాని నష్టము గాకుండునటులు ఒకచెరుకుపరిశీలకుని (Cane superi-

ntendent) నియమించాలి. ఈ పరిశీలకుడు రిఫ్రాక్టోమీటరు అనుయంత్రముద్వారా ఆయారైతుల పొలములందు చెరుకును పరిశీలించుచు నష్టముగాకుండగ కోయదగిన సమయమును వారికి తెల్పును దానినిబట్టి వారిచెరుకును ఫ్యాక్టరీయందు అదనుకు విడుదలయగునట్లు చూడాలి. అనగా ఈచెరకు పరిశీలకుడు రైతులకు ఫ్యాక్టరీవారులకు మధ్యవర్తిగా ఉంటాడు. ఇది జేబులో ఇమిడిపోవు చిన్నయంత్రము. దీనిని ఎక్కడికైనను తీసుకొనిపోయి చిన్నచెరుకుముక్కను దానిలో పెట్టిపిండిన ఆరసమునందుగల పంచదారయు దాని స్వచ్ఛతయు గూడ తెలియచేస్తుంది. దీనివలనను చెరుకుకోయదగిన యదను పాడయిపోవునసమయం తెలుస్తుంది.

౪. ప్రస్తుతము వృథాగాపోవుచున్న మొలాసులను రోడ్లు వేయుటయందు (బెంగుళూరులో ఉపయోగించియున్నారు) ఉపయోగించవలయును. లేనిచో పొలములో వేసినను నత్రజనిని బాగుగా వృద్ధిపరిచి ఎరువుగా పనిచేయును. దీని విషయమై నీలరత్న ధరగారు చాలా పరిశోధనచేసి మొలాసులను పొలములందు వేసిన అగమము నూటికి అయిదారు వంతులయిన వృద్ధి అవుతుంది.

### పరిశోధనావశ్యకత

౧౯౩౫ మార్చిలో సప్రూకమిటీఎదుట డాక్టరు హిగ్గిన్ బాథమ్స్‌గారు సాక్ష్యమిచ్చుచు "౧౧ కోట్ల ౨ లక్షలు జనాభాగల యునైటెడుస్టేట్సునందు ౩౦౦౦ పరిశోధనాలయములుగలవు. ౩౫ కోట్లుగల భారతదేశమందు అందులో మూడవవంతైన లే"వని చెప్పియుండిరి. పంట, పరిశ్రమ, పరిశోధనకు అత్యంత సన్నిహిత సంబంధము గలదు. పరిశోధనతో అనుగుణ్యముసాగుబడి, పరిశ్రమయుండిన దేశము వృద్ధిలోనికివచ్చును.

టారిఫ్‌బోర్డువారు చెరుకుపరిశోధనకై ఏటేటా ౧౦ లక్షలు ఖర్చుపెట్టవలెనని చెప్పిరి. ౮౬ వేల యకరములు సాగుబడియందున్న జావాయందు

పొసయిర్‌బీమ పరిశోధనాలయమునకు ౧౪ లక్షలు ఖర్చుపెట్టుచున్నారు. ౨ లక్షల ౭౫ వేలయకరములు సాగుబడియున్న కోట ౧౦ లక్షలు పరిశోధనకై ఖర్చుపెట్టుట విచారకరము.

నోయల్ డియర్‌గారు జావాయందుజరుగుచున్నటుల భారతదేశమందుగూడ చెరుకునందు ఈ దిగువవిధముల జరుగవలెనని సూచించిరి.

౧. చెరుకుసాగుబడి.
౨. చెరుకుతెగుళ్లు.
౩. పరిశ్రమ విధానములు.
౪. ఆర్థికపరిశోధన.

**వ్యవసాయము:—** ముందర భూమిస్వభావము బాగుగా పరిశోధింపవలయును. దానినిబట్టి దానికివలయు ఎరువులు నిర్ణయింపవలయును. చెరుకునందు క్రొత్తవిత్తనముల తయారుచేయుచుండవలయును. భూమి, వాతావరణములబట్టి విత్తనముల నిర్ణయించవలయును.

**చెరుకు తెగుళ్లు:—** తెగుళ్లను కలుగజేయు సూక్ష్మజీవుల జీవితచరిత్రను సమగ్రముగా పరిశోధించి వలయు నివారణములకనిపెట్టవలయును. భూమి ఆతెగుళ్లను ఎంతవరకు దోహదముచేయునో పరిశీలింపవలయును. ఆ రోగము ఆభూమియందు అంతకు పూర్వమున్నదో ఎంతకాలమునుండియున్నదో చూడవలయును. వీనినిబట్టి దున్నుట, రాసాయనికము, నీటిపారుదలనిర్ణయింపవలయును.

**పరిశ్రమయందు పరిశోధన:—** పరిశ్రమయందు సూక్ష్మవిధానము లనుసరించుటకై ప్రత్యేక మొకఫ్యాక్టరీయందు పరిశోధన సలుపవలయును. ఆ ఫ్యాక్టరీఖర్చు ఫ్యాక్టరీలసంఘమో, ప్రభుత్వమో భరింపవలయును. మిగిలినఫ్యాక్టరీలన్నియు ఆపరిశోధన ఫలితములబట్టి మార్పులు కలుగజేయుచుండవలయును.

**ఆర్థిక పరిశోధన:—** సాగుబడి ఆర్థికముగా ఉండవలయును. మనదేశమందు సగటున య. ౧కి ౧౩ టన్నులచెరుకు పండుచున్నది. దీనిలోనుండి నూటికి ౯ వంతులు పంచదారవచ్చును. జావాయందు చూచిన య. ౧కి ౫౦ టన్నులచెరుకు అగును. దీనిలో నూటికి

౧౨వంతులు పంచదార తయారగును. అనగా జావా యందు మ. ౧.కి ౬ టన్నులు పంచదార అగుచున్నది. మనదేశమందు ౧౯ టన్నులగును. హవాయిదీవులందు ౭ లేక ౮ టన్నులుకూడ తయారగుచున్నది. రైతు పంటను, పరిశ్రమను వృద్ధిచేసిన పంచదార ధరతగ్గి అందరకు అందుబాటులో ఉండును. రైతుకు యు. ౧ కి ౪౦ టన్నులు చెరకు అయిన మ. ౧కి ౦-౨-౦ చొ. ఇచ్చినను ౧౭౦-౦-౦ వచ్చును. అప్పుడు నూటికి ౧౦ వంతులు పంచదార తీయగల్గిన మ॥ ౧కి॥ ౪-౮-౦ గిట్టుబాటుయగును. దీనికంతయు పరిశోధన సలుపవలయును. ఇందులకై ప్రభుత్వమువారు ఖర్చుపెట్టు పది లక్షలుచాలవు. గత ఏప్రిలునందు విధించిన ఎక్సైజువలన వచ్చు ౧౪౭ లక్షలలో నాల్గవవంతు ౩౭ లక్షలైన ఖర్చుపెట్టుట వాంఛనీయము.

## మొలాసులను, బాగాసి నుపయోగించుట

గానుగలనుండి వచ్చిన పిప్పియు సెంట్రిఫ్యూగల్ యంత్రములనుంచి వచ్చిన మొలాసులను సరిగా నుపయోగించుటలేదు. వీనినుండి ఎంతఎక్కువ మూల్యము రాబట్టిన పరిశ్రమకు అంతలాభముగా యుండును.

మొలాసుల ఉపయోగము:—— సెంట్రిఫ్యూగలు యంత్రములోనికి వచ్చిన చెరుకు రసములో ౯వంతులు పంచదారయు ౪ వంతులు మొలాసులునుండును. మొదటలో దీనిని కొంత ఎరువుక్రింద చవుకబారు పంచదార తానలలోనికి ఉపయోగించినను ఇప్పుడు మిగిలిపోయిన మొలాసులన్నిటికి ఉపయోగము కనుబడుటలేదు.

| | మిగిలిపోయిన మొలాసులు |
|---|---|
| ౧౯౩౦-౩౧ | ౨౬౯౦౦౦ టన్నులు |
| ౩౧-౩౨ | ౩౬౬౦౦౦ ,, |
| ౩౩-౩౪ | ౫౦౦౦౦౦ ,, |

వీనిని అనేకవిధముల నుపయోగింపవచ్చును.

౧. మెథిలేటెడ్ స్పిరిటును తయారుచేయుట
౨. పశువుల మేత
౩. ఈష్టు తయారుచేయుట
౪. ఎరువులు
౫. రోడ్లమీదవేయుట
౬. పంచదారతొనలు తయారుచేయుట
౭. ఇంధనముగా వాడుట
౮. పెట్రోలునందు కలిపివాడుటకు ఆల్కహాలు తయారుచేయుట

౧. మెథిలేటెడ్ స్పిరిటుతయారుచేయుట:—మనము ప్రతిసంవత్సరము దాదాపు ౧౦ లక్షల గ్యాలన్ల స్పిరిటును దిగుమతి చేసుకొనుచున్నాము.

| | | |
|---|---|---|
| ౧౯౩౧ ౩౨ | ౧౦౦౫౨౪౦౦ | గ్యాలన్లు |
| ౩౨-౩౩ | ౮౫౬౮౦౦ | గ్యాలన్లు |

విదేశములందు పంచదారపరిశ్రమ లాభమునకై మోటారుకారులందు వాడు పెట్రోలునందు నూటికి కొన్నివంతులు చొ॥ స్పిరిటు కలుపవలెనని శాసనమున్నది. దీనివలన దేశమందు తయారగు స్పిరిటు ఖర్చు అగును. ఈ శాసనముచే మోటారుకారులకు నష్టమేమాత్రమును లేదు. మనదేశమందు ౧౦౦కి ౮౦ వంతులు పెట్రోలు ౨౦ వంతులు స్పిరిటు కలుపవలెనను శాసనముంచిన ఉత్తరహిందూస్థానమునందు ౧౦౯౬౦౦౦ గ్యాలన్ల స్పిరిటు ఖర్చగును. కాని ఉత్తరహిందూస్థానమున మిగిలిపోవు మొలాసులనుండి స్పిరిటుతీసిన ౨౩౦౦౦౦౦౦ గ్యాలన్ల స్పిరిటువచ్చును. ఉత్తరహిందూస్థానమందు మిగిలిపోయిన ౧౩౦౦౦౦౦౦ దక్షిణదేశమున ఖర్చుఅగును.

మొలాసులు మిగిలిపోవుటవలన వానిధర ఎట్లు పోవుచున్నదో క్రిందిపట్టికవలన గోచరమగును.

| | మ ౧ కి ధర |
|---|---|
| ౧౯౩౧ | ౧-౮-౦ |
| ౩౨ | ౦-౧౦-౦ |
| ౩౩ | ౦-౪-౦ |
| ౩౪ | ౦-౦-౦ |

ఇందులకుగాను స్పిరిటుమీదపన్నును ౧౦౦ కి ౭౫ నుండి ౨౫ చేయవలయును. అప్పుడు దిగుమతి పూర్తిగా ఆగిపోవును. ఇందువలన ప్రభుత్వమువారికి ౭౫ వేలుమాత్రమే నష్టము కల్గును. అఖిలభారత వ్యవ

సాయ పరిశోధక సంఘమువారు ఈ విషయమై ప్రభుత్వమువారికి సిఫార్సు చేసియుండిరి. అందులకై అమృతసరము, కాన్పూరునందు డిస్టిలరీలుండవలెనని. స్పిరిటు తయారుచేయుటకు కూడ ఎక్కువ ఖరీదు అవజాలదు. దీనివలన ప్రస్తుతము వృథాగా పోవుచున్న మొలాసులకు మ ౧ కి ౦-౬-౦ గిట్టుబాటగును.

మెథిలేటెడ్ స్పిరిటు చేయుటకుగాను
గ్యాలను ౧ కి అగుఖర్చు.

| | |
|---|---|
| మొలాసులు మ. ౧-కి ౦-౬-౦ చొ॥ గ్యాలను స్పిరిటు చేయుటకు అగుమొలాసుల ఖరీదు | ౦-౪-౯ |
| వీనినుండి స్పిరిటుచేయు పరికరములకు | ౦-౨-౯.౬ |
| పాల్లుపోవుటచే | ౦-౦-౭.౭ |
| స్పిరిటుసాంద్రత వృద్ధి చేయుటకు | ౦-౧-౨ |
| గ్యాలనుస్పిరిటు కగుఖర్చు—— | ౦-౯-౪.౩ |

ఎట్లుచూచినను గ్యాలను ౧కి ౦-౧౧-౦ కంటె ఎక్కువ కాజాలదు.

చెరుకుపిప్పి, లేక బాగాసి నుపయోగించుట:—

ప్రస్తుతము బాగాసిని బాయిలరునందు బొగ్గుకు బదులుగా వాడుచున్నారు. ౧౩ టన్నుల బాగాసి ౧ టన్ను బొగ్గుతో సమానముగా నుపయోగించును. ప్రస్తుతం బొగ్గుధరల బట్టిచూచిన టన్ను ౧ కి ౨-౦-౦ కంటె ఎక్కువ గిట్టుటలేదు. అందుచేత ఇట్లుపయోగించు టంత లాభకరముకాదు.

౨. కాగితపరిశ్రమయందు బాగాసిని బాగుగా నుపయోగింపవచ్చును. బాగాసియందు ౧౦౦ కి ౪౦ మొదలు ౫౦వరకు కాగితముల చేయుట కుపయోగించు సెల్యులోజు ఉన్నది. ఇందులో ౨౦ వంతులు తీసినను మంతకకాగితములు తయారుచేయవచ్చును.

౩. కృత్రిమపుపట్టును తయారుచేయుట.

౪. ప్యాకింగుకాగితము అట్టలను తయారు చేయవచ్చును. యునైటెడ్ స్టేట్సునందు ప్యాకింగు కాగితము తయారుచేయుటకు క్యూబానుండి బాగాసిని దిగుమతి చేసుకొనెదరు. మనము ప్రతిసంవత్సరము దిగుమతి చేసుకొను ప్యాకింగుపేపరు, అట్టలు వానిఖరీదు ఈ కింది పట్టికయందు తెలుపబడినది.

| సామాను | ౧౯౩౧-౩౨ తూకము టన్నులలో | ఖరీదు రూపాయలు | ౧౯౩౨-౩౩ తూకము టన్నులలో | ఖరీదు రూపాయలు |
|---|---|---|---|---|
| ప్యాకింగుపేపరు | ౧౦౨౪౧ | ౩౧౩౧౦౧౬ | ౧౬౨౪౪ | ౪౫౩౫౧౦౦ |
| ప్రాత వార్తాపత్రికలు | ౪౧౮౬౬ | ౩౪౫౧౬౦౮ | ౪౭౩౬౯ | ౪౨౩౮౫౮౪ |
| అట్టలు | ౧౦౨౪౪ | ౧౪౯౮౩౮౪ | ౧౫౮౪౫ | ౨౦౯౩౯౦౫ |

భార్గవాగారు డెహ్రాడూన్ ఇటలీ పరిశోధనాలయమునందు పరిశీలించి బాగాసి కాగితపరిశ్రమయందుపయోగించిన టన్ను ౧-కి ౭ లేక ౮ రూపాయలు గిట్టుబాటుఅగునని నిర్ణయించిరి. సరళమైన రైల్వేరేట్లతో కాగిత యంత్రాలయములకు టన్ను ౧-కి ౧౨-౦- లకు దొరుకును. దీనివలన ఉభయులకు లాభము గల్గును.

## పంచదార పరిశ్రమ - ఇతరదేశాల్లో

ప్రతిదేశమందును ఆదేశమునకు కావలసిన పంచదారకంటె ఎక్కువ తయారుచేయుచున్నారు. దీనివర్తకపుపోటీ హెచ్చయిపోయినది. ప్రక్కపట్టికయందు ప్రపంచమందు ఖర్చుఅయిన పంచదారయు, తయారయిన పంచదారయు మిగిలిపోయినదియు తెలుపబడినది.

| సంవత్సరము | తయారైన పంచదార టన్నులు | ఖర్చుఅయిన పంచదార టన్నులు | మిగిలిపోయిన పంచదార టన్నులు |
|---|---|---|---|
| ౧౯౨౪-౨౫ | ౨౪౯౨౫౦౦౦ | ౨౩౨౫౬౦౦౦ | ౧౬౬౯౦౦౦ |
| ౨౫-౨౬ | ౨౬౦౪౪౦౦౦ | ౨౪౭౧౨౦౦౦ | ౧౩౩౨౦౦౦ |
| ౨౯-౩౦ | ౨౮౪౭౧౦౦౦ | ౨౭౦౧౫౦౦౦ | ౧౩౭౬౦౦౦ |
| ౩౦-౩౧ | ౩౦౨౦౮౦౦౦ | ౨౭౫౭౩౦౦౦ | ౨౬౩౫౦౦౦ |
| ౩౧-౩౨ | ౨౭౭౭౧౦౦ | ౨౬౯౯౬౨౦౦౦ | ౭౫౧౦౦ |
| ౩౨-౩౩ | ౨౬౩౩౧౦౦ | ౨౬౩౦౨౦౦ | ౯౨౦౦౦ |

ఈ విధముగా ఏడాదికేడాది మిగిలిపోవుటవలన ధరలుపడిపోయి నష్టముకలుగుచుండుటచే ౧౯౩౧ మే ౯-వ తారీఖున ప్రపంచమందు పంచదారతయారు చేయు తొమ్మిదిముఖ్యదేశములు కూడి కొంత మొత్తము కంటె ఎక్కువ తయారుచేయకూడదని నిర్ణయముచేసుకొనినవి. కాని జావా, క్యూబా యంత్రాలయాధికారులు ఈ ఎగ్రిమెంటు ప్రకారము నడుచుకొనలేదు.

జావాయందు ౧౯౨౮ మొదలుకొని ౧౯౩౨ వరకు ౧౮౯ ఫ్యాక్టరీలు పనిచేసినవి. ౧౯౩౩లో మన పరిశ్రమ వృద్ధిచెందుటచేనేమి, పంచదార మిగిలిపోవుటచేనేమి ౯౯ మాత్రమే పనిచేసినవి. ౧౯౩౪లో ౪౦ మాత్రమే పనిచేయగల్గినవి. ఇటులనే చెరుకుసాగుబడిలో యున్న యకరముల సంఖ్యకూడ పడిపోయినది.

౧౯౨౮—౪౨౮౯౮౫ యకరములు
౧౯౩౩—౨౧౯౦౦౦ ,,
౩౪— ౭౬౦౦౦ ,,

ఇప్పటికిని జావా ౨౫౦౦౦౦ టన్నుల పంచదార ౨⅓ సంవత్సరములలో ఎగుమతి చేయవచ్చునని అంచనావేసినారు.

జావాయందు పరిశ్రమ వృద్ధియగుటకు అనేక కారణము లున్నవి. జావాజనాభా ౩౫౦౦౦౦౦౦. వైశాల్యము ౫౦౦౦౦ చదరపుమైళ్లు. కూలి చవుకగా ఉండును. చెరుకుసాగు, పంచదారపరిశ్రమ ఒకేసంస్థ చేతిక్రింద ఉండును. జావా, క్యూబాలయందు చెరుకు రసము తీయుకాలము కొంచె మెక్కువగా నుండును.

| దేశము | రసము తీయుకాలము |
|---|---|
| క్యూబా | జనవరి మొదలు జూన్ వరకు |
| జావా | మే—నవంబరు |
| నేటాలు | మే—డిసంబరు |
| ఇండియా | అక్టోబరు—ఏప్రిల్. |

అక్కడ సాగునం దవలంబించిన నూతనవిధానములచే యకరము ౧కి తయారగుచెరుకు, అందుండి వచ్చు పంచదారకూడ ఎక్కువగా నుండును.

| దేశము | య ౧కి॥ తయారగు చెరుకు | | య ౧కి॥ తయారగు పంచదార | | చెరుకు పంటకు కావలసిన కాలము | |
|---|---|---|---|---|---|---|
| జావా | ౪౫ | టన్నులు | ౫.౫ | టన్నులు | ౧౧-౧౫ | మాసములు |
| హవాయి | ౪౫ | ,, | ౫.౫ | ,, | ౧౭-౨౪ | ,, |
| క్యూబా | ౨౦ | ,, | ౨ | ,, | ౨ | సంవత్సరములు |
| ఫిలిపైన్ | ౨౦ | ,, | ౨ | ,, | ౧౧-౧౪ | మాసములు |
| దక్షిణఆఫ్రికా | ౨౦ | ,, | ౨ | ,, | ౨ | సంవత్సరములు |
| భారతదేశము | ౧౬. | ,, | ౧.౨౫ | ,, | ౧ | సంవత్సరము |

జావా, హవాయిదీవులందు ఫ్యాక్టరి ౧కి ఏడాదికి ౧౭౦౦౦ టన్నుల పంచదార తయారగును. మనదేశమందు ౬౫౦౧ టన్నులు తయారగును. ఇదికూడ అన్ని ఫ్యాక్టరీలయందు తయారుకాజాలదు. చాలాఫ్యాక్టరీలు ౫౦౦౦ టన్నులకంటె తక్కువ తయారు చేయును.

తదితరదేశములందు ౧ టన్ను పంచదారచేయుటకు షుమారు ౭⅓ టన్నులచెరుకుకంటె ఎక్కువ యక్కరలేదు కాని మనదేశమునందు ౧౧⅓ టన్నుల వరకు కావలయును. దీనివలన ఖరీదు ఎక్కువగుచున్నది.

| దేశము | ౧ టన్ను పంచదార చేయుటకు కావలిసిన చెరుకు | అంత చెరుకు నుపయోగించు ఫ్యాక్టరీలసంఖ్య |
|---|---|---|
| క్యూబా | ౭⅓ టన్నులు | ౭౦ |
| హవాయి | ౭ ౧/౫ టన్నులు | అన్నియుకూడ |
| జావా | ౭¾ టన్నులు | చాలామట్టుకు |
| క్వీన్సులాండు | ౬¾ టన్నులు | మొత్తముమీద అన్నియు |
| ఇండియా | ౧౧⅓ టన్నులు | ౫౨ |

దీనికితోడు స్వదేశపంచదార అనిన భారతీయుల నిరసన ఉదాసీనతగూడ హెచ్చుగా యున్నది. జావా పంచదార మ ౧-కి ౧౦-౮-౦ కలకత్తా మార్కెట్టు ధర అయియున్నది. ఇందులో ౬-౬-౦ అసలు ఖరీదు. ఇదేరకము స్వదేశపంచదార మ ౧-కి ౭-౮-౦ మొ. ౭-౧౦-౦ వరకు అమ్ముచున్నది. దీనివలన షుమారు ౨౦౦౦౦౦౦౦ అయిన భారతదేశపరిశ్రమకు నష్టము వాటిల్లుచున్నది. ఫ్యాక్టరీలు ఎక్కువయిపోయినందున పోటీఎక్కువగానుండి చాలాతక్కువధరలకు అమ్ముచున్నారు. అందులకుగాను ఒక కేంద్రవిక్రయసంఘము నిర్మించి దానిద్వారా ఫ్యాక్టరీలవాటాల ననుసరించి అమ్ముచుండిన అంత చవుకగా అమ్మవలసినయవసర ముండదు. జావాయందుగూడ ఇదేపద్ధతి నవలంబించి యున్నారు.

## రైల్వే సౌకర్యములు

పరిశ్రమల బాగోగులు రైల్వేలపై ఆధారపడి యున్నవి. విదేశపరిశ్రమ లంత లాభకరముగా నుండుటకు విదేశపు రైల్వేలేకారణము. రైల్వేరేట్లు చాలాచిత్రముగాయుండును. దేశమందు ఒకపట్టణమునుండి మరియొక పట్టణముకంటె రేవుపట్టణమునకు చవుకగానుండును. ఇటులే ముడిసరుకులు, తయారయిన సరుకుల రేట్లయందుకూడ తారతమ్యముండును. యు. పి. నుండి మద్రాసునకు ఎగుమతి చేయవలయునన్న మ. ౧కి ౧-౫-౦ రేటు ఇవ్వవలెను. జావానుండి మద్రాసుకుగాని, బొంబాయికి ఓడకేవు మ. ౧కి నాలుగు లేక అయిదు అణాలుండును. స్వదేశీపంచదార విదేశపంచదారకంటె తక్కువగా అమ్ముచున్నది. ఈపరిస్థితులలో నూటికి ౧౫వంతులు రైల్వేచార్జి ఇచ్చుట చాలా కష్టము. దీనివిషయమై టారిఫ్‌బోర్డువారు అనేక సలహాలొసంగియుండిరి. ఇవి ఆచరణలోనికి వచ్చి రైల్వేసౌకర్యము లేర్పడువరకు పరిశ్రమల భవిష్యత్తు బాగుండదు.

## పులిమీద పుట్ర

ఏవిధముగా చూచినను భారతదేశ పంచదార పరిశ్రమ విదేశపంచదారపరిశ్రమతో పోటీ చేయజాలదు. రక్షణవచ్చిన తర్వాత కొంచెము తలఎత్తుటకు వీలైనది. పరిశ్రమ సర్వతోముఖంగా వృద్ధి పొందుతోంది. ౧౫ వత్సరములవరకును రక్షణకలదని ధనికులు పెట్టుబడి పెట్టినారు. కాని ౧౯౩౮ ఏప్రిల్‌నందు పంచదారమీద మ. ౧కి ౦-౧౫-౮ ఎక్సైజుడ్యూటీ విధించినారు. ౧౯౩౧లో టారిఫ్‌బోర్డువారు రక్షణయొసంగినప్పుడు మొలాసులనుండి మ. ౧కి ౦-౧౦-౬ వచ్చునని లెఖచూచిరి. ఇప్పుడు వానినుండి ఒకదమ్మిడీ అయినను తిరిగివచ్చుటలేదు. దేశీయుల ఉదాసీనతవలనగాని జావాపంచదారకంటె స్వదేశీపంచదార ౧-౬-౦ లేక ౧-౧౨-౦లకు ఎక్కువగా అమ్ముచున్నను దిగుమతి పూర్తిగా ఆగిపోలేదు. ఈపరిస్థితులలో ఈఎక్సైజుడ్యూటీచే జావాపంచదారకు స్వదేశీ పంచదారకు అయిదారణాలు తారతమ్యమయిన జావాపంచదారనే కొనెదరు.

ఇందుకుతోడుగా ప్రభుత్వమువారు విదేశపంచదారమీద Rs.౧౦౦కి ౨౫ అనగా మ. ౧కి ౧-౪-౦ అదనపుపన్నను తొలగించిరి. దీనివలన విదేశవర్తకులకు దిగుమతిచేయుటకు మంచి సౌకర్యమేర్పడినది. ఈ అదనపు పన్నువల్లనే గత రెండు సంవత్సరములలో పరిశ్రమ యభివృద్ధికి వచ్చినది. దీనివలన జావాపంచదార ఖరీదు ఎక్కువయి దిగుమతి నాపుచుండెను. ఈ అదనపు పన్ను తీసివేయుటచే ౧౬౦లక్షల చెరుకు రైతులకు తీరని నష్టము వాటిల్లినది.

ప్రభుత్వమువారి అంచనాప్రకారము మొలాసుల మీద ఏమియు రకుండుట గుర్తించి పంచదార ఖరీదు ఎక్కువగుచుండుట గమనింపవలెను. ఏపరిశ్రమయు ప్రభుత్వమువారి సహాయము, సానుభూతి లేనిదే వృద్ధి పొందజాలదు. కాన ప్రభుత్వమువారు ఎక్సైజుడ్యూటీని రద్దుచేసి విదేశపంచదారమీద అదనపుపన్నును విధించి దేశీయపరిశ్రమకు చేయూత నొసంగవలెను.

## ఇందులకు తోడ్పడిన వాఙ్మయము

1. Cane Sugar by Noel Dear.
2. Sugar Industry in U.P. by R.D. Agrawal.
3. Past, Present, Future Sugar Industry M. P. Gandhi.
4. Agricultural Journal of India, Vol. X & XI, 1916.
5. Sugar Committee Report 1931.
6. Agricultural Reports of U.P. and Madras
7. Other dailies & Journals.

[Goots.

# నామహారాష్ట్రయాత్ర

## ౭

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

సలిలనిస్వనము మాతృదేవి మధురభాషణమట్లు వినవచ్చెను. గిరిశిఖరము నెక్కినపుడు కలిగిన యాతనను కాంచియే, కనికరము పెంపున నదీమతల్లి నన్ను చెంతకు చేరబిలిచిన ట్లూహించితిని. ప్రేవులు తెగునట్లు, ఒడలును గుండజేసికొనునట్లు, గుండెరక్తమును పిండుకొనునట్లు, పంచప్రాణములను చెదరగొట్టినట్లు వాకిదారుణారోహణమున * ప్రవర్తించిన నాకు కొంచెకొన జేరినంతన నూతనశక్తిని, నవజీవనమును నాకొసగినది ఆయమ్మయాదరోక్తిరే! ఆహా! తల్లియనురాగ మెంత మహత్తరమైనది! † దుస్సహవేదనమందు కన్నబిడ్డను కాంచినపుడు తన నిసుంగును కాచుటకై, దానికి సుఖశాంతులు చేకూర్చుటకై పరమపరితోషమున కన్నకడుపు ఎన్నెన్నిమారు లాత్మార్పణ మొనరించుకొనుటకు దలపడదు.

చల్లనితల్లి గోదావరి పొత్తిళ్లలోనే పెరుగు భాగ్యము నా కొదవెను.‡ గౌతమీవసిష్ఠ శాఖలనడుమ, చక్కనైన కాలువ (ఇంచుమించు ఆరుమైళ్లుకడచిన వెనుక లొల్లనుండి అమలాపురము, గన్నవరము, వానపల్లి దిశలకు మూడుకాల్వలు వెల్వడును) తీరమున మాయూరు (పేరవరము) ఉన్నది. ఈ ఋషిశాఖ లేదుపాయతై

---

* భారతదేశభక్తులందు నేను శమంతకమై కాంతిలు జవహర్‌లాలునకు కొండలెక్కుటందును, వనములందు మసలుటందును ఎంతో యభిలాషకలదు. అతని పలుకులను పరికింపుడు:

"......And I dream of the day when I shall wonder about the Himalayas and cross them to reach that lake (Manasa Sarovar) and mountain (Kailas) of my desire......... The journey is always worth the making even though the end may not be in sight

'Yea, in my mind these mountains rise,
Their perils dyed with evening's rose; And still my ghost sits at my eyes
And thirsts for their untroubled snows. —Walter de la Mare

(Vide Pandit Jawaharlal Nehru's Autobiography, Page 88)

† మహాకవు లీ యనురాగమును బహుభంగుల గీర్తించిరి. షేక్స్పియరు మహాకవియొక్క "The Tragedy of Coriolanus" లోను, ఆతని యడుగుజాడలంటి సారస్వతక్షేత్రమున మసలిన ద్విజేంద్రుని "చంద్రగుప్త" లోను మాతృప్రణయ మహత్త్వమును గాంతుము. అందలి మాత Volunnia; ఇందలి కన్నతల్లి ముర (Vide: Act V; Scene 3, Act I; Scene 3 'The Tragedy of Coriolanus' నే నాంధ్రీకరించిన 'చంద్రగుప్త' లోని ౧వ యంకమునందలి యైదవరంగమును చూడుడు.)

‡ తాను బాలుడైయుండ దనసెచ్చెలులు కొందరు కూడని తెన్నులందు దనను కొండొకవడి నిలిపిన యుదంతమును తెలుపుచు, మానవునకు జగదీశు డొక్కడే నిక్కంపు నేస్తకాడు కాగలడని తన "యాత్మకథ" యందు గాంధిజీ తెలుపుకొనినారు. విశ్రస్థానము నాక్రమించుటకు భగవానుడే యర్హుడగుచో, తలిదండ్రుల తావలమున చేరుట మఱి కేలుమానవమాత్రుల తరమా ? రుక్మిణి పేర్కొనిన పురాణదంపతులేకదా మాతాపితరులు కాగలరు! అమ్మయెనుక నయ్యాధివంగతుడైనంతన నాకు జననీజనకు లైనవారిదంపతులే! నా చుట్టములు వీరె! విజ్ఞానదాహముతో బొగులువాడను గావున గంగాగోదావరీమతల్లులు నాకమ్మలైరి.

సాగరమున గలియును. వీనియందు కవిస్వప్నములు పోలు దీవు లున్నవి. భారతావనిలోని నదీగతుల నన్నింటిని పరికింపుడు. ఇట్లువిస్తరిల్లి, ఇంతసింగారమున రంగారిన ధునీగతి నింకెందును గానరు. కనువిందొనరించు కోనసీమ కీడైన సీమ మరెందును లేదు. ఎనలేని మహామహులన కల్గొకృత్తు నిచటిప్రకృతివిభవము నాడును నేడునుకూడ రసస్రవంతుల గనుచుండెను. వీనినిగ్రోలి, గోదావరీవీచికలయం దీదులాడి నాడు నన్నయాదులు, నేడు వసురాయాదులు కవితల్లజులైరి. మన కొకరాష్ట్రము గాని, మహానగరముగాని లేకుండుటచే భారతయాత్రికులు మననేలను జూడరారు. కావున తెలుగునేలలోని ఈసొంపు నన్యరాష్ట్రీయు లంతగా నెఱుగరు.

గోదావరీగర్భమందలి లంకలు నూతనసృష్టియట్లు పొడగట్టును. పర్ణశాలనుండి సాగరమువఱకుగల దీవులందు శైశవమందే మసలితిని. రామపదాంకితములై, శాంతినిలయములై ఆత్మకు పుట్టిండ్లట్లివి శోభిలుచుండును. పచ్చలు రాశిరాసులై అందు నెలయుచుండెనని తోపక మానదు. వెండిపోడిపోలు ఇసుకతిన్నె లెన్నో మాయూరి చేరువ నున్నవి. ఒకప్పు డివి నాయాటచోటులు. దురదృష్టములతోపాటు ఎన్నో యదృష్టములు నాకు ప్రాప్తించినవి. తోడిబుడుతలగూడి రమ్యదృశ్యములందు శైవలినీమతల్లి ప్రోల శైశవమున గడపుట నాయదృష్టములలో మిన్నయనుకొందును. లంకముక్కలందు, పుచ్చపాదులందు, ఎత్తుమంచెలందు, ఒత్తుచేలందు, పైడిపైరులందు, పచ్చికపానుపులందు కేళివల్లు కడపి, పిట్టపలుకులను మనకున బట్టించుకొని, సైకతవాతూలమ్ము మధుకణములను జాలువార్చు కర్షకగీతములకు సెవు లొగ్గిన ప్రశాంతసమయమందే నావిద్యార్థి జీవన మారంభమైనది. నాహృదయ ఫలకమున జిజ్ఞాసాంకురమును నాటినది శ్యామలసస్య పరివృతయై, సుందరియై, సహృదయయై, నిర్మలభావ పూరితయైన గోదావరీజనయిత్రియే!

జ్ఞానము సలిలములీల ప్రవహించునదని మన తత్త్వశాస్త్రము తెలుపుచున్నది. వెల్లువ నిత్యకృత్యములకు పనికివచ్చు నీరు కాని వేఱుకాదని ఇతరదేశీయు లన వచ్చును. కాని భారతీయులు దానిని జ్ఞానపూరమనిరి. నదులకుఁగలగదా భారతవిజ్ఞానము పొంగిపారలినది! భారతసభ్యత రమ్యోద్యానమట్లు పెంపారినది ! మన కవులు తమతలపులను నదీమతల్లులనుండి కైకొనుటే గాక, తమకావ్య వ్యక్తులను గూడ వానిదాపునందే వసింపజేసిరి. రామాయణ భారతాది పురాణములను పరికింపుడు. గంగా గోదావరి తమసానదులు వానియందు అక్కసెల్లెండ్రట్లుతోచి, వనములందును, కొండలందును వరలి వాహినీపతిం జేరుకొనును.* యమునాతరంగిణియే

---

* వాల్మీకి రామాయణమున నిందందు దోచు ఈ శ్లోకములను పరికింపుడు:

"గంగాయాశ్చాపి సంతారం భరద్వాజస్య దర్శనం, భరద్వాజాఽభ్యనుజ్ఞానా చ్చిత్రకూటస్య దర్శనమ్.
తతః పంచవటీం గత్వా రామః సౌమిత్రి మబ్రవీత్, ఇయం గోదావరీ రమ్యా చక్రవాకోపశోభితా.
స ముహూర్తం గతే తస్మి న్దేవలోకం ముని స్తదా, జగామ తమసాతీరం జాహ్నవ్యా స్త్వవిదూరతః
సతు తీరం సమాసాద్య తమసాయా మహాముని:, శిష్య మాహ స్థితం పార్శ్వే దృష్ట్వా తీర్థ మకర్దమమ్.
అకర్దమ మిదం తీర్థం భరద్వాజ నిశామయ, రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనో యథా.
న్యస్యతాం కలశస్తాత! దీయతాం వల్కలం మమ, ఇదమేవాఽవగాహిష్యే తమసాతీర్థ ముత్తమమ్.
స శిష్యహస్తా దాదాయ వల్కలం నియతేంద్రియః, విచచారహ పశ్యం స్త తత్సర్వతో విపులం వనమ్.
సోఽభిషేకం తతః కృత్వా తీర్థే తస్మి న్యథావిధి, తమేవ చింతయ న్నర్థ ముపావర్తత వై మునిః.
అగస్త్యదర్శనంచైవ జటాయో రభిసంగమమ్, పంచవట్యాశ్చ గమనం శూర్పణఖ్యాశ్చ దర్శనమ్.
కబంధదర్శనం చైవ పంపాయాశ్చాపి దర్శనమ్, శబర్యా దర్శనం చైవ హనుమద్దర్శనం తథా.
ఋశ్యమూకస్య గమనం సుగ్రీవేణ సమాగమమ్, ప్రతిప్లవన మేవాథ మధూనాం హరణంతథా.
సంగమంచ సముద్రేణ నళసేతోశ్చ బంధనమ్.

భక్తిస్రోతమై భాగవతమున మానసగోచరమగును! ఈ మూడుపురాణములును ముగురమ్మలై, భారత మహా విజ్ఞానమును గనినవి! వీనిజన్మస్థలము పాత్రములందు లేదు.

పాత్రములందు మనసుసంపాదించు విత్తమెంత? "గ్రంథములు గ్రంథు" లనువాడు రామకృష్ణ పరమహంస. వ్యాసవాల్మీకులు గ్రంథములనే నమలి మ్రింగి, మేడలందును, మిద్దెలందును, మఠనాల్గు గోడల నడుమ విద్యనందియుండినచో, గొందెలందే వారి ప్రజ్ఞాప్రతిభ లడగి యుండెడివి. ఆమహాకవుల మనసులు "చెన్నగు నదీపులినసీమల దాగిలిమూతలాడి" ఆనందభరితములై కవితాధారలు గుమ్మరించినవి. నదీధారలు కవితాధారలకు కన్నతల్లులని యెఱింగియే గోదావరీజలబిందువులను గ్రోలినవారు కైతలో నందవేసినచేతు లయ్యెదరని కొంద అందురు.

నదీధారలో భావధారను కాంచునది జిజ్ఞాసాగర్భితమైన దృష్టి. కళారాధనకు తప్పనిసరిగ అక్కరైనది యీచూడ్కియే! జిజ్ఞాసతోడు భక్తిప్రణయము లిందు గాపుర ముండును. హృదయము నాకర్షించు వస్తువున భావవ్రతుడు వీనినిగాంచును. రామనామమునకై, భక్తినిధికై మారుతి రతనపురాలను ముక్కముక్కలు చేయలేదా? వెనిస్‌రాళ్లలో రస్కిన్ మహాశయుడు భావఖండముల నేఱుకొనలేదా? వానిని పాఠకలోకమునకు పంచి యీయలేదా? * భారత దృష్టాంతముపై కన్నిడి గ్రంథరచనమునకు గడంగిన (కార్లైలు, ఎమర్సను లిట్లని తెలుపుకొనిరి.) తనగురువువలె నీత డిట్టి దృష్టి నందినాడు.

భారతీయునిదృష్టి సూర్యకిరణము బోలునది. మయూఖమునకు గల జిజ్ఞాస ఎంత యద్భుతమైనది! జ్ఞానమునకై జగములు తన్నుద్దేశించి, గాయత్రి జపించుచుండ నిది సుఖస్వప్నములట్లు సూనముల సమీపమున జేరి గిలిగింతలచే, ముద్దులచే వానినిలేపి, పకక్కన నవ్వించి, ముల్లోకములను నిండింపజాలు ప్రణయపరిమళము

ప్రతారంచ సముద్రస్య రాత్రౌ లంకావరోధనమ్, శృంగిబేరపురే సూతం గంగా కూలే వ్యసర్జయత్.
కోసలో నామ ముదిత స్ఫీతో జనపదో మహాన్, నివిష్ట స్సరయూతీరే ప్రభూతధనధాన్యవాన్.

సాహితియనుడు, మతకళయనుడు, భక్తియనుడు ఆత్మసముద్భవమనుచుండును. ఆత్మయుకబళము కౌజాలు దివ్యభావము ప్రకృతియందు, ముఖ్యముగ తరంగిణులందు ఉండును. నీటివెల్లువను "లోక పావనీ" యని ఆవేశపూరితహృదయుడై సంబోధించి భారతీయుడు దానిమ్రోల సాగిలపడడా? భారతీయుని ప్రకృతినిగురించియే నివేదితాసోదరి నయాగరాజలపాతములు భారతావనియందుండుచో నవి పుణ్యతీర్థములట్లు గణింపబడియుండుననియు, వానిదాపున నెన్నో గుళ్లును, గోపురములును లేచెడివనియు పలికినది. నదియందుగ్రుంకులిడిన మహార్తముందే భారతీయుడు నిజాత్మచేపూతభావస్రోతమున మునకలువేయించును. రసతరంగిణియైన కవిరచనమునలనుకును, తరంగిణికిని గల సంబంధమెట్టిదో తెలిపితిని. భక్తప్రవరుల జీవనములను, రచనపరికించితిమేని ఎన్నెన్నో ఝురీమతల్లులను గాంతుము. కావ్యకర్త కావ్యపాత్రను సరిత్తీరమున నిలుపుటకు ముచ్చటపడులాగున, భక్తవరేణ్యుడు తనయిలువేలుపును శైవలినీకూలమున నిలుపుటకై ఎంతో యుబలాటముచూపుచుండును. తాము యాత్రికులై, జగదీశుని యాత్రికుడని ప్రస్తుతింతురు. బహుళదృష్టాంతములను పేర్కొనుట కిందు తావు లేదు. శ్రీజయదేవకృతగీతగోవిందకావ్యములోని కొలది పంక్తులనుమాత్ర మిందుదాహరింతును:

"స్ఫురదతిముక్తలతాపరిరంభణముకుళిత పులకితచూతే, బృందావనవిపినే పరిసరపరిగత యమునాజలపూతే." "శ్లో. యమునాతీరవానీరనికుంజే మందమాస్థితమ్, ప్రాహ ప్రేమభరోద్భ్రాంతం మాధవం రాధికావశీ." "ధీరసమీరే యమునాతీరే వసతి వనే వనమాలీ."

* మహారచయిత రస్కిన్ వ్రాసిన The st-ones of Venice (౧౮౫౧-౮) నుద్దేశించియే కదా అతనియాచార్యుడు కార్లైలు "Most true and excellent sermon in stones" అని ప్రశంసాపూర్వకముగ పలికినాడు!

నుండి బుడుంగున ప్రసవహృదయమున మునింగి, మరందరత్నాకరమునుండి జ్ఞానరత్నములను ప్రోగొనరించుకొనదా? తన యేడురంగులతో తళ్కొత్తుచు చిరుతెరగలపై నుయ్యాలలూగుచు, మర్త్యలోకము నుండి ఎంతెంతో భావసామగ్రిని మోచుకొని దివి భూమియందు చేరవేసికొనదా? భారతీయుని దృష్టి అలలందును, కుసుమకేసరములందును, తీవలందును, తెమ్మెరలందును, కొండచరియలందును చొచ్చి ఎంతేనివిజ్ఞానము నందినది! అంబరచుంబిమహాద్రులను, విమల సరిల్లలామలను, శుభ్రకాసారములను, గభీరసింధువులను గ్రంథపుటలుగావించుకొనినది! జ్ఞానసంభరితమైన రవిమయూఖ విశాలవిశ్వమున నద్భుతకాంతిని కలువడించులీల, విజ్ఞానపూరముతో తొలుకాడు భారతదృష్టి విశ్వవలయమున నపూర్వతేజమును గుమ్మరించినది.

జగదీశునకు సవ్యసాచి నిమిత్తమైనట్లు ఈశ్వరశక్తిసమన్వితమైన ప్రకృతికి మహదుద్దేశములను యుగముల కెఱిగించుటకై దృష్టిసమన్వితుడైన మానవుడు నిమిత్తమైనాడు. ఇట్లు నిమిత్తమాత్రులైనవారిలో ముఖ్యులు ఋషులును, కవులును, ప్రవక్తలును. ప్రకృతిలో తొలితావునం దిననదియం దీభావోపాసకులు జగద్ధాత్రిని గాంచి చేతులుమొగిడిరి. ఈయమ్మను సేవించుటకు, ఆత్మహృదయములందు జ్ఞానవాహినిని ప్రవహింపజేసికొనుటకు వారు యాత్ర సలిపిరి! నదిపుట్టినచోటుచేరి "ఉద్భటాచలమహోపలకోటి"యందు గగనచుంబి భావములను గాంచిరి! ప్రకృతియందలి పరంజ్యోతికి ప్రణమిల్లిరి! యాత్రికుడన ముముక్షువనియెఱిగి, జ్ఞానసంపాదనము ఆత్మశక్తివృద్ధికని, ముక్తికని గ్రహించి, విజ్ఞానార్జనమునకై తపస్సుచేసి జీవనము సార్థకముజేసికొనవలెనని పిన్నతనమునుండి మక్కువపడుచునేయుంటిని. యాత్రసాగించుచునేయుంటిని. ఐహికధన సంపాదనలో మనసును ప్రవేశింపనీయక జగదీశుడు నన్ను పథికుని గావించినాడు. చిఱుతతనమందే నా యాస్తిని దూరముగ నెట్టివేసినాడు. ఎందుండియో నిప్పునెరసులు దెచ్చి నా చిన్నిగుండెయం దుంచినాడు. గుండెయం దియగ్ని రగులుచుండుటచేతనే పదునాల్గవయేటనే యిడ లెఱుగక, దాని ధూమవేగము ననుసరించి దూరయాత్ర నారంభించితిని. ఐహిక భూతి నాజిజ్ఞాసానలమునకై బహు జలపాతమగుచో, నా కది వలదని వేయిదేవుళ్లకు మ్రొక్కుకొందును. నాయాత్రకు * భంగము దెచ్చు పరిస్థితులు (అవిపచ్చనివైనను) నన్ను మార్కొనకుండుగాక! నా

---

* విజ్ఞానార్జనమునకు యాత్ర అక్కఱైనదని భారతీయులు గుర్తించినవెనుక నన్యదేశీయులును గ్రహించిరి. మెగస్తనీస్, ఫాహియాన్, ఇబ్నబటూటా, హ్యూయాన్‌సేంగు మున్నగుపథికు లన్యసీమలనుండి మనదేశమున కరుదెంచి, ఎన్నెన్నోకష్టములకు శిరమొగ్గి విశేషవిజ్ఞానమంది దాని స్వగ్రంథములందు జేర్చిరి. ఈయంశమునే జవహరుపండితుడు ఇటీవల ప్రకటించబడిన తనయాంగ్లగ్రంథమున నిట్లుల్లేఖించెను :

"Thirteen hundred years ago there came a great traveller from China to India in search of wisdom and knowledge. His name was Hiuen Tsang and over the deserts and mountains of the north became, braving many dangers, facing and overcoming many obstacles, so great wash is thirst for knowledge And he spent many years in India learning himself and teaching others especially at the great university of Nalanda, which existed then near the city that was called Pataliputra and is now known as patna. Hiuen Tsangbecame very learned himself and he was given the little cf "Master of the Law"—the Law of the Buddha—and he journeyed all over India and saw and studied thepeople that lived in this great country in those far-off days. Later he wrote a bo:k of his travels" Vide: 'First letter to Indira', page 156; "India and the world" by Pandit Jawaharlal Nehru.

మహారాష్ట్రయాత్ర నాజీవనయాత్రలో నొకఘట్టము మాత్రమే! గోదావరిజన్మస్థలమున మానసాంజలిని నింపు కొనుటకే నాటి సంధ్యాసమయమున దానిదెస బయలుదేరితిని. మూర్తీభవించిన వారిధారయై నాయాశయము కొంత కొనసాగె కట్టెనుట తోచినదికావుననే నూతనశక్తినంది తిని. నాడు నాతపసు పండిన దినమంటిని. తపసుపండి నపుడేకదా సంతప్తచిత్తము సంపన్నమునకు ప్రతినిత్రము కాగలదు! మానసగోచరమైన భావపూర ముత్సాహ ప్రవంతుల నుప్పొంగింతురు! ఉత్సాహానందములు నవజీవన సామగ్రులు. నవభావము నవజీవనప్రదాయినికాదా?

గోదావరిపుట్టినచోటున నలుతట్టులందు జోదు లట్లు నిలిచిన నాలుగు ఉదుంబరవృక్షములు కలవు. పర్వత శిఖరమునుండి ఈవలికి నీరుబుకుచుండును. కొండనుండి జలధార ధరాసరిగ క్రిందికి పాఱుట గానము. శైలపార్శ్వమున నందందు ధారలు వెడలు చుంట జూతుము. ఒక్కొకచో నది గుప్తమైయుండును. ధారవెడలు తావులలో నిందును అందును రాతితొట్టె లగపడును. పుట్టినచోటున కించుక దిగువను కుశావర్త తటాకమునకంటె మిగుల జిన్నదియైన చెరువు కలదు. గోదావరి నీరందుజొచ్చి, అందుండి తరువాతి మజిలీ కరుగుచుండును. బ్రహ్మగిరిమీదను, త్ర్యంబకమునకు దిగువను, గుప్తమైయుండి ఆయుమ్మెల్లమార్గమున నదీరూప మున తోచిన తావలమందును, నాసికమున్నగు ప్రదేశము లందును గోదావరిని పుంఖానుపుంఖముగ పరిశీలించితిని. ఈయాచోటులం దీశ్వర విగ్రహమును, గోదావరీ జనయిత్రి విగ్రహమును, మఱికొన్ని మూర్తులను నిలిపి పూజారులు యాత్రికుల కడనుండి పైకమును పిండు చుందురు!

నాటి సాయంసమయమున కడుపడిగ నదుంబర వృక్షములనడుమ జేరి, ఆవేశపూరిత హృదయుడనై జన యిత్రీ జన్మస్థలమున సాగిలపడితిని. అవిరళమై, అనంత మైన యాశీస్సైన ఉదకము శారీరమున బడినది. దావా నలమునబడిన అమృతవృష్టివలె, తీవ్రవేదనమతో ప్రయ్యాలగుశలపై సలిలధార పడినంతన నాయుల్లము చల్లనైనది. అప్పటి నాయానంద మెట్టిదో మాటలతో తెలుపజాలను. జన్మస్థానమునుండి కదలిపోయినపిదప మనుష్యస్పర్శనంది సలిలము కొంత మలినమగును. దాని నైసర్గికగుణమునకు కొంత భంగపాటు కలిగితీ రును. పుట్టినట్టిచోటులోనో? సహజప్రతిభ, సహజ శక్తి, సహజగుణము, సహజమహత్త్వము అందే కదా వ్యక్తమగును! ఇవి యాత్మయు సోకినపుడు దివ్యభావ యందే అది తన యానందమును వ్యక్తపరుపగలదు. తలపై తల్లి ఆశీరుణమున చిల్కరించిన సలిల మెట్టిదని యెట్లు తెలుపుదును? చల్లనవలె చల్లనైన నీరందునా? పన్నీరువానయందునా? చందనవృష్టి యందునా? అత్తరు చిల్కరింత యందునా? అమృతధార యందునా? ప్రణయసేచనమే యందునా? ఈయుపమ లన్నియుగూడినను, అత్తటి నాహ్లాదమున జనించిన ఉత్తాల భావతరంగముల నుచితరీతి ప్రకాశమునరించిన వని తలపను. తనుతెలుపున నాత్మప్రకాశమందని భావము రచయితమనసున కెంతేని నెగులు కలిగించును.

భువనములన్నింటిని నిండింపజాలు భావమును వ్రజపువుసక్కపోలు చిన్నిమాట తన బొజ్జయందిముడ్చు కొనుచో సాహిత్యవిద్యుత్తలమున నది చంద్రవంకవలె తేజరిల్లును. ఆశ్చర్యభాషాలంకారము అవతారపూరుషుని బోలునది. బ్రహ్మాండమున నిండియుండు జగదీశుడు గోపాలుడైనాడని యెఱుగుదుము. మధురలో నీతడు జన్మించెనని ప్రాచీనసాహిత్యము తెలుపుచున్నది. ఈసాహిత్య లోని ప్రత్యక్షరము భావభరితమైనది. భావమాహాత్మ్య మును వ్యక్తీకరించుమాటకే ఇంపుచోటున్నది. 'మధుర' పదమందే అవతారమహత్త్వము నిహితమై యున్నది. అనంతమైన పాలవెల్లిని మథించినంతన గొంత మీగడ తేలునుగదా! దుగ్ధసింధువులోని గుణములన్నియు మీగడ తెఱగయందడగియున్నవికదా! అనంతవిశ్వము నావ రించుకొనియున్న సర్వేశుడు ఆత్మనుఘనముగావించుకొని నాడు కావున మధురలో నీశ్వరమహత్త్వమంతయు కృష్ణరూపమున మీగడయైతోచినది! ఈశ్వరాంశస్థ

అన్నియు ఒక్క కృష్ణావతారమున విజృంభించినవి.* ముద్దుకృష్ణుని ఉదరమున పదునాలుగు భువనములు నిహితమైయుంట గొల్లతల్లి కన్గొనెను. కృష్ణునిబోలు అలంకారమును, యశోదబోలు పతితయును గోచరించినపుడు సాహితీవసుమతి గోకుల కెనయై దివిషద్వర్గమునకు లీలాభూమి కాజాలును. అనంతభావము స్వయంభువు బోలు భాషాలంకారమున నాత్మప్రకాశము నందును. కవి దివ్యపురుషుడు కావున అతనిమనస్సుకనిన యలంకారము దివ్యశక్తికలది. అవతారమందలి ఈశ్వర మహిమను గుర్తింపజాలని నరుడు తోచుటెటె శుద్ధ, బుద్ధ, నిత్య, సచ్చిదానందఘనస్వరూపము కాకమానె విశ్వరూప సందర్శన మక్కఱగును. గ్రహణసాధ్యముగాని దృశ్యము సమ్ముఖమున నూపట్టినపుడే నరుడు దాని మహత్త్వము గుర్తించినాడు. దివ్యశక్తి సమన్వితాలంకారసృష్టికి తెడయవలసివచ్చినపుడును, ఇట్టి యలంకారములోని భావబ్రహ్మాండము నాత్మహృది జిక్కబట్టజాలు పటిత గోచరింపనపుడును విషయగ్రహణమునకు తోడుపడునది ప్రత్యక్షానుభవమే! పరానుభవమును, పరభావమును ఆత్మసమ్ముఖమున ప్రత్యక్షమొనరింప ప్రవక్త పగిది అలంకారము నాశ్రయించి భావభిక్షనందుట కంటె, స్వీయానుభవమున విషయమును హృదయంగమ మొనరించుకొనుట ఘనతరవిషయము. బ్రహ్మగిరి శిఖరమున, చల్లనితల్లి యక్కున నుత్తమాంగము నొగ్గినపుడు నాయుల్లమందిన హాయి యెట్టిదో గ్రహింప నభిలషించు సోదరులు నావలె కడుకష్టమున బ్రహ్మగిరినెక్కి శైవలినీమాతహృదయమున, నామె జనించిన తావలమున శిరములొడ్డితీఱవలెను.

పవిత్రాంబుధారలం దట్లే కొంతసేపు తలనునిచి, తనివార తానమాచరించి, భావపూరితశీతలవారిని కడుపారద్రాగి, కనులుమూసి మనసును హాయిలో ముంచి, పడపడి పశ్చిమదిశను పరికించితిని. అస్తంగతుడగు నాదిత్యుడు నన్ను జూచి పక్కన నవ్వుచుండెను! రాశిరాశులైన కెంపులుతెచ్చి, గుండజేసి, దివ్యతోయము గలిపి, అపూర్వమైన వసంతమును గావించి, జగత్కల్యాణ మహోత్సవమని కాబోలు నగుమోమున వసుమతీవధువుపై చిల్కరించుచుండెను! రంగురంగుల ముగ్గులు దివిభువి నొప్పుచు, కవిహృదయముబోలు కల్యాణమండపమున కగ్గలంపు నిగ్గుగూర్చుచుండెను! సప్తద్యుతిసందీప్తములైన జలదములు మహోత్సవమును చూడవచ్చిన ముత్తైదువుల ట్లగపడుచుండెను!

బ్రహ్మగిరికి కొంతదూరమున నెత్తయినకొండ మఱొండు కలదు. కవలలట్లున్న భూధరములనడుమ తాల్వికునిమనసుబోలు లోతులోయ యున్నది. రాజదంపతులకుఅగల నెందరెందఱో వందిమాగధులు నిలుచు లీల జోడుకొండలచుట్టు నెన్నెన్నియో గుట్టలు చాల దూరమువఱకు వరుసగ నిలిచియుండెను. లోయనిండ తోణుకు రంగారుబంగారు వెలుగుకొండయంచులనుండి యవ్వలి కల్లనల్లన తుంపురులై రాలుచుండెను! కోటికోటి కాంతిబిందువులతో తొలంకాడు నుపత్యక ప్రకృతివధూటికై యేర్పడిన దివ్యప్రాదమట్లు తోచెను! కవిమానసమున రివ్వుమను భావపరంపరలట్లు శైలసామ్రాజ్యమున యథేచ్ఛగ శకుంతసంతతు లెగయుచు, హృదయములు విప్పి మధుపూరమును లోయలోనికి గుమ్మరించుచుండెను! పిట్టకుత్తుకలనుండి జలజలరాలు గణయతులు హృద్యమైనపద్యమై ప్రకృతిపీనులకు విందుచేయుచుండెను! హేమవర్షము బోలుసూర్యాలోకమున తానమాడుతరుసాలములును, గగనచుంబిమహాద్రుమములును, కన్నుగుట్టు చెంగులువ కేదారములును, పైడిపూలనీడ కుంజవాటికలును విహగకవులయాశ్రమములగుడు భావనభావస్థగిత మహాకావ్యములకైవడి కానుపించు

---

* మనుష్యరూపమున విజృంభించిన ఈశ్వరశక్తిని క్రైస్తవులు Son of man, Son of God అనువాక్కులతో దృష్టాంతీకరించుచుందురు. వీరు చూపు ప్రత్యక్ష దృష్టాంతము ఏసుసంయమి. రాముని యందు మనుష్యశక్తి అధికము; కృష్ణుని యందీశ్వరశక్తి మెండు. రాముడు కన్నీళ్లొడ్చిన సమయములు, పలవించినమహార్తములు ఉన్నవి. వీనికి కృష్ణజీవనమున తావులేదు. తా నీశ్వరుడని విశ్వరూప సందర్శనమున కృష్ణుడు రూఢిచేసినాడు. నరునకు 'భగవద్గీత'నిచ్చినాడు. శ్రీరాముని Son of Man అని, శ్రీకృష్ణుని Son of God అని తెలుపనగును.

చుండెను! కేవల నల్లనల్లన నల్లాడు కమ్మతెమ్మెరలు ఇల్లాలి గుసగుసలవలె నల్లమును పోకుచు నందు కడలేని హాయిని వెలార్చుచుండెను! ప్రణయినీ సంశ్లేషము చాడ్పున శైలహృది నంటి, అందు బులకలు లేపు పరిమళము, ప్రఫుల్లహృదబ్జమునుండి గుప్పున నుప్పొంగు భావమట్లు, అదృశ్యమయ్యు అనంతమైన ఈశ్వరకరుణ కరణి పచ్చనిమనఃప్రాంతరంగమున నెన్నెన్నో యానంద స్వప్నములను సృష్టించుచుండెను! ఆదర్శనిత్యగుణమును, ఆత్మనుతనుపు విద్దెము మానవు డందవలసిన దిట్టి దృశ్యములందే! ఇట్టి ప్రశాంతతరుణములందే! ఇట్టి పవిత్ర ముహూర్తములందే! ఇట్టి విశ్రాంతిసమయములందే!*

ఉసురుల నూడదీయు ఉపద్రవములును, గుండెలను గుండజేయు అపాయములును, మనసును చీల్చి చెండాడు యాతనలును, కడుపు కోసి వదలు చింతలును నాటి సంధ్యాదృశ్యమును చూచినంతనే ఎండగసినవో! వసుమతి గడగడ దోచు రోతను, జఘన్య క్రియలందు పుట్టుకంపును, డొంకదాట్లు నలువంకలందునే డల్లుకొనియున్న ప్రపంచమును మనసులు తట్టు నపుడు "అయ్యో! పృథ్వియంతయు క్రుళ్లుగోతిలో దిగబడినదే!" అని యారాటమున క్రుంగిపోమా? ప్రస్తుతము ఐరోపాఖండమునుండి వెడలువిషవాయువులును, రుధిర ప్రవంతులును భయమును, జుగుప్సను, దుఃఖమును లేపుట లేదా? పలువురువిద్యాధికులే, పలుకుబడిపడసిన యదృష్టవంతులే చెడుచెయిదములకు దలపడుట జూచినపుడు అంతరంగమున గార్చిచ్చు రగులుటలేదా? "మనుష్యహృదయమును నేడేలునది పిశాచమా? హననక్రియలే, దురంతవధలే నేడు రాసక్రీడలైనవా?" యని దూపిల్లుచుందుముగదా!† కాని, — కాని గభీరనిరాశయందు మనకుదొరలుచుండ వేడిగాడ్పులట్లు నిట్టూర్పులు హృదయవీథియందు చెలరేగుచుండ, అగ్నివృష్టివలె బాష్పకణములు రాలుచుండ, తప్తశలాకవలె శరీరము రవులుచుండ, నేలగూలు నిసుగును అక్కునజేర్చు అమ్మవలె, ఏదో యద్భుతశక్తి మానవహృదయమును ప్రేమసంశ్లేషమున జొనిపి, కనులుతుడిచి, చెవులందు మధుర సాంత్వనము వోయుచున్నది! ఆశక్తి శంఖచక్రములు ధరించి ప్రత్యక్షముకాదు. అపరంజిలతికలు పోలు రవిమరీచులందు, రజతసలిలమున కనయైన జ్యోత్స్నయందు, ఉద్వృత్తగ నుప్పొంగు సౌరభమందు, దశదిశల నింపు మాధుర్యమందు అపుడపుడు చెవులబడు మంచిమాటలందు, కనులదోచు సొంపుచేతయందు, వెలుగురేకలువోయి తలపులందు విరాజిల్లుచుండును! ఈ శక్తికతననే నిరాశాంధకారము పటాపంచలగును. "వసంతసమయమున నిందందు ప్రస్ఫుటించు పలువిధప్రసూనములపగిది సదాశయములు మదిలో కుసుమించి, హృదయము నానందసౌరభముచే నింపును! గాఢసంతమసమునగూడ చుక్కనిచుక్కలు మిన్నుపై తేజరిల్లవా? ఎట్టికాళరాత్రియైనను, చక్కరగోళీలని చుక్కలను దిగమ్రింగజాలునా? చీకటికొట్టునగూడ నెందుండియో గురువాక్కువలె క్షీణాలోకము జొచ్చి మనసున నాశను లేపుచుండదా? అజాండమునంటు అంధకారము నొక్కొకపు డొక్కచిన్నమెఱపు చీల్చివేయదా? జగతి నేలునది ఆలోకముగాని అంధకారము కాదు. అనంతకాలమున ననంతజీవియై వర్ధిల్లునది సౌందర్యముగాని కుత్సితముకాదు. విజయకేతన మెత్తువాడు జగదీశుడు

---

* నేటిజపాను మహాకవివాక్కులను గమనింపుడు:

"I wonder if the very soul of a man of high character, does not exhaust itself in that one word—leisure. He whose hours exist only on the face of a clock is a worldling, a philistine, an earthworm. What a joy it is to feast on leisure!" "Vide: My Ideal Home" By one Noguchi, Professory of English Literature, Keis Gijuku Univer-sity, Tokyo.

† మేథ్యూ ఆర్నాల్డ్ మాట లెట్టివో చూడుడు:

"And we are here, as on a darklingplain, Swept with confused alarms of struggle and flight, Where ignorant armies clashby night.

గాని పిశాచముకాదు. ప్రతిభాపాణింధమును ప్రయోగించునవి ఉత్తమాశయములుగాని దురూహలుగావు. నిరాశను పీపెక్కి స్వారిచేయనీయకుడు. సహనకవచము దాలిచి శాంతిమంత్రమును జపింపుడు. ఆశారక్తాథను తప్పక చూతురుజుడీ! ఇహజీవనము తుచ్ఛమైనది కాదు. మహత్తరజీవనమున కది ఆక్కరైనసోపానము. జగతిని జూచి 'ఇసీ!' యనకుడు. ఈశ్వరసామ్రాజ్యమున కది ప్రధానద్వారము. పంకిలము మీద మనసును రాలనీయరాదు. సహృదయుని అంతరంగమునా, గగనలక్ష్మి సుందరాననమును, ప్రకృతిమహిళ ప్రశాంతహృదయమునా, బాలకుని ముద్దుమోమును చూచి మరియు" దని ఈ యదృశ్యాధ్యాత్మికశక్తి పలుమాఱు మనకు ప్రబోధించుచునేయుండును. వెతకిన, కం టెందుండదు? గాలించిన రొచ్చు కానంబడదా? ఉన్నదానిని లేదనుట ఎంతదోషమో, లేనిదాని నున్నదనుటయు నంతదోషము! అనుమానమునా, అడలునా, అసహ్యమును ఇలువేలుపులు చేసికొనువారికి పూజామందిరమున గూడ పిశాచగణము ప్రత్యక్షమగును! ఇతడు మెచ్చగలది, చూచి యానందించునది జగతిలో నేమియునుండదు. పూవును చూచి "ఈచోటు పవిత్రవంతమైన దని పలికి ముకుళితహస్తుడై ఒకప్పుడు ఎమర్సన్ మహాశయుడు సుమసమ్ముఖమున నిలిచినాడు! పూవుపై కన్నువేయక క్రిందిపేడలో చూడ్కిజొప్పించువాడు మనుష్యరూపమున నున్న పురుగందునా. మనుష్యచరిత్రను గనిపెట్టుటకు పేండ్లను, పూండ్లను గడపనక్కఱలేదు. కొలదినిముసములు వ్యక్తిచెంత నిలిచినచాలునా. మాటలందునా, చేతలందును పరిమళమును వెలారింపగలవాడు మూర్తిభవించినస్వర్గము. నిరంతర దూషణమందునా, దురంతదుర్విమర్శనమందున రొచ్చులో పడిన పందివలె పొరలాడువాడు రూపుదాల్చిన నరకమని నొక్కిచెప్పవచ్చును.

సహృదయులు ప్రకృతి నాశ్రయించి, సదాశయద్యుతిని గాంచి, దివ్యడింభకముల ట్లు మహత్తర భావములను ప్రసాదించుతల్లియని దానికి ప్రణమిల్లుదురు. ఈసహృదయులెవరు? కవులునా, ఋషులును, ఆచార్యులును, ప్రవక్తలును, గుణవంతులును గారా? వీరందఱును యాత్రికులే? వీరు ముక్తిదూతలని కూడ నిరూపింతును. సత్యవ్రతులై, సౌందర్యోపాసకులై, భావపిపాసులై, మహాజిజ్ఞాసువులై వీరు యాత్ర సల్పుదురు; తపమాచరింతురు.

మనుష్యసంఘమునకును, మహారణ్యములకును, మహోన్నతపర్వతములకును ప్రాచీనకాలమున దగ్గఱి చుట్టఱిక ముండెడిది. మానవులను వదలి కొండలందునా, బిలములందును ముక్కుమూసికొని ఆత్మముక్తికై భారత మానులు తపించిరనియు, సంఘసేవ నించుకైన వీరెఱుగరనియు పలువురనుచుందురు. మన కవిఋషులును, ఆచార్యులును చేసిన, నేడును చేయుచున్న మానవసేవను వసుమతియందు మఱెవ్వరును చేయలేదని ఋజువుచేయగలను. రమ్యప్రకృతియందుండియుండి, దానిని మనుష్యహృదయమున ప్రవేశపెట్టినవారు వారే! వీరికతన జేకుధర శిఖరములపై నుత్పన్నమైన భావగంగ, స్వార్థదరులందు నక్కియుండక బహుయుగములనంగి జాలువారుచు, బహుళమానవమానస కేదారములను దనుపుచున్నది; భావభరితములైన వీరిప్రబోధములు ప్రజల నిత్యజీవనములం దింకిపోయినవి.* వీరిరచనములును, వీరి జీవనవిధాన

---

*వీ రీశ్వరుని నదులందునా, దరులందునా, రాగరంజితనభమందునా, వనములందును (భారతసాహిత్యమంతటి ప్రతిపుటయందును నివి గోచరించుచునేయుండును.) విలోకించుటచే, నీశ్వరభావ సముద్భవగంభీరాశయములన్నిటిగూడ నందే కాంచిరి. ఈవాక్కులను విలోకింపుడు:

**"Think of the form of your Ishtam(Ideal) as smiling and full cf bliss......Imagine that everything is shining thrcugh its lustre......Ihtam pervades land and water hills and dales, sky and stars—everything"** (Vide "Spiritual Teaching"—Page 8. by Swamy Brahmananda)

ములును, వీరి యుద్బోధనములును గలసి భారతవిజ్ఞానమై అన్యసీమలందుగూడ స్వాగతమందెను. కొండసింగారమున, కాంతారసంతానములందు, గురుకులములలో, ప్రశాంతాశ్రమములందు జనించిన విజ్ఞానమును దూరసీమలకు, భావియుగములకును అందించిన పరార్థజీవులు వీరు. వీరికిని వీరియుద్దేశసిద్ధికిని నడుమ నెన్నో కంటకములు, ఎన్నో సంకటములు నిలిచినవి. సంకల్పసిద్ధికై నడుము గట్టిన యోధులు కావున నిచ్ఛాశక్తి, దృఢ నిశ్చయములు, సహనశాంతులు మున్నగు గురుగుణములను దమ యాత్రయం దలవరచుకొనిరి కావున వెనుకంజవేయక, వినికతన సర్వశక్తి నంది విక్రమసింహులై గమ్యస్థానము దెస నడచిపోయిరి. శంకరరామానుజ, రామానంద వల్లభాచార్య, మధ్వాచార్య, శ్రీచైతన్యప్రభృతిమహాయాత్రికు లాశ్రమస్థానములనుండి భావవిభూతినిగొని, క్లిష్టపథములగుండా కదలిపోయి మానవలోకము నుద్ధరించిరి. వీరి ప్రత్యేకజీవనములను పుంఖానుపుంఖముగ పరిశీలించితిమేని ఎన్నెని దృష్టాంతములు చేకుర్చును. లంబినీవనము, జేతవనము, అనాథపిండికుని ఆరామము, బోధిద్రుమము, పురాతనీ రాజనాథురి, సారనాథవనము బుద్ధజీవనమందలి ప్రధానస్మృత్యములు! దేవదత్తప్రభృతు లితని యాయువుదీయ నుద్యమించిరి. తనయిక్కట్టులను నెట్టివేసి తథాగతుడు నిర్వాణమహత్త్వమును ప్రజల కుద్బోధించినాడు. ఈతడు చేసిన సాంఘికసేవ మెవ్వడు చేసినాడు? మహావీరుడు? మహారణ్యములందు దుంపెగింత్ర దెబ్బలకు నెన్నొగ్గియే కృతకృత్యుడైనాడు! కబీరుదాసు భారతపథికుడ నని చెప్పికొనినాడు! సృష్టిమంతయునొక్క కుటుంబమనియు, దీని యధినాథుడు జగదీశుడనియు వచించి ప్రజల నాతనిప్రేమాల జేర్చుటకై మహాయాత్రికుడు మహమ్మదు కావించినకృషి ఎట్టిదో ఎఱుగమా?

కవియును ఈయాత్రికుల వర్గము లోనివా డనియే కదా తెలిపియుంటిని. * తక్కుంగల పత్రికుల ట్లితడును

---

"The water of the Ganges is verily the holiest of all waters it fulfils one's desire and is a help to realising the Ishtam" Brahmananda.

"The water of the Ganges, the holy prasadam of Jagannath and the sacred dust of Brindavan are verily Brahman in reality" Ramakrishna Paramahamsa.

పంచవటికడ పాడుచు నాత్మహృదియందు రామకృష్ణపరమహంస మధురవీణా నాదమును వినుచుండువాడు!

"To bring the idea of vastness within, one should see the Himalayas or the ocean or gaze at the sky" (Vide: Brahmananda Swamij's "Spiritual Teaching" page 284.)

* ఏదేశమున నేకాలమున నుద్భవించిననేమి కవులందఱును యాత్రికులే! వీరిభావములు, రాజకీయార్థిక సమస్యలు వేఱువేఱై యుండవచ్చును. వీరి ప్రధానోద్దేశములందు పారపాచ్చములు లేవు. వీరందఱును సత్యవ్రతులే! సౌందర్యోపాసకులే! మహదాశయముల నారాధించువారే! వ్యాసహోమరులును, వాల్మీకి సోఫోకిల్సులును, భట్టబాణగెథేలును, కాళిదాసు షేక్స్పియరులును, భారవిడాంటేలును, భవభూతిషిల్లరులును, భాసు భాసరులును, ఓల్హాణ స్పెన్సరులును, మల్హణటెన్నిసనులును, సుబంధుబ్రౌనింగులును, మాఘ బైరన్లును, మురారి షెల్లీలును, శివభద్రవర్డ్స్వర్తులును, సోమిల్లిస్కాట్లును, చోరకీట్సులును, మయూర బెన్ జాన్సనులును, దండిడ్రైడనులును అన్నదమ్ములే. తనపాత్రలందలి కొండొకయాత్రికు నుద్దేశించి డాంటే మహాకవి తెలిపిన ఈనుడువు లాతనికే చెల్లును.

"He had gone through almost all theparts to which this language (Italian) extends, a pilgrim almost a beggar. (See also the reference which Dante makes to his own exile at Verona and else where in Paradise XVII 58-60)

**13.** 12- 14 ౮౮3

వసుంధరను చీకటినుండి, చింతనుండి, వెగులునుండి, దిగులునుండి, విషవాయువునుండి, గభీర కలుషమునుండి కాపాడును.

కళ, మతము, తాత్త్వికశక్తి, మనుష్యజీవనము దాశరథులట్లు కలసినపుడే జగతియందీశ్వరసామ్రాజ్యము నెలకొనును. ఇట్టికలయిక నేడు గోచరించుట లేదు. కావున ప్రకృతియందలి మహత్త్వము నేడు మనుష్య చరిత్రను సోకుట లేదు కావున, మహాయాత్రికులైన కవులును, ప్రవక్తలును, తాత్త్వికులును, ఆచార్యులును గాక, సామరికసామగ్రిసృష్టికై తోడ్పడు భౌతిక శాస్త్రజ్ఞులే నేడు పాడనూపుచుండుటచే, అధునాతన నాగరకత చింతనిప్పులను క్రక్కుచుండుటచే, ఆత్మ శక్తి యడగి పశుబలము హెచ్చుచుండుటచే, రక్కసి వలె స్వార్థము పెచ్చిల్లుచుండుటచే నేటివసుమతి దుర్దాంతదుస్థితి పట్టినది. ప్రపంచము నీదుర్గతినుండి యుద్ధరింపగలవారు యువకులు. మహత్తరమైన ఈ క్రియను నెఱపుటకై వీరు తపశ్శక్తి నందవలెను. దీనిని పడయుటకుమున్న వీ రెన్ని కఠోరపరీక్షల నెదుర్కొనవలెను. వీనియందు గెలుపునందినంతన,-నూతన బలమునందినంతన, మహోన్నత కర్తవ్యశిఖరమున గాలూనినంతన అంతరంగ మానందప్లావితమైనంతన గనువిందొనరించు దృశ్యము, మహదాశయప్రదీప్తకాల వియత్తలము వీరిశిరోభాగమున దోచుట తథ్యము. నాటి సాయంసమయమున, బ్రహ్మగిరిశిఖరమున, దాశరథులు పోలు ఉదుంబరవృక్షములనడుమ, విజ్ఞానశైవలినీజన్మ స్థానమున కనదురుప్రకృతిమాల ననిమేషలోచనుడనై చేతులుమొగిచి నిలిచిన ముహూర్తమున నే బడసిన పాఠ మిదియే!

సూర్యుడస్తమించిన కొంతసేపటికి సంజకెంజాయ అదృశ్యమయ్యెను. ఆత్మజీవనమునుండి భాగ్యరేఖలు జలజలరాలినపుడు, చేటు మూకలందు ప్రవేశింప పైశాచికనృత్యము సలుపులీల, కారుచీకటు లచ్చో జొరబడదొడగెను. నిముసములో బ్రహ్మగిరియంతయు అంధకారబంధురమైనది. ఎట్టిఘనుడైనను, ఎంతబలశాలియైనను, సమయసమయములందు లెక్కలేని సేసులకు నిజజీవనము నొడ్డవలసినదే! పుణ్యనదిని గని, గగనము నంటునంతటియున్నతి నందిన బ్రహ్మగిరిమీద నాటి రాత్రి నీసమయమున గాఢతమస్సమునకు తలయొగ్గవలసివచ్చెను. రక్కసిమోమువలె భయంకరమైనవిభావరితో కాలము గడపు టెట్లు? సమీపముననగాని, కొంతదూరముననగాని ఏ దేవాలయమో, పర్ణశాలయో గోచరించిన సంతసించియుందును. అట్టిదేమీ కనబడలేదు. నాలుగుచెట్లనడుమ, తల్లి పుట్టినతావులోనే రజనిగడప నిశ్చయించితిని. ఇరులందు నిందందు మసలిన, నేదేని మసలము వచ్చునని

---

నైతికవిభూతిని సృజింప లేఖిని బూనిన కార్లయిలును, మానవకృషియందెన్నోయేండ్లుకడపిన ఆర్నాల్డును, మతమహత్త్వమును గుడిగోపురమట్లు నిలువబెట్ట గంకణము కట్టుకొనిన న్యూమేనును, కళోపాసనమందును, సంఘసముద్ధరణమందును మనసుంచిన రస్కిను మహాశయుడును నిజజీవనము నొక్కొక మహాగ్రంథము గావించుకొనిన యాత్రికులే! వీరిబృందమున చేరజాలనివారుకవులేకారు. ఇందుకు కృషిసలిపినచో ప్రతిమానవుడును పద్యమల్లజాలును. కాని పద్యమనగ నితడా? గుడియన దేవుడా? శరీరమన మనుష్యుడా? పద్యమును గుడియును శరీరమును బాహ్యావరణములే! శ్వేతమల్లెయందు గభీరసౌరభసింధు నిహితమై యుండునట్లు, తుషారకణమున మిహిరమండల మడగియుండునట్లు, చిన్ని పద్దెమున, ముద్దుగొలుపుగద్యయందు భావబ్రహ్మాండమును దర్శింపగలవాడే కవి. ఆత్మప్రతిభను గుఱుతించి, జగతిలోని కీశ్వరునిచే పుత్తెంపబడిన రాయబారినని యెఱిగి, బాహ్యప్రకృతికిని, మనుష్యప్రకృతికిని గల వియ్యమెట్టిదో, అందెంతనెయ్యమున్నదో వివరించి నిహితభావములను వ్యక్తీకరించుచు తనమతియందు నవజీవనసృష్టి గావించువాడితడు. పైన నుల్లేఖింపబడిన అద్భుతశక్తి ఆచార్యుని హృదయమున ట్లీతని యెడదందునుకూడ చక్కనైన తులసికోటను గావించి అందు దివ్యదీపికను వెలిగించును. ఇందలి మణికాంతులనే యీతని రచనయందును, జీవనమందును, ఈతడు మసలు సంఘమందును విలోకించి ఆనందింతును; నూతనభవముండి, లోనిఖువును కట్టుత్రాళ్లతో బంధించి, నిజజీవనములందు విజయధ్వజమును నిల్పజాలుదును,

యూహించి అందే చతికిలబడితిని. రాత్రి అవు డేడుగంటలుమాత్రి మయ్యెను. కడపవలసినకాలము తక్కువకాదు. వచ్చివచ్చి కారుచీకటులందు తల దూర్చుట మంచిపని కాలేదేమోయనుకొంటిని. హృదయమందు తలయెత్తిన తీవ్రవాంఛయే నన్నచటికి బరబర యీడ్చుకొని వచ్చినదికదా! ఈవాంఛ నరికట్టుటకు నాకు శక్యము కాలేదు. 'మొండిసాహసము' నకు దలపడితిని. దీర్ఘయోచనమువలె 'మొండి సాహసము' కూడదని యూహింతుము. కాని మహాద్భుతములను మాటలనట్లు మాపునకైకొని కాలము నడచుచుండ, నాయద్భుతములను చేబట్టవలెననిన మొండిచొరవ యక్కరై యుండునని అపుడపుడు తలపోయుచుందును. దీర్ఘయోచనము మనుజుని నిలిచిన తావునందే నిలిపి, రాతిబండ జేసివేయును! మొండిచొరవ వానిని ఘోర విపత్తులందు గూలద్రోయును! విపత్తులందు బడమేని, మనమందు అనుభవమెంత? సంపాదించు పరిజ్ఞానమెంత? నిదురించిన మనుష్యశక్తులు ఆపదలవలననే, నుస్సోటపోటున నుద్వేత్తుగ నుబుకు అగ్నిసెరసులవలె లేచును! వెనుకనుండి వేటకాడు వాడిశరపుంఖ వదలుచు, తరుముకొని వచ్చుటచే గదా కురంగము జవోపేతముగ పర్వెత్తి, తనపరుగున నాత్మశక్తిని గుర్తించినది! మానవుని సహనసామర్థ్యములు విజృంభింపవలెననిన, మనుష్యులందొకండు మనుష్యుడు కావలెననిన, అత డాపదలకై తపింపవలెనని నొక్కిచెప్పుదును. అవమానముచేసినను ఆపదలు ప్రత్యక్షము గానియెడల, నడుముగట్టి తానే వానిని వెతకుకొనుచుపోయి కదనమున డీకొనుమని సవాలు చేయవలెను.* ఆపదలందు లంఘించునలవాటును శైశవమందే, జేబులో నిండైన బండి సున్నను నిలుపుకొని హోరాస్టేషనులో దిగిన మహాత్తమునుండి యలవరుచుకొంటిని.

చెట్లనడుమ జేరుకొంటినిగాని నిద్దురపట్టించుకొనుట అనర్థకహేతువగునేమో యనుకొంటిని. కనులు మూసిన నెట్టియుపాయము తలపెట్టవలెనో! నలుతట్టులందును విద్రోహిమానసమట్లు దట్టమైన యడవి చూపట్టుచుండెను! అందెన్ని ఘాతుకమృగములున్నవో! ఏపులియో మీద నెగిరిపడి, నిదురించుచున్న నిముసములో నవరగోళమున ప్రవేశపెట్టుననిన అతిశయోక్తి కాజాలదు. కాని, మేలుకాంచిన మాత్రమేమి? గర్జించుచు మృత్యువు పైబడిన నేమిచేతును? వన్యపశువుతో పోరుటకు సంసిద్ధుడనై యుండలేదు. చేత నేయాయుధమును లేదు. తుపాకు గల్గియుండలేదు. క్రూరమృగము మార్కొనినచో "హర! హరా!!" యని దానికి కబళమైతీరవలసినదే! కటికిచీకటిలో, కొండనేలయందు దెచ్చటికి పరుగెత్తుదును? పరుగెత్తినను, మఱొకజంతువు నోటిలోనికే! మృగముఖగహ్వరముగాకున్న, ఏలోయలోనో గుభాలునగూలబడి, గుండనై పాతాళమున రాలుదునని యెఱుగుదును. నదీమతల్లి మంజులరవమున అనంతగీతిక నాలాపించుచునే యున్నది. కడుపు చలువగల జలధార కనిన గీతికాధారకరుణాధారయై నామనసును సోకుచునేయున్నది. ఆధార నాకు నూతనపాఠమును గఱపినది. భయంకరసమయమందైనను, పాడుకొనుచు, అవిచలితచిత్తయై తల్లి తనపనిని తాను చూచుకొనుచున్నది! కట్టెదుట పెద్దజోదులట్లు ఇక్కట్టులు నిలిచినను, అంతర్వాహినియైన సరస్వతివోలు శాంతభావము నంతరంగమున స్రవింపనిమ్మనియు, దానితో తన నెయ్యంపులియ్యనిపాటను సహకరింతుననియు గంగా

* నేడీ యంశమును గుర్తించిన పాశ్చాత్యుడు ముస్సోలినీ! నేడీతడు సభ్యజగతి కెంతో యెగ్గుచేసినాడు. అబిసీనియనుల యెసల దుండగమునకు గడంగినాడు. కాని, యీతడు అద్భుతమైన ఇచ్ఛాశక్తి నలవరుచుకొనిన వ్యక్తియగు, ఆపదలందు భయరహితుడై మసలువాడని, స్వీయసేమకై ఎన్నెన్ని యత్యాచారములు చేసినను స్వార్థము నారాధింపలేదని, తనకైగాని, తనవారికైగాని ఈతడు హంసతూలికలను తల్పముచేసికొనలేదని, నిరంతర విలాసమున బొరలాడక తనసైనికులతో కూలివాండ్రతో గలసి శ్రమించువాడని యెఱుగుదుము. "Live dangerously" అనువాక్యము వీనిMotto. పిల్లిపిల్లలవలె నీతడు సింహడింభకములను పెనుచువాడు!

భవాని * ఆదరపూర్వకముగ తెలుపుచున్నదని గ్రహించితిని. అవ్వల ఘోరఝంఝూనిలము విజృంభించుచున్నను, హృదయమందలి శాంతిని మానవుడు గోల్పడరాదను ప్రధానపాఠము భగవద్గీతయందు కలదు. (Vide: Swamy Saradananda's Bengalee Commentary on the Geeta) కొండనంటు కెరటాలతో నెగిరిపడు కడలికడుపున ననంతశాంతి విరాజిల్లుచుండును గదా! ప్రకృతినుండి పాఠములను గ్రహించుటెట్లో పాఠకులకు తెలుపనే తెలిపితిని.

"కానవావానిగంగాభవాని" యనియు, "నను జూచి హోరనియేడ్చు గంగాభవానితో" ననియు బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు మసనమందలి చంద్రమతిచే పలికించినారు. † నను జూచి, మందాకినీమతల్లి మత్యంతమంజులముగ గీతికాలాపనము చేయుచు, నా గుండెనుండి దుడుకును దూరీకృతి మొనరించుచు నందు పరితోషమును నించింప యత్నించుచున్నదని యూహించితిని. కావున గీతికాపూరమునకు భక్తిపూర్వకముగ మానసాంజలి నొడ్డితిని.

కడచిన నిశీథమందును, నాడును పడిన హైరానువలనను, బొంబాయి విడిచినదాది ఆహారనిద్రల నెఱుగక పోవుటచేతను, మేనువాల్చవలెనను బుద్ధి పుట్టినను ఒరగక కొయ్యవలె కూర్చుని అజాంతముతో నన్ను గుటుక్కున దిగమ్రింగిన అంధకారము నబ్బురపాటున నవలోకించుచు యోచనామగ్నుడనై యుంటిని.

చీకటి పడినంతనే ఏవో పురుగులు ఎడతెగని రీతి గూయుదొడగినవి. పొలములం దిట్టిధ్వనిని చాలమాఱులు వినియుంటిని. కొంతసేపటి కది ఆగిపోయినది. ఆగినపుడే అంతకుము న్నట్టిశబ్ద ముండెనను అంశము మనసున తట్టినది. చెవికి నలవాటైన రవమును పాటింపమనియు, అది యాగినపుడే యది యుండెనని గ్రహింతుమనియుగదా మనశ్శాస్త్రము తెలుపుచున్నది! ఏదేని వన్యమృగమో, అప్రాకృతశీరమో నాదెస వచ్చునేమో యని యూహించుచు నలుతట్టులను పరికించుచుంటిని. ఎందుండియో అపుడెవరో పకపకనవ్విన శబ్దము హఠాత్తుగ చెవిబడినది! ఉలికిపడితిని! గుండెలు దడదడలాడినవి! అందు మనుష్యసంచారమే లేదు. అక్కడ మెట్లు

* గోదావరికి గంగయనురూపాంతర ముండుట లోకప్రసిద్ధము. పోతరాజు పలుమారు గోదావరిని గంగయని సంబోధించినాడు.

† ఈ పల్కులందలి Pathetic fallacy కడుంగడు చక్కనైనది. కవి, ఈయలంకారమును కడుకష్టముతోనైనను వదలుకొని, చక్కనితాత్త్వికభావము నిందుంచిన బాగుండెడిది. అమరకాంతల అంగలార్పుగూడ కలస్వనము గలదై యుండునుగదా! అందుచు దివిజకల్లోలిని, విశ్వేశ్వరసాన్నిధ్యమున వేలయై హోరునవ్వినందను భావమునుగాక "బిడ్డా! అదో! ఈశ్వరుసందుండి కదలివచ్చుచున్నాడు. ఇక నచిరములో సాక్షాత్కరింపగలడు. నీయిక్కట్టుల నీశ్మశానవాటికయందు బూడ్చివేయుము జావీ!" యను భావమును (నిక్కముగ నామె కడగండ్లందే కడతేరును కదా!) కవి ఇందు జొనిపియుండవలసినది. ఇట్టి భావము చంద్రమతిహృదయమునకును, ప్రేక్షకుల యెడందలకును గొంత యూరట గూర్చెడిది. రాబోవుదానిని నాటకకర్త చెప్పివేసినయెడల Dramatic effect నకు చెఱుపువచ్చుట నిజమే! కాని, ఇన్నిమాటల నుచ్చరింపక "మారదృష్టిగల లోకపావని పాడిన భావగర్భితవాక్కు"ని యూహించుటకు చోటొసగుచిన్నిమాట నాత డందుచొప్పించియుండిన, తననాటకరాజమును Idealism, optimism లచే తళ్కొత్తించియుండువాడు. ఏకావ్యమునకైనను, ఏజీవనమునకైనను వన్నెదెచ్చున వీరెండుశక్తులే! వీని నంతరంగమున నిడికొనినవ్యక్తులే ధృతిసహితులై భయదకష్టములతో పోరిరి ఈ యంశమును గణింపకపోవుటచే మనకవులు మాటిమాటికి మహావీరులచే గోలపెట్టించిరి. శూరులందుశూరులై, కోటికోటిఘోరారిష్టములను చెండాడినవారు దుర్గాహగున గడగడలాడి కన్నీరోడ్చిరని తెలపజెల్లదు. గుండియలను పట్టి నీటిబుగ్గలు చేసికొనినచో వారి యసిధారావ్రతనిష్ఠకు, సత్త్వైకస్వేచ్ఛాదీక్షకు తప్పక భంగము వాటిల్లియుండెడిది. ప్రేక్షకుల హృదయములను కదలించుట నాటకకర్త పని. కావున విషాదమును పూటెక్కించినగాని పనిచెల్లదని మనకవు లూహించియుందురు. పొంగిపొరలు దుఃఖముపై, పాలకడలిపై తేలియాడు దేవదేవునిపట్లె, మణికాంతు లీను ఆశాద్యుతి లేదని ఆదర్శకవులు తెలుపగలరా?

వచ్చెనో యూహింపజాలనైతిని. దొంగ లెవరైన నందు పొంచియుందు రనుటకు ఎట్టిఅవకాశములేదు. కలవారి ఇండ్లను కొల్లగొట్టువారికి కోగులుందు నెలవున నేమి లభించును? అం దేవైనపిశాచము లున్నవని యోచింతునా? దయ్యములను గుఱించిన వింతవింతకథ లెన్నో జ్ఞప్తికివచ్చినవి. కోటిపల్లి కాల్వయొడ్డున నొకప్పు డొక చెంచుయాడుది చనిపోయి, భూతమై అచ్చటి చెట్టును పట్టియుండి, ఏమరుపాటున నెవ్వరైన రాత్రులందు అటనుండి పోవునపుడు "తిన్నాలమ్మతవ్వాలో!" అని యఱచుచు వారిని అసలగొట్టుచుండెడిదట! అట్టిదయ్య మేదైన నవ్వుచుండెనేమో! కాని, కడుంగడు పవిత్రమై, దేవతల క్రీడాంగణమై, ఋషికంఠీరవులయాటపట్టయిన అచ్చోటున పిశాచము లెట్లు చేరజాలునని తలపోసితిని. "బొంబాయినుండి బహుప్రయాసతో వచ్చినది ఈ భయంకర నిశీథమున, నీఘోరారణ్యమున, నీ నిర్మానుష్యప్రదేశమున, నీ భీషణాంధకారమున నే క్రూర జంతువుగొంతుకలోనో నీకుత్తుకను చొప్పించుటకా?" యని ఎవ్వరో నాయంతరంగమున నట్లు నవ్విరేమో యనుకొంటిని. ఐదునిమిషములు గడచెను. మరల పకపకమనునవ్వు చెవులబడినది! అది నాయూహ కాదని గ్రహించితిని. అదేమో యెలుగువలెనని మఱుకవపడితిని. పరిసరమున పరికింపవలె ననుకొంటిని. చేతిలో టార్చిలైటైనను లేదు. అగ్గిపెట్టె వెంటనుండవలసిన అవసరము నాకన్నడు లేదు. చీకటిలో తడుముకొనుచు మసలినయెడల ముప్పువచ్చునేమో! కావున ఆ "నవ్వు ఎవ్వరిదైనను సరే" యనుకొని కిక్కురుమనకుండ చెట్టునకానుకొని కొయ్యనై కూర్చుంటిని. అదూరమునగలలోయలో అపుడేదో మంట కానుపించినది! వియోగిద్దరైన నందు ఆశ్రమమేర్పఱచుకొని వసించుచుండెనేమోయని యూహించితిని. మున్యాశ్రమ మొకటి అందున్నదని యెఱిగితినేని, చీకటి పడకమున్నె తొలుత నం దరిగియుందునేమో! కాని లోయ మిగుల లోతైనదగుటచే, దానిని చేరుట కష్టమేయని గ్రహించితిని. మరలిపోవునపుడు ఋషికుటీరమును చూడవచ్చు ననుకొంటిని. మంటదాపున మునిప్రవరుడుగాని, శిష్యులుగాని అగపడుదురేమో అనుకొని అకట్టున దృష్టిని బద్ధమొనరించియుంటిని. ఇంతలో నాజ్వాల యదృశ్యమైనది. కొంతసేపటికి మంట మఱికొంతదూరమున కానుపించినది! ఇట్లే మఱికొన్నిమంట లగపడి అదృశ్యము కాజొచ్చినవి! పాపికొండలలో* రాత్రులందు మంటలు లేచు టెఱుగుదును. వనము దగ్ధమగుచుండ లేచినజ్వాల లవియని స్పష్టముగ దెలియును. దాగరమూతలాడు నేటి మంటలో? అవి కొఱవిదయ్యము లని యూహించుటకు నామనసొప్ప లేదు. ఏమైననేమి? చూడ్కుల నచ్చెరుపాటున నాదిక్కునందే నిలిపియుంచితిని. ఈపర్యాయము కొండనేలయందు కొంతదూరమున శబ్దముతోకూడ పెనుమంట యెగసెను ఖాండవదహనదృశ్యము మరల ప్రదర్శింపబడునేమో యనుకొంటిని. శబ్దసహితమైనజ్వాల! శైలశిఖలమునకు ఋక్కులుచ్చరించు ఋషీంద్రు డెవ్వరైన నిప్పంటించుచుండెనా? వెలుతురులో నేదోయఱచుచు, వలయముగ పరుగెత్తుచున్నట్లు తోచెను. అది వన్యమృగమో, కొండలందు మసలు కోయవాడో, అడవియని

* తూరుపుకనుమలలో నివి మిగుల నెత్తైనవి. ఇవి శ్రీరామగిరికి కొంతదూర మీవల నున్నవి. ఇచటి గోదావరి మిగులలోతై మొసళ్లతో నిండియుండును. కొండలనడుమనుండి నదియం దాఱుమైళ్లవఱకు పోవలెను. శ్రీరామనవమినాడు దయోధ్యను చూచినట్లు భద్రాచలమును పర్ణశాలను జూచుటకై [illegible]తో నాఇంటర్ మీడియట్ పరీక్షలకుముందు ఆక్షేత్రములకరిగితిని. పాపికొండలందలి వింతదృశ్యముల నపుడు విలోకించితిని. ఈపయనమును గుఱించిన ఉదంతమును చదువరులు మఱొకచో గాంతురు.

షియో, అపూర్వమైన మహేజీవమో గుర్తించుట నాకు సాధ్యము కాలేదు. వింతయు, భీతియు నాకరమైన నాదృశ్యమెట్టిదైనను దూరమందే గోచరించుటచే దాని వలన నా కెట్టియొగ్గు కలుగదని ధైర్యమూనియుంటిని. కాని అది పర్వతప్రదేశమున చిత్తమువచ్చినచొప్పున విహరించుచుండుటచే, నాప్రమోల, - నామీద నిలిచి చిందులుత్రొక్కునేమో యని పరక్షణముండే యడల జొచ్చితిని. నాలోనేను దండకముల నేకరువుబెట్టుకొన సాగితిని. మరల పకపకమనునవ్వు! దూరమున నీ రెలుంగు! సైళరిస్తబ్ధతను చంపసెంచిన గర్జనము!

# స్వర్గీయ ప్రేమచందు

గిడుగు రామారావు

మొన్న అక్టోబరు రాత తేదీన మున్షీ ప్రేమచందు స్వర్గస్థుడయ్యెను. ఈవార్త సాహిత్యోపాసకుల కెల్లరకును దుఃఖదాయకము.

ప్రేమచందునకు తలిదండ్రులు పెట్టిన యసార్థక నామము ధనపతిరాయి. అతడతని జీవితములో దీనా మును సార్థకము కానీయలేదు కాబోలు ప్రేమచందు అని



మార్చుకొనెను. అతడు కాశికి ౫ మైళ్ల దూరమున మాఢ్వ అను గ్రామములో ౧౮౮౦-వ సంవత్సరమున జన్మించెను. అతడు కాయస్థకులజుడు. అతనితల్లి ఎల్లప్పుడు రోగపీడితురాలై యుండి యతనిచిన్నతనముననే మరణించెను. అతనితండ్రి పోస్టలాఫీసులో గుమాస్తా. నెలకు ఇరువదిరూపాయల జీతముతో పనిచేయుచుండెను.

ప్రేమచందునకు ౧౫వయేటనే వివాహము జరిగెను. వివాహమైన ఒక్క సంవత్సరములో నతని తండ్రియు మరణించెను. తండ్రి నిలువచేసిన కొద్ది రూప్యములు లౌకికియంత్యక్రియలకు సరిపోయెను. సంసార భారము ప్రేమచందుపై బడెను. అప్పటి కతను ౧౬ సంవత్సరములవాడు. భార్యయు, సవతితల్లియు, సవతి తమ్ములిద్దరు అతనిపై ఆధారపడియుండిరి.

పదునారవ సంవత్సరమున మెట్రిక్యులేషన్ కాశిలో క్వీన్సు కాలేజిలో చదువుచుండెను. అతని తెలివితేటలకు మెచ్చుకొని కాలేజివారు ఉచితవేతనము నిచ్చిరి. కానియతడు సంసారభార మెట్లుతప్పించుకొనగలడు? పిల్లలకు చదువుచెప్పి నెలకయిదురూపాయలు సంపాదించి ఇంటిక్రింద ఖర్చుపెట్టుచుండెను. రూపాయకు ౧౦ శేర్లచొప్పున జొన్నలుకొని వానితో కాలము గడుపుచుండెను. ప్రతిదినము ౫ మైళ్లు నడచివచ్చిపోవుచుండువాడు. ఇట్లు కష్టపడి మెట్రిక్యులేషను పరీక్షలో రెండవతరగతిలో నుత్తీర్ణుడయ్యెను.

అతనికి విద్యాభిలాష మెండు. ఎఫ్. ఎ. చదువ దలంచెనుకాని ఆర్థికదుర్దశ సాగనీయలేదు. ఉచితవేతనమునకై ప్రయత్నించెను. రెండవతరగతిలోనుత్తీర్ణులైనవారి కది లభింపదు. ఆదినములలోనే హిందూకళాశాల విద్యాలయము స్థాపింపబడెను. ప్రేమచందు ప్రిన్సిపాలుగారిని కలిసికొని ప్రార్థించెను. కాని అతడు లెక్కలలో ఎక్కువ తెలివిగలవాడు కాడు. అందువలన ఉచితవేతనము దొరకలేదు. ఇంక చదువుమానివేయక తప్పినదికాదు దానికి. దానికితోడు జ్వరము. పాపమతనికష్టములు వ్రాయనలవికాదు. కాశిలో నొకవకీలు కడ కేగి వానిపిల్లలకు చదువుచెప్పుదుననియు, ౫ రూపాయి లిమ్మనియు ప్రార్థించెను. వకీ లందులకు

సమ్మతించి, అతను ఉండుటకు ఒకగదికూడ నిచ్చెను. ౫ రూపాయలలో మూడు ఇంటికిపంపి రెండురూపాయలతో తాను స్వయంపాకము పెట్టుకొనెను.

అతడులయిబ్రరీకిపోయి చదువ నారంభించినదిప్పుడే. నవలలన్నియు బూర్తిచేసెను. ఉర్దూనవలలు, తదితర గ్రంథములు పూర్తిగా పఠించెను. ఉర్దూలో పండితుడయ్యెను. కాని ధనసంపాదనమున్మాత్రము వెనుకబడెను. ఊరిలో వస్త్వులు పెరిగిపోయెను. తిరుట కాహారము దొరకుటలేదు. పాపము కొన్నిదినములు వానబోసినశనగలు తిని యుండెను. ఇంతలో నింటికిబోదలచెను. ఉత్తచేతులతో నెట్లుపోగలడు? తనయొద్దనున్న చక్రవర్తి కృతఅంకగణితపుస్తకమునమ్మి ఒకరూపాయి సంపాదించెను.

పుస్తకమునమ్మునపుడు ఒక హైస్కూలు ప్రధానోపాధ్యాయు డతనిజూచెను. అతని దీనస్థితికి జాలిపొంది ౧౮ రూపాయల జీతముతో తనస్కూలులో ఉపాధ్యాయుడుగా కుదిరించెను అచ్చట ఉపాధ్యాయుడుగానుండి యే ప్రేమచందు బి.ఎ. పరీక్షయందుత్తీర్ణుడయ్యెను. బి. ఎ. పరీక్షఅయినపిమ్మట గవర్నమెంటు ఉద్యోగముదొరకెను.

అప్పటికతనికి ఇరువదిసంవత్సరములు దాటెను. అప్పుడే ఉర్దూలో కథలు వ్రాయనారంభించెను. ౧౯౧౪ వరకును ఉర్దూలోనే వ్రాయుచు పిదప హిందీలో వ్రాయ మొదలిడెను. ఉర్దూలో తనకథలను 'వ్యాసకర్తనవాబురాయి' అని వ్రాసుకొనెడివాడు.

ప్రేమచందు రెండుభాషలలోను పరిపూర్ణపాండిత్యము గలవాడు. త్రికరణశుద్ధిగా సరస్వతిని ఉపాసించి ప్రాణములగోలుపోయిన మహాపురుషులలో నీతడొకడు. అతను మరణశయ్యపైనుండియు "బాబూ! ఏమియాలోచించుచున్నా"రని ఒకమిత్రుడు ప్రశ్నించినప్పుడు "సాహిత్యముయొక్క భావిదశను గూర్చి" (౮ వ తేదీన) అని బదులొసంగెను.

ప్రేమచందుకథలు ప్రప్రథమమున జమానాఅను ఉర్దూపత్రికలో ప్రచురింపబడుచుండెను. అతడు మొదట వ్రాసిన పురుదూగ్రంథము శరదాన్. చివరవ్రాసిన గ్రంథము గోదాన్. ఈ రెండుదానములనడుమ లెక్కలేనన్ని గ్రంథములను హిందీమాతకు దానముచేసెను.

అతనికి హమీర్పురిలో డెప్యూటీ ఇన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సు ఉద్యోగము కుదిరెను. దురదృష్టవశమున నాపదవిలో నతనియారోగ్యము చెడిపోయెను. వెంటనే దానినుండి విరమించుకొని ఒకగవర్నమెంటు పాఠశాలలో ఉపాధ్యాయుడుగా ప్రవేశించెను.

౧౯౨౦ వ సంవత్సరములో సహాయనిరాకరణోద్యమము ప్రారంభమయ్యెను. అప్పుడతను గోరఖ్‌పూరులోనుండెను. వెంటనే తనపనికి రాజీనామాయిచ్చి కాన్పూరులో మార్వాడీవిద్యాలయమునకు హెడ్మాష్టరుగా జేరెను. ఈ పరిస్థితులలో నతనిభార్య చనిపోయెను. అత డనేకపర్యాయములు పట్టుబడెనుకాని శిక్షననుభవింపలేదు.

ఆదినములలో నున్న మాసపత్రిక సరస్వతి. ఆ పత్రిక యభివృద్ధికీతని కథలు కారణమని చెప్పకతప్పదు. నవలాకిశోరి ప్రెస్సువారి మాధురీమాసపత్రికలో నియమపూర్వకముగా కథలంపుచుండెను. కొంతకాలమునకు ఇతడు దానిసంపాదకవర్గములో పనిచేసి సంపాదకుడయ్యెను. స్వాతంత్ర్యేచ్ఛగలవాడెంతకాలము ఒకరిక్రింద బని చేయగలడు? ఆయుద్యోగమునువిడచి 'జాగరణ' అని స్వయముగానొకపత్రికను నడుపింపప్రారంభించెను.

ప్రేమచందు సాహిత్యసేవ ఇప్పటినుండియే దృఢమయ్యెను. ప్రేమచందునకు వర్ణనాశక్తి యత్యద్భుతము. మానవప్రకృతిని, మనోభావములను వెల్లడించుటలో నితనికి అసాధారణశక్తికలదు. భాష భావగర్భితమై సులభశైలిలో నుండును. కేవలము మనోవినోదమునకై రచించిన కథయొక్కటియు నతనిగ్రంథములలో కనుపింపదు. పాశ్చాత్యకథాసాహిత్యము నీత డనుకరించెను కాని భారతప్రాచీన సంస్కృతినిమాత్రము మరచిపోలేదు.

"మానవజీవితమే కథ-మానవుడే కథానాయకుడు" అని యాతని వాదము. పీడరికము, నిష్ఫలప్రేమ,



అగ్రాకోటలో యూదభాయి నగళ్లలోని నూతియొక్క లోపలి వైపు. దీనిలోపలికి దిగుటకు ఏడు భిన్నమార్గములు కలవు



పాట్నాలో నున్న ధాన్యపు కణజము. ౧౭౮౬ లో కట్టబడినది. ౬౦ అడుగులు ఎత్తుండును T.



కాశీలో బ్రహ్మమందిరము T. M. P. R.



ఔరంగజేబుకాలమున మసీదుగా మార్చిన ప్రాచీన దేవాలయము, కాశీ

సహానుభూతి యీమూడువిషయములు లాతనికి ప్రియతరములు. "పూర్వకాలపు కాకి పిచ్చుక కథలు, ఆధ్యాత్మిక గాథలు, దయ్యములకథలు మనోవికాసమును గల్పింపజాలవు. జీవనసంగ్రామమునకు సంబంధించిన విషయములు, జీవితములోని కఠినసమస్యలు- ఇవియే మానవులకు శిక్షనొసంగగలవు" అని యతడెన్ని యోసారులు పలికియుండెను.

అతను రచించిన 'సేవాసదన్', 'కర్మభూమి' యను గ్రంథములను తెలియనివా రుండరు. 'సేవాసదన్', 'మజ్దూరి' యను నవలలు సినీమాతీయబడినవి. ప్రేమచందు స్వయముగా వానిని డైరెక్టుచేసెను.

అతనువ్రాసిన యుత్తమగ్రంథములు 'ప్రేమాశ్రమ్', 'రంగభూమి' 'కాయాపలట్,' 'ప్రతిజ్ఞ,' 'గబన్' మొదలైనవి. 'కర్మభూమి' నవలకు హిందూస్థానీ ఎకాడెమీ వారతనికి ౫౦౦ రూపాయలు బహుమాన మొసగిరి. కథలసంగ్రహములలో ముఖ్యములు 'ప్రేమప్రసూన్,' 'సప్తసుమన్,' 'ప్రేమద్వాదశి,' 'ప్రేమపూర్ణిమ,' 'మానససరోవర్' ఇత్యాదులు. అతనికథలు కొన్నిపందలుండును. అనేకపుస్తకములకనేకపర్యాయములు సంస్కరింపబడెను. చాలపుస్తకములు గుజరాతీ, మరాటి, జాపానీ, ఇంగ్లీషు భాషలలోనికి తర్జుమా చేయబడినవి. చాలకథలు ఆంగ్లములోని కనువాదము చేయబడినవి; చేయబడుచున్నవి. దీనినిబట్టి ప్రేమచందు రచనల కెంత గౌరవముకలదో తెలుపవచ్చును.

"మానవతత్వమును తెలిసికొనుటయే గొప్పవిద్య" అని యతని యభిప్రాయము. తత్వహీనమైనకథ పాఠకులమనసున కుత్తేజమును. కల్పింపదు. సుందరభావములు మొలకలెత్తవు అని యతనియుద్దేశ్యము.

ప్రేమచందు ఆదర్శవాది. ఆవాదమే అతని గ్రంథములలో కనుపించును. సమాజము మానవుల వాస్తవికచిత్రణలో నతడు సమర్థుడు. ఆదర్శవాదము, యథార్థవాదము రెండును కలసి యతనిరచనలో కనుపించును.

ప్రేమచందు సంస్కరణవాది. ప్రథమభార్య చనిపోయినపిమ్మట వితంతువుతోవివాహము చేసికొనెను.

ఈ యాదర్శములతో ప్రేమచందు సాహిత్యము ప్రారంభమయ్యెను. ఈయాదర్శములప్రకారము వ్రాసినవారు చాలతక్కువ. హిందీసాహిత్యమున కతడు క్రొత్త పద్ధతిని దెచ్చిపెట్టెను. అతనింత అల్పవయస్సులోనే ఉర్దూహిందీలలో నుత్తమసాహిత్యగ్రంథములను వ్రాసి భారతీయ సాహిత్య భాండాగారమును నింపెను. అతనంతటితో తృప్తిపడలేదు. టాల్‌స్టాయికథలను హిందీలోని కనువాదమొనర్చి హిందీవాఙ్మయమున లేని కొరతదీర్చెను. మహాత్మ షేక్‌సాదీ కవిజీవితమును హిందీలో వ్రాసెను. 'కర్బలా,' 'సంగ్రామ్,' 'ప్రేమకీ వేదీ' అను నాటకములువ్రాసి నాటకరచనా చాతుర్యమును జూపెను. అందులకే అతనికి "ఉపన్యాస (నవలా) సమ్రాట్టు" బిరుదము లభించెను.

క్రొత్తగా కథలువ్రాయువారి నతను ప్రోత్సహించుచుండెను. క్రొత్తగా వ్రాయువారికి క్రొత్తభావములు వచ్చునట! కథలో తప్పులున్న దిద్దిపంపుచుండెను.

ప్రేమచందు "హంస" అను పత్రికను స్వయముగా ప్రచురించుచుండెను. రెండుసంవత్సరముల క్రిందనది అఖిలభారతీయ సాహిత్యపరిషత్తువారి యాజమాన్యమునకు తీసికొనబడెను. అప్పుడతను సంయుక్తసంపాదకుడుగా నుండెను. గవర్నమెంటువారికి ధరావతు కట్టవలసిన కారణమున నది ఇప్పు డాపివేయబడెను. ప్రేమచందునకిది బెదిరింపు మొదటిది కాదు. ధైర్యముతో మొన్న ఆగస్టుసంచికకూడ ప్రకటించెను. "హంస"ను పాలించువాడే "హంస"ను విడనాడెను.

హిందూస్థానీ భారతజాతీయభాషగా నుండవలెననియు, హిందీ, ఉర్దూలిపులు ఇష్టమువచ్చినట్లు ఉపయోగింపవచ్చుననియు నతని సమ్మతిని తెలిపెను. ఉర్దూహిందీ లిపిచర్చను తగ్గించుటకు మధ్యకాలీన ముస్లింసంస్కృతి నొకదానిని స్థాపించి పాటుపడెను.

అతని భార్య శివరాణీదేవి. "మేరీ హృదయ" అనగా "నా హృదయ"మని యామె కథాసంగ్రహమొకటి ప్రచురించెను. ఆమె రెండుసార్లు జాతీయోద్యమమున శిక్షకూడ ననుభవించెను. ఈమె కీస్వాతంత్ర్యము నిచ్చినది ప్రేమచందే.

ప్రేమచందు ఎన్నడును కథకు ౧౫ లేక ౨౦ రూపాయలనుమించి సంపాదింపలేకపోయెను. వాగ్దానమిచ్చినవి రాకున్నచో వారితో కలహించువాడు కాడు. నిరభిమానము కలవాడు. కపటము లేనివాడు. ఎల్లప్పుడును చిరునవ్వుమోము కలిమిడికలవాడు. వాదవివాదములలో నెంతసులభముగా గెలచునో యంత సులభముగా చెప్పినది గ్రహించుటయు గలదు.

ప్రేమచందు బెంగాలులోని శరచ్చంద్రచట్టోపాధ్యాయునకును, ఆంధ్రదేశములో కందుకూరి వీరేశలింగం పంతులు, పానుగంటి లక్ష్మీనరసింహం పంతులు గార్లకు తీసిపోడు. కొంచెమించుమించుగా పానుగంటి లక్ష్మీనరసింహంగారి పోలికే! ప్రేమచందు బీదరికమునకు తగినట్లుగనే యుండును. వేషభూషణములతో డాంబికమును చూపడు. నెమ్మదిగా మాట్లాడును.

ప్రేమచందు తన జీవితమును సాహిత్యమునకు, సమాజమునకు, రాష్ట్రోన్నతికొరకే వినియోగపరచెను. కొంతవరకు సఫలుడయ్యెను. అతడు సామాజిక సంస్కర్త దృఢమైన రాష్ట్రీయతావాది కాని తనవాదములను తనసాహిత్యము మూలముననే ప్రచారముచేసెను. ప్రేమచందు చివరవరకు సాహిత్యసమ్మేళనమునకు అధ్యక్షుడుగా నుండకపోవుటయే కడు విచారమైన విషయము. అతడధ్యక్షుడై యుండినచో సాహిత్యస్వరూప మిప్పుడెట్లుండెడిదో! అతడు విదేశములలో జన్మించినచో కోటీశ్వరుడై యుండునుకదా! కాని యతడెన్నడును తనదీనస్థితికి చింతాముగ్ధుడై యుండలేదు. ధనము గడింపలేదని యతనికి విచారములేదు. హిందీలోకమునకు ప్రసాదించిన గ్రంథరాజములే యతనిధనము. ఆధనమునకు వినాశములేదు. ధనపతిరాయి స్వర్గమున కరిగెను. ప్రేమచందు చిరంజీవి.

ప్రేమచందునకిద్దరు కుమారులు, ఒక కుమార్తెయు గలరు. పెద్దకుమారుడు బి. ఎ. చదువుచున్నాడు. ఈదుఃఖమును సహించుటకై వారికి భగవంతుడు ధైర్యమొసగుగాక!

ఉపన్యాససమ్రాట్టు మున్షీ ప్రేమచందు ఆత్మశాంతికై ప్రతి సంవత్సరము ప్రేమచందు దినము అని పండుగలు జరుపబడుగాక!

# భారతదేశపు రైళ్లు

## గో. వెం. కృష్ణరావు

భారతదేశమందు రైళ్ల పాలనము చాల అసంతృప్తికరముగ నున్నది. భారతీయులు అనేకకోట్ల ధనము రైళ్లపై ఖర్చుపెట్టినను వానివలన ఎట్టి సౌకర్యములను చేకూరకపోవుటయేగాక చాలనష్టము సంభవించుచున్నది.

౧౯౦౫వ సంవత్సరమునకు పూర్వము రైళ్ల పాలనము ఇండియా ప్రభుత్వమువారి వర్తకశాఖలో నొకటిగా నుండెడిది. మొదటి రైల్వేబోర్డులో ముగ్గురు సభ్యులు ఉండెడివారు. వారు ఇండియా ప్రభుత్వమువారి వర్తకశాఖకు లోబడి రైళ్ల పాలనము కొనసాగించిరి. కాని యీపద్ధతి తృప్తికరముగ నుండక పోవుటచే ౧౯౦౮వ సంవత్సరమందు రైళ్లకు ప్రత్యేక డిపార్టుమెంటు ఏర్పాటు చేయబడెను. ఆడిపార్టుమెంటు అధ్యక్షుడు సర్వాధికారములు చలాయించుచు, అవసరమయిన రాజప్రతినిధితో మాట్లాడుటకు హక్కు కల్గియుండెను. ఎంత ప్రత్యేక సంస్థగానున్నను రైల్వే బోర్డు ఇంకను ఇండియా ప్రభుత్వపు వర్తకశాఖ మంత్రిఅధికారమందే యున్నది.

౧౯౨౧వ సంవత్సరమందు యాక్వర్తు కమిటీ సిఫార్సుల ప్రకారము రైల్వేబోర్డు అధ్యక్షుని "ఛీఫ్ కమీషనరు ఆఫ్ రైల్వేస్" అని పిల్చుటకును, ఆర్థికముగా సలహాలిచ్చుటకు కమీషనరు నొకని నియమించుటకును నిశ్చయించిరి. ప్రస్తుతమున్న బోర్డు రాజ్యాంగమిదియే.

ఛీఫ్ కమీషనరే ప్రభుత్వమువారికి రైళ్లపరిపాలనా కార్యదర్శిగ పనిచేయును. రైళ్ల పాలనాసూత్రములను, టెక్నికల్ విషయముల నిర్ధారణ గావించుటయును ఛీఫ్ కమీషనరే నిశ్చయించును. ఇప్పుడు బోర్డులో ౫ గురు, డైరక్టర్లు, టెక్నికల్ ఆఫీసరు, కార్యదర్శి, డిప్యూటీ కార్యదర్శి గలరు. పరిస్థితుల ననుసరించి బోర్డు సభ్యుల సంఖ్యను హెచ్చించుట, తగ్గించుట ప్రభుత్వము వారు నిర్ణయించెదరు.

భారతదేశమందు ౪౨,౯౬౧ మైళ్ల పొడవుగల రైలుమార్గములు గలవు. రైళ్లపై ౮,౭౭,౨౫,౧౧,౦౦౦ రూప్యములు వ్యయము చేయబడెను. ప్రతిసంవత్సరము దాదాపు ౯౬ కోట్ల రూప్యముల ఆదాయము వచ్చును. మిగిలినధనము రైళ్లపై వెచ్చించిన మూలధనమునకు వడ్డీ నిచ్చుటకే యగుచున్నది.

సంవత్సరమునకు ౫౦ కోట్లమంది రైళ్లను ఉపయోగించుచున్నారు. ౭ కోట్ల టన్నుల బరువుగల సామానులను రైళ్లు మోయుచున్నవి. ౭౩౦,౨౯౯ మంది యుద్యోగులు గలరు. వీరిలో ౪,౫౧౬ మంది యూరోపియనులును, ౧౩,౫౪౮ మంది ఆంగ్లోహైందవులును, ౫౧౯,౮౧౯ మంది హిందువులును, ౧౫౭,౭౧౪ మంది మహమ్మదీయులును, ౩౪,౬౨౬ మంది ఇతరులును ఉన్నారు. వీరికి సంవత్సరమునకు ౩౧ కోట్ల రూప్యములు జీతములక్రింద ఇవ్వబడును.

౧౮౯౮ వ సంవత్సరమువరకు రైళ్లవలన ౫౮ కోట్ల రూప్యముల నష్టమువచ్చెను. ఈ నష్టమునంతయు భారతప్రభుత్వమువారు తమ ఆదాయమునుండి యిచ్చుకొనిరి. అటుతరువాత కొన్ని సంవత్సరములవరకు రైళ్లు లాభకరముగనే ఉండెను. కాని గడచిన యేడు సంవత్సరములనుండి యీ రైళ్లవలన మనకు మరల నష్టము వచ్చుచున్నది. మన కెంత నష్టమువచ్చినదో యీ క్రిందిపట్టికవలన స్పష్టపడును:

| | |
|---|---|
| ౧౯౩౦-౩౧ | ౬౨౪ లక్షలు |
| ౧౯౩౧-౩౨ | ౯౮౬ |
| ౧౯౩౨-౩౩ | ౧,౦౮౦ |
| ౧౯౩౩-౩౪ | ౭౯౩ |
| ౧౯౩౪-౩౫ | ౫౦౬ |

౧౯౩౫-౩౬ ౪౫౪
౧౯౩౬-౩౭ (మదింపువేయబడెను) ౩౪౪

ఈ నష్టములను డిప్రీసియేషను ఫండు (Depreciation Fund) నుండి చాలవరకు భర్తీచేసిరి. రిజర్వు ఫండును ఇదివరకే ఖర్చుపెట్టిరి. రైళ్లవలన మనకు ఇంకను కొంతకాలము నష్టమువచ్చుట నిశ్చయమని చెప్పవచ్చును.

ఇప్పుడు భారతదేశమందు నాలుగురకముల రైలు మార్గములు కలవు. అవేవన:

(౧) ప్రభుత్వమువారే స్వయముగా నడపు రైలుమార్గములు. వీనిని స్టేట్ రైళ్లందురు. (ఉ. ఈస్టిండియా రైలుమార్గము)

(౨) ప్రభుత్వమువారు కొన్ని రైలుమార్గములకు ఖామందులయినప్పటికిని, కంపెనీలు ఆ రైలుమార్గముల పాలనము కొనసాగించుచున్నవి. (ఉ. బెంగాలు నాగపూరు రైలుమార్గము; మద్రాసు అండు దక్షిణ మహారాటా రైలుమార్గము)

(౩) కంపెనీవారే స్వయముగ నడపు రైలుమార్గములు. (ఉ. బెంగాలు నార్తువెస్టు రైలుమార్గము)

(౪) సంస్థానాధీశుల పాలనయందున్న రైలుమార్గములు (ఉ. నైజాము స్టేటురైలుమార్గము.)

యాక్వర్తుకమిటీసూచనల ననుసరించి భారత ప్రభుత్వమువారే అన్ని రైలుమార్గములను తమ వశము చేసికొన నిశ్చయించిరి. ౧౯౫౦ వ సంవత్సరమునకు అన్ని రైలుమార్గములును భారత ప్రభుత్వమువారి వశమగును. అన్ని రైలుమార్గములును కేంద్రప్రభుత్వమువారి స్వాధీనమయినచో సక్రమపరిపాలనకు అవకాశమేర్పడుటయేగాక వానివలన వచ్చు లాభములను దేశీయులే పొందుటకు వీలుకల్గును. రాబోవు నూతన రాజ్యాంగము క్రింద ఏర్పడనున్న ప్రత్యేక సమాహార-రైల్వేబోర్డువారు రైలుమార్గముల నన్నిటిని తమ వశముచేసికొని, నిష్పాక్షికముగ పాలించుట ధర్మము.

ఎంత లాభమువచ్చినను రైళ్లపై వ్యయముచేసిన మూలధనమును దాని వడ్డీలను తీర్చుటకే యగుచున్నది. రైళ్లపాలనము వర్తకసూత్రముల ననుసరించి జరుగకపోవుట ప్రథమ లోపమని చెప్పవలె. రైల్వేబడ్జెటులో ఆదాయమును, ఖర్చును సరిసమానము చేయుటకు పద్ధతులు దోచక రైల్వేబోర్డువారు ఖర్చునే తగ్గించి, వచ్చు ఆదాయముతో సంతృప్తిపడుటకు ప్రయత్నించుచున్నారు. దూరదృష్టిగల వర్తకుడు ఆదాయము నెట్లు వృద్ధి చేసికొనెదమా యని మార్గముల నన్వేషించునేగాని వచ్చురాబడితో తృప్తిపడి, దానికి తగినట్లు ఖర్చులను సర్దుకొనడు.

రైల్వేబోర్డు పాలనలో చాల లోపములు గలవు. వానిలో కొన్నిటిని వివరింతును.

(౧) రైల్వేబోర్డువారికి సలహాల నిచ్చుటకు ఇంగ్లండులో ఇంజనీర్లు ఉన్నారు. వారికి బోర్డువారు కొంత వేతనమిచ్చెదరు.

౧౯౩౦ వ సంవత్సరమందు నార్తువెస్టు రైలుమార్గమునకు రెండు డీసెల్ ఎలెక్ట్రిక్ ఇంజనులను కొన్ని లక్షలరూప్యములు ఖర్చుచేసి తెప్పించిరి. కరాచీలో ఆరెండు యింజనులు స్టీమరు దిగినపుడు పత్రికలలో వానివివరములను ప్రచురించిరి. కాని వానిని ఇంతవర కెచ్చటను ఉపయోగించుటలేదు. ఎందుచేత?

సామాన్యముగ ఇంగ్లండునుండి తెప్పించు సాధనములను అచ్చటనే పరిశీలించి, వాని బాగోగులను ఇంగ్లండులో నున్న బోర్డువారి యింజనీరు సలహాదారులు నిర్ణయించిన తరువాతనే వానిని భారతదేశమునకు తెప్పించెదరు ఇది సలహాదారుల ధర్మమని చెప్పనక్కరలేదు. సలహాదారులే యింజనులను పరిశీలించిరా, లేదా? అమెరికా, జర్మనీ, ఫ్రాన్సు దేశాలలో తయారుచేసిన డీసెల్ ఇంజనులు బాగుగ పని చేయుచున్నవి. ఇప్పుడిప్పుడే వీనిని ఇంగ్లండులో తయారుచేయుచున్నారు. సరియగు అనుభవములేని కంపెనీలు తయారుచేసిన యింజనులను మన రైల్వేబోర్డువారు కొన్నారా?

రైల్వేబోర్డు సలహాదారులు తమ విధ్యుక్తధర్మమును సరిగ నిర్వహింపనపుడు వారికి వేలకొలది రూప్యములు జీతమిచ్చి, వారి సేల నుంచుకొనవలయును? డీసెల్

యింజనులు సరిగా పరిశీలింపని యిట్టి సలహాదారుల కిచ్చుడబ్బు కేవలము దండుగని చెప్పవలె.

(౨) బొంబాయిరాష్ట్రమందు తాతాకంపెనీవారు కల్యాన్ స్టేషను వద్ద పెద్ద విద్యుచ్ఛక్తి యంత్రాలయము స్థాపించి, బొంబాయికి చుట్టుప్రక్కల ప్రదేశములకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయుచున్నారు. తాతాకంపెనీ వారు బొంబాయియందున్న గ్రేటుఇండియన్ పెనిన్సులర్ రైలుమార్గమునకు రైళ్లునడపుటకు విద్యుచ్ఛక్తిని చాల తక్కువరేటుకు ఇచ్చెదమని చెప్పినను, బోర్డువారు వినక, అనేకకోట్ల రూప్యములు ఖర్చుచేసి, ప్రత్యేక యంత్రాలయమును స్థాపించుకొనిరి. ఇప్పుడు వారు తయారుచేసుకొను విద్యుచ్ఛక్తిరేటు తాతాకంపెనీ వారిచ్చెదమన్నరేటుకన్న హెచ్చుగుచున్నట్లు స్పష్టపడినది. బోర్డువారిట్టి హ్రస్వదృష్టికరమగు పనిచేయుటలో ఉద్దేశమేమి?

(3) రైల్వేబోర్డువారు కూడ తమ ధర్మములను చురుకుగా నిర్వహించుట లేదు. ఇప్పటికి బోర్డువారికి అనేకమంది నిపుణులు కొన్ని నివేదికలను సమర్పించిరి. వానిని ఇంతవరకు బోర్డువారు పరిశీలింపలేదు. ఆ నివేదికలలో గావించిన సూచనలపై తమ యభిప్రాయములనైన వెలిబుచ్చలేదు.

౧౯౨౭ వ సంవత్సరమందు రైళ్లవిషయములో గొప్పనిపుణుడని ప్రసిద్ధిగన్న సర్ ఆర్థర్ డికిన్సన్ గారు మన రైళ్లపాలనను పరిశీలించి, ఒక నివేదిక బోర్డువారి కర్పించెను. ఆ నివేదికగతి యింతవరకు తేలలేదు.

పోపుకమిటీవారు ఈస్టుబెంగాలు, ఈస్టిండియా రైలుమార్గములను కలిపివేయవలసినదని సూచించుచు నొక నివేదిక సమర్పించిరి. వారిసూచనను బోర్డువారింత వరకు అంగీకరింపలేదు.

(౪) అన్నిటికన్న రైళ్లపాలనలో బోర్డువారు గావించిన ముఖ్య లోపము ఉద్యోగుల విషయమందు జరిగినదని చెప్పవలెను. అనేక స్థలములందు స్వల్ప వేతనములుగల యుద్యోగులను, నౌకరులను తీసివేసి, పెద్దజీతములుగల యుద్యోగులపై వెచ్చించినారు. తక్కువ జీతములు గలవారిని తగ్గించి, పెద్దయుద్యోగుల నేల యుంచవలసివచ్చినది? ఖర్చులను తగ్గించుకొనదలచిన పెద్దయుద్యోగులను తీసివేయుటకు వీలులేదా?

స్వల్పజీతములుగల యుద్యోగులను కొందరిని తీసివేసియు, మిగిలినవారి జీతములను తగ్గించియు బోర్డువారు నిర్దాక్షిణ్యముగ ప్రవర్తించుటచే రైళ్లపాలనము సంకుచిత మగుచున్నది. నౌకరులలో, కార్మికులలో అసంతృప్తి హెచ్చుచున్నది. కడచిన పదిసంవత్సరములందు రైళ్లపాలనలో జరిగిన మార్పులను పరిశీలించిన ఈ నిజము ఎల్లరకు సుగ్రాహ్యమగును.

౧౯౨౭ వ సం॥ ఆగస్టునెలలో అద్దె లేకుండ వసతిగృహములను బోర్డువారు తమ యుద్యోగులకు ఇచ్చుటకు నిరాకరించినారు. ఈవిధముగ స్వల్ప ఉద్యోగుల జీతములలో నూటికి పదోవంతు తగ్గించినారు. ఇట్టి అక్రమమునకు యేకారణము జూపకుండ చేయుట విచారకరము. తమ నౌకరులను తాము నిర్దేశించిన స్థలములందు నివసింపనుని నిర్బంధించినప్పుడు బోర్డువారు గృహసౌకర్యములను గల్పింపకపోవుట అర్థరహితము.

రైళ్లవలన నష్టము వచ్చుచున్నది గనుక రైళ్లను నడుపుటకగు ఖర్చులను తగ్గించుకొనవలసియున్నదని బోర్డువారు సాకుచెప్పుట పరిపాటియైనది. భారతదేశమందు రైళ్లను వర్తకదృష్టితో నడపకపోవుటచే నష్టము వచ్చుటలో ఆశ్చర్యమేమియు లేదు. ప్రభుత్వమువారును, సైనికాధికారులును రైళ్లను తక్కువరేట్లనిచ్చి తమ స్వంతపనుల కుపయోగించుకొనుచున్నారు. వర్తకాభివృద్ధికని సామానులు మోయు విషయమందు వర్తకులను ప్రోత్సహించుటకు తక్కువరేట్లు ఏర్పరుపబడెను. వ్యక్తుల సదుపాయములకు రేట్లలో కొన్నిలాభములు చూపబడెను. అదేకాకుండ రైలుఇంజనులకు కావలసిన రాతిబొగ్గు కని సంవత్సరమునకు ౧౨ లక్షల రూప్యములు నష్టము వచ్చుచున్నను బోర్డువారు కొన్ని గనులను తమ యధీన

మందుంచుకొని త్రవ్వించుచున్నారు. ఇక రైల్లు లాభదాయకముగ నెట్లుండును?

రైళ్లలో పనిచేయు కార్మికుల సమస్య రాను రాను బహు క్లిష్టమగుచున్నది. కడచిన పది సంవత్సరములలో ఒకలక్షకుపైగా కార్మికులను పనులనుండి తొలగించిరి. నూటికి ౧౫ మందిని తగ్గించినట్లు తెలియుచున్నది.

పని లేకపోవుటచే కార్మికులను తగ్గించవలసి వచ్చినదని బోర్డువారు చెప్పవచ్చు. పూర్వము సంవత్సరమునకు ౧౦౦ కోట్ల రూప్యముల ఆదాయము వచ్చెడిది. ఇప్పుడో ౯౦ కోట్ల రూప్యములు వచ్చును. ఆదాయము నూటికి ౧౦వవంతు తగ్గినప్పుడు, కార్మికులను నూటికి ౧౫వవంతు తగ్గించి, మిగిలినవారిచే యెక్కువ పని చేయమని నిర్బంధించుట న్యాయమా, ధర్మమా?

పెద్దజీతములుగల యుద్యోగములా, భారతీయుల కిచ్చుట లేదు. స్వల్ప జీతములుగల యుద్యోగములందు తిర్చుతగ్గింపుకని ఉన్నవారిని కొంతమందిని తీసివేయుచున్నారు. ఇప్పటికి స్వల్పఉద్యోగుల జీతములలో నూటికి ౨౫వవంతు తగ్గింపుచేసిరి.

ఉద్యోగులకిచ్చు జీతములను పరిశీలింతము—పాయింట్సుమనుకు నెలకు ౧౮ రూప్యములు జీతమిచ్చెదరు. ఎండయైనను, వానయైనను, ఉరుములు ఉరిమినను, మెరుపులు మెరిసినను, పిడుగులు పడుచున్నను లెక్కచేయకుండ పాయింట్సుమను బహు జాగరూకతతో తన ధర్మమును నిర్వహించును. ఏమాత్రము అజాగ్రత్త కనపరచినను రైలువారికి నష్టము వచ్చుటయేగాక అనేకవేల ప్రజలకు ప్రాణ ధన నష్టములు సంభవించును. ఇట్టి గొప్పబాధ్యతగల మనిషికి నెలకు ౧౮ రూప్యములా జీతము?

స్టేషనుమాష్టరుకు నెలకు ౬౦ రూప్యములు జీతమిచ్చెదరు టికెట్టు, లగేజి, గూడ్సు గుమాస్తాలకు స్టేషను మాష్టరుకన్న తక్కువజీతము. ఎక్కువ బాధ్యతగల్గి, తమధర్మములను ఎట్టిలోపములు లేకుండ నిర్వహించు ఇట్టి యుద్యోగుల కింత స్వల్పజీతము లిచ్చినయెడల ఇంక వారు తదితర పద్ధతుల నవలంబించి యెక్కువ ధనము సంపాదించుటకు ప్రయత్నించుచున్నారని నేరారోపణచేసిన ప్రయోజనమేమి?

రైల్వే యధికారుల జీతములా! ఛీఫ్ కమీషనరుకు నెలకు ౫,౦౦౦ రూప్యములు; మెంబర్లకు ఒక్కొక్కరికి నెలకు ౪,౦౦౦ రూప్యములు; ఏజంట్లకు నెలకు ౩,౦౦౦ రూప్యములు జీతము లిచ్చుచున్నారు. రాబడి తగ్గెనని స్వల్ప ఉద్యోగుల జీతములనే తగ్గించిరి కాని పెద్దయధికారుల జీతముల నట్లేయుంచిరి. వారిజీతములను తగ్గించిన మోసము హెచ్చయి రైళ్ల పరిపాలనము మరింత కుంటువడునని ప్రభుత్వ పక్షీయులు వాదించెదరు. కాని స్వల్పయుద్యోగుల జీతములను తగ్గించిన మోసము హెచ్చుకాదా? స్వల్పయుద్యోగులు గావించు మోసమును పెద్ద అధికారులు కనుగొనుచున్నారా?

టిక్కెట్లు లేకుండ కొందరు వ్యక్తులు ప్రయాణముచేయుట; సామానులను సరిగ తూకము చేయకుండుట; స్వల్ప ఉద్యోగుల జీతములు హెచ్చుట; కార్మికులకు సౌకర్యము లేర్పరచుట; వర్తకము కుంటువడుట; అన్యదేశములు జాతీయ స్వసంపన్నతకొరకు కృషిసల్పుట; మోటారుపోటీ - వీనివలన మనకు నష్టము వచ్చుచున్నదని రైల్వేమెంబరు తెల్పెను

టిక్కెట్లు లేకుండ కొందరు ప్రయాణము చేయుచున్నమాట నిజమే. కాని అట్టి ప్రయాణీకులను శిక్షించినంత మాత్రమున కొన్నిలక్షల రూప్యములు ఆదాయము వచ్చునని అంచనావేయుట అన్యాక్తము. టిక్కెట్టు లేని ప్రయాణీకులను శిక్షించుటవలన రైళ్లలో ప్రజలు క్రిక్కిరిసి కూర్చుండుట తగ్గునని చెప్పవచ్చు. అదేకాక సామానులను సరిగ తూకము వేయుట లేదగిన స్వల్ప జీతము లిచ్చుట మూలమున కల్గు ఫలితమని గ్రహింపవలెను. టికెట్టులేకుండ గావించు ప్రయాణముల నెంతవరకు రూపుమాపవచ్చునో అంతవరకే యీ లోపమును కూడ సవరించుటకు వీలగును.

స్వల్పయుద్యోగుల జీతముల హెచ్చించుటకు గాని, కార్మికులకు సౌకర్యముల నేర్పరచుటకు గాని

యిప్పటికి ౪౦ లక్షల రూప్యములకంటె హెచ్చు ఖర్చు పెట్టలేదు. విట్లీ కమీషను వారి సూచనలను ఇంతవరకు ప్రభుత్వమువారు కార్యరూపము దాల్చునట్లు చేయలేదు. ఈ సందర్భములో ఇంకను హెచ్చు ఖర్చు పెట్టుటకు ప్రభుత్వమువారు సంసిద్ధులగుట న్యాయము.

ప్రపంచమందంతటను వర్తకము కుంటువడుటచే రైళ్లమూలమున నష్టము వచ్చుచున్నదని రైల్వేమెంబరు చెప్పుటలో అతిశయోక్తి యేమియు లేదు. వర్తకాభివృద్ధి పెంపొందినపుడే రైళ్ల ఆదాయముకూడ వృద్ధియగును. ప్రపంచమందు ఆర్థికమాంద్యము తగ్గి, వర్తకము అభివృద్ధి పొందుట కింక కొంతకాలముపట్టును. కాని ఒటావా ఒడంబడికవలన రైళ్ల ఆదాయము చాలవరకు తగ్గినదని ప్రభుత్వమువారు గ్రహించుట భావ్యము. నూలుపత్తులవలన నూటికి 33 వ వంతున, ప్రత్తివలన నూటికి ౧౨ వ వంతును ఆదాయము పడిపోయెను. ఎందుచేతననగా, మనము ఒటావా ఒడంబడిక ఒప్పుకొనుటచే అన్యదేశములవారు మన యోగుమతులను చాలవరకు నిషేధించిరి. ఆంగ్లసామ్రాజ్యమందున్న దేశములవారా, మన ముడివస్తువులను ఎక్కువగ కొనలేదు. వస్తువుల రవాణా స్తంభించుటచే రైళ్ల ఆదాయము తగ్గినది. అంతియగాక, అన్యదేశములవారు జాతీయ స్వసంపన్నత కొరకనేక ప్రయత్నముల గావించుచున్నారు. అందుచే మన ముడివస్తువులను కొను దేశముల సంఖ్య రాను రాను తగ్గుచున్నది.

మోటారుపోటీవలన వచ్చు నష్టమును అపుసలజేయుటకు భారతప్రభుత్వమువారు రెండుసంస్థల సంయుక్త సమావేశము నొకటి గావించి, వివాదసమస్యల నన్నిటిని చర్చించి, పరస్పర సహాకారము చేసికొనుటకు కొన్నిసూచనల గావించిరి. కేంద్రమందును, రాష్ట్రములందును సలహాదారుల సంఘములను నెలకొల్పిరి. ఇక మోటారుపోటీ రైళ్లకుండదని చెప్పవచ్చు.

ఈసంవత్సరము రైళ్లపాలనము మరింత అధ్వాన్నస్థితికి వచ్చుననుసూచనలు కన్పడుచున్నవి. కొన్ని రైలుమార్గములలో ఉద్యోగుల సంఖ్య హెచ్చుగుచున్నదని ౪,౦౦౦మందిని పనినుండి తొలగించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఒకవైపు ఉద్యోగుల తగ్గించుటకు ప్రయత్నములు: రెండోవైపు నూతనోద్యోగుల కొరకు ప్రకటనలు. నార్తువెస్టు రైల్వేవారికి ౪౦మంది స్టేషనుమాస్టర్లు, ౩౦ మంది వర్తక గ్రూపులోను. ౭౩ గురు చదువుకున్న క్లర్కులు కావలెనని ప్రకటించిరి. ఉన్నయుద్యోగులను తీసివేయకుండ, వారికే అపనులు నేర్పి ఆ స్థానములలో వారి నేల నియమింపరాదు?

ప్యాసు నియమములను పునర్విమర్శించెదరట! ప్యాసునియమములవలన రైళ్లకెట్టి నష్టము వచ్చుటలేదని చెట్టి కమిటీయందు ఫ్రెంచికమీషనరు ఒప్పుకొనినను ఇంకను మార్పుచేయుటకేలనో ప్రయత్నించుట?

అదిగాక చాలకాలమునుండియున్న యుద్యోగుల జీతములను కూడ తగ్గించి, 3 కోట్ల రూప్యములు ఆదాయము చేయవలెనని బోర్డువారు ప్రయత్నించుచున్నారట!

ఇట్టి ఎత్తులవలన రైళ్లపాలనము చక్కగా జరుగునని తలంచుట వెఱ్ఱి. కార్మికులలో, ఉద్యోగులలో అసంతుష్టి హెచ్చయి, రైళ్లవలన మరింత నష్టమే సంభవించును. లోపము లెచ్చటగలవో వానిని సవరింపక, వర్తకసూత్రముల ననుసరించి రైళ్లపాలనను కొనసాగింపక, రైల్వేబోర్డువారు నిరంకుశముగ తమ యిష్టము వచ్చినట్లు ప్రవర్తించిన దేశమునకు చాల నష్టము కల్గజేసినవారగుదురు. ఇంతకు భారతదేశమును ఆర్థికముగ దోపిడి చేయవలయునను అభిప్రాయము రైల్వేబోర్డువారి కున్నంతకాలము రైళ్లసమస్య చక్కబడదు. ఈ సూక్ష్మమును భారత జాతీయ వాదులు గ్రహించి, రైల్వేబోర్డువారి చర్యలను నిరసించి, రైల్వేబోర్డులో భారతదేశప్రతినిధుల నధికసంఖ్యాకులుగ నియమించుటకు ఆందోళనము గావించుట అత్యవసరము.

# 'పొగడదండ'

## బులుసు వేంకటరమణయ్య

'కవిరాజు కంఠంబుఁ గౌఁగిలించెను గదా
పురవీథి నెదురెండ బొగడదండ'

అను శ్రీనాథుని చాటుపద్య భాగములోని 'పొగడదండ'ను గూర్చి యీ నడుమ చాల అభిప్రాయ భేదములు వెలువడినవి. మువ్వురు పండితులీ పదమును చర్చించుచు 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక'లో వ్యాసములను ప్రకటించిరి. వారందఱును 'ఎదురెండఁ బొగడదండ' అను పాఠమును గ్రహించి చర్చలను సాగింపఁ దొడఁగిరి.

౧. పయి పద్యములోని యవశిష్ట పాదత్రయమునందును 'నల్లగుండు, కసుకుగొడియ, నిగళయుగము' అని శిక్షా (అవమాన) సాధనము లుండుటచే మొదటిపాదమున గౌరవాపాదకమగు 'పొగడదండ' చేర్చఁబడుట పొసఁగదని యెంచి శ్రీ బండారు తమ్మయ్యగారు 'పొగడదండ'ను 'పొరకదండ'గా మార్చుట యుచితమనిరి. పొరకదండ యనఁగా గడ్డిపరకదండ గాలికి ఎగిరివచ్చిన గడ్డిపరక (చెత్త) శ్రీనాథుని మెడపయి పడి దండవలె నుండెనని వారు సమన్వయించిరి. శ్రీ వడ్డాది సుబ్బారాయఁడుగారు కూడ 'పొరకదండ' యని యుండుటయే యుచితమని తమతో చెప్పినట్లు శ్రీ తమ్మయ్యగారు వ్రాసినారు. [ఆం సా ప. పత్రిక సంపు ౨౮ సంచి. ౪ పుట ౧౩౪.]

౨. "పొరకదండ" అను పదము వాడుకలో లేదనియు, దండనార్హుల మెడకు పూలమాలవేయుట యాచారముగుటచే "పొగడదండ" కూడ అవమానసూచకమనియు శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారు వ్రాసియున్నారు. పై అభిప్రాయమును సమర్థించు ప్రమాణాంతరమును తిమ్మకవి "శివధర్మముల"లోని

"బురదగుంటలోఁ ద్రొబ్బియుఁ బొగడదండ
చుట్టి..................."

అనుదానిని వారుదాహరించియున్నారు. పయిస్థలములోని "పొగడదండ"ను "పూలదండ"గా మార్చినను ఏ అర్థాంతరము కలుగదుగాన "పూలదండ" అని యనుకొనుటయే యుచితమని వారి తలంపు.

[సంపు. ౨౫ సంచి. ౨]

3. శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు పై అభిప్రాయములలో దేనితోను ఏకీభవింపక "పొగడదండ" అను పాఠమునే గ్రహించి, అది సర్వసాధారణమగు పొగడదండకంటె విలక్షణమును, "శిక్షించుట కుపయుక్తమగు సాధనము" నగు "పొగడదండ"యై యుండునని వ్రాసిరి. "పొగడదండ" "శిక్షాసాధన" మనుటకు ప్రమాణములుగ శ్రీ శాస్త్రులుగారు "రామాభ్యుదయము"లోని భాగములను ఇచ్చియున్నారు. అవి-

అలరువిలుకానితో డిపుఁ
డెలమి న్నా పొగడదండ యి; ప్పొమ్మవై తే
వలరాజు శాన మీఱిన
వెలఁదీ నినుఁ బొగడదండ వేయింతుఁజుమీ."
[రామా. ప్రథమా-౧౯౬]

"మెడకు మీఁగాలికిఁ బడమికిఁ గొనవేయఁ
బొగడదండలతోడఁ బొలియువారు."
[రామా. అష్టమా. ౧౬]

అనునవి. వీనిలో మొదటిపద్యమున "నినుఁ బొగడదండ వేయింతుఁజుమీ!" అనుచోట "శిక్షింతు"నను అర్థమనియు, కాన "పొరకదండ" అని మార్చ వీలు లేదనియు, యమక ప్రచురమైన రామాభ్యుదయమున అది అసంగతమనియు వారి యభిప్రాయము. రెండవ పద్యమునభిప్రాయమును శ్రీ శాస్త్రులుగారు "ఆకాశమునుండి యింద్రజిత్తు భూమిపైనున్న వానరులను బాణములచేఁ గొట్టుచున్నాఁడు. ఒక బాణమే మెడకును మీఁగాలికిని గ్రుచ్చుకొని భూమిలో నాటుకొనిపోవుచున్నదఁట. అట్లు మెడకును మీఁగాలికిని గలిపి కట్టినట్లుండుట "పొగడదండ" యను శిక్ష వేసినట్లున్నదని భావము" అని వివరించియున్నారు.

'దీనివలనఁ బొగడదండ యన నిగళయుగమూ, వెదురుగొడియ మున్నగు శిక్షాసాధనములలో నొకటి కాని యన్యము కాదనియూ, మెడకును, మీఁగాలికిని గదలకుండ నంటఁగట్టెడు త్రాడో యినుపగొలుసో మఱొకటో యై యుండుననియు' శ్రీ శాస్త్రులుగారి అభిప్రాయము. [సంపుటము ౨౫. సంచి. 3.]

పయి మూసింటిలో శ్రీ సూర్యనారాయణ శాస్త్రులుగారి వాదమే యాదరణీయము. 'పొగడ దండ'ను 'పారకదండ'గా మార్చ వీలులేనటులే 'పూల దండ' యని అనుటకును వీలుకాదు. అందులకు 'పరమ యోగి విలాసము'లోని యీ ద్విపదభాగ మాధారము:

'మఱి సహస్ర స్తంభ మంటపంబునకు
నటిమూటి నేతెంచి యచ్చోట నిలిచి
యిసుమకట్టున వేఁడిరొండలో మిగుల
జడియ వీఁపుపుమీఁదఁ జాపరా లెత్తి
పొగడదండలు వైచి పోనీక యునుట
బిగడఁ జట్టుము నడ్డ పెట్టినవారి
నరసి యిట్టేమొకో యని యధికారి
పరివారజనులఁ దప్పక విలోకించి'
[చతుర్థాశ్వాసము, పు. 3౨౫.]

పై కథాభాగము విప్రనారాయణచరిత్రములోనిది. శ్రీ రంగనగరమున దేవాలయమునందలి బంగరు గిన్నె తస్కరాపహృత మయినదని యర్చకులవలన విని, వారే యీ పనిచేసియుందురని నిశ్చయించి అధికారి వారలను దండించుట అందలి ప్రకరణము. కావున ఇది "శిక్షాసాధనమే" కావలెను. మఱియు 'శిక్ష వేయుట' లేదా వైచుట మొదలగువానివలెనే తఱుచుగ 'పొగడదండ వైచుట (వేయుట)' అనియే ప్రబంధము లందలి ప్రయోగములు కానవచ్చుచున్నవి.

పూలదండ అవమానసూచకముగ ంఠసార్థుల కంఠము నలంకరించునట్లు వర్ణించుట సర్వసామాన్యము. కాని అందరికిని పొగడదండయే అలంకారము కావలె నని నియమములేదు. ఉపలబ్ధ ప్రబంధోదాహరణము లన్నింటియందును కనఁబడుచున్నది ఒక్క "పొగడ దండ"యే! నిందితుల మెడల నలంకరించునవి నిర్గంధము లును, ప్రాయికముగ రక్తములు నగు "గన్నేరు" మొద లగు పూవుల దండలు కాని పొగడదండలు కావు. సంస్కృతనాటకములందు సాధారణముగ "పూలమాల"లే (పువ్వువిశేషములఁ జెప్పక) గ్రహింపఁబడినవి.

శ్రీ సూర్యనారాయణ శాస్త్రులుగారి సమన్వయము చాలవఱకు సముచితము. కాని వారనుకొనినట్లు దండన సాధనము 'పొగడదండ' కాదు. అది 'బొగడ దండ.' బొగడ లనఁగా పల్లేరు మొదలగు కాయలవలె ముండ్లమర్పఁబడిన ఇనుపకాయలు. వానిచేఁ దయారు చేయఁబడిన దండ 'బొగడదండ.' పయి రీతి ఇనుప కాయల కూర్పు గృహో రామాదుల ఆవరణములకు ఉప యోగింపఁబడుట నేఁడును మనము చూచుచున్నాము. కావున 'బొగడలదండ' దండనసాధన మనుట కేయాటంకమును లేదు. శ్రీ నాథుని ప్రయోగములో ఎట్టి అసాంగత్యమును ఉండదు మఱొక సంగతి! పయి బొగడల వంటివే చిన్న పువ్వులు కలవు. వానికి 'బొగడ పువ్వు'లని పేరు. అవి సాధారణముగ ఎఱుపు, తెలుపు రంగులలో నుండును. వాని దళములు కఠినములయి స్పృశింప దుర్ఘటములయి ఉండును. ఇనుపబొగడలను బట్టి పూవులకుఁగాని, పూవులనుబట్టి యినుపకాయలకుఁ గాని పేరు కలిగి యుండవచ్చును.

ప్రబంధము లన్నింటియందును 'బొగడదండ' అనియే యుండవలెను లేఖకులును, పరిశోధకులును కొందఱు 'బొగడదండ' అన నేమియో అర్థముచేసికొనక గ్రుతముననుఁ బరముగ నందు 'బకారము'ను సాధ్యముగ గ్రహించి, తత్పూర్వము ఖండాఖండబిందువులను నిలుప మొదలిడిరి! కళకుఁ బరమగు 'బకారము'ను సిద్ధముగ పరుషముగ దిద్ద సాహసించిరి! పరిశీలించినచో ఇయ్యది సిద్ధసరళమగును కాని పరుషము కాదు.

పయిరీతిని 'పొగడదండ'ను 'బొగడదండ'గా మార్చినచో ఉదాహృత ప్రబంధపద్యభాగములలో కుదురుబాటున కెట్టి ఆటంకమును కలుగదు. '...నా పొగడదండ యిఁకిమ్మనైతే, వలరాజు నాన నీరాడిన వాఁడదీ! నినుఁ బొగడదండ వేయింతు'నను స్థలమున 'నినుఁ బొగడదండ' అనుచో శ్లేష యుండుటచే (ఒక యర్థమున 'నీచేఁ దప్పక పొగడదండ వేయింతు'ననియు, మఱియొక యర్థమున నీ మెడలో బొగడలదండ వేయింతు ననియు అర్థము.) 'శ్లేషే సఖండ నిర్బంధో్యః ష్వచి స్మేళనం మతమ్' అను నియమము ననుసరించి సాంగత్యము కలుగుచున్నది. ఇట 'బొగడదండ'యను వర్ణమున 'నిను బొగడదండ' అనునప్పుడు నిర్బంధుకమనియు, 'పొగడదండ'అను వర్ణమున 'నినుఁబొగడదండ' అను చోట సబిందుకమనియు తెలియవలెను.

కావున ఇంతవఱకును 'పొగడదండ' గా వ్యవహరింపఁబడుచున్న పదము 'బొగడదండ'అను దండనసాధనమని నిశ్చయించుట ఉచితము.

# "కృష్ణదేవరాయల పోలిపాడు శాసనము"

## (సవరణ)

జి. వి. చలపతినాయుడు

భారతి ౧౯౩౬ జూలై నెల సంచికయందు పైశీర్షికతో శ్రీయుత డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు "పోలిపాడు" గ్రామము యొక్క శాసనమును గురించి వ్రాయుచు, చతుస్సీమహద్దులను ఈ క్రిందివిధముగా సమర్థించిరి :—

రెండవరేకు; రెండవప్రక్క

శ్లోకం. ౬౨-౩ నూనవే | చంద్రగిర్యాఖ్యా రాజ్యస్థం కల్శిహస్తి సీమగం | * వెం

౬౪ దోడగ్రామతః ప్రాచ్యం పోతుగుంటాచ్చ దక్షిణం | పశ్చిమంశ్రతశ్చాపిసగుటోరోరథోత్తరం॥*

అత్రభాగాప్రథం జ్ఞాతంభక్త్యా

౬౬ త్స్మాన్ మహీసురై ః| కృష్ణరాయపురం చతిప్రతినామాపశోభితం॥ *

గ్రామంమనోహరం పోలిపాటినామాన ముత్తమం *

*సర్వమాన్య*

౬౭ చతుసీమా సంయుక్తంచ సమంతతః" * * * *

శాసనమునందలి స్థలములు (౬౭ వ పేజి)

"దానముసంగబడిన గ్రామము చంద్రగిరి రాజ్యమందలి పోలిపాడని స్పష్టముగ దెలియుచున్నది కాని ఈ గ్రామ సీమయందలిలో లిపికారుడు విశదముగ వ్రాయలేదు. కల్శిహస్థి అని యున్నట్లు గాన్పించుచున్నందున బహుశః కాళహస్తియేమో యని తోచుచున్నది. ఈ పోలిపాడు గ్రామము వెంగోడు గ్రామమునకు తూర్పునను, పోతుగుంటకు దక్షిణమునను, పత్రకు పశ్చిమమునను, సగుటోరునకు ఉత్తరమునను ఉన్నట్లు తెలియుచున్నది. ఈ గ్రామములన్నియు ఇప్పటి నెల్లూరుజిల్లా రాపూరు, గూడూరు తాలూకాలను, వెంకటగిరి డివిజనును కలియు భాగమునం దున్నవి. ఈ శాసనమునందలి పోలిపాడు, వెందోడు గ్రామములు ఇప్పటి గూడూరు తాలూకాయందలి పోలిపాడు, వెంద్రోడు గ్రామములే. ఇవి రెండును గూడూరు తాలూకాయందు నైరృతిభాగమున నున్నవి. పోతుగుంటయిప్పటి రాపూరు తాలూకాయందు ఆగ్నేయ దిగ్భాగమున నున్న పోతేగుంట, లేక పాతగుంట కావచ్చును. సగుటోరు అని మన శాసనమున నున్న గ్రామమునే నేడు సగుటూరని వ్యవహరించుచున్నారు. ఇది వెంకటగిరి తాలూకా ఈశాన్యభాగమునం దున్నది. ఈ గ్రామములన్నియు ఒకటికొకటి దగ్గరగ నున్నందునను మన శాసనమునందలి పేర్లకును ఇప్పటి పేర్లకును ఎక్కువవ్యత్యాసము గాన్పించనందునను, నేను గాన్పించుచున్న పై గ్రామములే శాసనమునందు జెప్పిన గ్రామములని నమ్ముటకు వీలున్నది. ఇక సందేహాస్పదముగనున్న గ్రామ మొక్కటియే. ఇది పత్రయని పై శాసనమున వ్రాయబడినది. కాని ఎఱ్ఱ అని వ్రాయుటకే పొరబాటున లిపికారుడు పత్ర యని వ్రాసెననియు, గూడూరుతాలూకాయందలి యేరూరు గ్రామమే ఈ ఎఱ్ఱగ్రామ మనియు నా యభిప్రాయము. యేరూరు గ్రామముగూడ తక్కిన ౪ గ్రామములకును సమీపముననే యున్నందునను, శాసనమునందు దెల్పిన సరిహద్దుల దిక్కుల పేర్లు సరిగా

పరిపోవుచున్నందునను పై యూహ నిజమే యని నమ్మ వచ్చును."

## లో ప ము లు

పై ఆంధ్రీకరణమునందు "పోతుకుంటకు దక్షిణమునను, పఠ్రకు పశ్చిమమునను" అను రెండుహద్దులను "పోతుకుంటను" పోలిపాడుకు వాయవ్యభాగమున సుమారు ౧౫ మైళ్లదూరములో కొండలప్రాంతమున గల "పోతేకుంట" గ్రామము గావచ్చుననియు "పఠ్ర"ను "యఠ్ఠ" జేసి లిపికారుని అనావశ్యముగా నిందించి "పఠ్రను" పోలిపాడుకు ఈశాన్యభాగమున సుమారు ౨౦ మైళ్లదూరములో సముద్రప్రాంతమున గల "యేరూరు" గ్రామము గావచ్చుననియు, ఈగ్రామము లన్నియు సమీపమున గలవనియు సమర్థించిరి.

## ని జ స్థి తి

ఈ పోలిపాడుగ్రామము ఇప్పుడు బ్రిటిషు గవర్నమెంటువారి లెఖలప్రకారం నెల్లూరుజిల్లా గూడూరు తాలూకాలో నెం ౫౭ రు గ్రామమై ౭౫౦-౨౭ యకరముల విస్తీర్ణముగల శోత్రియగ్రామము. ఇది శ్రీయుత పెళ్లేటి వీరరాఘవరెడ్డిగారి సొంతగ్రామమై వారి స్వాధీనానుభవములో నున్నది.

పోలిపాడుగ్రామము మన శాసనములోని హద్దులకు సరిగా సరిపోవుచున్నది :— ఈ గ్రామము పందోడుగ్రామమునకు తూర్పుభాగమున సుమారు రెండుమైళ్లదూరమున గలదు. ఈ రెండుగ్రామములకు మధ్య "అరిమానిపాడు", "కార్జించేడు" అను రెండు గ్రామములు గలవు.

పోతుకుంటగ్రామమునకు దక్షిణమున సుమారు ఒకమైలుదూరమున గలదు. ఈ రెండు గ్రామములకు మధ్య "భువనగిరిపాళెం" అనుగ్రామము ఒకటిగలదు. భువనగిరిపాళెం శ్రోత్రియగ్రామము; శ్రీయుత పెళ్లేటి వీరరాఘవరెడ్డిగారి సొంతగ్రామము. ఈ పోతుకుంటకు మజరాగా యుండిన వోడూరు గ్రామము ఇప్పుడు పెద్దగ్రామముగా నున్నది. "పోతుకుంట" కొద్దిగా ఇండ్లుగలిగి అయ్యవారిపాళెం శ్రోత్రియగ్రామములో కలిసి పీఠిహద్దుగా గలిగి బ్రిటిషుగవర్నమెంటువారిదై యున్నది. గవర్నమెంటువారి డైగ్లాటు రిజష్టరు వగైరా లెఖలలో "పోతుకుంట వోడూరు" అని వ్యవహరించుచున్నారు. కాన కృష్ణరాయల శాసనకాలమునందు ఈ పోతుకుంట ఒక పెద్ద గ్రామముగా నుండి యుండవచ్చును గనుక దీనిని హద్దుగా నిర్ణయించి యుందురు గాని ౧౫ మైళ్లదూరమున వాయవ్యమూలగల "పోతేకుంట"ను హద్దుగా నిర్ణయించుటకు సాహసించియుండరు.

పెదపఠ్రె గ్రామమునకు సుమారు ౪ ఫర్లాంగుల దూరమున గలదు. ఈ రెండుగ్రామములకు మధ్య పెళ్లువ నగిరిపాళెం శ్రోత్రియ గ్రామముయొక్క భూములు కొంతవరకు గలవు. ఈ గ్రామము వ్యావహారికమునందు పెదపఠ్రె అని వాడబడుచున్నది. రైల్వేస్టేషను బోర్డుమీద "పెదపరియ" అని మార్పుబొందినది. కాన ఇది మనశాసనకాలమున పఠ్ర అని పిలువబడుచుండి ౨౫-౧౨ ౧౫౧౦ వ సంవత్సరమునకు తరువాత మరొక పఠ్రగ్రామము దీని ప్రక్కన ఏర్పడుటచేత దీనికి పెదపఠ్రె అని మార్పుకలిగియుండవచ్చును అయితే చిన్నపఠ్రె అని పేరుగల గ్రామ మొకటి యీ ప్రాంతములం దెచ్చటను గానరాదు. బహుశః చినపఠ్రె మన శాసనకాలమునకు తరువాత నేర్పడి, తరువాత కొలదికాలమునకే నశించియుండునేమో. ఇప్పుడు పెదపఠ్రె పెద్ద గ్రామముగా నున్నది. ఇంత సమీపములో నున్న పెదపఠ్రను వదలి ౨౦ మైళ్ల దూరమున ఈశాన్యభాగములో గల యేరూరును హద్దుగా నిర్ణయించియుందురని సమర్థించుటకు అవకాశము లేదు.

పసుటూరు గ్రామమునకు ఉత్తరమున సుమారు ఆరు ఫర్లాంగుల దూరమున గలదు. ఈ రెండు గ్రామములకు మధ్య "చిల్ల మానిచేను", "సురంకొండ" అను రెండు గ్రామములు గలవు. మన శాసనములో దీనిని "పసుటోరు" అని వ్రాసియున్నట్లు ఆంధ్రీకరించిరి. ఇప్పుడు దీనిని పసుటూరు అని వ్యవహరించుచున్నారు. ఇటులనే పఠ అనుదానికి పఠ్రె అని మారియుండవచ్చును.

౨౮-౧౨-౧౫౧౦ వ సంవత్సరపు ఈ శాసనమునందు హద్దులుగా నిర్ణయించిన నాలుగు గ్రామములలో వసుటూరు గ్రామము ఒక్కటిమాత్రము వెంకటగిరి జమీందారీలో నున్నది. తక్కిన మూడు గ్రామములు నెల్లూరుజిల్లా గూడూరుతాలూకాలోని బ్రిటిషు గవర్న్మెంటు గ్రామములు.

చరిత్రాంశములను గురించి వ్రాయునట్టివారు ఆయాప్రదేశములకు స్వయముగా వెళ్లి తమకు సందేహము గల విషయములను విచారించి తెలుసుకొని వ్రాయునట్లయిన సాధ్యమగునంతవరకు లోపములకు చోటుండదని తలచెదను.

# పోలిపాడు శాసనము

## (డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారి జవాబు)

నాయుడుగారు వ్రాసినదానిలో సారాంశమేమన పోలిపాడుశాసనమున చెప్పిన పరిహద్దు గ్రామములలో పోతుకుంట, పర్రయను రెండుగ్రామములు నేను పోలిపాటికి సమీపమున గానవచ్చుచున్న పోతుకుంట, పెదపరియ అను గ్రామములు కాని నే ననుకొన్నట్లు పోతేకుంట, ఎరూరు గ్రామములు గావు అని.

నేను నాకు తెలిసినంతవరకును సర్వేమ్యాపులు (Survey maps), గ్రామలెక్కలు (Village Statistics), గెజెటీర్లు (Gazeteers) మొదలగువానిని పరిశోధించి వ్రాసితినేగాని స్వయముగా ఆయాగ్రామములకు వెళ్లి విచారించలేదు. పోతుకుంట నేను "కొద్దిగా ఇండ్లుగలిగి అయ్యవారిపాళెం శ్రోత్రియగ్రామముతో కలిసి ఉన్నా"దని నాయుడుగారే చెప్పియున్నారు. అట్టిచో ఇంతచిన్నగ్రామము నాకు సర్వేమ్యాపులలో గాని, గెజెటీర్లలో గాని ఎట్లు కనబడగలదు? నాయుడుగారు స్థలవాసులు; గాన వారికి గ్రామముల వినయము సరిగా తెలిసియే ఉండును. చరిత్రికాభివృద్ధియందు ఇంత ఉత్సాహము కలిగి చారిత్రక విద్యార్థులకువిధముగ సహాయము చేయుట ఎంతయు ప్రశంసార్హము. నాయుడు గారికి నే నెంతయు కృతజ్ఞుడను.

కాని "చరిత్రాంశములను గురించి వ్రాయునట్టి వారు ఆయాప్రదేశములకు స్వయముగా వెళ్లి తమకు సందేహముగల విషయములను విచారించి తెలుసుకొన" వలయునని నాయుడుగారు వ్రాసియున్నారు. చారిత్రక పరిశోధనకు బూనుకొనువారందరు శ్రీమంతులుగను, ధనవంతులుగను ఉండజాలరు. ఇక విశ్వవిద్యాలయమువారు గాని, శ్రీమంతులు విద్యావంతులు నగు జనసామాన్యము గాని చారిత్రక పరిశోధకుల కట్టిసహాయమును జేయనప్పుడు ఏ శాసనము ప్రచురింపవలసినను ఆయాప్రదేశములకు స్వయముగా వెళ్లి పరిశీలించుట కెట్లు సాధ్యమగును?



# కలగూరగంప



## మదామ్ ఐరీన్ జోలియట్ క్యూరీ

మొన్న మొన్ననే ౧౯౩౫ లో రసాయనశాస్త్ర పరిశోధనలకు నోబెల్ బహుమతిని సంపాదించిన యీ ఫ్రెంచి యువతిని మేరీక్యూరీ కుమార్తెను గురించి కొన్ని వివరములు నవంబరు నెల భారతిలో ప్రకటింపబడి నవి. ఈ యుత్తమవ్యక్తిని గురించిన వివరములు మరి కొన్ని యిప్పుడు తెలియుచున్నవి.

తల్లిదండ్రు లుభయులు వైజ్ఞానికులు. తాను వైజ్ఞానికురాలు. తన్ను చేపట్టిన యాతడును వైజ్ఞానికుడు. ఈ యనుబంధము దైవసంకల్పముకాక మరి యేమి? ఇక నీమెవ్యక్తిత్వసంపదయో? - ఎవరిని, ఏ విషయము నను గాని పోలుటయు, అనుకరించుటయు హేయముగ తలచునంతటి బలవత్తరమయినది.

తొలినాళ్ళలోని యీమె శీలము: తలిదండ్రులు ప్రేమతో నప్పుడప్పుడు మిఠాయిపొట్లములను ఇచ్చు చుండు నలవాటు. ఆమె వానిని తన అలమరలో దాచి, తన పనులలో మునిగి వాని ప్రసంగమే మరచెడిది. కార్యదీక్షలో బాల్యచాపల మెక్కడికి పోయెడిదో! అమ్మ నాయన లప్పుడప్పుడు బిడ్డకు చిరుదిండ్ల కిచ్చెడు చిల్లరడబ్బులుకూడ అట్లే చేరిపోవలసినదే కాని యీమె వాని నేమాత్రమును ఉపయోగించిన పాపాన పోయినది కాదు. ఈమెకేమైన కావలసియున్న గదా! బడికి గూడ ఇంటిపాఠములను చక్కగా వ్రాసి, చదివి వేళ తప్పక—సకాలమునకు పోయెడిది. తెలివితేటలందును, వినయ విధేయతలయందును ఈమెను మించగలిగిన సహపాఠకులు లేకుండిరి. చదివిన పాఠములు, నేర్చుకొన్న జ్ఞానము క్రమబద్ధమయిన యీమె మనసున దిటవుగ నాటుకొనిపోయెడివి.

కాయిక, మానసికకష్టములనగా నేమో ఈమెయెరుగదు. అధైర్యము, నిరుత్సాహము ఈమె కోశమున లేవు. "అసారే ఖలు సంసారే" అను మిథ్యావాదముకా ఈమె మతము. ఈమెగమ్యమున కడ్డువచ్చు తొందరల నన్నిటిని ఈమె మెలకువతో తప్పించుకొనజేర్చినది. అహంకారలేశముకూడ నెరుగదు కాని ఆత్మవిశ్వాసము మాత్ర మీమెకు మెండు. తాను సాధించవలసినదేదో దానిని తొందరపడక, నిరుత్సాహముచెందక ధైర్యముగ, నెమ్మదిగ సాధించునేర్పే ఈమె నింతయున్నతికి దెచ్చినది.

పట్టణవాసమన్న ఈమెకు సరిపడదు. ఆసందడి, ఆసమ్మర్దము, ఆదుమ్ము-ధూళి ఈమె సాధనలకు అనుకూలపడునా? కావుననే యీమె పారిస్ పరిసరప్రదేశములం దొకయింట కాపురము పెట్టినది. నిర్మలమయిన ఆవాతావరణము, ఏకాంతమయినవాసము ఈమెపరిశోధనలకు చాల నుపకరించునవి. నిరాడంబరమైన సాంసారిక జీవితమును గడపుటకు అవి అనుకూలమైనవి. అనంతమైన కార్యకలాపమునందు సయితము ఈమె రొట్లో తీరికగలుగ జేసికొనుచు ఈత, నీరు పడవలలో విహరించుట, కొండల నెక్కుట మొదలగు దేహపరిశ్రమలందును పాల్గొనుచుండును. వేషభూషాద్యలంకరణములవంటివి తలచుటకుగూడ ఈమెకు మితిలేని విసుగు.

ఈమె, ఈమెభర్త ఇరువురు నిరంతరము సమష్టిగనే పరిశోధనలు జరుపుచుందురు. ఈ నిత్యసన్నియోగముకతన క్యూరీకి క్రమేణ మానవత్వమువైపు మనస్సుమొగ్గినది; గృహిణీత్వము పైకొనుచువచ్చినది. తన యిరువురు పసికందులపైన మమత, అనుబంధము గాఢమగుచు వచ్చినవి. సుఖదుఃఖాతీతమైయుండిన యీవ్యక్తిలో నిప్పుడిప్పుడు మార్పులు గోచరింపజొచ్చినవి సమాజ విషయములందును, రాజకీయసిద్ధాంతములందును ఈమె మనసు పారజొచ్చినది. ఆ విషయములందు తన అభిప్రాయములనుగూడ కొన్నిటిని నిశ్చయించుకొన్నది. తదితరాభిప్రాయములను డీకొనుటకు వెనుదీయుట లేదు. అభిమానావేగములను ఎరుగని క్యూరీ వానికలవాటుపడిపోయినది.

అది కాలచక్రపు తిరుగుడు. దాని కేమి? ఈమె పరిశోధనలకు విజ్ఞానప్రపంచము తలలూపినది. తల్లినోము ఫలించినది. ఈమె ఇప్పుడు ఫ్రెంచికాబినెటులో శాస్త్ర పరిశోధనలకు అండర్ సెక్రటరీగ నున్నది.

మేరీక్యూరీ యానందమునకు మేరయుండునా?

*   *   *

## పాలు, ఉర్లగడ్డల ఆహారగుణములు

మాంసకృత్తులు, పిండిపదార్థములు, క్రొవ్వులు మొదలగువానిని బట్టియేకాక పోషకగుణమును, బలము నిచ్చు ధర్మమును బట్టి కూడ ఆహారములు తరగతుల వారీగా విభజింపబడుచున్నవి. పుష్టిదాయకము లగు నాహారపదార్థములలో ఖనిజ సంబంధమును, విటమినులును ఎక్కువగ నుండును. పాలు, పాలనుండి తీయారైన వస్తువులు, గ్రుడ్లు, ఆకుకూరలు, పండ్లు, క్రొవ్వులు చేపలు, మాంసము మొదలైనవి అట్టివి. బలకర పదార్థముల తరగతిలో చక్కెర, మరధాన్యములు, కొన్ని క్రొవ్వులు చేరును. వానిలో కొన్నింట పోషకగుణ మేకొద్దిగనో యుండును; కొన్నింట అసలే యుండదు.

ధాన్యవర్గ మామొదటితరగతిలో చేరుచున్నది. వానిని నాణ్యపరచినకొలది ఆ ఉన్న కొద్ది గుణము కూడ తగ్గుచుపోవును. క్రొవ్వులుగూడ-అందునను నాణ్య పరచినవి ఈ తెగకే చేరుచున్నవి. శుద్ధపరచిన చక్కెరలో బలకరగుణ మున్నది కాని ఖనిజసంబంధమును, విటమినులును అందులో సర్వశూన్యము. చక్కెర ఎక్కువగా వాడినకొలదియు ఆహారములందలి పోషకాంశములు కొరవడుచు పోవును.

మీగడ తీసినవి కాని, తీయనివి కాని- మొత్తము మీద పాలలో ఖటిక లవణములును, స్ఫురితములును, విటమిను B 2 ను దండిగ కలవు. B 1 కూడ వానిలో కలదు. పాలక్రొవ్వుగాని, మీగడగాని A విటమినును సమృద్ధిగా సమకూర్చును. గ్రుడ్లలో A, B 1, B 2, D విటమినులును, ఎక్కువగ లోహాంశమును గలవు. ఈ యాహారపదార్థములందలి మాంసకృత్తులు స్వయముగ పుష్టినిచ్చుటయేకాక ధాన్యవర్గములందును, కూరగాయలందును గల మాంసకృత్తుల యుపయోగమునకు దోహదము నిచ్చుచున్నవి.

ఇతరాహారపదార్థములనుండియు, సూర్యాతపము నుండియు లభించెడి D విటమిను ఉపయోగములకు పాలలోని ఖటికలవణములును, స్ఫురితములును మరి కొంత ప్రాబల్యమును సమకూర్చుచున్నవి. పాలలో లోహాంశము శూన్యమే యయినను లోహగుణములు మాత్రము నిండుగ నున్నవి. సాధారణాహారములు D విటమినును తగుమాత్రము సరఫరా చేయలేకున్నవి. అందువల్ల పోషణ అవసరమైనవారి భోజనమున ప్రతి నిత్యమును కొంత చేపలనూనెను చేర్చుట మంచిది. A విటమినుకును, అయొడీనుకును చేపనూనెల కన్న ప్రశస్తమైన ఆధారములు మరి లేవు. గలగండరోగము విపరీతముగ నుండు ప్రాంతములందును, సముద్రపు చేపలు లభింపని ప్రదేశములందును అయొడీనును ఏ రూపములోనైనను ఉపయోగింపవలయును.

మరధాన్యములకును, చక్కెరకును అనుబంధాలముగ ఉర్లగడ్డలను విరివిగ వాడుట గుణకరమని పరిశోధకులు తెలుపుచున్నారు. ఉర్లగడ్డలలో C విటమిను ఎక్కువగ గలదు. ధాన్యవర్గములందు సులభముగాని కాల్షియము, ఫాస్ఫరసు కూడ అందులో ఎక్కువగనే లభించును. ధాన్యవర్గములు సమకూర్చు పరిమాణముకన్న ఎక్కువగనే ఉర్లగడ్డలు లోహమును, B విటమినులను సమకూర్చును.

పుష్టినిచ్చు ఆహారములను ఏ ఒకటిరెంటినో అలవాటుచేసికొన్నను ఆరోగ్యరక్షణకు చాలును కాని, ఆహారముల వైవిధ్యము ఆరోగ్యపోషణకు చాలమంచిది. మరినాణ్యపరచిన పిండ్లను ఎక్కువగా వాడరాదు. వానికి బదులు ధాన్యవర్గమును, అన్నిటికిని మించి ఉర్లగడ్డలను వాడుట చాల మంచిది. ఎక్కువ నాణ్యపరచిన చక్కెరను గూడ తగ్గించి ఉర్లగడ్డలనే యుపయోగించుట భావ్యము.

పాలలోను, ఉర్లగడ్డలలోను అంతగా చెప్పుకొనదగిన గుణములేవియు లేవని నమ్ముచుండువారికి ఇటీవలి

శాస్త్ర పరిశోధనల యీ ఫలితములు చక్కని సమాధానములు కాగలవు.

*　　　　*　　　　*

## ప్రాచీనభారతదేశ వైభవము-దాని పోకడ

వర్తమాన భవిష్యత్తులలో నూహింపనైన రాని వైభవము నానాడు భారతదేశ మనుభవించినది. అది యొక భూలోకస్వర్గముగ నుండెను! దానిని చూచి కన్నుకుట్టనివాడానాడు లేకపోయెను. నైతికముగనే కాదు, ఆధ్యాత్మికముగనే కాదు, వస్తుసంపత్తిలోనే కాదు నాటి మన దేశము ఎనలేని యున్నతిలోనుండినది. అందుత్పత్తియగుచుండిన పదార్థములు నాణ్యమునందును, బాలికతయందును అసమానములై వెలసినవి. తక్కినదేశములు దానితో వర్తకవ్యవహారములు సాగింపబూనిన కారణ మాగొప్పదనమే ప్రాచీన-ఈజిప్టుదేశము, చాల్డియాదేశముకూడ వాణిజ్యమున భారతదేశము నాశ్రయించియుండినవని తెలియుచున్నది. నిర్మాణ కౌశలమునందును, క్రియాకలాపములందును భారతీయుల నేర్పును ఆదేశములవారు బాగుగ గ్రహింపగలిగిరి. "ఇతరత్ర ఎక్కడను లభింపని వస్తువులను భారతదేశము విక్రయమునకు సమకూర్చినది. అణిముత్యములు, వజ్రవైఢూర్యాది రత్నములు, సన్నని మేలైననారవస్త్రములు, డక్కామజిలినులవంటి యుల్లిపొరగుడ్డలు, పట్టుబట్టలరకములు, ఇంకనెన్నని చెప్పగలము, మరియేదేశమునందు గాంచగలుగుదుము?"

గుజరాతు నావికవర్తకు లీ సరకులను మెల్లగ ఈజిప్టు చాల్డియాదేశములకు కొనిపోయిరి. అక్కడ వీనికి "వేడివేడి యిడ్లీల"వలె అమ్మకము జరిగెను. వేరచూడునంతటి వస్తువులా మరి! ఆతర్వాత ఫొనీషియనులు ఈ యపూర్వమైన సరకులను ఐరోపీయులకు చవిజూపిరి. వానిని చూచినంతనే వారికి ఇండియామీద మనసుపారినది. ఆ వైనము తెలుసుకొని అదియేపనుయమని పారసీకులు, అరేబియనులు ఈ సరకులను గొనిపోయి యైరోపీయులకమ్మి కుబేరసంపదను గూర్చుకొనిరి. ఈ "వర్తకులు" పయనించుచుండిన మార్గమునందు ఎన్నియో పెద్దపెద్దపట్టణములు పుట్టినవి. ఈ లాభసాటి వ్యాపారమును ఇతరుల చేవరినో యనుభవింపనీయనేలయని దురాశ ఐరోపీయులకు కలిగినది. తామే స్వతంత్రించి దానిని నడుప ప్రయత్నములు సాగించిరి. ఈ వ్యాపారమునకు నేలమార్గము కష్టభూయిష్ఠమైనదని తలచి సముద్రమార్గము నొకదానిని కనిపెట్టుటకు కొలంబసును నియోగించిరి. పోర్చుగీసువారు అదేపనికై వాస్కోడగామాను పంపిరి. అతను 3౹౨ నెలలు ప్రయాణపడి ఇండియాకు దక్షిణాఫ్రికాతీరముగా నొక సముద్రమార్గమును కనుగొని తిరిగివెళ్ళెను పోవునపుడు ఒక హిందూరాజునుండి యొక యుత్తరముకూడ కట్టుకొనివెళ్ళెను. పోర్చుగీసువారికి బ్రహ్మానందమైనది. "ఆరాత్రి లిస్బనులోని యిండ్లన్నియు దీపముల ధగద్ధగాయమానముగ వెలిగింపబడెను." యథార్థము వారికి అద్దమునందువలె గోచరించినది. "నాగరక ప్రపంచమెరిగిన ప్రతివస్తువు, మనుష్యుని బుద్ధికిని, చేతికిని సృష్టింపజాలిన ప్రతిపదార్థము - అది యుపయోగించుకొనదగినదైననుసరియే, కళాదృష్టితో నుండుకొని ఆనందించదగినదైననుసరియే-ప్రపంచములో నేదియున్నను అది మొట్టమొదట భారతదేశమునందు సృష్టింపబడినదే. పరిశ్రమలందుగాని, నిర్మాణసంపదయందుగాని భారతదేశమును మించిన దేశము యూరపులోగాని, ఏషియాలోగాని మరియొకటిలేదు. అక్కడ తయారగు ఉన్ని, నూలు, పట్టు, నార- వస్త్రములు నాగరక ప్రపంచమందంతట కీర్తిని గడించినవి. ఇక నగల సంపదమాత్ర మేమితక్కువ? ఆ రకరకముల ఆభరణములకు, అపనితనమునకు సాటికలదా? ఇక-మట్టిపాత్రలు, పింగాణిసామానులు, లక్కవస్తువులు, లోహపాత్రసామగ్రి, ఇతరపరికరసంతతి వీనిమందే దేశము చేసని నిలువగలదు? భారతీయశిల్పము, ఆ అందచందములకు ఆ కళాసంపదకు దాని కదియే సాటి. వాస్తుశిల్పమునకు నక్కడ కొరవకానరాదు. అక్కడ గొప్ప గొప్ప వర్తకు లున్నారు. వ్యాపారపరిమర్మముల నెరిగినవేత్త లున్నారు. గొప్పగొప్ప బ్యాంకర్లు, ఆర్థికసంపదగలవారు ఉన్నారు. భారతదేశము నాకా నిర్మాణమునకే కాదు ప్రపంచమంతటికోను జల, స్థల-

ఉభయమార్గములను వర్తక వాణిజ్యములను నడపుటకును అఖండఖ్యాతి గాంచినది." పరాయి దేశములవారికే మన దేశ మింతవైభవముగా కనుపించినది!

స్పానియర్డులు తాము నూతనముగ కనిపెట్టిన అమెరికాకు వెళ్లి చేరికే కాని ఇండియాను మాత్రము వారు మరచిపోలేకపోయిరి. ఫెర్డినాండ్ మగెల్లన్ నాయకత్వమున కొందరు పరిశోధకులు ఇండియాకు పసిఫిక్ సముద్రమున నొకమార్గమును కనిపెట్టుటకు బయలుదేరిరి. దారిలో వారికి కొన్ని ద్వీపములు తటస్థించినవి. అవి ఇండియాయొక్క భాగములే యనియు, అందు వసించుచున్నవారే ఇండియనులనియు వారు మొదట భ్రమపడిరి. ఆ తర్వాత అవి కాదని తెలిసినది. ఫిలిప్పయిను ద్వీపములని వానికి పిదప నామకరణము చేసిరి. ఇండియాను వెదకు ప్రయత్నములో వారికి క్రొత్తగనే భూఖండము దొరకినను ఇండియాగానే వారుతలచుకొనుచుండిరి. ఈ స్పానియర్డుల యొక్కయు, పోర్చుగీసువారి యొక్కయు అడుగుజాడలనే వచ్చి, ఇంగ్లీషు, ఫ్రెంచి వారును అనుసరింపజొచ్చిరి. వారిలోవారికి మనస్తాపములు, తగాయిదాలు మొలకెత్తినవి. అందులో విశేషమేమి? ఏకామినలోభమునకు అట్టివి ఆనుషంగిక ఫలితములే కదా! ఆ పోటీలలో ఇంగ్లీషువారు తక్కిన వారిని తలదన్ని ముందుకు వచ్చిరి; ఇండియావర్తకమునందు ముప్పాతికమువ్వీసము పాళ్లను కబళించిరి. ఏ మూలనో నామరూపములులేక అడగియున్న ఇంగ్లండు ఆదెబ్బతో 'ఏరీ నా సరివారు' అనుకొనునంతటి స్థితికి ఎగబ్రాకినది! ఇంగ్లండు నేడే వైభవము ననుభవించుచున్నదో అది యంతయు ఇండియాప్రసాదమే. ఈ సత్యమును మరుగుపరచజూచినచో నది యభిమాన ప్రభావముకాక మరేమియు కానేరదు.

[మా. లిబర్టీ-నవంబరు]

## మెండలీయము - రక్తస్పర్శ సవరణ

భారతి నవంబరు సంచికయందు ౭౮౩-వ పేజిలో "౨౫-౨-౩౬ తేదినాడు సాయంత్రము..." అని మొదలయి, "...విత్తులేయని నే నూహించెదను" అని ముగిసినపేరాను ౭౮౪-వ పేజీలో "మందలోని పొట్టేలిచే బొర్లింపబడిన గొట్టెకొట్టియుండును" అని ముగిసిన పేరాకు తర్వాత చదువుకొనవలెను. [సం. భా.]



# విజ్ఞానవిశేషాలు



[పాపులర్ సైన్సునుండి]

## ఇక లోహసామగ్రి త్రుప్పుపట్టదు

ఈతన యేదో రాసాయనిక 'స్నానము'ను క్రొత్తగా కనిపెట్టినాడట. ఆ ప్రక్రియతో నేలోహ పదార్థమునైనను త్రుప్పుపట్టకుండ చేయవచ్చునట. దీనితో జేళమున కార్థికముగ నెంతో ఖర్చు తగ్గుననుటకు



సందియములేదు. మోటారుకార్ల నిర్మాతలు, లోహసామగ్రి పరిశ్రమాలయముల యజమానులు నీతనితో నీవిషయమై రాయబారములు జరుపుచున్నారు. ఆ స్నానపు ప్రక్రియ కూడ కేవలము నాలుగునిమిషాల పనియట.

ఇతడు తనయింటిలోని లోహపరికరములను భద్రపరచుకొనుచున్నాడు.

## కేశవర్ధని

మందు లవసరములేదు, మాకు లవసరము లేదు. వెండ్రుకలు పెరుగుట కీ యంత్రము చాలును. ఈ టోపీని నెత్తినపెట్టుకొని కుర్చీలో కూర్చొని ఖులాసాగా కాలక్షేపము చేయుచుండవచ్చును. ఈ యంత్ర మతని కొలితకుండగనే టోపీగుండా అనుక్రమముగా వాయు పీడనమును, వాయుశూన్యతను తటకు గలుగజేయుచు వెండ్రుకల చిగుళ్లను పోషించు రక్తనాళములను విజృంభింపజేయును. ఆస్పత్రులలో రోగుల కాళ్లపైన నెండ్రుకలను మొలవజేయుట కుపయోగింపబడుచుండు 'గ్లాసు బూటు'లనబడు యంత్రముల విధానమే యీ యంత్రము సృష్టికి మార్గదర్శకమయినది అవికూడ రక్తప్రసరణ



మును హెచ్చుచేయుపద్ధతినే యవలంబించుచున్నవి. బట్టతలవాండ్లకు, పలుచని కేశములు గలవాండ్లకు,పొట్టి వెండ్రుకలుగలవారికి ఇక భయములేదు. ఎట్టివారికైనను దీనిమూలమున గుబురుగ, మిసమిసలాడు వెండ్రుకలు పెరుగును. అనేకులు దీనిని పరీక్షించిచూచినారు. సగమునకు పైగా ఫలితములను పొందినారు.

## మెరుపులను ఫోటోతీయు క్యామెరాలు

ఎటువంటి మెరుపులనైనను, ఎడతెరపిలేకుండ మెరయుచున్నను ఈ క్యామెరాలతో ఫోటోలు

తీయవచ్చును. ఈ క్యామెరాలన్నియు నొకచక్రము పైన వరుసగ అమర్పబడియుండును. మెరుపులు మెర యుకాలమునకు సరిగా క్యామెరాల లెన్సుల మూతలు తెరచిపెట్టి, చక్రము గిఱ్ఱున చేతితో త్రిప్పవలెను.



ఉన్న వున్నట్టుగ మెరుపుల చిత్రములు తయారగును. చిత్రములలో ఆకాశభాగములు పడకుండునట్టు రీతిని క్యామెరాలు అమర్పబడును. మెరుపులను పరిశీలించుటకు ఈక్యామెరాచక్రమాల చాల ఉపయోగపడగలదు.

## కుక్కలకంఠధ్వనిని మందగింపజేయవచ్చును

కుక్కలు మొరుగుచుండునప్పుడు నిద్రాభంగమగునని కొంతమందియు, చీకాకుగా నుండునని కొందరును, దాని కర్ణకఠోరతకు మరి కొందరును మొత్తము



మీద అందరును విసుగుపడుదురు. ఇకమీదట ఆభయము లేదు. కుక్కలు మొరగకపోవుగాని ఆధ్వని యుచ్చములో నుండక మంద్రములో నుండును. వాని కంఠము లందలి ధ్వనివాళముల భాగములను ఆపరేషనుచేసి కత్తిరించివేయుటవలన తారస్థాయిలో నుండుచువచ్చిన వాని ధ్వని మంద్రస్థాయిలోనికి తెచ్చుచున్నారు. ఈ ఆపరేషనువలన కుక్కలప్రాణముల కేవిధమయిన యుపద్రవము నుండదు. మొరిగినను చెవులు బొంగురుపోకుండుటకై మాత్రమే యీ ఆపరేషను.

## సైకిలుయాత్రికులకు కొన్ని సౌకర్యములు

సైకిళ్లమీద ప్రపంచయాత్ర, దేశయాత్ర చేయువారి సంఖ్య దినదినమున కెక్కువయగుచున్నది. అన్న



పానములకన్న, వారు రేమజిలీలోనో చూచుకొందురుగాని దుస్తులు మొదలగు వారి యుపయుక్త సామగ్రిని వెంబ కొనిపోకపోయిన మధ్యలో నెవరు సమకూర్చెదరు? పెట్టెలలో పెట్టుకొని వానిని సైకిలువెనుకచక్రముపై కట్టుకొనిపోవుట చాల ప్రయాసకరము. అక్కడక్కడ మజిలీలలో నాగినపుడు వారికాలక్షేపమునకు వినోదసౌకర్యములును ఉండవు. ఈ యవస్థల నెరిగిన యీ యాత్రికుడు తన సైకిలు కొక ఉపశకటికను తగిల్చి, ఒక రేడియోను కూడ అమర్చుకొనినాడు. అతని సామగ్రియంతయు నా ఉపశకటికలో నిమిడిపోవును. వినోదకాలక్షేపమునకు, ఆయాస పరిహారమునకు రేడియో, అక్కరకువచ్చును. తక్కినయాత్రికులును ఈ పద్ధతి నేల యనుసరింపరాదు?

## గోడలను చిత్రములతో నలంకరించుట

కాగితపు చిత్రముల నతికించినచో ఒకవేళ నవి చినిగిపోవచ్చును; ఊడిపోవచ్చును. కుంచెలను తీసికొని రంగులతో చిత్రించుటకు కాలము, శ్రమ మిక్కిలి యవసరము. ఇందు కొక సులభోపాయము కనిపెట్టబడి నది. ఫోటోగ్రాఫులనుండి పెద్దవిచేయ బడిన బింబములను గోడలమీద కావల సినప్రదేశములందు ప్రతిఫలింపజేసి ఆ బింబములనే స్థిరపరచ గల మార్గము దొరకినది. రాతినార కలిసిన యొక రంగును మొదట గోడమీద పిచికారితో చల్లెదరు. ఆతర్వాత బింబ గ్రాహక గుణముగల సిల్వర్ ఎమల్షనను దానిమీద చిలుకరించెదరు. అవి దానిమీద బాగుగ అతుకుకొనిపోవును. అప్పుడు చిత్రములను పెద్దవిచేయు క్యామెరాలో కావలసిన ఫోటో నమర్చి, వెలుగును దానిగుండా గోడమీదికి ప్రసరింపజేయుదురు. చిత్రము పెద్దదిగా గోడమీద కనబడును. పిదప స్పష్టీకరణ, స్థిరీకరణద్రావణములతో నా బింబమును స్థిరపరచెదరు. దానిపైన మరల నొకలక్క పూతను, చిత్రము చెరిగిపోకుండ నుంటకు, పూసెదరు. ఈ ప్రకారముగ నెంతటి పెద్దగోడలపైనను కొన్నిగంటల వ్యవధితో చిత్రములతో నలంకరింపవచ్చును. ఈ చిత్రములు ఏలాటి వరణమునను మాసిపోవు. ఈ వాతావిధానమునందలి పద్ధతులును, అట్లు చిత్రింపబడిన యొకానొకచిత్ర స్వరూపమును ఈ చిత్రములందు గలవు.





## దూరదర్శి నియంత్రములను మనమే తయారుచేసికొనవచ్చును



ఈ వ్యక్తి పాప్యులర్ సైన్సు మాసపత్రికలో నిచ్చిన ప్రణాళికతో నీ వ్యక్తి దూరదర్శిని స్వయముగ నిర్మించినాడు. దీని నిర్మాణమునకు కొన్ని డాలర్లు మాత్రమే ఖర్చయినవి. ౨౦౦ షిల్లింగుల వెలచేయు యంత్రములకన్న నిది యెంతయో బాగుగ నున్నదని యితడు అభిమానపడుచున్నాడు. ఒక 'కంబళినాళిక' దీనికి గొట్టమైనది. రెండు భూతద్దములు - అందులో నొకటి చదునుపరచినది - దీనికి లెన్సులైనవి. దీని పరిమాణము ౬౦ అంగుళములు. దీనిని నిర్మించి తీరా మూడుమాసము లయినవో లేదో అప్పుడే ౧౧౨ మంది వచ్చి దీనితో పరిశీలనచేసి వెళ్లినారు.

---

## మోటారుయంత్రముల లోటుపాట్లను కనిపెట్టు సాధనము

మోటారు యంత్రములలో నేభాగములు చెడిపోయినవో, దడదడలాడు శబ్దములకు కారణమేమియో కనుగొనుటకు ఈ విద్యుద్దర్శయంత్రము కనిపెట్టబడినది. ఇది

చూచుటకు వైద్యుల హృదయస్పందపరీక్షణివలె యుండును. మోటారు స్పందముల నిది జాగ్రత్తగ నిరూ



పింపగలదు. ఆ స్పందనములు ఒక దండమునుండా సూక్ష్మశ్రవణికి కొనిపోబడును. అక్కడ లవణస్ఫటికము లుండి విద్యుదాఘాతములను జనింపజేయును. వెంటనే ఆయాఘాతములు తిలటిమెమ్మలకు పరుగెత్తిపోవును. ఎంతటి సూక్ష్మస్పందములనుగాని యీ మోటారు రోగ పరీక్షణి గ్రహింపగలదు.

---

## భారతీయుల ప్రతిభ కొక దృష్టాంతము

బొంబాయిలో నొక దంతపుపనివాడు ఏనుగు దంతములో ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు జంతువులయు, ఇతరప్రతిమలయు బొమ్మలను బహుసూక్ష్మమైనవాటిని తయారుచేయుచున్నాడట. ఆ బొమ్మల శిల్పవైభవము చూచుటకు మహాశక్తిగల భూతద్దములు కావలయును. తన కౌశలమును ప్రపంచమునకు చాటుటకు అతడు ఈ యేనుగువంటి బొమ్మలను తయారుచేసి,



అట్టి వానిని ఒక సన్నని లోగుజ్జుతీసిన బటాణికంటి గింజలో పదిలపరచి, దంతపు మూతతో దానినిమూసి, వందలు వేలుగ అట్టి బరిణలను ఎగుమతిచేయుచున్నాడు. ఈ చిత్రమును చూడుడు. ఈ యేనుగు వాని సూక్ష్మ

నేచిత్రము లన్నిటిలోను మిక్కిలి పెద్దది. ఈ యేనుగు బొమ్మ ఇందులో మిక్కిలి పెద్దదిగా ఫోటో తీయబడినది. ఎంత పెద్దదిగా తీయబడినదో ఆ ప్రక్కనేయుండు నిప్పుపుల్లల మొనలనుబట్టి యూహించుకొనవచ్చును.

---

## టైపుయంత్రములలోని అక్షరములను శుభ్రముచేయు పరికరము

ఈ పరికరముతో మెల్లగ అక్షరములను శుద్ధి చేయవచ్చును. అక్షరములలోని కల్మలమంతయు తొలగి



పోయి, యవి శుభ్రముగ తళతళలాడుచుండును. ఈ పరికరములోని జిమ్మ మెత్తని పదార్థములో చేయబడిన దగుటచే అక్షరములకు చెరుపు ఏమాత్రమును కలుగ నేరదు.

---

## క్రొత్తరకపు సేఫ్టీ రేజరు

బ్లేడులను శుభ్రము చేయుటకు గాని, క్రొత్త బ్లేడును వేయుటకుగాని రేజరుమొత్తమును విప్పవలసిన



గనే వసతి కలుగజేయుటకై యీ పద్ధతి అనుసరింపబడినది. పిడిమొన నుండు మరవలయమును త్రిప్పినచో నీరేజరుకప్పు రెండుపాయలుగ తెరచుకొనును. వలయమును మరల వెనుకకు త్రిప్పినచో నది మూసికొనును. ఈ రేజరులో నుండు మరియొక విశేషమేమన, దీనితో నెవరెవరి యభిరుచి చొప్పున వారు క్షౌరముచేసికొనుటకవకాశము కలదు. మర వలయమును గట్టిగా త్రిప్పియుంచినచో మామూలుక్షౌరమున కనుకూలముగా బ్లేడు వంగియుండును. మామూలుకన్న సున్నగ

క్షౌరముచేసికొనవలయునన్న వలయమును ఒకచుట్టు కొద్దిగ త్రిప్పవలయును. అప్పుడు బ్లేడు వారి కనుకూలముగ చదునుగ నుండును.

---

### దేశముకానిదేశముననుబొప్పాయిచెట్లపంట

బొప్పాయిచెట్లు ఉష్ణదేశపుపంట. దానికి తెగుళ్లు, పీడలబాధ విపరీతము. అమెరికా సంయుక్తరాష్ట్రము







లలో ఇట్టి పంట పెట్ట బూనుకొన్నారు. మరి కావలసిన రక్షణోపాయములు అమర్చవలదా? ఆప్రశ్నలను తలదన్ను ఆరోగ్యవిధి, విధానములను సమకూర్చినారు. అవిరితో నిరంతరము వెచ్చచేయబడు గృహములను ఈపంటపాలములకు నిర్మించినారు. ఆనేలమన్ను కృమికీటకాములు లేకుండ శుద్ధపరుపబడినది వానిప్రవేశమునకును అడ్డంకులు కల్పింపబడినవి. కార్మికులును, చూడవచ్చినవారును ఈ వాటికలలో ప్రవేశించుటకుముందు అంటుదోషమునునివారించు ద్రావకము గల యొకతొట్టిలో కాళ్లుకడుగుకొనియే తీరవలయును. గాలికిని, వెలుతురునకును కావలసిన అవకాశములు కల్పింపబడినవి. ఈ సౌకర్యసంపత్తితో నక్కడ ఆ చెట్లు అతి ప్రోదిగా యెదురుచున్నవి. పండ్లుకూడ పసిడిపసిమి, సువాసన గలిగి, యొక్కొకటి సుమారు ౭ పౌనులదాక బరువుగలిగి యుండుచున్నవి. ఒకయేడాదిప్రాయమునకే యీ చెట్లు ౨౦ అడుగుల యెత్తునగల వాటికగాజుకప్పులను పగిల్చిపోవునంతగా పెరుగుచుండును గావున వనపాలకులు అప్పుడప్పుడు చెట్లకొనలను కత్తిరించివేయుచుందురు. ఆరునెలల చెట్టె యెంతలేసి కాయలను విడిచినదో చిత్రమున జూడనగును.

### కాఫీగింజలను వేగించు విద్యుద్యంత్రము

పొయ్యిమీద వేగించి ఎక్కడ మాడిపోవునో, వాసన యేమైపోవునో యని తల్లడిల్లు గృహిణుల యదృష్టము ఫలించినది. ఈ విద్యుద్యంత్రముతో కాఫీగింజలను బహు సులభముగా, చెడిపోవునను భయము, వాసన పోవునను ఆత్రము అక్కరలేక వేగించుకొనవచ్చును. పచ్చిగింజలను యంత్రముపైభాగమున నుండు అరలో పోసి ఒక మూత పెట్టవలెను. వెంటనే గింజలు మధ్యనుండు విద్యుచ్ఛక్తి పెనములోనికి పోవును. అక్కడ నవి



తనిచ్చగ వేగి, శుభ్రపరుపబడి, చల్లపరుపబడి అడుగున నుండు సొరుగులోనికి పడిపోవును. ఇక వానికి చేయ వలసిన సంస్కారమేమియు నుండదు. పాడిచేయుటయే తరువాయి.

---

## మన చిత్రకారులు కేశవములనుచూచి మానవచిత్రములను రచించిరన్న నమ్మలేదు

న్యూయార్కులో నేదో హత్య జరిగినది కాబోలు! చితకగొట్టబడి, శకలములుగ చేయబడి, చెల్లాచెదరుగ పడిపోయిన యొక తలముక్కలు మాత్రము పోలీసులకు దొరకినవి వానిని వారొక శిల్పిచేతి కిచ్చి, అనుసరించి ప్రతిమ నూహించి తయారు చేయమన్నారు. ఈ శిల్పి అష్టకష్టములుపడి ఆశకలముల తృణములనే పరిశీలించి పరిశీలించి, చివరకు హత్యల చేయబడిన వ్యక్తి తలను పోలియుసున్నముతో ప్రతిమగ తయారుచేసినాడు. పోలీసులకది చాల ఉపయోగ పడినది. ఆ శిల్పి తాను రచించిన ప్రతిమను పరీక్షించు చుండుట యిందు గానవగును.



మన గాథలను మన మెందుకు నమ్మకపోవలెనో తెలియుటలేదు!!

---



స్వారి

—S. S. B.

ఆంధ్ర చిత్రశిల్పి

# శ్రీ వి. ఆర్. చిత్రాగారి

జపాను పర్యటనము



వి. ఆర్. చిత్రగారు . .

ఆంధ్రచిత్రకారుడు శ్రీయుత వి. ఆర్. చిత్రాగారు ౬ మాసముల జపానుయాత్రను ముగించుకుని గత అక్టోబరు మాసాంతమున చెన్నపురికి మరలివచ్చిరి. వీరు రవీంద్రుని విశ్వభారతి కళాభవనమునందు ఆచార్య నందలాలబోసు శిష్యత్వమున ఆరుసంవత్సరములు గడపి, పిదప లక్నోచిత్రకళా విద్యాలయమున కొంత కాలము శ్రీ అసితకుమార హాల్దారుని సహోపాధ్యాయులై, ప్రస్తుతము(గడచిన ౨ సంవత్సరముల నుండియు) చెన్నపురి కళావిద్యాలయమున శిల్పశాఖకు (Crafts Section) అధికారిగా ఉద్యోగము చేయుచున్నారు.

అరుణోదయసీమ (Land of the rising sun) యని పేరు వడసిన జపానుదేశమున గడపిన ౬ మాసములలో వీరు అచ్చట చూడ నగు సుందర నగరరాజములు, కళామందిరములు, కళాప్రదర్శనములు, చిత్రవస్తు నిర్మాణశాలలు మున్నగు ననేక విశేషములను దర్శించియున్నారు. పలువురు చిత్రకారులను దర్శించినారు. తాము సేకరించిన విషయజ్ఞానము నంతయు చెన్నరాజధానిలోని కళాభిజ్ఞుల కొరకును, జనసామాన్యము కొరకును సంచార చిత్రవస్తు ప్రదర్శనములద్వారా ప్రచారము చేయుటకు సంకల్పించుచున్నారని తెలియుచున్నది. ఇది మిక్కిలి ముదావహమగు విషయము.

ఆంధ్రచిత్రశిల్పి శ్రీ చిత్రాగారు జపాను దేశమునకుపోయిన ముఖ్యోద్దేశము అచ్చటి శిల్పశాలలను దెల్ప పింగాణీ, లక్క, వెదురు మున్నగువానితో చేయనగు చిత్రవస్తు నిర్మాణమును పరిశీలనచేయుటయు, భారతీయ చిత్రకళా విశేషమును జపానీయులకు ఉపన్యాసము మూలమున విశదముచేసి తద్వారా ఉభయ ప్రాచ్యదేశములకును విజ్ఞాన వాణిజ్యాభివృద్ధిని, స్నేహభావమును పెంపొందించుటయు నైయున్నది.

జపానుదేశమున వీరి పర్యటనములును, ప్రచారమును అచ్చటి పత్రికారాజములలో నెంతయు కొనియాడబడియున్నవి. నగోయాపట్టణమునందలి ధనికులలో నొకరగు జిరోజేమన్ ఇటోగారి (Jiro Joamon Ito) యింట బసచేసి శ్రీ చిత్రాగారు నగోయా పిం

గాణీవస్తునిర్మాణశాలను (The Nagoya porcelain works Ltd.), నిప్పన్ పింగాణీ వస్తునిర్మాణశాలను



జపానుహోటలులో చిత్రగారు



వి. ఆర్. చిత్రగారు, హరిహరనుగారు

(The Nippon porcelain works Ltd.) దర్శించి అచటి నిర్మాణవిధానములను, వాణిజ్యపద్ధతులను విపులముగా అవగాహనముచేసికొనియున్నారు. ఇంతేకాక అచటనున్న కాలములో "కరాత్సు మాధ్యమిక పాఠశాల" "కరాత్సు వాణిజ్యపాఠశాల" మున్నగు విద్యాలయములలో "భారతీయ విజ్ఞానప్రభావము" "భారత జపానుదేశముల ప్రాచీనబాంధవ్యము" మున్నగువిషయములగూర్చి ఉపన్యాసముల నొనర్చి మెప్పుగాంచిరి. జపానుదేశపు సుప్రసిద్ధచిత్ర కళాచార్యులగు టైకాన్ యొకోమా (Mr. Taikon yokome, president of the art institute of Japan), ర్యుషి కవాబాటా (Rushi kawabata, president of Suryusha Art Society) గార్లతో కళాసంప్రదాయములు, ఆధునిక చిత్రకళావిధానములు మున్నగువిషయములను గూర్చి ప్రసంగించి జపానీయ విజ్ఞానమును గ్రహించుటయేకాక, తమయొక్కయు జపానుదేశమున గత ౬ వత్సరములనుండియు నివసించుచున్న కేరళ చిత్రకారుడు శ్రీహరి హరన్‌గారియొక్కయు చిత్రములను ప్రదర్శించి జపానీయులకు కూడ భారతీయ చిత్రకళావిధానమును చవిచూపి యున్నారు. అట్టి ప్రదర్శనములలో శ్రీయుత చిత్రాగారి 'చిత్రమాల' యను వర్ణచిత్ర సంపుటమును, హిమాలయ ప్రకృతి దృశ్యచిత్రములును జపానీయ పత్రికలలో మిక్కిలి కొనియాడబడియున్నవి.

ప్రస్తుతము వి. ఆర్. చిత్రాగారును, వారితో కూడ చెన్నపురికి విచ్చేసిన జపానీయ పత్రికావిలేఖకుడును పింగాణీ కర్మాగార ప్రతినిధియునగు శ్రీయుత త్సుమూరో వాటానోబ్‌గారును (Mr. Tsumuro watanobe) రాబోవు క్రిస్టమస్ దినములలో చెన్నపురి నగరమున హిందూ జపానీయ చిత్రశిల్ప వస్తుప్రదర్శ



ఎడమవైపునుండి శ్రీ వాటనోబుగారు, చిత్రగారు

నము నొకదానిని జరుపు ప్రయత్నములో నున్నారు. ఈ ప్రదర్శనమున వీరు తమతో తెచ్చిన అనేక చిత్ర

విచిత్ర జపానీయ వస్తువులను ప్రజలు దర్శించుటకు అవ కాశము కలుగగలదు. ఈ ప్రదర్శనమును తీసికొని మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిను రాజధానీనగరము లందు కూడ శ్రీయుత వాటానోబ్‌గారు సంచారము సల్పనైయున్నారు.

ఇంతేకాక శ్రీయుత వి. ఆర్. చిత్రాగారు చిత్రవస్తునిర్మాణశాస్త్ర ప్రవీణులగు వాటానోబ్‌గారి సహాయమున చెన్నపురిలో నొక పింగాణీ వస్తునిర్మాణ శాలను స్థాపించుటకు సంకల్పించియున్నారు. ఈ సంద ర్భమున వీరు చెన్నపురి గవర్నమెంటు కార్మికశాఖా మంత్రి, శ్రీమంతులగు వణిక్ప్రముఖులు, రాజధానిలోని సంస్థానాధీశులు మున్నగువారి సహాయమును పొందగల మని ఆశించుచున్నారు.

శ్రీయుత చిత్రాగారు జపానునుండి తిరిగివచ్చిన పిదప కొచ్చిను సంస్థానాధికారుల ఆదేశమున ఆ ప్రాం తములందలి ఆలయములలో గల ప్రాచీన కుడ్యచిత్రము లనుగూర్చి పరిశీలన మొనర్చి, ఒక ప్రత్యేకనివేదికను (A Monogram) తయారుచేసి సంస్థానమువారికి అర్పించియున్నారు.

ఈ సుప్రసిద్ధ యువకచిత్రకారుని జన్మస్థానము విశాఖమండలము. ఆంధ్రచిత్రకారులలో వయసునచిన్న వారైనను, సంచారమువల్లను, అధ్యయనమువల్లను కలిగిన అనుభవమున మిన్నవారై, ఆధునిక భారతీయ చిత్రకారు



జపాను హోటలులో పనికత్తె

లలో ప్రాముఖ్యము గడించుటయును, ఇతర దేశములందు గూడ ఆంధ్రకళాప్రభావమును ప్రసరింపజేయుటయును ఆంధ్రులెల్లరును అత్యంత ప్రమోదాభిమానముల వహిం పవలసిన విషయము.

మ. వి.





శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము

# అమృతానందనాథస్వామి జయంతి

పద్య కుసుమాంజలి

**కవితిలక కంచనపల్లి కనకాంబ ప్రణీతము**

అమృతానందగురుప్రతిష్ఠితము విద్యాపీఠ, మీ తెల్గుదే
శమునన్ ధర్మముతత్త్వమున్ నిలుపు కీర్తుం గాని, విద్వాంసులన్
శమసంపన్నుల, సత్కవీంద్రుల, సమర్చల్ సల్పు నిత్య మ్మిటుల్
సుమతుల్ దీనినిఁ బ్రోదిసేయ, సదికూర్చున్ లోకకల్యాణమున్.

కృతయుగఖండ మిక్కలిని శ్రీపతిపీఠము, దానియందు సం
తతము గనందగున్ గురులతత్త్వము, తత్త్వము, సత్కవిత్వమున్
శ్రుతివిహితప్రవర్తనము, సూరిజనాప్తవిశుద్ధకీర్తి, యా
నతుల కుదాత్తమైన యమనస్కపదంబు, ఘటించు బోధమున్.

పాయనిభక్తితోఁ బతితపావనపావన వెంకటేశపం
చాయతనార్చనం బహరహంబు ముముక్షులు మంత్రయుక్తితోఁ
జేయుదు రార్ద్రచిత్తముల శ్రీపతిపీఠమునందు దీక్షతో
న్యాయమె కాదె సద్గురులయాజ్ఞల శిష్యులు నిర్వహించుటల్.

గురుమూర్తిన్ ధరియించి యాహరియె మాకుం దోఁచి భక్తాళికిన్
స్థిరకల్యాణముగూర్పఁగాఁ దగినరీతిన్ నిల్పె నీపీఠమున్
భరియింపందగు దీని నాంధ్రులు శుభప్రారంభసంపూర్తి, యీ
శ్వరసంప్రాప్తియు, నాత్మతృప్తియును విశ్వశ్రేయముం గాంచఁగన్.

పూతచరిత్రునిన్ భువనపూజ్యుని సద్గురుమూర్తిఁ గొల్చి వి
ఖ్యాతివిభూతి గాంచనగుఁగాని ప్రసిద్ధికి గుంపుదూరి యే
సేతలఁ జేసి రోతవడి చిత్తము తత్తరమొంది గుందనా
నే! తదధీనమీజగము లెల్లయుటంచుఁ దరించు టొప్పగున్.

సరదాలన్ బరమార్థముల్ దొరకునా! శ్రద్ధాన్వితుల్ భక్తితో
గురుదీక్షన్ గొని సాధుసన్నిధిని వాక్కుం గట్టి యానందసం
భరితంబైనపదంబు గన్గొనుట ధర్మం బుత్తమం బేటికీ
పరిహాసంబగు నుద్యమంబులు భయభ్రష్టత్వసంప్రాప్తికా?

వేత్తల్ విత్తులు వారినిల్పుకొనఁగా విజ్ఞానముల్ బందు సం
పత్తీ భారతభూమికయ్యది యె దార్భాగ్యంబగుల్ భాగ్యమా
పత్తౌ నయ్యదికల్గియుల్ జనులు లాభభ్రాంతిలోకంబులోఁ
గత్తుల్ కత్తులు కల్పికొంచుబహుసంగ్రామాలలోఁ దూలరే.

ఇక్కడనేము చిక్కనని యెక్కడపుట్టిన మొక్కలీంద్రహా
దృక్కులు తూర్పుదిక్కునకుఁ ద్రిప్పికనంగన దిక్కులేనియ
ట్లక్కట పశ్చిమాననుఁడ నయ్యెద నేలొకొ చూడు మాంధ్రుఁడా !
దృక్కుగ నిల్పనట్టి యుపదేశము చేసిన దేశమిద్దియే.

ఎంత నవీనశాస్త్రి ముదయించిన యించుక మాఱ దార్షసి
ద్ధాంతము సర్వకాలముల తత్త్వము శాస్త్రి పురాణ వేద వే
దాంతములందు నున్నది భవార్ణవతారకమైన చిత్తవి
భ్రాంతినిఁగూర్పు నర్థులకు సద్గురు పీఠము లెల్లకాలముల్.

ధాతువుదేవతల్ గ్రహణ ధారణముల్ సమదృష్టి పించి మ
న్నారలు నాల్గువేదములు నాలుకపై నటియింపఁజేసి, క
న్నారలు పూన దీక్షలఁ గనంబడనట్టి సువస్తువెట్టు లు
న్నారము నేటివార మసుహారము నిల్పుట పెద్ద భారమై.

శాస్త్రాభ్యాసము, దేవతాగురు నమస్కారంబు లేకే యస
చ్ఛాస్త్రిల్ ఛత్రము దాల్చి సిద్ధనిడు విశ్వాసంబు ఖండింతు వా
క్ఛస్త్రింబుల్ గొని పామరుల్ కడుఁ బ్రహర్షంబంద వారింపఁగా
శాస్త్ర గానఁగరామిఁ కేమి గతి కృష్ణా యోగిరాడ్భూషణా.

దేవునితోడబుట్టె మన దేశము నన్నిగమంబు లప్పు డీ
పావన భూమికిర్ దుల, ప్రభావమునం దిల లేదు, పూర్ణమై
కేవల తత్త్వముల్ దెలిపెఁ గ్రీస్తుకు వెన్క నదెన్నినాళ్లకో
లేవఁదొడంగె బాహుబల లేపముల మదిలేని దేశముల్.

భావమునందు ముందుగఁ బ్రభావమునర్ బరిపూర్ణులై యహం
భావముమాని దేవుని సమాన విభూతినిఁగాంచి రార్యు లీ
పావన భారత వనిఁ బ్రపంచమె నిన్ననె నిద్రలేచి స
ద్భావములేక యార్యుల నధఃకరణం బొనరించు నేఁ డహో.

రెండును రెండు నాలుగు ధరిత్రిఁ ద్రికాలములందు సత్యమం
దుండదు భేదమెందు నెపుడో వచియించినవంచు నమ్మకం
బుండదు గాని శాస్త్రములున్నది నిత్యము నిన్న నుండి యె
ల్లుండికి మారుచుండు నిపు డుజ్వలమైన నవీనశాస్త్రముల్.

సమ్మతి మ్లేచ్ఛభాషలకు ఛాందసుఁ డప్పకవీంద్రుఁ డిచ్చె ము
న్నమ్మిక చెల్ల యెందు వ్యవహారము హానికి జంకికాదె ప్రా
ణమ్ములు పోవునట్టి తరుణమ్మున యావనభాషల న్నిషే
ధమ్మొనరించె శాస్త్రులు ధర్మము తత్త్వముకాంచు బుద్ధితో.

వ్యవహారంబున కంచు నొప్పుకొన ముంపంజొచ్చెఁ బో కొంపలి
ట్లవుగాదంచన కన్యభాష పరధర్మావేశముంగూర్చి, మా
ధవ సంసేవలు నార్చి, లౌకికపు చింతల్ పేర్చి స్వేచ్ఛానము
ద్భవదుస్తంత్రములందుఁ దూర్చి పరమార్థంబెల్లఁ బోకార్చుచున్.

కొల్లఁగ నిండియున్న దెటకుం జన నేల జగాన నెల్లెడం
జిల్లరదారులన్ విడిచి శ్రీ గురుసూచిత రాజమార్గమం
దల్లనఁ బోవు భక్తులు కహో మునులందఱుఁ గన్నవోయి, రం
జెల్లరముం భుజింత మెపు డేగునొ ప్రాణము వట్టి మాటలన్.

అన్నియునున్న రాజులకునైనఁ బ్రశాంతి మనంబులోపలన్
సున్న, సమర్థుఁడేని వగచున్ బరిశోధన లెన్ని సేసియున్
మున్న యెఱుంగలే రెటులొఁ బోవునొ భూతము, లెన్ని భంగులం
దున్నది బ్రహ్మ మీవు నది యొక్కెడ నూ, గురుసూక్తిఁ గన్నచో.

కలుగుట దుర్ఘటం బెటులొ కల్గినచోఁ బరమార్థబుద్ధి యి
క్కలి ఫలియించు శీఘ్రముగఁ గంజభవాదుల కెంత చేసినన్
గలుగని సత్ఫలంబు, క్షణకాలమునం ఘటియించు నంచుఁ బె
ద్దలు వచియించు మాట లగుఁ దారకముల్ భయవారకంబులున్.

బాలత్వంబునఁ జిత్త మచ్ఛమగుఁ గాపట్యంబు లేకుండు, మా
యాలోలంబగు నావలన్, దనువదే ప్రారంభమందల్పమై
స్థూలంబౌఁ గద యేండ్లుచన్న నటు ముందుం బూర్ణమై, తగ్గుఁ బో
కాలంబుం జనఁ బ్రాచి పశ్చిమము నిక్కం బిప్పు డర్థిల్లెడున్.

పౌండ్రక వాసుదేవులు ప్రభావవిహీనులు లోకమందుఁ బె
క్కండ్రు కలిప్రభావమునఁ గ్రాలుట వాస్తవ తత్త్వవేత్తలౌ
వాండ్రకు జీవనంబును శుభస్థితియున్ కఱవయ్యె నెట్లు కై
కొండ్రొకో వారు సాధుబుధ గోష్ఠులఁ బ్రేమ స్వధర్మనిష్ఠలన్.

స్థూలము సూక్ష్మమంచు నిరుద్రోవలు ధర్మమునందు నాద్యమున్
బాలనసేయఁగాఁదగును పార్థివుఁ డన్యము సాధుసేవలన్
శీలమునన్ ఘటించు గలఁ డెన్ గలిరొంటి నికేమి దిక్కు నే
డాలకు ధర్మరక్ష కవతారము శౌరి ధరింపకున్నచోన్.

పావక సన్నిభంబగు భవంబు మనంబతిచంచలం బెటోఁ
బోవు ధనంబు సంతతియుఁ బోవును, గీర్తియుఁ బోవు వెంటరా
వేవియు, వేయు నేమిటికి విజ్ఞులు తజ్ఞులు మున్ను తెల్పు పెం
ద్రోవకు సాటిరావు పెఱత్రోవలు పావనుజేయ జీవునిన్.

ఏ మొనరింప నేమియగు నీ భరతావని మున్ను నేఁడు నే
మేమిట వన్నెకెక్కినవి యేమెటు లేనియు నిల్పఁబెట్టనో
నేమరకుండ నాంధ్రజను లీసరిపాటి యెఱింగి ధీరులై
సేమము గాంతు రింకఁ బరసీమలకెల్లను దామె నేతలై.

తెల్పెదు పెద్దలం గొలుచు ధీరత లేమినహంకరించి నేఁ
డల్పులు స్వేష్టవాసనల కడ్డని యెడ్డల దొడ్డిబెట్టి యే
కల్పములేని జల్పములఁ గంఠము బొంగురువోవ నాశి సం
కల్పిత క్షుద్రసిద్ధులను గాంచి హసించెద రెంత వింతయో.

పాడినపాటెపాడ వినువారికి భాగమెయానుగాకిటుల్
పాడియుఁ బంధయున్ దొలఁగువారిని దారికిఁ దీయఁదీయఁ గాఁ
బాడిరి, పాడుచుండి రిఁక పాడెద రెందఱొ సన్నుబోంట్లు, కా
పాడఁగ సాధులన్ భవముపారముఁ జేరుచు సారవాక్కులన్.

బెంగాలీయుల కాంగిలేయుల కహో విశ్వోపదేష్టృప్రతి
ష్ఠం గల్పించి తదీయమార్గముల నాస్థంబట్టి యాత్మీయబు
ద్ధిం గోల్పోయిన ముగ్ధు లిద్ధమతులై దీపింపఁ ద్రైలింగ్యభా
వం గుర్వీశ్వరతత్త్వబోధకములన్ సద్గ్రంథముల్ వ్రాసితిన్.

అనలేకలికాలము పంచసహస్రము లందు జరుగ సంకరమగునన్
మునలయ్యలన్న మాటకు దోసఁగగునని నేటివారు తొడగుదురేమో.

యోషాశూద్రులకున్ బురాణములు లనెన్నోయుండ గీర్వాణమం
దీషత్తద్గతభావముం దెలియలేరీ నేటివారంచు మున్
భాషన్ నన్నయభట్టు వ్రాసెను ప్రబంధం, బద్దియున్, గ్రామ్యదు
ర్భాషాభూషల ఘోషలో నణఁగె సంరక్షించు వాగ్లెమిచే.

నన్నయచిన్నయల్ మొదలునన్ దుదిఁగన్ గలగ్రంథరాజిలో
నున్నతమైనభావములె యున్నవి మొన్నను నిన్న నేఁడె? యు
న్నన్న! యసభ్యభావము లనంతము పొత్తములందు నచ్చులై
వన్నెకు నెక్కి సత్కవుల వాక్కుల నొక్కుచునున్న వక్కటా!

ఆచారం బెటు కట్టుబాట్లు నటు త్రోయంబోల దార్ఢ్యంబులన్
ప్రాచీనుల్ రసలుబ్ధులౌట నెగ్గొ సైసంజూతురే కాక, యి
క్లేచత్తేనియు మోపుఁగట్టి సభ నెంతేఁ బేసుతో నమ్మ నీ
వాచారంబుల ప్రల్లదంబులను సైసంజాల రొక్కించెయున్.

అరయన్ బ్రహ్మమె మూరసంబనుచు బ్రహ్మజ్ఞానులన్నారు, దు
ర్భరమా గ్రామ్యకుతంత్రబులన్ వినఁగఁ గర్ణంబుల్ గదున్ నొచ్చు నీ
శ్వర! మెల్లోర్వఁగవచ్చు బ్రహ్మమె ప్రపంచం బన్నహో వాక్యవి
స్ఫురణన్ దాలిమిఁ గొంత పూనఁగనువచ్చెన్ గాక చీకాకులన్.

నావశమా పరాంబికమె నా కల మాఁడఁగఁ జేయఁ బాయకే
నీవిధి వ్రాయుదానఁ దరమే ననుబోటికి నిట్టివో నహాం
భావముపూని పల్కు గురు భావములన్ నిజధర్మనీతుపై,
భావమునిల్పు టాంధ్రులు స్వభావముగా విధియింపు దైవమా!

ఓమితి శివమ్.




### ఇంగ్లీషు - కన్నడనిఘంటువు - ఒకటవభాగము

(A మొదలు Billow వరకు)

పు 555. ప్రధానసంపాదకులు బి. వెంకటనారణప్ప; ప్రకాశకులు మైసూరు విశ్వవిద్యాలయము, బెంగుళూరు.

ఇంగ్లీషు వాఙ్మయ ప్రపంచమున సుప్రసిద్ధుడగు జాన్సన్ (Johnson) ఇంగ్లీషు భాషనుగూర్చి క్రింది విధమున చెప్పియున్నాడు:

"...that it is copious without order and energetic without rules; that wherever the view is turned there is perplexity to be disentangled, and confusion to be regulated; that choice is to be made out of the boundless variety without an established principle of selection; adulterations are to be rejected or received without the suffrages of writers of classical reputation or acknowledged authority."

ఇట్టి ఇంగ్లీషు భాషకు సాధింపదగినన్ని సరియైన నిఘంటువులున్నగాని వీలుపడదు. సందర్భమును బట్టి ఒక వాక్యమునందలి పదముల కన్నిటికిని ఏదో విధముగ అర్థము కుదిరినను పదస్వారస్యమును గుర్తెరుంగుటకును, అర్థమునందలి సూక్ష్మభేదములను అవగాహనచేసికొనుటకును ఉత్తమనిఘంటువు అత్యావశ్యకము. కన్నడపదములకు ఇంగ్లీషున అర్థమిచ్చు ఒక ఉత్తమ నిఘంటువును కిట్టల్ (Kittel) దొర చాలకాలముక్రిందటనే రచించియున్నను ఈ నిఘంటువు కన్నడభాష నేర్చుకొనగోరువారికి ఎక్కువగా ఉపయోగపడునే గాని ఇంగ్లీషు నేర్చుకొనువారికి అంతగా ఉపయోగపడదు. ఈ కొరతను దీర్చుటకై ఇట్టి నిఘంటువును రచించుటకు మైసూరువిశ్వవిద్యాలయమువారు పూనుకొనియున్నారు.

ఈ నిఘంటురచనము కేవల మొక్కని యధీనముననే ఉండక, ఇందున కొక సంపాదకీయవర్గ మేర్పడియుండుట ఒకవిశేషమే. ముఖ్యసంపాదకులు బి. వెంకటనారణప్పగారు. కర్ణాటక సాహిత్యపరిషత్తునకు ఉపాధ్యక్షులుగ నున్న గుండప్పగారు, విశ్వవిద్యాలయమునను్న ఇంగ్లీషుప్రొఫెసరుగానున్న బి. ఎమ్. శ్రీ కంఠయ్యగారు మొదలగువారు సంపాదకీయవర్గము నందున్నందున ఈ నిఘంటువు తప్పక అధికప్రాముఖ్యమును బడయగలదు.

నిఘంటురచనము కష్టసాధ్యము. కాని ఇదివరకే ఎన్నియో ఇంగ్లీషు నిఘంటువు లున్నవిగాన వాని సహాయమున నొక ఇంగ్లీషు కన్నడ నిఘంటువును రచించుట కొంతసులభమే. కాననే ఈ నిఘంటురచనమునందు సంపాదకీయ వర్గమువారు ఇంగ్లీషు నిఘంటువులలో ఉత్తమమయినదగు ఆక్స్‌ఫర్డు కన్‌సైస్ డిక్షనరీ (Oxford concise Dictionary) పైనఆధారపడియున్నారు. పదముల అర్థములను చర్చించునపుడు ఒకొక్కప్పుడు ఆక్స్‌ఫర్డు కన్‌సైస్ డిక్షనరీని మాత్రమే కాక షార్టర్ ఆక్స్‌ఫర్డు డిక్షనరీని (Shorter Oxford Dictionary), వెబ్‌స్టర్ డిక్షనరీ (Websters Dictionary)ని కూడా పరిశోధించి అందలి విషయములనుకూడా కొంతమట్టుకు ఉపయోగపరచుకొనియున్నారు. కాని ఆక్స్‌ఫర్డు డిక్షనరీయందువలె ప్రతిపదమును ప్రత్యేకముగ నివ్వక ప్రధానపదముల శీర్షికక్రిందనే ఆపదముల నామవాచకములు మొదలగు జన్యపదముల నన్నిటిని చేర్చియున్నారు. ఒకొక సందర్భమున ఈ పద్ధతి ప్రారంభకులకు అంత అనుకూలముగ లేనట్లు తోచుచున్నది. ఉదాహరణముగ Advisory, Adnominal, Abrasive. అను పదములను గైకొందము. వీనికిని Advice, Adnown, Abrade అను పదములకును లేఖనమునందు కొంతభేద మున్నందున ఇంగ్లీషు

భాష నంతగా ఎరుగని ప్రారంభకులకు పై పదముల నేముఖ్యపదముల క్రింద జూడవలెనో తెలియక కొంత శ్రమ కలుగవచ్చును. కాని కొన్ని సందర్భములందుమాత్రము ఈ నిఘంటువునందు ఇట్టిపదములను వేర్వేరుగనే ఇచ్చి యున్నారు. ఉదాహరణము Accidence, Accident.

కొన్ని పదముల అర్థములు సందేహమునకు ఎడ మిచ్చుచున్నవి. Anatomy అను పదమునకు కన్సైస్ ఆక్స్ఫర్డు డిక్షనరీయందు "(Popular skeleton, mummy, emaciated creature" అని యుండిన ఈ నిఘంటువునందు "(రూఢియాగి) అస్థిపంజర; రక్షితశవ (కెడియదం లిట్టిరువ హెణ); (రూపకవాగి) జీవచ్ఛవ" అని యున్నది. "రూఢియాగి" అని చెప్పుట వలన పై యర్థము పరిగ్రాహ్యమైనదే యని యభిప్రాయము కలుగుటకు అవకాశమున్నది. ఒక Emaciated creature' అనిన 'జీవచ్ఛవ'మని తర్జుమాచేయుట సౌష్ఠవమని చెప్ప నలవికాదు.

కొన్ని ముఖ్యపదముల కిచ్చిన పర్యాయపదములు సర్వజనసమ్మతములు గాజాలవు. Astronomy ఖగోళ శాస్త్రమనుటకన్న జ్యోతిః శాస్త్రమనిగాని, నక్షత్ర శాస్త్రమనికాని చెప్పిన బాగుండునేమో. Meteorology పవనశాస్త్రమనుటలో లక్షణము అవ్యాప్తిదోషమునకు పాల్పడుచున్నది. Physics ను భౌతికవిజ్ఞానమనిన యెడల Geology ని భౌమవిజ్ఞానమని ఏలయనరాదు? భూవిజ్ఞానమనుటలో విశేషమేమి? Archaeology ప్రాచీనవస్తు శాస్త్రమని చెప్పుట వలన ప్రాముఖ్యమంతయు నిర్జీవములైన ప్రాచీన వస్తుసమూహమునకే వచ్చినది గాని ఆవస్తువులను నిర్మించిన మనుష్యులకు రాలేదు.

పదముల అర్థమును సువిశదము చేయుటయేకాక వీలైనంతవరకును పర్యాయపదముల నిచ్చుటయే నిఘంటురచయితల ప్రధాన కర్తవ్యము. పదముల వివిధార్థములు వాని ప్రయోగములనుండియే కాని ఇతర విధముల బోధపడదు; కాన ఆధునిక నిఘంటువులందు ప్రతి పదముక్రిందను అనేక వాక్యములను ఉదాహరణరూపముగ నిత్తురు. ఈ యంశమునకు మాత్రము ఈ నిఘంటువునందంత ఎక్కువ ప్రాముఖ్యము నివ్వినట్లు గానరాదు. అంతేకాక కన్సైజ్ ఆక్స్ఫర్డు డిక్షనరీ నేడు ప్రచారములో నున్న పదములను, అర్థములను మాత్రమే విశదీకరించును. కాన దానిపై నాధారపడి యున్న ఈ కన్నడ నిఘంటువు ఇంగ్లీషునందలి ప్రాచీన పుస్తకములను చదువునప్పు డంతగా ఉపయోగపడదు. అట్టి సందర్భములందు ఇంగ్లీషునందే అర్థమునిచ్చు ఇంగ్లీషునిఘంటువులను చూడవచ్చు నని సమాధానము చెప్పవచ్చును. కాని సంపూర్ణముగ వీనూ ప్రముఖమైననే యాధారముచేసి వాదించినచో ఇట్టినిఘంటువుల ప్రాముఖ్యమే సందేహాస్పదమగును. కాన కన్నడ విశ్వవిద్యాలయమంతటివారే పూనుకొనినప్పు డిట్టికార్యము నింకను ఉత్తమముగా నెరవేర్చినచో ఎంతయో బాగుండెడిదని చదువరులకు తోచవచ్చును. ఐనను అత్యధిక వ్యయప్రయాసలకు లోనై, వెల యధికముగ నిఘంటువును ప్రచురించుటకు మారు జనసామాన్యమునకు ఉపయోగపడునట్టి నిఘంటువును సరసమగు వెలకు నొసగుటకు మైసూరు విశ్వవిద్యాలయమువారు పూనుకొనియుండుట కడు ప్రశంసార్హము.

ప్రధానపాఠశాలలందును, కళాశాలలందునుగూడ మాతృభాషలోనే విద్యాభ్యాసంగము చేయవలెనని వాదించువారు ఇట్టి నిఘంటువులు లేకున్న మాతృభాషలలోనికి పుస్తకములను తర్జుమాచేయుట దుస్సాధ్యమని తగను గమనింపరు. భౌతికరసాయనాది శాస్త్రములటుండ సామాన్యగ్రంథములనుగూడ. ఇంగ్లీషునుండి మాతృభాషలలోనికి తర్జుమాచేయునపుడు ఎన్నియోపదములకు పర్యాయపదములు సులభముగ జ్ఞప్తికి రాక పూనినకార్యము దుస్సాధ్యమని తోపజేయును. ఈ నిఘంటు ప్రచురణము వలన కన్నడదేశస్థులకు ఇట్టిదిక్కులన్నియు చాలవఱకు తొలగిపోగలవు.

పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు

---

### ప్రతిభ

ఇది 'నవ్యసాహిత్య పరిషత్తువారు ప్రకటించే త్రైమాసిక పత్రిక.' సంపాదకుడు, ప్రకాశకుడు: తెలికిచెర్ల వెంకటరత్నం. డబుల్ క్రౌను సైజు: ఫెదర్ వైటు

కాగితము. చక్కని అచ్చు. చందా సంవత్సరమునకు రెండు రూపాయలు. విడి సంచిక (తపాలాఖర్చులు కాక) ఎనిమిది అణాలు. వలయువారు గుంటూరిలోని నవ్యసాహిత్య పరిషత్తుకు వ్రాయవలెను.

సంపుటము ౧. సంచిక ౧. పుటలు ౧౧౬;
సంచిక ౨. పుటలు. ౧౧౭—౨౧౨.

మొదటి సంచికలో ఆంధ్ర వాఙ్మయం-పుట్టు పూర్వోత్తరాలు, శాసనములలోని తెలుగుభాష, పద్య రచన, రాష్ట్రేతరాంధ్రులు - నవ్యసాహిత్యము, భాషా సంస్కరణము అను గద్యవ్యాసములు; 'మూపరెంటు కూతురు' అను కథ, ప్రణామము, ఆషాఢమేఘము, ప్రణయగాథ అను పద్యవ్యాసములు; మణ్ణవతి, తువ్వాయి, గీతం, రోడ్డుపక్కన మొదలగు గేయాలు, జాబులు, గ్రంథవిమర్శనము, సంపాదకీయ విజ్ఞాపనము అను కలవు.

రెండవ సంచికలో 'ముత్యగోపాలా!', కథానిక, నాలోమార్పు, భాషాప్రయోగవిధానము అను వ్యాసములు, భారతీశతకము, పత్య, ధన్యజీవి, ధిక్, కోకిలా!, సర్వజ్ఞస్వామి, జైలులో, కృష్ణవేణి, వేగు, దివ్యదర్శనము అను పద్యవ్యాసములు, 'మాటపట్టింపు' అనేకథ, భవిష్యత్తు, నిరీక్ష, నీకళ్లు, తెలుగుతోట అను గేయములు, గ్రంథవిమర్శనలు కలవు.

పై రెండుసంచికలయందును, సుప్రసిద్ధ పండిత కవులగు శ్రీ కొమాండూరి కృష్ణమాచార్యులు, శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, శ్రీ నోరి నరసింహశాస్త్రి, శ్రీ చింతా దీక్షితులు, శ్రీ జయంతి ఈశ్వరదత్తు, శ్రీ గిడుగు వెంకట సీతాపతి, శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రి, శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి, శ్రీ తెలికిచెర్ల వెంకటరత్నం, శ్రీ కవికొండల వెంకటరావు, శ్రీ పిలకా గణపతిశాస్త్రి, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ శివశంకరశాస్త్రి, శ్రీ వెంపటి నాగభూషణం, శ్రీ జి. జాషువ, శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి, శ్రీ బొడ్డు బాపిరాజు, శ్రీ అడివి బాపిరాజు, శ్రీ పురిపండా అప్పలస్వామి, శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు, శ్రీ కొడాలి ఆంజనేయులు, శ్రీ కందుకూరి రామభద్రరావు మొదలగువారు రచించిన వ్యాసములు కలవు.

అంతకు పూర్వము తెలుగుమాగాణమున నెలకొల్పబడిన పరిషత్తులు, సారస్వత సమాజములు ఆధునికాంధ్ర వాఙ్మయమునకు, సర్వజన వ్యవహారసిద్ధమగు భాషకును తగిన ఆదరమును, పోషణను ఈయని కారణమున పయివాని నుద్ధరించుటకు కొలది యేండ్ల క్రిందటనే 'నవ్యసాహిత్య పరిషత్తు' అను సభ కొందఱు సమర్థులగు ఆంధ్రపండితకవుల ప్రయత్నమున వెలసినది. ఆ పరిషత్తువారి ప్రధానోద్దేశములలో పత్రికా ప్రకటన మొకటి. దానిమూలముననే వారు తమ ఉద్దిష్ట కార్యములను నెరవేర్చ నవకాశము కలుగును. ప్రకటితములగు సంచికలలోని వ్యాసములు వారి అభిప్రాయములకు అనుగుణములై ఉద్దిష్టకార్యములను నెఱవేర్చుటకు చాలవరకు అనుకూలములయి ఉన్నవి. అందులో పత్రికలోని ఎక్కువ పుటలను ఆక్రమించుకొని, ప్రధానములని అనుకొనదగిన వ్యాసములం గూర్చి ఇచట కొంచెము వ్రాయబడును.

శ్రీ ఆదినారాయణశాస్త్రులుగారి 'ఆంధ్రవాఙ్మయం-పుట్టు పూర్వోత్తరాలు' అను వ్యాసమున ఆంధ్ర వాఙ్మయపు సంగ్రహ చరిత్రము, ఆధునికాంధ్ర వాఙ్మయపు వైశిష్ట్యము, నవ్యసాహిత్య పరిభాష మొదలగు విషయములు విపులముగ చర్చింపబడినవి. ఆధునికవాఙ్మయాభిమానులు ఆమోదించి అనుసరింపదగిన విషయము లిందు చాల కలవు.

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి 'మణ్ణవతి' అను గీతమున కథాసంవిధానముకంటె రచనాచమత్కృతి అధికము. రాజు స్వాభ్యుదయమునకై గురుపుత్రుని కాళికి బలియిచ్చుట యిందలి కథావస్తువు.

శ్రీ దీక్షితులుగారి 'తువ్వాయి' పది పాదముల చిన్న గీతిక అయినను చాల హృద్యముగ నున్నది.

శ్రీ జయంతి ఈశ్వరదత్తుగారి 'శాసనములలోని తెలుగుభాష' అను వ్యాసమున వారు పరిశోధించి

కనిపెట్టిన క్రొత్త విషయములు కొన్ని వివరింపబడినవి. వారు చర్చించిన 'ఇనుప రొయ్యు' అను పదమునుగూర్చి, ప్రయోగ వైచిత్ర్యములు, వ్యాకరణ విశేషములలో కొన్నిటిని గూర్చియు కొంత అధికముగ తెలుపవలసి యున్నది. ఆ విషయము లొక ప్రత్యేక వ్యాసమున వివరింపబడును.

శ్రీ సీతాపతిగారి 'పద్యరచన' అను వ్యాసమున యతి, ప్రాసలు శబ్దాలంకారములని, కవులు తమయిచ్చ వచ్చిన ఛందస్సులను క్రొత్తగ కల్పించుకొని పద్యరచన సాగింపవచ్చునని, 'ఛందోబద్ధ మయినంతమాత్రాన వట్టి మాటలు కవిత అనిపించుకోవు' అని వివరించి నారు. వారి ఉపదేశము ఉచితము. ఈ వ్యాసమున మొదటినుండియును ఛందస్సులను, యతిప్రాసలను మార్చుకొనుచుండుట ఉన్నదని విపులముగ వివరింపబడి నది.

పార్వతీశ్వరశాస్త్రిగారి 'రాష్ట్రేతరాంధ్రులు-నవ్యసాహిత్యము' అనువ్యాసమున రాష్ట్రేతరాంధ్రులు నవ్యసాహిత్య పరిషత్తువారికి పంపిన సందేశము తెల్ప బడినది.

శ్రీ వెంకటరత్నముగారి 'భాషాసంస్కరణ ము'లో వ్యావహారికాంధ్రప్రాశస్త్యము, దాని పరమ ప్రయోజనము వ్యక్తపరుపబడినవి.

శ్రీ దీక్షితులుగారి 'నూపరెంటుకూతురు' అను చిన్నకథ పత్రికకు ఒక అమూల్యాలంకారము.

శ్రీ కృష్ణమాచార్యులుగారి 'ప్రణయగాథ' కథా సరిత్సాగరమునందలి, లేదా అట్టిదానియందలి కథకు పద్యానువాదము. కథ ప్రాతదే అయినను ఆచార్యులవారి కవితాశిల్పము దానికి క్రొత్తదనమునుగూర్చి నది.

శ్రీ సీతాపతిగారి 'భారతీశతకము' (అసమగ్రము) వ్యావహారికాంధ్రప్రాశస్త్యమును తెలుపు 'భారతీ' ప్రబోధము. ఇందొకచోట శతకకర్త 'పలుకులపొందు లేక రసభంగము సేయుము, ప్రాతపడ్డమాటలఁ దము సేర్పు నూపుము' అను తిక్కనపద్యభాగమునకు 'తనలోకమునకు వినఁబడ్డపలుకులకు బలుకుచుఁ గాద పక్కని ప్రబంధములెల్ల రచించు'నను భావమును వివరించిరి. కాని ప్రాతపడ్డమాటలనఁగా వ్యవహారభ్రష్టములగు మాటలని యర్థము చెప్పుటకంటె 'పూర్వప్రు (తనకంటె) కవులచే ఒక భాగమునందు వాడబడి, తిరిగి ఆభాగమందే వాడబడిన పదము'లని అర్థముచెప్పుట సరసము. 'తమ సేర్పు చూపుము' అను తదనంతరపదము పై అర్థమునకు అత్యంతానుగుణము. ఇట్టిమాటలే 'ఎంగిలి మాటలు' అని లోకమున ప్రసిద్ధములు. శ్రీ సీతాపతిగారు కేవలము వ్యవహారాంధ్రాభిమానులగుటచే ఆ యర్థముసే గ్రహించియుందురు.

శ్రీ నాగభూషణంగారి 'ముద్దు గోపాలా!' చక్కని విమర్శవ్యాసము. క్షేత్రయ్యను గురించిన క్రొత్త సంగతులు ఇందు కొన్ని వివరింపబడినవి.

శ్రీ శివశంకరశాస్త్రిగారి 'ప్రభువాక్యము'అన్ని విధములను వారి 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి'కి సోదర్యమును పొందుచున్నది. కథ హృద్యము. రచన హృద్యతరము. 'ఏల చెప్పగవైతివి' అని శ్రీ శాస్త్రి గారు ఒకచో విచిత్రముగ ప్రయోగించినారు. 'చెప్పవు ఐతివి=చెప్పవైతి'వైనట్లు, చెప్పగవు+అయితి అని ఇచట సంధి చేయవలెను. 'చెప్పవు' అనుదానికి 'చెప్పగవు' అని ప్రయోగించుట అననుగుణము.

శ్రీ అమంచర్ల గోపాలరావుగారి 'మాట పట్టింపు' చిలకమర్తి వారి 'గయోపాఖ్యానము' నకు అనుకరణము. కథలో చివర కొంతమార్పు కలదు. కాని అది విరసముగ ఉన్నది. రచన వ్యావహారిక మగుట, కుంతి పాండవులతోపాటు అరణ్యవాసమునకు పంప బడుటయు ఇందలి క్రొత్తదనములు.

శ్రీ హనుమచ్ఛాస్త్రిగారి 'కథానిక' చిన్న పరిశోధకవ్యాసము. ఇప్పటి చిన్న కథకు ప్రాచీనాలంకారికులు చెప్పిన కథానికాలక్షణములు సరిపోవుటచే ఇది కథానిక అని పిలువబడుట ఉచితమని యిందు చక్కగ వివరింపబడినది.

శ్రీ శివశంకరశాస్త్రిగారి 'నాలో మార్పు' (ప్రథమము) వారి జీవితచరిత్రలోని వాఙ్మయసేవకు చెందిన

ఒక భాగము. వారి సారస్వతాభిమానము, సారస్వత కృషి కొంతవరకు ఇందు వివరింపబడినవి.

శ్రీ సత్యనారాయణగారి 'మాక్లీ దుర్గంలో కుక్క' స్వాభావిక వర్ణనలతో గూడిన చక్కని కథ. చాల హృద్యము.

శ్రీ వెంకటరత్నంగారి 'భాషా ప్రయోగవిధానము' కూడ 'భాషాసంస్కరణము' వలెనే వ్యావహారికాంధ్రవిషయకము; తత్సమర్థకము.

మిగిలిన పద్యవ్యాసములు, గీతికలును చాలవరకు హృదయంగమములు.

ఇందలి పద్యవ్యాసములు తక్క తక్కిన గద్యవ్యాసములు, గీతములు వ్యవహారాంధ్రమున రచితములు.

'ప్రతిభ'లోని వ్యాసములు చాలవరకు పత్రిక పేరు సార్థకపరచుటకు తగియున్నవి. పరిషత్తువారాదరించు వ్యావహారికాంధ్రము గద్యరచనకు అత్యంతము అనుకూలము. కాలములకు అనుగుణము. అట్లయినను ఎవరిఇచ్చకువచ్చినట్లు వారు వేరువేరు విధముల రచించినచో వ్యావహారికభాష సైతము కొరకరానికొయ్య అగును. కాన తగినట్లు నియమములు కొన్ని దానికి అపేక్షణీయములు. అట్లు లేనినాడు ప్రయత్నమునకు తగినఫలము దుర్లభమగును.

నవ్యసాహిత్య పరిషత్తువారి ప్రయత్నములు ప్రశంసింపదగినవి. 'ప్రతిభ' తగినరీతిని భాషావాఙ్మయసేవ చేయగలదని విశ్వాసము. సంపాదకులు ఇంకను ప్రయత్నించి భాషా, వాఙ్మయములకు సంబంధించిన—ఉదుపకారకములగు వ్యాసములను ఆయా విషయములలో పరిశ్రమచేసినవారిచే వ్రాయించి భాషకు, వాఙ్మయమునకును తులలేని సేవ కావర్పుదురుగాక!

బు. వేం. ర.

---

### "సంయుక్త"

గ్రంథకర్తలు: భాగవతుల వెంకట శాస్త్రి బి. ఎ., ఎల్. టి; విద్వాన్ తంగిరాల రామమూర్తి బి. ఎ., బి. ఇడి.,

ప్రకాశకులు: సరస్వతీగ్రంథమాల, కాకరపర్రు.

ప్రతివెల రు. ౦-౧౨-౦; క్రౌను సైజు; సుమారు ౧౮౦ పేజీలు, రఫ్ కాగితము.

పై గ్రంథమాలయందు ౪౨-వ పుష్పముగ ప్రకటింపబడిన ఇయ్యది చరిత్రాత్మక నాటకము. "ఈ నాటకము గ్రంథకర్తలగాని, పకాశకులగాని వ్రాతమూలమున ననుమతిపొందనిదే ప్రదర్శింపకూడదు" అను నొక ఆంక్షను ప్రకాశకులు ప్రయోగించి యీవిధముగ ప్రచారమును నిరోధించుచున్నారు

నేడు భారతస్త్రీజాతి వెలుగునకు రానెంచుచున్నది. పురుషులవలెనే వారును సాంఘికరాజకీయాది విషయములందు సమానప్రతిపత్తిని కోరుచున్నారు. ఇప్పట్టున సంయుక్తవంటి భారతనారీమణుల గాథలు వారిలో వీరతేజోలక్షణములు పెంపొందుటకెంతేని తోడ్పడగలవు. ఈసంయుక్తగాథ పాతదే కాని నూతనము కాదు. సంయుక్తపృథ్వీరాజుల వివాహమే యిందలి ప్రధానమగు విషయము. అయినను హిందూరాజుల నడుమ కలహములు, దీని నాధారముగ తీసికొని తురకల తాంత్రికము, నడుమ నడుమ యుద్ధములు మొదలగునవెన్నియో సంఘటిల్లును. శైలి సరసము. పద్యము లుండదగు స్థానము, పాత్రల కుచితమగుభాష మున్నగు విషయములందు గ్రంథకర్తలంతగ శ్రద్ధవహించినట్లు తోపదు. ఇందు "దరువులు" చేర్చకుండుటకు గ్రంథకర్తలభినందనార్హులు. రంగవిభజన మొనర్చుపట్ల కొంతయుక్తి అవసరము. ప్రథమాంకము ప్రథమ, ద్వితీయ, తృతీయ రంగములు ఒకే అడవిప్రదేశమునందు వేరువేరుగ అమర్పబడినవి. ఒకరంగమునందిది సాధ్యపడునా? సాధ్యపడినను రంగముల మార్పుదలకగు కాలపరిమితి సంగతియేమి?

విద్యార్థులకు నీగ్రంథకర్తలు నాటకరూపమున రచింపదగిన అపూర్వవిషయములను భారతదేశచరిత్రనుండి సేకరించి హెచ్చుగ భాషాసేవ చేయుటయేగాక యీనాటి స్వాతంత్ర్యతృష్ణ నుద్దీపింపజేయు సాధనముగ నొనర్తురని యాశించెదము.

"వ్యామోహము"

గ్రంథకర్త: కొత్త భావయ్యచౌదరి.

ప్రకాశకులు: కొండపల్లి వీరవెంకయ్య, రాజమండ్రి.

ప్రతివెల రు. ౧-౦-౦. డెమ్మీసైజు. ౧౫౬ పేజీలు. రఫ్ కాగితము.

ఇయ్యది పదునాల్గు ప్రకరణములతో కూడిన సాంఘికనవల. ఇందలి యితివృత్తము ప్రేమగాథ. నాయికానాయకులు భరతుడు, రాగలతిక యనువారలు. రాగలతిక బాలవితంతువు. భరతు డొక ధనవంతునకు పెంపుడుపోయి పెంపుడుతండ్రితో కలహించి యీబాల వితంతువును పరిణయ మాడును. వివాహమునకుపూర్వము వీరిలో మోహాంకురములు పొడసూపెను. ఆచిన్ననాటి ఉడుకు ఉబుకే పెంపుడుతండ్రిని, జనకపక్షమువారిని తృణీకరించుట, వేరుకాపురము పెట్టుట, తండ్రితో వ్యాజ్యమాడుట, చివరకు తనలో దుర్వ్యక్తులు హెచ్చుట, తనకు చిప్పచేతికివచ్చుట, తనను నమ్మిన వారికి చిప్పచేతికిచ్చుట మొదలగు పరిణామములు కలిగెడు స్థితికి దెచ్చినది. మోహాంధకారమున జరుగు వివాహములు ఈవిధముగా పరిణమించుట మన నిత్య జీవితమునం దనేకము చూచుచున్నాము. ఈ కారణ ముననే యువతీయువకుల వివాహబాధ్యత మన భారతవర్షమున తరుచుగ, నిక్కచ్చిగ తల్లిదండ్రులే వహింతురు.

కథయందు హెచ్చుగు బిగువులేదు. గ్రంథకర్త నవలారచన కిదియే ప్రప్రథమమట. గంతకుతగిన బొంత యను సామ్యముగ ప్రకాశకులకు తగినవారే లభించిరి. కొండపల్లి వీరవెంకయ్యగారిపేరు శైవవాఙ్మయము మూలమున ఆంధ్రదేశవాసులకు పరిచయమై యున్నది. వారి తదితరగ్రంథములవలెనే యీగ్రంథముగూడ శైవ వాఙ్మయముగనే తయారైనది. వీరవెంకయ్యగారు గాక మరొకరు ప్రకాశకులుగ నున్నచో గ్రంథమునందన్ని వందల అచ్చుపొరపాట్లు దొర్లియుండెడివి కావు. ఉభయులకైన గ్రంథకర్తయైనను యించుకశ్రద్ధ వహించి యుండినయెడల సినిమా నవలలవంటి యీ నవలను రచించిన యువకుడైన భావయ్యచౌదరిగారు [illegible] గ్రంథరచనాది కార్యకలాపములయందు కొంతమనసునుంచి తమగ్రంథములు బహుజనాదరపాత్రములగునట్లు చేసికొందురని ఆశించెదము.

"సంతానం"

---

## వివాహతత్త్వము

### బం. మల్లయ్యశాస్త్రిగారి గ్రంథముపై బులుసు వెంకటరమణయ్యగారి విమర్శపై చిన్న సమాధానము

పుట. ౫౮౪-౫౮౫ భాద్ర-ఆశ్వయుజ భారతిలో

౧. "బ్రాహ్మాద్యష్టవిధ వివాహములును వివాహ సంస్కారములు కాని వివాహములు కావని". శాస్త్రిగారి మత మిదికాదు. ఈ యెనిమిదియు వివాహసాధనములని. ౭౩ పుట వివాహతత్త్వము చూడుడు.

౨. "కాని ప్రాచీన వాఙ్మయమునుబట్టి చూచినను గాంధర్వ వివాహము చేసుకొన్న భార్యాభర్తలు తిరిగి పెళ్లితంతు జరిపినట్లు కనబడదు. ఇట్టివో దుష్యంతి పుత్రుడు భరతుడు దుష్టసంతానమే కావలసి వచ్చును" అని.

వివాహతత్త్వము ౭౦ పుటలో - గాంధర్వాసురపైశాచా...పశ్చాద్ధోమో విధీయతే" అని శాస్త్రిగారిచ్చిన వచనము ప్రాచీనవాఙ్మయములోనిది కాదందుమా?

౩. "కొన్నియెడల స్త్రీ శాస్త్రులు శాస్త్ర తమమతమున కనుకూలముగ స్మృతుల మూలములను మార్చిరి" - ఇట్లు వ్రాయుట అశ్లాఘ్యము. అట్లు భిన్నపాఠము లున్నవి. అయిన శిష్టమయిన పాఠమును ప్రామాణికం చేసరనము. కాక మీరిచ్చిన పాఠములుకూడ వారిమతమునకు బాధకములు కావు. మీరిచ్చిన "అప్రాప్తామపి తాం తస్మైకన్యాం దద్యా ద్యథావిధి" అనిశబ్దమువల్ల అప్రాప్తవయము వ్యర్థపడినది. ఇందులోగూడ "యథావిధి కన్యాదానమే" చెప్పబడినది. వివాహమనుమాట స్పష్టపడలేదు.

౪. ౩౫ పుటలో దక్షవచనము కుల్లూక వ్యాఖ్య విది ప్రాసి శాస్త్రిగారే చూపినారు. ఎనిమిదేండ్లకును అప్రాప్తకాల మనియే కుల్లూకాభిప్రాయము స్పష్టముగా నున్నది.

౫. త్రింశద్వర్షోద్వహేత్తన్నది తప్పుపాఠము. వర్షః + ఉద్వహేత్ అన్నచో నట్టిసంధి వచ్చునా? వహేత్తనికూడ పాఠము గలదు. ఉద్వహేత్తన్న పాఠమే యుంటే శాస్త్రిగారి మతమునకే బలము. ఉద్వాహము పండ్రెండేళ్లదానికిని గల దన్నది.

౬. సందిగ్ధములు కాని స్పష్టవచనములు.

౩౪ పుట. సంస్కారతత్వము ౨౦౨ "పాణిగ్రహణం వివాహశ్చ భిన్నకర్మణీ, వరణాద్గ్రహణం పాణేస్సంస్కారో వా విలక్షణః." అని నారదవచనము శాస్త్రిగా రిచ్చినారు. పాణిగ్రహణము వధూవరోభయ సంస్కారము - దానాదికోద్వాహము కేవల కన్యా సంస్కారము అని. ఇదికాక హరివంశములోని ఉద్వాహతత్వకారు డిచ్చిన "కృతోద్వాహః పరస్యైవై, పాణిగ్రహణమంత్రాణాం విఘ్నం చక్రే" అన్నదాని "కృత" అన్న భూతకాలిక విశేషణమే ఒకటి. ౩౨ పుట. వివాహతత్వము.

౪౭ పుట. ౧-౯. ఋతుస్నాతాతు యా శుద్ధా సా కన్యేత్యభిధీయతే - అన్న మాధవీయ భారతవచనము బాలికా వివాహవాదుల కెట్లుగాని సమర్థించునా? ఇంతకంటే స్పష్టవచనము మరెట్లు చూపగలరు?

కట్టి సాంబమూర్తిశాస్త్రి

---

# గ్రంథ స్వీకారము

### జర్మనీ నవీనచికిత్స

చిన్నసైజు, పు. ౨౯౩, వెల రు. ౦-౮-౦. రచయిత: నారపరాజు కోదండరామయ్య, ఎం. బి., తెనాలి.

### ఉద్యానకృషి

క్రౌను ౧/౬ సైజు, పు. ౧౬౮, వెల ౦-౧౨-౦, గ్రంథకర్త: పెద్యోటి వెంకటేశ్వరరావు, హార్టికల్చరల్ ఇన్‌స్పెక్టరు, మినర్, హైస్కూలు, భీమవరం.

---

### రాఘవశతకం

డెమ్మీ ౧/౬ సైజు, పు ౧౯. వెల రు. ౦-౨-౦, రచయిత; వేదనభట్ల వెంకన్న, ప్రకాశకులు: మొసర్ల తాతా కృష్ణమూర్తి, భద్రాచలం.

---

### లలితకథావళి

క్రౌను ౧/౬ సైజు, పు. ౧౬౪; వెల రు. ౦-౮-౦ రచయిత, మరియు ప్రకాశకులు: రామసం వెంకటశివుడు, ఎం. ఏ, గుంటూరు.

---

### భారతీనక్షత్రమాలిక

క్రౌను ౧/౬ సైజు; పు. ౧౨; కవయిత్రి: శ్రీమతి యస్. భారతీరత్నాకరాంబ, సుల్తానుబజారు, హైదరాబాదు.

---

### ఘోషయాత్ర (నాటిక)

క్రౌను ౧/౬, సైజు; పు. ౨౯, రచయిత్రి: శ్రీమతి వడ్లకొండ ఇందిరాదేవిగారు.

---

### రుక్మిణీపతి శతకము

డెమ్మీ ౧/౬ సైజు; పు. ౨౬; గ్రంథకర్త: కూరెళ్ల అచ్యుతరావు, వేగుజుక్క ముద్రణాలయము, బరంపురం.

---

### The Significance of the Faltering of Arjuna

ఫూల్సుకాప్ ౧/౬ సైజు; పు. ౪౩; [illegible] రచయిత: K. Sreenivasa Rao, [illegible] B. L., Vakil, Chittor.

### గోవర్ధనాచార్య సప్తశతిసారము

క్రౌను 16 సైజు; పు. 113; వెల రు. 1-0-0.
రచయిత: చన్నిభొట్ల సూర్యనారాయణశాస్త్రి, తెలుగుపండితుడు, మహబూబ్ కాలేజి, సికింద్రాబాదు.

---

### దివాంధము

క్రౌను 16 సైజు; పు. 34; వెల రు. 0-5-0,
రచయిత: పంతుల అంజనేయులు.

---

### గృహలక్ష్మి కంఠాభరణము

క్రౌను 16 సైజు; పు. 148; రచయిత: ముత్తికృష్ణమూర్తి. ప్రకాశకులు: డాక్టరు కే. యన్. కేసరి, గృహలక్ష్మి కార్యాలయము, మద్రాసు.

---

### భారతీయ కార్మికోద్యమ చరిత్ర

క్రౌను 16 సైజు; పు. 119 వెల రు. 0-8-0.
రచయిత: కుమ్మల వెంకటరామయ్య.

---

## తుపాను

జి. జాషువ

కొమ్మ పుట్టిడునీడఁ గురియ శ్రీవెనుమచ్చి పాంథులనొకశతాబ్దము భజించి
కొల్లాపురవుసత్తి కొలుపుల కిచింత, తొలిపువ్వు కులుకునవ్వులువెలార్చి
ఎఱుగాలికలువునాఁ డీనింబతరుశాఖ లంటాడిదయ్య మలంకరించె,
గరుడాలమంతు నాఖరిఁకాన్పు లీజువ్వి పయికొమ్మపయిఁ దెల్లవార్చుకొనియె.
ధరణిపుట్టిననాటివృత్తాంతములకు, శాసనమ్మైనయిమ్మహీజములు బ్రదుకు
మొన్నటితుపానుబీభత్సమున నశించి మూడువారాలకథలోనఁ బూడిపోయె.

చిలిపి తుపానుదెబ్బలకు జించి, జలాశయమందుఁ బడ్డ, పూ
వులముఖసీమలం దొలఁగి పోవఁగలేదు విలాసలక్ష్మి యూ
యులల హాసించుబాలుకముఖేందులఁ గ్రమ్మగలే దహా! జల
ప్రళయనిశాటినోటఁ దల వాల్చినమాత్ర వియోగమేఘముల్.

---

Printed and Published by K. Nageswara Rao,
at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor: G. Subbaramayya.